# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 5 హైదరాబాద్ 142 మే 2013 పేజీలు : 68 రు. 15

- విద్యుత్ సంక్షోభ కారణాలు
- నోవార్టిస్ కేసు - సుప్రీంకోర్టు తీర్పు
- పువర్తి ఎన్‌కౌంటర్ నిజానిజాలు
- మహిళలపై ఆగని అత్యాచారాలు
- పిల్లల అనారోగ్యంపై కాగ్ నివేదిక
- రెండు సదస్సులు - ఆశాసూచికలు
- ఉత్తర కొరియా రణగర్జనలు

# వీక్షణం మీ నుంచి కోరుతున్నది
# రచనా సహాయం, ఆర్థిక సహాయం

మీ వంటి వేలాది మంది పాఠకుల ఆదరాభిమానాలతోనే వీక్షణం నానాటికీ అభివృద్ధి చెందుతున్నదని మీకు తెలుసు. వీక్షణం తాను పెట్టుకున్న ప్రజా చైతన్య పురోగమన, విస్తరణ లక్ష్యాలకు మరింతగా చేరుకోవాలంటే మీవంటి అభిమానులు, పాఠకులు, రచయితలు, దాతలు మరింతగా చేయూత నందించవలసి ఉంది. మీ చేయూత రచనల రూపంలో కావచ్చు, ఆర్థిక సహాయం రూపంలో కావచ్చు.

వీక్షణంకు రచయితల నుంచి, అభిమానుల నుంచి రచనలు గణనీయంగానే అందుతున్నప్పటికీ ఇంకా ఎక్కువ, ఇంకా నాణ్యమైన రచనలు రావలసి ఉంది. అందుకు మీ పూనిక అవసరం. వీక్షణం మూడు రకాల రచనలకు ప్రాధాన్యతనిస్తుంది : 1) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలలో విరివిగా సమాచారం వస్తున్నప్పటికీ ప్రజానుకూల విశ్లేషణ లేని అంశాలపై ప్రజా దృక్కోణం నుంచి లోతైన విశ్లేషణలు. 2) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు సాధారణంగా విస్మరించే ప్రజా జీవన పరిణామాల గురించి సమాచార, విశ్లేషణా రచనలు. 3) ఏ సమాచారాన్నయినా అర్థం చేసుకోవడానికి అవసరమైన పనిముట్లు అందించే దృక్పథ ప్రధానమైన రచనలు.

వీక్షణం ఆర్థిక స్థితి సమస్యాత్మకంగా ఉన్నదని, ఏ నెలకానెల అన్నట్టుగా సాగుతున్నదని మీకు ఎప్పటికప్పుడు నివేదిస్తూనే ఉన్నాం. ప్రతి సంచిక ఆర్థిక లోటుతో నడుస్తున్నది. వ్యక్తిగత చందాలు, సంస్థల చందాలు, పుస్తకాల అమ్మకాలు, విరాళాలు, ప్రకటనలు వంటి వనరులన్నీ ఇంకా పెరిగితే గాని పత్రిక మనుగడ సుస్థిరం కాదు. వీక్షణం అభిమానులు, పాఠకులు ప్రతి ఒక్కరూ పూనుకుని తమ వంతు బాధ్యతగా చందాలు చేర్పించడం, విరాళాలు, ప్రకటనలు సేకరించడం వంటి అన్ని రూపాలలో ఆర్థిక సహాయం అందించడం అవసరం.

**తెలుగు సమాజంలో ప్రగతిశీల ఆలోచనాధారలో, ప్రజానుకూల పత్రికల సంప్రదాయంలో కృషి చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం**

**తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణ వీక్షణం**

**ఈ సంభాషణను విస్తరిద్దాం! తెగిపోకుండా కాపాడుకుందాం!**

142 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మే 2013
సంపుటి : 11
సంచిక : 5

వ్యవస్థాపక సంపాదకులు: వి. హనుమంతరావు
సంపాదకులు: ఎన్. వేణుగోపాల్
కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్: వై. రామచంద్రం
కంపోజింగ్: సి. రాజశేఖర్
సబ్ ఎడిటర్ : ఎ. మల్లేశ్
ఆఫీస్ అసిస్టెంట్ : ఎస్. వెంకటేష్

## లోపలి పేజీల్లో...



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,
డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**జా**ర్ఖండ్‌లోని రాంచీ సెంట్రల్ జైలులో విచారణ ఖైదీగా ఉన్న నేను గత ఐదు నెలలుగా వీక్షణం పత్రిక చదువుతున్నాను. వీక్షణంలో వచ్చేటి కొన్ని ముఖ్యమైన వ్యాసాలు, ముఖ్యంగా జాతీయ, అంతర్జాతీయ పరమైనవి కేవలం తెలుగు పాఠకులకే పరిమితమై ఉండడం కాకుండా వాటిని హిందీ, ఇతర భాషలలో ముఖ్యంగా హిందీ పాఠకులు కూడా చదువుకునే విధంగా అనువాదం చేసి ఆయా భాషల మాస, పక్ష పత్రికలకు అందజేస్తూ, ముద్రించే విధంగా ప్రయత్నిస్తే చాలా ఉపయోగకరంగా ఉంటుంది. ఉదాహరణకు, డా. నళిని గారి మహిళా ఉద్యమ చరిత్ర, లోకసంచారి ఆరోగ్య రంగంలో ఏం జరుగుతోంది?, సామ్రాజ్యవాద విష ఫలితాలు, ఎ. నర్సింహారెడ్డి గారి నేరాల కన్నతల్లి పార్లమెంటరీ వ్యవస్థ, పి.వి. రమణగారి మహోజ్వల భారత కార్మికోద్యమం, వివి గారి హంతకులకు శౌర్య పతకాలా?, ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణంలో విప్లవోద్యమం తదితరాలు. అలాగే లోకసంచారి, నళిని, వివిల వ్యాసాలను బుక్‌లెట్‌గా ముద్రిస్తే బాగుంటుంది. నొయిడా నుండి వెలువడే హిందీ మాసపత్రిక 'సమకాలీన్ తీసిరీ దునియా' లాంటి హిందీ పత్రికలకు వీక్షణం వ్యాసాలను అనువదించి పంపడం, అవసరమైన వ్యాసాలను హిందీ పత్రిక నుండి అనువదించి వేయడం బాగుంటుంది. జనవరి ప్రత్యేక సంచిక వ్యాసాలు ప్రజా ఉద్యమాలను, విప్లవోద్యమాలను కండ్లలో కదలాడించాయి.

**– ఎం.డి. హుసేన్**

*జనరల్ సెల్, రాంచీ సెంట్రల్ జైల్, జార్ఖండ్*

**వె**నిజులా నేత హ్యూగో చావెజ్ గురించి వీక్షణం ఏప్రిల్ 2013 సంచికలో డా. ఎ. పున్నయ్య కొంత సమాచారం అందించారు. చావెజ్ మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాలతో ఏకీభవించలేదు. లాటిన్ అమెరికాలో ఉన్న ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని 21వ శతాబ్దపు సోషలిజం అన్నారు. చావెజ్ 1998లో అమెరికా సామ్రాజ్యవాద వ్యతిరేక అజెండా చేపట్టి రాజ్యంలో అనేక మార్పులు చేపట్టారు. సైన్యాన్ని ప్రజల అవసరాలకు, సంక్షేమ కార్యక్రమాలకు వినియోగించారు. మార్క్సిస్ట్ సిద్ధాంతాన్ని అంగీకరించక పోయినా పీడిత ప్రజలకు మిత్రుడు. సైమన్ బోలివార్ సామ్రాజ్యవాద వ్యతిరేకి. ఈ సిద్ధాంత ప్రాతిపదికగానే చావెజ్ బొలివేరియన్ సోషలిజం తన ఆశయం అన్నారు.

**– తుంపాల శ్రీరామమూర్తి**

*గాజువాక, విశాఖపట్నం*

**లో**కసంచారికి 'సంచారం' తెలుసేమోగానీ, 'లోకజ్ఞానం' తెలిసినట్టు లేదు. తన వ్యాసాల మీద వచ్చిన విమర్శలకు ఆయన 'స్పందన' పేరుతో (ఏప్రిల్ సంచికలో), అసలు విషయంతో పొంతన లేని దాటవేత జవాబులు చాలా ఇచ్చుకున్నారు. ఈ సంచారి గతంలో రాసిన వ్యాసాలేవీ నేను చదవలేదు కాబట్టి, ఆదిరెడ్డిగారి విమర్శలకు ఈయన ఇచ్చిన జవాబుల జోలికి నేను వెళ్లను. ఢిల్లీ అత్యాచారాల దురంతం మీద ఈ సంచారి రాసిన వ్యాసంలో (మార్చి సంచిక) నాలుగు మంచి మాటలు ఉన్నందుకు నేను సంతోషించి, నాలుగు తప్పుడు మాటల్ని ఎత్తి చూపితే అది ఈయనకి నచ్చలేదు. 'నిజమే, ఇంత తప్పు చేశానా!' అని ఆలోచించుకోవలసిన ప్రతీ చోటా, దానికి వ్యతిరేకంగా, 'నేనలా అనలేదు, నా అభిప్రాయం అది కాదు' అంటూ దాన్నే మంచి జవాబుగా చెప్పుకున్నారు. ఒక అత్యాచార దురంతం గురించి చెప్పే సందర్భంలో, వేరే దేశాల్లో వ్యభిచారానికి లైసెన్సులు ఉన్నాయి – అనే మాటలు ఎందుకు చెప్పినట్టు? దానివల్ల అక్కడ అత్యాచారాలు ఉండవనో, తగ్గాయనో, చెప్పడం కాదా? – అని అడిగితే, 'నా అభిప్రాయం అది కాదు' అనడం! చెప్పిన వ్యక్తి అభిప్రాయం అది అయినా, కాకపోయినా, దానికే దారి తీసిందని అర్థం కాలేదా? పైగా, వ్యభిచారాల స్త్రీల హక్కుల సంఘాలు లైసెన్సులు కోరతారని వాదం! సరే, కోరతారు. కోరితే, అది ఆత్మగౌరవం గల మార్గం కాదనీ, పునరావాసం కోరడమే సరైన మార్గమనీ, సంస్కర్తలు అర్థం చేసుకోవాలి. తప్పుడు బోధనలు ప్రేమలతో చేసినా, దారి తప్పుతారు బాధితులు. ప్రేమల వల్ల ప్రయోజనం ఉండదు. నేరాల్లో, చిన్నా–పెద్దా తేడాలు ఉండవట! నేరాల్ని అలా విభజించలేరట! జేబు దొంగతనాలూ, హత్యలూ, అత్యాచారాలూ, అన్నీ చిన్నవే. లేదా, అన్నీ పెద్దవే. అన్నీ ఒకటే. ఈ వాదంలో, ఈ సంచారి లోకజ్ఞానం స్పష్టంగా కనబడుతోంది. సామ్రాజ్యవాదాలూ, సరుకుల అమ్మకాలూ, పెట్టుబడిదారీ విధానం కానట్టూ, అవి వేరే దారిలో పుట్టి పెరుగుతున్నట్టూ, వాదం! సరుకులు అమ్ముకునే వాళ్లు, జనం ఏ సరుకులు వాడతారో, ఏం కొంటారో, వాళ్లకి ఎంత పిచ్చి వాడకాల్ని అలవాటు చెయ్యాలో ఆలోచించక ఏం చేస్తారు? అది, పెట్టుబడిదారులు లాభాల కోసం పడే పాట్లు గాక, దాని నుంచీ దూరంగానూ, తేడాగానూ ఉన్న విధానమా? – ఈ మాట అడిగితే, ఇంట్లో తుపాకులు పెట్టుకోడం, వాటితో హత్య చేయడం – అని గొప్ప జవాబు చూపడం! తుపాకులు ఉన్నదెందుకు? హత్యలకే. దీనికీ, అత్యాచార దురంతానికీ ఏమిటి సంబంధం? పొంతన ఉందా ఏ రెంటికైనా? స్త్రీలు, హత్యలు చేసే వాళ్లనైనా క్షమిస్తారు గానీ, అత్యాచారాలు చేసే వాళ్లని క్షమించరు. వాళ్లని ఉరి తియ్యడానికి తలారులు అక్కరలేదు. ఆ పని సంతోషంగా చెయ్యడానికి ఆడ పిల్లలెందరో ముందుకొస్తారు. పేదలు పిచ్చికలట! పిచ్చికల మీద కోపం చూపకూడదట! వాళ్లు ఎలాంటి దురంతం చేసినా! అత్యాచారాల వాడు ధనవంతుడైతే వాణ్ణి ఉరితీసి, పేదవాడైతే వాణ్ణి నెత్తిన పెట్టుకోవాలనే సంచారి వాదం అడ్డగోలు వాదం అవుతుందే గానీ, పేదల ప్రేమికవాదం ఏమీ అవదు. నూటికి యాభై మంది భర్తలు అత్యాచారాలు చేస్తారట! స్త్రీల పక్షాన నిలబడి పోయినట్టు ఈ గొప్ప వాదం! మూర్ఖ భర్త ప్రవర్తనకీ, నమ్మకంగా బస్సు ఎక్కిన ప్రయాణికురాలి ఉదంతానికీ, పోలిక! ఇతర మగవాళ్లని నిందించే మగవాడు, తన గురించి మొదట చెప్పుకోవాలి. పెద్ద పెద్ద చర్చలకి నిజంగానే పత్రికల్లో చోటు చాలదు. అది అర్థం చేసుకోవలిసిందే. ఈ సంచారి రాసిన అత్యాచారాల వ్యాసంలో నాలుగు మంచిమాటలు ఉన్నందుకే పొంగిపోయి నేను దాన్ని 'అమృత భాండం' తో పోల్చడం, ఇప్పుడు ఆలోచిస్తే చాలా తెలివి మాలిన చేష్టలాగ ఉంది. స్త్రీకి జరిగిన దురంతం మీద ఒక పురుషుడు ఆ మాత్రం స్పందించడం పట్ల ఆనాడు నా ఆనందం అది. కానీ, ఆ వ్యాసానికీ, ఆ వ్యాసకర్తకీ, అంత విలువ లేదు నా మనసులో ఈనాడు.

**– రంగనాయకమ్మ**

హైదరాబాద్

**ఏ**ప్రిల్ 2013 వీక్షణం సంచికలోని సంపాదకీయం – బడ్జెట్ అంశాలు; పి.వి. రమణగారి 'విదేశీ శక్తులకు బంగారు బాతు – రక్షణ రంగం' అనే వ్యాసం చాలా ఆలోచనాత్మకంగా పాఠకులకు వివరణాత్మకంగా ఉంది. అవును నిజమే. చట్టసభలకు ఎన్నికయ్యే ప్రజా ప్రతినిధులు ఐదు కోట్ల నుండి ఇరవై, పాతిక కోట్ల వరకు ఖర్చు పెట్టి తిరిగి దానిని తమ పదవీకాలంలో ఐదారు రెట్లు సంపాదించుకోవడంలోనే వారి పదవీ కాలం సరిపోతుంది. కాని ప్రజల అవసరాలు, దేశ ప్రయోజనాలు తుంగలో తొక్కి దేశీయ, విదేశీయ, బహుళజాతి సంస్థల బడా పారిశ్రామికవేత్తల ప్రయోజనాలకు అనుగుణంగానే బడ్జెట్లను రూపొందించి అందులో ముఖ్యంగా రక్షణ శాఖకు అధిక మొత్తాలను కేటాయించడం ప్రజా సంక్షేమాల పట్ల పట్టించుకోకపోవడం, అనేక సబ్సిడీలను, రాయితీలను తొలగించడం ప్రస్తుత పాలక ప్రభుత్వాలు చేస్తున్నాయనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. రక్షణ రంగంలో 1948 నుండే కుంభకోణాలు ప్రారంభమై, జర్మనీ సబ్‌మెరైన్లు, స్వీడన్ బోఫోర్స్ శతఘ్నులు, దక్షిణ ఆఫ్రికా ఆంటీ మెటీరియల్ రైఫిల్స్ ఇటీవలి ఇటలీ ఆగస్టా హెలికాప్టర్ వంటి అనేక కుంభకోణాలు జరిగిన తీరు నిజంగానే రక్షణశాఖ పాలకులకు 'బంగారు గుడ్డు పెట్టే బాతుగా' మారిందనడంలో ఎంత మాత్రం తప్పులేదు. ఇక రెండవ అంశం ఎల్. అరణ్య, పుల్లూరు జగదీశ్వరరావు గార్ల 'ఉరిశిక్ష' అను అంశం కూడా ప్రస్తుత సమాజంలో తీవ్రంగా చర్చ జరుగుతున్న దనడానికి అద్దం పట్టినట్లుగా ఉంది. నాగరికత అంటే ఏమిటో ఆఫ్రికా ఖండ

*(మిగతా 63వ పేజీలో...)*

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ;

# ఎవరిదీ అపార ఖనిజ సంపద?

ఒకే ప్రశ్న పదే పదే, విభిన్న స్థలాలలో, విభిన్న స్థాయిలలో, విభిన్న ప్రజాసమూహాలలో వినిపించడం ఆ సమాజం తీవ్రమైన సంక్షోభంలో ఉన్నదనడానికి, ఆ సంక్షోభం అనేక రూపాల వ్యక్తీకరణ పొందుతున్నదనడానికి నిదర్శనం. భూగర్భంలో నిక్షిప్తమై ఉన్న ఖనిజ సంపద, సహజ వనరులు ఎవరికి చెందుతాయి అనే ప్రశ్న అటువంటిదే. ఎప్పటినుంచో ఉన్న ఈ ప్రశ్న ఇటీవల మరింత తీవ్రధ్వనితో వినబడుతున్నది. తాము నివాసం ఉంటున్న నేల లోపలి ఖనిజ సంపద తమదేనని ఆదివాసులతో సహా అనేక సమూహాలు భావిస్తుండగా, ఆ ఖనిజాలను ఇప్పటికిప్పుడు తవ్వితీసి తమ బొక్కసాలు నింపుకోదలచుకున్న పాలకులు వేరు వేరు జవాబులు చెపుతున్నారు. ఆ ఖనిజ సంపద మానవజాతి మొత్తానికీ చెందినదనో, ఒక పాలనా ప్రాంతంగా ఉన్న దేశానికి చెందినదనో, ఆ దేశంలో పాలనా విభాగమైన రాష్ట్రానికి చెందినదనో జవాబు చెపుతున్నారు. ఈ జవాబు మర్యాదపూర్వకంగా, ఆదర్శంగా, తటస్థమైనదిగా, న్యాయమైనదిగా కనబడుతుంది గాని అది పూర్తి నిజం కాదు.

భూముల క్రయవిక్రయాల పాత దస్తావేజులలో 'తరుగుల్మ జల నిధినిక్షేప సహితముగా' అనేమాట ఉండేది. అంటే భూమితో పాటే భూగర్భంలోని నిధి నిక్షేపాల మీద యాజమాన్యం కూడ బదిలీ అవుతుందన్నమాట. ఇది భూమి మీద వ్యక్తిగత ఆస్తి, యాజమాన్యాలకు సంబంధించిన వ్యవహారం. కాని 'భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వు' అని వేమన భూమి ఏ ఒక్కరిదీ కాదన్న మౌలిక వాస్తవాన్ని ఎప్పుడో చెప్పి ఉన్నాడు. కనుక నిధినిక్షేపాలు కూడ ఏ ఒక్కరివీ కావు, అవి మరొకరికి బదిలీ కూడ కావు. భూగర్భ నిధినిక్షేపాలు రాజ్యానికి, ప్రభుత్వానికి చెందుతాయనే చట్టపరమైన వాదన ఒకటి ఇప్పుడు రాజ్యం చేస్తున్నది. ఆ హక్కు ప్రభుత్వానికి ఉంటుందా? ప్రభుత్వాలు వస్తాయి పోతాయి, ఆధునిక కాలంలోనైతే ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం అనేది వచ్చాక ఎన్నికలలో గెలిచిన వారిదే ప్రభుత్వం. అలా ఎన్నికైన ప్రభుత్వాల గరిష్ట కాలవ్యవధి ఐదు సంవత్సరాలు. కనీస వ్యవధి పదమూడు రోజులు అని కూడ మన అనుభవంలో ఉన్నదే. లక్షల సంవత్సరాలుగానో, కోట్ల సంవత్సరాలుగానో భూగర్భంలో రూపు దిద్దుకున్న ఖనిజ సంపద మీద ఈ క్షణభంగురమైన ప్రభుత్వాలకు అధికారం ఇవ్వడం అనైతికం, అక్రమం, అసహజం.

అంటే భూగర్భ నిధులపై హక్కు వ్యక్తిదీ కాదు, ప్రభుత్వానిదీ కాదు. ప్రకృతికీ మనిషికీ ఉండవలసిన సంబంధాన్ని సక్రమంగా నిర్వహించే స్థానిక సమాజానికి మాత్రమే ఆ హక్కు ఉండాలి. ఆ సమాజం కూడ దాన్ని దుర్వినియోగం చేయకుండా, ఒక్క తరంలోనే ధ్వంసం చేయకుండా, పొదుపైన, అత్యవసరమైన వినియోగం మాత్రమే చేయాలని నిర్దేశం ఉండాలి.

బయ్యారం ఇనుప ఖనిజ నిక్షేపాలను ఎవరు ఎలా వాడుకోవాలి అనే ప్రస్తుత తక్షణ సమస్యలో ఇలా ఆలోచించవలసిన దీర్ఘకాలిక, సామాజిక, చారిత్రక, రాజకీయార్థిక సమస్యలెన్నో ఉన్నాయి. ఆ సమస్యలన్నిటినీ పక్కనపెట్టి శుష్క సమానత్వ, ఆడంబర ఆదర్శ ప్రవచనాలు వల్లించడం యథాస్థితి వాదానికి తప్ప మరొకందుకు పనికిరాదు. బయ్యారం ఇనుప ఖనిజాన్ని గతంలో రాజశేఖరరెడ్డి, రోశయ్య ప్రభుత్వాలు రక్షణ స్టీల్స్ అనే బేనామీ కంపెనీకి కట్టబెట్టాయి. ఆ కంపెనీ రాజశేఖర రెడ్డి అల్లుడు అనిల్ కుమార్‌దని తేలిన తర్వాత, ప్రజాందోళన తర్వాత ఆ నిర్ణయాన్ని వెనుకకు తీసుకున్నారు. ఇప్పుడు హఠాత్తుగా ఆ ఇనుప గనులను విశాఖపట్నంలోని రాష్ట్రీయ ఇస్పాత్ నిగమ్ లిమిటెడ్‌కు అప్పగిస్తున్నట్టు ప్రభుత్వ ప్రకటన వెలువడింది.

ఆర్ఐఎన్ఎల్ భారత ప్రభుత్వ సంస్థ గనుక, 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' నినాదంతోనే విశాఖ ఉక్కు కర్మాగారం ఏర్పడింది గనుక, ఖనిజ వనరులు జాతి అవసరాల కోసం వినియోగించవలసినవే గనుక ఈ నిర్ణయాన్ని తప్పు పట్టగూడదని నీతి వచనాలు పలుకుతున్నారు. ఆ ఖనిజ నిలువలు తెలంగాణకు చెందినవని, ఆ ఖనిజాన్ని వాడుకునేలా తెలంగాణలోనే ఉక్కు కర్మాగారం తెరవాలని వాదించడం జాతికే అపచారమని ప్రభుత్వం, పాలకవర్గ, కోస్తాంధ్ర రాజకీయ నాయకులు వాదిస్తున్నారు. 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అని 1960లలో నినదించిన మాటా, ఆ ఆందోళనలలో తెలంగాణ ప్రజలు కూడ పాల్గొన్న మాటా నిజమే. కాని ఏర్పడిన విశాఖ ఉక్కు కర్మాగారంలో తెలంగాణకు దక్కిన వాటా ఎంత? అది కేంద్ర ప్రభుత్వానికీ, రాష్ట్రం మొత్తానికీ చెందిన సంస్థే అయినా, రాష్ట్ర విస్తీర్ణంలో 40 శాతం, జనాభాలో 42 శాతం ఉన్న తెలంగాణ వాసులకు దానిలో నలభై శాతం కాదు, నాలుగు శాతం వాటా అయినా దక్కిందా? ఇప్పుడు బయ్యారం విషయంలో జాతి ప్రయోజనాలు అని మాట్లాడుతున్న వాళ్లు కడప, అనంతపురం జిల్లాలలో ఇనుప ఖనిజం నిలువల గురించి తెలిసినప్పుడు కడపజిల్లాలోనే ఉక్కు కర్మాగారం పెట్టాలని ఆలోచించారు గాని విశాఖపట్నానికి పంపాలని ఆలోచించలేదే? ఇప్పుడు ఇనుప ఖనిజం లభ్యమవుతున్న ఖమ్మం, వరంగల్ జిల్లాలలో దండిగా ఉన్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి అక్కడే ఉక్కు కర్మాగారం నిర్మించవచ్చుగదా.

అలాగే ఈ నిర్ణయం వెలువడిన సందర్భం కూడ ప్రత్యేకంగా గుర్తించదగినది. తమ వనరులను ఇతర ప్రాంతాలకు దోచి పెడుతున్నారని, తమ వనరుల మీద తమదే అధికారమని తెలంగాణ ప్రజలు ఉద్యమం సాగిస్తున్నప్పుడు, తమ వనరులు తమకు దక్కాలంటే ప్రత్యేక రాష్ట్రం తప్ప గత్యంతరం లేదని నినదిస్తున్నప్పుడు, రాష్ట్రాన్ని ఏర్పాటు చేస్తామని వాగ్దానం చేసిన కేంద్ర ప్రభుత్వం సాచివేత ధోరణిలో ఉన్నప్పుడు ఈ నిర్ణయం వెలువడింది. అంటే ఒకరకంగా ఈ నిర్ణయం ఉద్యమ వాదనలకు బలం చేకూరుస్తున్నది. ఇటువంటి సందర్భంలో తెలంగాణ వనరులను ఇతర ప్రాంతాలకు తరలించే నిర్ణయం వాంఛనీయం కాదు. ఆ నిర్ణయాన్ని సమర్థించుకోవడానికి ఆ ఖనిజం నాణ్యమైనది కాదనీ, ఆ గనులు కొద్ది రోజుల్లోనే వట్టిపోతాయనీ సాకులు చెప్పడం పుండుకు కారం అద్దడమే.

ఈ పాలకవర్గాలు సంక్లిష్ట సమయాలలో కూడ ప్రజానుకూల నిర్ణయాలు తీసుకోవనీ, ఇష్టారాజ్యపు, అహంకార, స్వార్థప్రయోజన నిర్ణయాలు తీసుకోవడమే వాటికి అలవాటనీ, ఒక విధాన నిర్ణయం మీద ప్రజలతో చర్చ జరపాలనే కనీస ప్రజాస్వామికత కూడ పాటించవనీ ఈ నిర్ణయం మరొకసారి తెలియజెపుతున్నది. పాలకవర్గాల ప్రవర్తన కొత్తదీ విచిత్రమైనదీ కాదు, ప్రజలు, ప్రజల పక్షం వహించే బుద్ధిజీవులు, రాజకీయ పక్షాలు ఇప్పటికైనా మొత్తంగా పాలకవర్గ నీతిని ఎదిరించే కర్తవ్యానికి పూనుకోక తప్పదని ఈ పరిణామం మరొకసారి చెపుతున్నది.

వీ

# మరొక అమానుష అత్యాచారం, మళ్లీ ఉరి కోర్కెలు...

శిక్ష కఠినంగా ఉంటేనే అటువంటి నేరాలు మళ్లీ జరగవనీ, స్త్రీల మీద అత్యాచారం వంటి నేరాలకు మరణశిక్ష మాత్రమే సరైన శిక్ష అనీ ఢిల్లీలో జ్యోతి సింగ్ పాండేపై అత్యాచార ఘటన తర్వాత గొంతెత్తి అరిచిన వారు, ఆ కఠినశిక్షల డిమాండ్ల తర్వాత కూడ అత్యాచార ఘటనలు తగ్గకపోవడాన్ని ఎట్లా వివరిస్తారో తెలియదు. జ్యోతి సింగ్ పాండేపై అత్యాచారం తర్వాత దేశం అట్టుడికిపోయింది. దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున నిరసన ప్రదర్శనలు జరిగాయి. ఈ అత్యాచారాలు ఇంకానా, ఇకపై సాగవు అని ప్రజలు నినదించారు. స్త్రీల మీద అత్యాచారాలను నిరోధించడానికి ఏమి చేయాలో పాలకులు, మేధావులు ఆలోచించడం మొదలుపెట్టారు. జస్టిస్ జెఎస్ వర్మ కమిటీ నియామకం, ఆ కమిటీ నివేదిక, సిఫారసులలో కొన్నిటిని ఒప్పుకుని ఆర్డినెన్స్, చట్టం అన్నీ యథావిధిగా జరిగిపోయాయి. మరణశిక్ష, నపుంసకుడిని చేయడం వంటి కఠినశిక్షలు అమలు జరపాలని డిమాండ్లు వచ్చాయి. శిక్షాభయంతో నేరాలను ఆపడం సాధ్యం కాదనీ, నేరాలు జరగడానికి అవకాశం ఇస్తున్న సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కారణాలను తొలగించాలనీ హేతుబద్ధంగా వాదించినవారి గళం బలహీనంగా మాత్రమే వినబడింది. ఒకవైపు కఠినశిక్షా నినాదాలు మారుమోగుతుండగానే శిక్షాభయం ఇసుమంత కూడ లేకుండా అదే నేరం పదే పదే జరుగుతూనే వచ్చింది. ఇంకా ఎక్కువ భయంకరమైన, అమానుషమైన పద్ధతిలో కూడ అత్యాచార నేరాలు జరుగుతూ వచ్చాయి.

మొన్నటికి మొన్న మళ్లీ ఒకసారి దేశం దిగ్భ్రాంతి చెందేలా అదే ఢిల్లీలో ఐదు సంవత్సరాల పసిపాప గుడియా మీద ఇద్దరు యువకులు అత్యాచారం జరిపారు. బీహార్ నుంచి వచ్చి వాచ్ మన్ గా పనిచేస్తున్న యువకుడు, అతని స్నేహితుడు మద్యం సేవించాక ఆ అత్యాచారం చేశారు. 'ఉరితీయండి' అని మళ్లీ ఒకసారి అశ్శరభ శరభ కేకలు మిన్నుముడుతున్నాయి గాని, ఆ ఇద్దరు నేరస్తుల అమానుషత్వం వెనుక వారి వ్యక్తిగత కారణాలెన్ని ఉన్నాయో, సామాజిక కారణాలు అన్ని ఉన్నాయి. ఆ ఇద్దరినీ ఉరితీస్తే బాధిత కుటుంబం, మధ్యతరగతి భావోద్వేగాలు సంతృప్తి చెందవచ్చు. కాని సామాజిక కారణాలు తొలగిపోవు. స్త్రీల పట్ల చిన్నచూపు, పసిపాపల నుంచి పండు ముదుసలి దాకా స్త్రీ అయితే చాలు పురుషుడి భోగ్య వస్తువు మాత్రమేననే భూస్వామ్య దృక్పథం, సొంత అనుభవాన్ని, స్వార్థాన్ని ప్రధానం చేసి, మనిషిలోని మానవత్వాన్ని తొలగించే పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద వినియోగ వస్తు సంస్కృతి, యువతరాన్ని మద్యం మత్తులో, అసహజ లైంగిక వాంఛలలో, హింసలో ముంచి, నీచ సంస్కృతిని రెచ్చగొట్టి పబ్బం గడుపుకోదలచుకున్న పాలకవర్గ కుటిల ప్రయత్నాలు, అనాదృత, నిస్సహాయ వర్గాలకు రక్షణ కల్పించడమే తమ బాధ్యత అని మరచిపోయిన భద్రతా బలగాలు, శవాల ఊరేగింపులో పేలాలు ఏరుకుంటూ, ఇటువంటి ఘటనలను సంచలనాత్మకం చేసే రాజకీయ నాయకుల అసహ్యకర ప్రవర్తన, స్త్రీ పురుష సంబంధాన్ని శత్రుపూరిత యుద్ధక్రీడగా, పురుషుడి భోగలాలసగా మెదళ్లలో నింపుతున్న దృశ్య, శ్రవణ, పఠన ప్రచార సాధనాలు – ఎన్ని సామాజిక కారణాలున్నాయి! వాటన్నిటినీ ఒకటొకటిగా క్షాళన చేసినప్పుడే, ఒక్క మాటలో చెప్పాలంటే వ్యవస్థ మారినప్పుడే ఈ అమానుషత్వం తొలగిపోతుంది. అది సుదూర కర్తవ్యం అనుకున్నా, ఆ దిశలో ఒక్కొక్క అడుగూ వేయడం తప్ప మరొక దారిలేదు.

వీ

# ఉత్తర కొరియాపై సామ్రాజ్యవాద దాడి

ఉత్తర కొరియా అణుపరీక్షలు సాగిస్తున్నదని, యుద్ధానికి కాలు దువ్వుతున్నదని ఆరోపిస్తూ అమెరికా, దక్షిణ కొరియాలు ఉత్తర కొరియా మీద దాడికీ దురాక్రమణకూ సన్నాహాలు చేస్తున్నాయి. ఒకవేపు పశ్చిమాసియాలో అమెరికా, ఇజ్రాయెల్ ల ఆధ్వర్యంలో దట్టమైన యుద్ధ మేఘాలు ఉండగానే, ఇప్పుడు తూర్పు ఆసియాలో కూడ యుద్ధ మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఇజ్రాయెల్, దక్షిణ కొరియా వంటి తన తైనాతీల సహాయంతో అమెరికా సాగిస్తున్న యుద్ధోన్మాదానికీ, ఆయుధాల వ్యాపారానికీ, విస్తరణ కాంక్షకూ ఇది మరొక నిదర్శనం. ఇరాక్ మీద దాడికి జనహనన ఆయుధాలున్నాయనీ, సద్దాం హుసేన్ నిరంకుశ పాలన సాగిస్తున్నాడనీ సాకులు చూపినట్టుగానే ఉత్తర కొరియా గురించి కూడ అమెరికా పాలకవర్గాలూ, ప్రచార సాధనాలూ అనేక సాకులు చూపుతున్నాయి. రాబోయే యుద్ధానికి సమ్మతి తయారు చేస్తున్నాయి.

ఉత్తర కొరియా సోషలిస్టు, కమ్యూనిస్టు దేశమేనా, అక్కడ కమ్యూనిస్టు పార్టీ పేరుతో కుటుంబ పాలన సాగుతున్నది గదా, యుద్ధ ఆర్థికవ్యవస్థను నడుపుతూ దేశ ప్రజల కనీస అవసరాలు తీర్చని పేదదేశంగా మిగిల్చారు గదా, కనీస ప్రజాస్వామ్యం లేని నిరంకుశ పాలన సాగుతున్నది గదా వంటి ప్రశ్నలు తప్పనిసరిగా జవాబులు చెప్పవలసినవే. కాని ఇవాళ్టి సందర్భం అది కాదు. ఇవాళ్టి సందర్భం అమెరికా సామ్రాజ్యవాద యుద్ధోన్మాదం ఉత్తర కొరియా మీదికి దూకబోతున్న సందర్భం. మొన్న ఆఫ్ఘనిస్తాన్ మీద, నిన్న ఇరాక్ మీద, లిబియా మీద దూకి, ఇవాళ ఇరాన్ మీద దూకడానికి సిద్ధంగా ఉన్న అమెరికాగితపు పులి మరొక పంజాను ఉత్తర కొరియా మీదికి చాస్తున్నది. సరిగ్గా ఆయా దేశాల మీదికి దూకడానికి చెప్పిన కారణాలనే చెపుతున్నది. ఆ కారణాలు నిజాలే అయినా దాడి చేసే హక్కు అమెరికాకు లేదు.

రెండో ప్రపంచ యుద్ధానంతరం అరబ్ దేశాల పక్కలో బల్లెం లాగ ఇజ్రాయెల్ ను తయారు చేసినట్టే అప్పటి ప్రధాన శత్రువులు సోవియట్ యూనియన్, జన చైనాల పక్కలో బల్లెంగా సామ్రాజ్యవాదులు దక్షిణ కొరియాను సృష్టించారు. ఉత్తర దక్షిణ కొరియాల మధ్య 1950–53లలో యుద్ధాన్ని రెచ్చగొట్టారు. అప్పటినుంచీ ఉత్తర కొరియా మీద ఆంక్షలతో, బెదిరింపులతో ఆ దేశం మీద ఒత్తిడి తేవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రాంతంలో నిరంతర ఉద్రిక్తత ఉండేలా చూస్తున్నారు. ఆ నిర్బంధ, ఒత్తిడి వాతావరణంలో ఉత్తర కొరియా పాలకులు ప్రజానుకూల పాలన నెరపి, ప్రజల మద్దతు కూడగట్టవలసింది. సామ్రాజ్యవాదాన్ని, దాని దళారీగా పనిచేస్తున్న పొరుగు ప్రభుత్వాన్ని ప్రజల సహకారంతో ప్రతిఘటించవలసింది. కాని సైన్యం మీద, ఆయుధ శక్తి మీద, పార్టీ మీద, ప్రభుత్వం మీద కుటుంబ సంకుచిత పట్టుతో సామ్రాజ్యవాద జోక్యాన్ని ఎదిరించదలచారు. వారు ఎంచుకున్న వ్యూహం ఖండించవలసిందే అయినా, వారి మీద దాడి చేసే అధికారం మరే దేశానికీ, ప్రత్యేకంగా దక్షిణకొరియాకూ, అమెరికాకూ లేవని ప్రపంచమంతా ఎలుగెత్తి చాటవలసి ఉంది. కష్ట కాలంలో ఉన్న ఉత్తర కొరియాకు విమర్శనాత్మక మద్దతునైనా అందించవలసి ఉంది.

వీ



❖ **అవిటి కథలు** – వికలాంగుల బతుకు చిత్రణ – వేముల ఎల్లయ్య, శంకర్ సంపంగి – అవిటి సాహితీ సంస్థ – 204 పేజీలు, 1/8 డెమీ రు. 100, ప్రతులకు: శంకర్ సంపంగి, రూం నం. 10, బషీర్ హాస్టల్, ది ఇంగ్లిష్ అండ్ ఫారెన్ లాంగ్వెజెస్ యునివర్సిటీ, తార్నాక, హైదరాబాద్ – 500 007; సెల్: 9866624901; ఇమెయిల్:sampangishnkr03@gmail.com



❖ **కథల పంట – 2** – విరసం వర్క్‌షాప్‌ల కథలు (2009–12) విప్లవ రచయితల సంఘం, 231 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : పాణి, 50–348–ఎల్/19 బి2, అరోరా నగర్, కర్నూలు – 2



❖ **ఫారన్‌హీట్ 451** – మరికొన్ని అనువాద వ్యాసాలు – ఎనిశెట్టి శంకర్ – స్నేహ ప్రచురణలు – 188 పేజీలు, 1/8 డెమీ, రు : 90, ప్రతులకు : విశాలాంధ్ర; సహచర; దిశ; నవోదయ



❖ **మార్క్సిస్టు సాహిత్య విమర్శ** – సిద్ధాంత రాజకీయ సమస్యలు – డా. శ్రీనివాస్ – వందన ప్రచురణలు – 199 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు: విశాలాంధ్ర; ప్రజాశక్తి; నవోదయ; దిశ; తెలుగు బుక్‌హౌస్



❖ **సోమయ్యకు నచ్చిన వ్యాసాలు** – సమకాలీన జీవితం సమాజం సందర్భం – వాడ్రేవు చినవీరభద్రుడు – శ్రీ ప్రచురణలు – 476 పేజీలు, 1/8 డెమీ, రు: 250, ప్రతులకు: నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్



❖ **తెలుగు సాహిత్యంపై మహాకవి శ్రీశ్రీ ప్రభావం** – డా. కడియాల రామమోహన్‌రాయ్ – శ్రీశ్రీ సాహిత్య నిధి ప్రచురణ – 63 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520004, ఫోన్: 0866–6640595, సెల్: 9246277375 ఇమెయిల్: srisri_sahityanidhi@yahoo.com



❖ **చెన్నై ప్రకటన** – ఆంధ్రప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ, అఖిల భారత విద్యాహక్కుల వేదిక – 40 పేజీలు, 1/8 డెమీ, రు: 20, ప్రతులకు: ఆం.ప్ర. విద్యా పరిరక్షణ కమిటీ, 306, ప్లెజెంట్ అపార్ట్‌మెంట్స్, బజార్‌ఘాట్, హైదరాబాద్ – 500 004; ఫోన్: 040–23305266, సెల్: 9440980396



❖ **అపరిచితుడు** – ఆల్బర్ట్ కామూ, తెలుగు: జి. లక్ష్మి – పీకాక్ క్లాసిక్స్ – 102 పేజీలు, 1/8 డెమీ, రు: 60, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్



❖ **కులం ప్రత్యామ్నాయ సంస్కృతి** – డా. కత్తి పద్మారావు – లోకాయత ప్రచురణలు – 182 పేజీలు, 1/8 డెమీ, రు : 100, గ్రంథాలయ ప్రతి : రు. 200 ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్; ప్రజాశక్తి బుక్ హౌస్



❖ **బుద్ధభూమి** – బౌద్ధ ధమ్మ పత్రిక – సమ్రాట్ అశోక ప్రత్యేక సంచిక – ధర్మ దీపం ఫౌండేషన్ సౌజన్యంతో– 136 పేజీలు, 1/8 డెమీ, విడి ప్రతి రు : 15, సంవత్సర చందా : రు. 150, ప్రతులకు: రేకా కృష్ణార్జునరావు, ఇ.నం. 11–450–సి1, ఎన్‌సిసి రోడ్, మంగళగిరి – 522 503, గుంటూరు, సెల్: 98481 99098, 99491 45650; ఇమెయిల్:telugusanghamithra@gmail.com



❖ **కట్టెపల్క** – కందుకూరి అంజయ్య – సాహితీ సోపతి – 68 పేజీలు, 1/8 డెమీ, రు : 60, ప్రతులకు : కందుకూరి అంజయ్య, 10–4–311, సుభాష్‌నగర్, కరీంనగర్ – 505 001



❖ **వేమన** – (వేమనపై విమర్శ వ్యాసాలు) – సిపి బ్రౌన్ పరిశోధన కేంద్రం, యోగి వేమన విశ్వవిద్యాలయం – 244 పేజీలు, 1/8 డెమీ, రు : 160, ప్రతులకు : సభ్య కార్యదర్శి, సిపి బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రం, 1–1254, సిపి బ్రౌన్ రోడ్, ఎర్రముక్కపల్లి, కడప – 516 004; ఫోన్: 08562 – 255517



❖ **ఒద్దిరాజు సోదరుల మేనరికం** (మరికొన్ని నాటకాలు) – పాలపిట్ట బుక్స్ – 204 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036; ఫోన్: 27678430 ఇమెయిల్:palapittabooks@gmail.com



❖ **ప్రజల పాటలు** – డిటిఎఫ్ కళా సమితి – 95 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : నవోదయ బుక్‌స్టాల్; దిశ పుస్తక కేంద్రం; సహచర బుక్‌మార్క్



❖ **తెలంగాణ మార్చ్ (సాగర హారం)** – సంపాదకులు: పిట్టల రవీందర్ – తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ – 78 పేజీలు, 1/8 డెమీ, రు : 25, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో



❖ **అస్తిత్వాలు – ఆధునికత – మార్క్సిజం** – పాణి, విప్లవ రచయితల సంఘం, 175 పేజీలు, 1/8 డెమీ, రు : 75, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం; నవోదయ బుక్‌స్టాల్; సహచర బుక్‌మార్క్

### సి. ధర్మారావు మృతి

మాజీ అధికార భాషా కమిషన్ సెక్రటరీ, తెలుగు సాహితీవేత్త సి. ధర్మారావు (79) మార్చ్ 18న హైదరాబాద్‌లో మరణించారు. గత కొంతకాలంగా ఆయన అనారోగ్యంతో ఉన్నారు. 1934, మార్చ్ 30న క్రిష్ణా జిల్లాలో పుట్టారు. ఆయన లా పట్టా ఉన్నా ఎన్నడూ న్యాయవాద వృత్తిని చేపట్టలేదు. ఆయన తెలుగు భాషా అభ్యున్నతికి ఎంతో కృషి చేశారు. గోరాశాస్త్రి ప్రేరణతో ఆయన పాత్రికేయ వృత్తిలో తనదైన ముద్రవేశారు. ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, నడుస్తున్న చరిత్ర లాంటి ఎన్నో పత్రికలో విరివిగా వ్యాసాలు రాశారు.

### మూతపడుతున్న బడులు

రాష్ట్ర వ్యాప్తంగా 1284 ప్రాథమిక పాఠశాలలను మూసేస్తున్నట్లు ప్రాథమిక విద్యాశాఖ మంత్రి శైలజానాథ్ ఏప్రిల్ 2న ప్రకటించారు. ఒక్కొక్క బడిలో పది మంది కన్నా తక్కువ విద్యార్థులు ఉన్న కారణంగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు వెల్లడించారు. 884 పాఠశాలల్లో ఒక్క విద్యార్థి కూడా లేడనీ, 400 స్కూళ్లలో నలుగురి కన్నా తక్కువ మంది ఉన్నారనీ తెలిపారు. మూసేసిన స్కూళ్లలోని విద్యార్థులను ఇతర స్కూళ్లలో చేర్పిస్తామనీ, వారికి రవాణా సౌకర్యం కూడా కల్పిస్తామన్నారు. రాష్ట్రంలో దాదాపు ఒక లక్షా అరవై వేల మంది చిన్నారులు బడికి దూరంగా ఉన్నారని చెప్పారు.

### నుస్రత్ మొహియుద్దీన్ మృతి

తెలంగాణ సాయుధ పోరాట యోధుడు మఖ్దూం మొహియుద్దీన్ కుమారుడు, ఆల్ ఇండియా ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ (పిడబ్ల్యుఎ- ఉర్దూ) కార్యదర్శి నుస్రత్ మొహియుద్దీన్ ఏప్రిల్ 4న హైదరాబాద్‌లో మరణించారు. ఉర్దూలో ప్రగతిశీల కవిత్వం, వ్యాసాలతో పాటు తెలుగు, ఇంగ్లిష్‌ల నుంచి ఉర్దూలోకి అనువాదాలెన్నో చేశారు.

### తెలంగాణ వనరుల విధ్వంసంపై సదస్సు

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏప్రిల్ 6న తెలంగాణ వనరులపై, తెలంగాణలో అభివృద్ధి పేర జరుగుతున్న విధ్వంసంపై సదస్సు జరిగింది. ఈ సదస్సులో జార్ఖండ్ ప్రజా గాయకుడు జీతన్ మరాండీ ముఖ్యఅతిథిగా హాజరైనారు.

### విద్యుత్ చార్జీల పెంపుకు నిరసనగా రాష్ట్ర బంద్

రాష్ట్రంలో పెంచిన ధరలకు వ్యతిరేకంగా విపక్షాలు ఏప్రిల్ 9న బంద్‌కు పిలుపునిచ్చాయి. వామపక్షాలు, టిడిపి, బిజెపి, వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ, టిఆర్ఎస్ పార్టీలు ఈ బంద్‌లో పాల్గొన్నాయి. ఈ బంద్‌కు పారిశ్రామిక వేత్తలు కూడ మద్దతు తెలిపారు. దుకాణాలు, వ్యాపార సముదాయాలు, బ్యాంకులు, విద్యాలయాలు, పెట్రోల్ బంకులు మూతబడ్డాయి.

### న్యాయమూర్తుల ప్రమాణ స్వీకారం

హైకోర్టు బార్ అసోసియేషన్ నుంచి ఎంపిక చేసిన ఐదుగురు సీనియర్ న్యాయవాదులు హైకోర్టు అదనపు న్యాయమూర్తులుగా జస్టిస్ రాజశేఖర్‌రెడ్డి, జస్టిస్ నవీన్ రావు, జస్టిస్ భట్, జస్టిస్ శేషసాయి, జస్టిస్ కోదండరామ్‌లు ఎన్నికయ్యారు. హైకోర్టు తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి ఎన్.వి. రమణ ఏప్రిల్ 12న వీరితో ప్రమాణ స్వీకారం చేయించారు.

### జస్టిస్ చిన్నపరెడ్డి మృతి

సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి (91) ఏప్రిల్ 13న హైదరాబాద్‌లో మరణించారు. ఆయన గత కొంతకాలంగా అనారోగ్యంతో బాధపడుతున్నారు. చిన్నపరెడ్డి 1922, సెప్టెంబర్ 25న కర్నూలు జిల్లా జంబులదిన్నెలో పుట్టారు. లండన్ మిషన్ హైస్కూల్, గుత్తిలో విద్యాభ్యాసం చేశారు. మద్రాస్ హైకోర్టులో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. 1960 నుంచి 1967 మధ్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర హైకోర్టు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా పనిచేశారు. తర్వాత హైకోర్టు అదనపు న్యాయవాదిగా, రెండేళ్ల తర్వాత శాశ్వత న్యాయమూర్తిగా ఉన్నారు. 1978 జూలై 17న సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పదోన్నతి పొంది 1987 సెప్టెంబర్ 24న పదవీ విరమణ చేశారు.

### పిబి శ్రీనివాస్ మృతి

ప్రముఖ గాయకులు పిబి శ్రీనివాస్ (82) చెన్నైలో ఏప్రిల్ 14న మృతి చెందారు. తెలుగు, హిందీ, తమిళం, మళయాళం, కన్నడ చిత్రాలలో ఎన్నో పాటలు పాడారు. ఆయన 1930 సెప్టెంబర్ 22న తూర్పు గోదావరి జిల్లా కాకినాడలో పుట్టారు. బికాం చదివిన పిబి శ్రీనివాస్‌కి ఎనిమిది భాషల్లో ప్రావీణ్యం ఉంది. తెలుగులో పలు గజల్స్ కూడా రాశారాయన.దాదాపు రెండు వందల చిత్రాల్లో పాటలు పాడారు.

### సబితా ఇంద్రారెడ్డికి సమన్లు

వై. ఎస్. జగన్మోహన్ రెడ్డి అక్రమ ఆస్తుల కేసులో భాగంగా హోం మంత్రి (అప్పటి గనుల శాఖ మంత్రి) సబితా ఇంద్రారెడ్డికి సిబిఐ సమన్లు జారీ చేసింది. దాల్మియా సిమెంట్స్‌కు సిమెంట్ గనుల లీజు వ్యవహారంలో గనుల శాఖ మంత్రిగా అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని, ఇతర నిందితులతో కలిసి కుట్రలో పాల్గొన్నారని సిబిఐ పేర్కొంది.

### రావూరి భరద్వాజకు జ్ఞానపీఠ్

ప్రముఖ తెలుగు సాహితీవేత్త రావూరి భరద్వాజ (86)కు ఏప్రిల్ 17న కేంద్ర ప్రభుత్వం జ్ఞానపీఠ్ అవార్డ్‌ను ప్రకటించింది. సినిమా రంగంపై ఆయన రాసిన 'పాకుడురాళ్లు' పుస్తకం ఆయనకు ఈ అవార్డు తెచ్చి పెట్టింది. తెలుగు సాహితీ రంగంలో ఈ అవార్డు లభించిన మూడో వ్యక్తి భరద్వాజ. ఇప్పటి వరకు ఆయన 37కి పైగా కథల సంపుటాలు, 17 నవలలు రాశారు. ఏడో తరగతి వరకే చదువుకున్నా ఆయన సాహితీయాత్ర నిరంతరం కొనసాగుతూనే ఉంది.

### విఎస్ రమాదేవి మృతి

బహుముఖ ప్రజ్ఞాశాలి, దేశ చరిత్రలోనే తొలి, ఏకైక కేంద్ర ఎన్నికల కమిషనర్, కర్ణాటక మాజీ గవర్నర్ వి.ఎస్. రమాదేవి (79) ఏప్రిల్ 17న బెంగళూరులో మరణించారు. ఆకాశవాణి రేడియోలో పిల్లల కార్యక్రమం ద్వారా రచయిత్రిగా ప్రస్థానం ఆరంభించారు. ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి పత్రికల్లో ఎన్నో వ్యాసాలు రాశారు. దాదాపు 19 పుస్తకాలు రాశారు. 1934 జనవరి 15న పశ్చిమ గోదావరి జిల్లా చేబ్రోలులో వి.వి. వెంకటసుబ్బయ్య, వి. వెంకటరత్నం దంపతులకు పుట్టారు. ఎం.ఎ. ఎల్.ఎల్. డిగ్రీలు పొందారు. ఎన్నికల కమిషనర్‌గా, హిమాచల్ ప్రదేశ్, కర్నాటకల గవర్నర్‌గా పదవీ బాధ్యతలను నిర్వహించారు.

### కారుమంచి వెంకటేశ్వరరావు మృతి

మార్క్సిస్ట్ అర్థశాస్త్రవేత్త కారుమంచి వెంకటేశ్వరరావు (80) ఏప్రిల్ 10న హైదరాబాద్‌లో మరణించారు. ఆయన గుంటూరు జిల్లా మంగళగిరి సమీపంలోని నీరుకొండ గ్రామంలో 1932 జూలై 1న పుట్టారు. భూస్వామ్య కుటుంబంలో పుట్టిన కారుమంచి విద్యార్థి దశ నుంచే వామపక్ష భావజాలం వైపు ఆకర్షితులయ్యారు. గుంటూరు హిందూ కళాశాలలో, అలీగఢ్ విశ్వవిద్యాలయంలో చదువుకొని అమెరికాలోని అలబామా విశ్వవిద్యాలయంలో అర్థశాస్త్ర ప్రొఫెసర్‌గా పనిచేశారు. పదవీ విరమణ తర్వాత తిరిగి వచ్చి కొంతకాలం గుంటూరులోనూ, ఆ తర్వాత హైదరాబాద్ నీలం రాజశేఖరరెడ్డి పరిశోధన కేంద్రంలోనూ పనిచేశారు. ప్రపంచీకరణపై ఎన్నో వ్యాసాలు రాశారు.

### వెంకట సుబ్బయ్య మృతి

గుంటూరు విప్లవోద్యమ నాయకుడు జవ్వాజి వెంకట సుబ్బయ్య (75) అనారోగ్యంతో ఏప్రిల్ 16న గుంటూరులో మృతిచెందారు. ప్రకాశం జిల్లా పొదిలి మండలం అముదాలపల్లికి చెందిన వ్యవసాయ కూలీలు కొండయ్య, కొండమ్మ దంపతుల కుమారుడైన వెంకటసుబ్బయ్య 28 ఏళ్ల పాటు విప్లవోద్యమంలో కీలక పాత్ర పోషించారు. శ్రీకాకుళ విప్లవోద్యమంలో పాల్గొని, పార్వతీపురం కుట్రకేసు నిందితుడుగా జైలు జీవితం కూడా గడిపి చివరిదాకా మావోయిస్టు పార్టీతో సన్నిహితంగా ఉన్నారు. ☐

# విద్యుత్ సంక్షోభానికి కారణాలు

***రాష్ట్రంలో పెరుగుతున్న విద్యుత్ సంక్షోభానికి కారణాలను విశ్లేషిస్తూ, ప్రత్యామ్నాయాలను కనుగొనాల్సిన అవసరాన్ని సూచిస్తున్నారు* ఏంపెల్లి భాస్కర్**

మారుతున్న ప్రపంచ పరిస్థితులకు అనుగుణంగా మారిన ప్రజల జీవన విధానాల, ఆర్థిక పరిస్థితుల వలన కావచ్చు లేదా ప్రజలు ఆధారపడే ఆర్థిక రంగాల ప్రాధాన్యంలో మార్పుల వలన కావచ్చు విద్యుత్ అనేది సాధారణ మానవులకు సైతం నిత్యావసర వస్తువుగా మారింది. విద్యుత్ మీద ఆధారపడని రంగం, ప్రజలు దాదాపు లేరని చెప్పుకోవడం అతిశయోక్తి కాదు. ఇంత ప్రాధాన్యత సంతరించుకున్న ఈ విద్యుత్ రంగం సంక్షోభంలోకి నెట్టి వేయబడింది. దాని భారం ప్రజల మీద పడింది. ఈ విద్యుత్ సంక్షోభానికి కారణాలను, పరిష్కారాలను, అవసరమయిన ప్రత్యామ్నాయాలను చర్చించవలసిన అవసరం ఉంది.

విద్యుత్ రంగంలో సంక్షోభం అంటే దాని అవసరానికి, సరఫరాకు మధ్య వ్యత్యాసానికి, దాని మూలాన పెరిగిన విద్యుత్ ధరలకు, అవి ప్రజల రోజువారి జీవితంపై చూపిన ప్రభావానికి సంబంధించింది. మనం గమనించవలసింది విద్యుత్ కొరతకు దారితీసిన పరిస్థితులు, విద్యుత్ ఉత్పత్తిని, ధరలను నిర్ణయించడంలో ప్రభుత్వం అనుసరించిన విధానాలు, అవి సమస్య పరిష్కారానికంటే జటిలం కావడానికి దారితీసిన విధానం.

### భారత విద్యుత్ చట్టం – 2003

విద్యుత్ రంగంలో ప్రైవేటీకరణను తీసుకురావడం కోసం చేసింది ఈ విద్యుత్ చట్టం. భారతదేశంలో విద్యుత్ రంగంలో అనేక మార్పులను ఈ చట్టం తీసుకువచ్చింది. ఈ చట్టం ప్రకారం విద్యుత్ రంగం వివిధ విభాగాలుగా, ఉత్పత్తి, నియంత్రణ, పంపిణీ సంస్థలను వేరు వేరుగా ఏర్పాటు చేసుకొని వాటిద్వారా పనిచేయడం తప్పనిసరి చేసింది. విద్యుత్ పరిశ్రమ ఏకీకృతంగా కాకుండా వివిధ విభాగాలుగా పనిచేయడం వలన దాని సామర్థ్యంగాని, వినియోగదారులకు అందించిన సేవలలో నాణ్యతగాని పెరిగిన దాఖలాలు చాలా దేశాలలో లేవు. అయినా ఉత్పత్తి, నియంత్రణ, పంపిణీ విభాగాలుగా పనిచేయడం విద్యుత్ రంగం సామర్థ్యం పెంచుతుందని ఈ చట్టం చెబుతుంది. విద్యుత్ రంగంలో ఉన్న అన్ని సమస్యలకు ఈ రకమైన వికేంద్రీకరణ, ప్రైవేటీకరణ పరిష్కారం అని సూచించింది. ఇందులో భాగంగానే విద్యుత్ ఉత్పత్తి, పంపిణీలలో ప్రైవేట్ యాజమాన్యాలను అనుమతించింది.

అయితే విద్యుత్ ఉత్పత్తిలో, పంపిణీలో వివిధ రాయితీలు అనుభవిస్తూ కూడా ప్రైవేట్ సంస్థలు సామాన్య ప్రజల అవసరాలు తీర్చడంలో సఫలమయినట్టుగా మనకు ఎక్కడా కనిపించదు. చాలా సందర్భాల్లో ఈ ప్రైవేట్ సంస్థలు అవి ఉత్పత్తి చేస్తున్న విద్యుత్‌ను ప్రజల అవసరాలకు, జాతీయ ప్రయోజనాలకు అనుగుణంగా కాకుండా లాభాపేక్షతో ఎక్కువ ధర చెల్లించిన వారికే అమ్ముకుంటున్నట్టు గమనించవచ్చు. రిలయన్సు కంపెనీ మన రాష్ట్రంలో ఉన్న వనరులను, కృష్ణా – గోదావరి బేసిన్‌లోని గ్యాస్‌ను, రాష్ట్రం విద్యుత్ సంక్షోభంతో సతమతమవుతుంటే అవసరమైన గ్యాస్‌లో కొంత కూడా కేటాయించకుండా, అధిక ధర చెల్లించే రాష్ట్రాలకు అమ్ముకుంటోంది. అలాగే ల్యాంకో వంటి ప్రైవేట్ విద్యుత్ ఉత్పత్తి సంస్థలు, విద్యుత్‌కు ఉన్న డిమాండ్‌ను దృష్టిలో పెట్టుకుని, లాభాలు దండుకోవడానికి ఎక్కువ ధరలు నిర్ణయిస్తూ పక్క రాష్ట్రాలకు అమ్ముకోవడం, పెద్ద వినియోగదార్లు పంపిణీ సంస్థలను నిర్ణయించుకునే అవకాశం ఈ చట్టం ఇవ్వడం వలన ఎక్కువ ధర చెల్లించే పెద్ద వినియోగదార్లకు అమ్ముకోవడం జరుగుతుంది. ఈ సంస్థల అధిపతులు కొన్ని సందర్భాల్లో ప్రజా ప్రతినిధులుగా ఉన్నా కూడా వాళ్లు ప్రజా ప్రయోజనాలకు కాకుండా లాభాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. కాబట్టి విద్యుత్ రంగంను వికేంద్రీకరించి, ప్రైవేట్ పరం చేస్తే అందించే సేవలలో సామర్థ్యం, నాణ్యత పెరుగుతాయనడంలో వాస్తవం లేదు. ఒకవేళ పెరిగినా ప్రైవేట్ ఉత్పత్తి సంస్థల ప్రయోజనాలు, ప్రజల ప్రయోజనాలు ఒకటి కాదని అర్థం అవుతుంది.

భారత విద్యుత్ చట్టం – 2003 ఫలితంగానే ప్రైవేట్ విద్యుత్ సంస్థలు, విద్యుత్ నియంత్రణ మండలులు, డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు ఏర్పడ్డాయి. పెద్ద వినియోగదారులు పంపిణీదారులను నిర్ణయించుకునే విధానం, ఇంధన సర్దుబాటు సర్ ఛార్జిలు (ఎఫ్ఎస్ఎ) మొదలైన విధానాలు అమలులోకి వచ్చాయి.

### ఇంధన సర్దుబాటు సర్‌ఛార్జి (ఎఫ్ఎస్ఎ)

విద్యుత్ ఛార్జిలు నిర్ణయించడానికి ముందు విద్యుత్ ఉత్పత్తికి అయ్యే ఖర్చులను, బొగ్గు, గ్యాస్, నాఫ్తా లాంటి ఇంధన వనరులకు అయ్యే ఖర్చులను ఆధారంగా చేసుకుని అంచనా వేస్తారు. భవిష్యత్‌లో ఇంధన ధరలు పెరిగే అవకాశం ఉంటే వాటిని దృష్టిలో పెట్టుకుని విద్యుత్ ఛార్జిలు నిర్ణయిస్తారు. అయితే ధరల్లో ముందుగా వేసిన అంచనా కన్నా ధరలు పెరగడం కానీ, తగ్గడం కానీ జరిగితే, ప్రతి మూడు నెలలకోసారి విద్యుత్ ఛార్జిలు సర్దుబాటు చేస్తారు. అంచనాకు మించి ఇంధన ధరలు పెరిగితే ఛార్జిలను కలుపుతారు. తగ్గితే ఛార్జిలను తగ్గిస్తారు. ఇది అన్ని శ్లాబులకు వర్తిస్తుంది.

ఇటీవల విద్యుత్ ఛార్జిల పెంపుతో ప్రజలలో వచ్చిన వ్యతిరేకతకు భయపడి ప్రభుత్వం 850 కోట్ల రూపాయల భారాన్ని తగ్గించింది. అయితే ఈ భారాన్ని ఇంధన సర్దుబాటు సర్‌ఛార్జిలను పెంచడం ద్వారా రాబట్టడం కోసం ప్రణాళికలు వేస్తున్నట్లు తెలుస్తోంది. ఇట్లాంటి

సర్దుబాటు చేయడానికి ఈ ఇంధన సర్దుబాటు సర్‌ఛార్జిలను ప్రభుత్వం ఉపయోగించుకుంటుంది.

## మర్చంట్ పవర్ ప్లాంట్లు

ప్రైవేట్ రంగ సంస్థలు విద్యుత్ ప్లాంట్లను స్థాపించుకుని, ఉత్పత్తి చేసుకుని, ఇష్టం వచ్చిన ధరకు, ఇష్టం వచ్చిన వారికి, ఇష్టం వచ్చిన చోట అమ్ముకోవచ్చు. వీటికి అవసరమయిన మౌలిక సదుపాయాలైన భూమి, నీరు మొదలైనవి ప్రభుత్వం సమకూర్చుతుంది. శ్రీకాకుళం, విశాఖపట్నం, నెల్లూరు జిల్లాల్లో ఎక్కువగా ఈ ప్లాంట్లకు అనుమతి లభించింది. శ్రీకాకుళం జిల్లా కాకరాపల్లి, సోంపేటలో ఏర్పాటు చేయనున్న ఇలాంటి థర్మల్ విద్యుత్ కేంద్రాలకు విలువైన, సారవంతమైన భూములను ఇచ్చినందున ప్రజల జీవనాధారమైన చేపల వేటకు ఈ విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు అడ్డుగా మారుతున్నందున ప్రజల నుండి తీవ్ర వ్యతిరేకత వచ్చింది.

## విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు (పిపిఎలు)

విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలతో కుదుర్చుకున్న విద్యుత్ కొనుగోలు ఒప్పందాలు దీర్ఘకాలికంగా ఇరవై ఐదు సంవత్సరాలకు పైబడినవి. ఈ ఉత్పత్తి కేంద్రాలు ఎంత ధర నిర్ణయించినా దీర్ఘకాలంలో కొనవలసి ఉంటుంది. వాటికి ఇంధన వనరులైన బొగ్గు, గ్యాస్ సమకూర్చవలసిన బాధ్యత ప్రభుత్వానిది. దేశంలో ఉత్పత్తి అయిన బొగ్గు ప్రభుత్వ విద్యుత్ ఉత్పత్తి సంస్థలకు కేటాయించకపోవడం వలన అధిక ధరలకు విదేశాల నుండి కొనుగోలు చేయడం, గ్యాస్ తగినంత కేటాయించకపోవడం వలన ఆర్ఎల్ఎన్ గ్యాస్ వంటి ఖరీదైన ఇంధన వనరులను కొనుగోలు చేయడం మూలాన ఉత్పత్తి ఖర్చు పెరిగి తద్వారా విద్యుత్ ధరలు పెరగడానికి దారితీస్తుంది.

ఈ లోపాలన్నింటిని కప్పి పుచ్చుకుంటూ, పెరుగుతున్న విద్యుత్ అవసరాలకు అణు విద్యుత్ తప్పనిసరి అని, అది చవకైనదని ప్రచారం మొదలుపెట్టారు. అణు విద్యుత్‌కు అయ్యే వ్యయం తక్కువేమీ కాదు. అది విడుదల చేసే రేడియేషన్ కావచ్చు, ప్రపంచంలో ఇంతకు ముందు జరిగిన ప్రమాదాల దృష్ట్యా అది అంత ఆధారపడవలసిన వనరు కాదు. దానికి బదులు సంప్రదాయేతర వనరులయిన సౌరశక్తి, బయో డీజిల్‌ను విద్యుత్ ఉత్పత్తికి ఉపయోగించడం, అభివృద్ధి చేయడం మంచిది.

## ప్రస్తుత సంక్షోభం

2013 ఏప్రిల్ 1 నుండి విద్యుత్ ధరలను పెంచుతూ, కొత్తగా శ్లాబులను పెంచుతూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంతో విద్యుత్ రంగంలో సంక్షోభం తెరమీదకు వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో ప్రజలు తక్కువ వోల్టేజీ విద్యుత్, విద్యుత్ నిలిపివేత వంటి సమస్యలతో ఒక పక్క సతమతమవుతుంటే, ఈ సందర్భంలో అసాధారణ ధరల పెరుగుదల ప్రజల సహనాన్ని పరీక్షించి, వాళ్ల ఆగ్రహాన్ని చవిచూడాల్సి వచ్చింది.

తక్కువ ధరకు అందుబాటులో ఉండే జల విద్యుత్, గ్యాస్ ఆధారిత విద్యుత్ గత కొన్ని సంవత్సరాలతో పోలిస్తే ఎన్నడూ లేనంతగా తగ్గిపోయింది. రాష్ట్రానికి ఏడు వేల మెగావాట్ల అదనపు విద్యుదుత్పాదక సామర్థ్యం ఉన్నప్పటికీ గ్యాస్ అందుబాటులో లేక ఉత్పత్తి జరగడం లేదు. మన రాష్ట్రంలో రిలయన్స్ ఉత్పత్తి చేస్తున్న గ్యాస్ ఇతర రాష్ట్రాలకు అమ్ముకుంటోంది గానీ, రాష్ట్రంలో సంక్షోభంలో ఉన్న విద్యుత్ రంగానికి అది గ్యాస్ కేటాయించడం లేదు. అటువంటి ఒక పెద్ద ప్రైవేట్ కంపెనీని గ్యాస్ కోసం ఒత్తిడి తెచ్చే సామర్థ్యం రాష్ట్ర ప్రభుత్వానికి, కేంద్ర ప్రభుత్వానికి లేదు.

'ఇంత ఇబ్బంది ఊహించలేదు. కరెంటు కష్టాలు నిజమే. వర్షాభావం, గ్యాస్ కొరత వల్లే యూనిట్ విద్యుత్‌కు రు.12కు కొని సాగుకు ఇస్తున్నాం' అని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి అన్నారు. ఎక్కువ ధరకు విద్యుత్ కొని ప్రజలను అప్పుల పాలు చేసి, ప్రజలపై విద్యుత్ భారాలు మోపడానికి సిద్ధపడింది కానీ, కృష్ణా – గోదావరి బేసిన్‌లో రిలయన్స్ నుండి గ్యాస్ కోసం ఒత్తిడి తేవడానికి ప్రభుత్వానికి ధైర్యం రాలేదు. లేదా ధైర్యం లేదు.

మొత్తం విద్యుత్తు ఛార్జిల పెంపు భారం రు. 12,000 కోట్లు. ప్రభుత్వం సబ్సిడీ ద్వారా రు. 5,700 కోట్లు ఇవ్వగా మిగిలిన రు. 6,300 కోట్లు వినియోగదారుల నుండి విద్యుత్ ఛార్జిలు పెంచడం ద్వారా రాబట్టాలని నిర్ణయించడం జరిగింది. జల విద్యుత్, బొగ్గు, గ్యాస్ ఆధారిత విద్యుత్ అందుబాటులో లేకపోవడం వలన ఆర్ఎల్ఎన్‌జి, నాఫ్తా ఆధారిత విద్యుత్ ఉత్పత్తి చేయాలని నిర్ణయించడం మూలంగా విద్యుత్ ఛార్జిలు ఈ స్థాయిలో పెరగడం జరిగింది.

శ్రీశైలం, నాగార్జునసాగర్ జలాశయాల్లో నీటిమట్టం తక్కువగా ఉండడం వలన 2500 మిలియన్ యూనిట్ల విద్యుత్ మాత్రమే ఉత్పత్తి జరిగింది. గత సంవత్సరం ఇది 11,000 మిలియన్ యూనిట్లుగా ఉంది. 85,000 మిలియన్ యూనిట్లు విద్యుత్ అవసరం ఉండగా 9,000 మిలియన్ యూనిట్ల కొరత ఏర్పడింది. ఫలితంగా పరిశ్రమలు సగం రోజులు కూడా పనిచేయడం లేదు. వ్యవసాయానికి తగినంత విద్యుత్ అందడం లేదు. చేతివృత్తులను నమ్ముకున్న వారి బతుకులు అస్తవ్యస్తమయ్యాయి. కరెంట్ ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియని పరిస్థితిలో వోల్టేజి సమస్యతో వ్యవసాయ బావులలో మోటర్లు కాలిపోవడం, రాత్రి వేళల్లో విద్యుత్ లాంటివి రైతులకు అదనపు భారాలు. ఈ సమస్యల నుండి బయట పడడానికి, విద్యుత్ కొరతను అధిగమించడానికి విద్యుత్ ఛార్జిలు పెంచడం జరిగిందని ప్రభుత్వం చెపుతోంది.

బొగ్గు కేటాయింపులను కేంద్రం నుండి ఎక్కువగా రాబట్టుకోవడంలో రాష్ట్ర ప్రభుత్వం విఫలం అవుతోంది. ఈశాన్య రాష్ట్రాల నుండి చవకగా విద్యుత్ కొనడానికి సరఫరా వ్యవస్థ అందుబాటులో లేకపోవడం ఇబ్బందిగా మారింది.

2003 భారత విద్యుత్ చట్టం సూచనల మేరకు రాష్ట్రంలో ఆంధ్రప్రదేశ్ విద్యుత్ నియంత్రణ మండలిని ఏర్పాటు చేసారు. ఈ నియంత్రణ మండలి విద్యుత్ రంగంలో పెట్టుబడులను, విద్యుత్ ధరలను, ఉత్పత్తిదారులను, పంపిణీదారులను, వినియోగదారులను దృష్టిలో పెట్టుకుని రాజకీయాలకతీతంగా, హేతుబద్ధంగా, పారదర్శకంగా నిర్ణయించడానికి ఉద్దేశించబడింది. దీని ముఖ్యమైన బాధ్యత వినియోగదారులకు సాధికారత కల్పించడం. పెట్టుబడిదారీ విధానంలో వినియోగదారులే రాజులు అని చెప్పే కపటత్వమే ఇందులో కూడా దాగి ఉంది.

ఈ విద్యుత్ నియంత్రణ మండలి అవసరమైన విద్యుత్‌ను అంచనా వేసి, దాని సరఫరాకు ఉన్న అవకాశాలను పరిశీలించి, కొరత ఉంటే అధిగమించడానికి అవకాశాలను చూపిస్తుంది. దానికి అనుగుణంగానే

విద్యుత్ ఛార్జిలను నిర్ణయిస్తుంది. 2013-14 సంవత్సరానికి రు. 49,187 కోట్ల ఆదాయం విద్యుత్ అవసరాలు తీర్చడానికి అవసరమని డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు (డిస్కంలు) ప్రతిపాదించాయి. అయితే అంత మొత్తం అవసరం లేదని రు. 37,853.63 కోట్ల ఆదాయం సరిపోతుందని విద్యుత్ నియంత్రణ మండలి నిర్ణయించింది. ఇందులో విద్యుత్ అమ్మకాల ద్వారా రు. 28,995.63 కోట్లు, రాష్ట్ర ప్రభుత్వం సబ్సిడీ ద్వారా రు. 5480 కోట్లు, మిగిలిన రు. 3,378 కోట్లు ఛార్జిలు పెంచి వినియోగదారుల నుండి రాబట్టాలని నిర్ణయించింది. కానీ డిస్ట్రిబ్యూషన్ కంపెనీలకు కావలసిన ఆదాయం రు. 40,639 కోట్లుగా మార్చి, రాష్ట్ర ప్రభుత్వ సబ్సిడీలో ఏ మార్పులు చేయకుండా వినియోగదారుల నుంచి వసూలు చేయాల్సిన దానిని రు. 3,378 కోట్ల నుండి రు. 6,164 కోట్లకు పెంచింది. ఇది అంతిమంగా విద్యుత్ ఛార్జిల పెరుగుదలకు దారితీసింది.

అయితే దీని వెనుక ఉన్న అసలు ఉద్దేశాలు ఏమిటి అనేది పరిశీలించాలి. విద్యుత్ నియంత్రణ మండలి ఆర్ఎల్ఎన్జి, నాఫ్తా వంటి ఖరీదైన ఇందన వనరులతో విద్యుత్ ఉత్పత్తిని నిరాకరించింది. రాష్ట్ర ప్రభుత్వం ఒత్తిడి మూలాన కేవలం 1443.34 మిలియన్ యూనిట్ల విద్యుత్ ఉత్పత్తికి యూనిట్‌కు రు. 10 చొప్పున అంగీకరించింది. కానీ రాష్ట్ర ప్రభుత్వం దానికి 2430 మిలియన్ యూనిట్లకు పెంచేలా ఒత్తిడి తీసుకువచ్చింది. ఈ విధంగా అర్ఎల్ఎన్జి ఆధారిత విద్యుత్ ఖర్చు రు.2430 కోట్లకు చేరింది. అదే విధంగా ప్రైవేట్ విద్యుత్ సంస్థల నుండి ఒక యూనిట్ విద్యుత్‌కు రు. 4.55 చెల్లించి 6334.76 మిలియన్ యూనిట్లు కొనేందుకు విద్యుత్ నియంత్రణ మండలి నిర్ణయించింది. దీనిపై డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు తీవ్ర ఒత్తిడి చేసి యూనిట్ ధరను రు.6తో 8841 మిలియన్ యూనిట్లను ప్రైవేట్ విద్యుత్ సంస్థల నుండి కొనడానికి ఒప్పించాయి. ఫలితంగానే రు.3378 కోట్ల భారం కాస్తా రు. 6164 కోట్లకు పెరిగింది.

ఇదంతా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యక్షంగా, డిస్ట్రిబ్యూషన్ కంపెనీలతో పరోక్షంగా ఎందుకు చేయించింది అంటే వచ్చేది ఎన్నికల సంవత్సరం కాబట్టి, భవిష్యత్‌లో వర్షాభావ పరిస్థితులు ఏర్పడి జలశయాలు నిండక జలవిద్యుత్ ఉత్పత్తి సమస్యగా మారితే, ఆర్ఎల్ఎన్జితో విద్యుత్ ఉత్పత్తి చేయాల్సి వస్తే అప్పుడు ఛార్జిలు పెంచడం ఎన్నికల మీద ప్రభావం చూపిస్తుంది. కనుక వర్షాలు పడవని, జల విద్యుత్ ఉత్పత్తి జరగదని ఒక ప్రాథమిక అవగాహనకు వచ్చి, ఆ భారం ఇప్పటి నుండే ప్రజల చేత వసూలు చేసేలా టారిఫ్ ఆర్డర్ ఉండాలనీ విద్యుత్ నియంత్రణ మండలికి సూచనలు చేయడం జరిగింది. ఆర్ఎల్ఎన్ గ్యాస్ ఆధారంగా 2430 యూనిట్లు ఉత్పత్తికి యూనిట్‌కి రు. 10 చొప్పున రు. 2430 కోట్లు అవుతుంది. అంతే మొత్తంలో జల విద్యుత్‌కు అయ్యే ఖర్చు రు. 656 కోట్లు మాత్రమే. తేడా రు. 1774 కోట్లు, దీనిని కూడా ప్రజల నుండి ఛార్జిల రూపంలో వసూలు చేయాలని ప్రతిపాదించింది.

## వ్యవసాయం - రైతులు - ఉచిత విద్యుత్

వ్యవసాయానికి ఏడు గంటల ఉచిత విద్యుత్ అనేది ప్రభుత్వ ఎన్నికల హామీయే కాని, వాస్తవంలో దాని అమలు విద్యుత్ అంటే రైతులు భయపడే స్థాయిలో ఉంది. రాత్రిపూట వ్యవసాయ బావుల వద్ద విద్యుత్ షాక్‌కు గురై మరణించిన వారి సంఖ్య తక్కువేమీ కాదు. లోవోల్టేజీ విద్యుత్తుతో మోటార్లు, ట్రాన్స్‌ఫార్మర్లు కాలిపోతుండడం, రైతులు ట్రాన్స్‌ఫార్మర్ల కోసం (మోటార్ల కోసం కాదు) సబ్ స్టేషన్ల ముందు ధర్నాలు చేయడం సామాన్యమైన విషయంగా మారిపోయింది. వ్యవసాయానికి విద్యుత్ నిరంతరాయంగా కాకుండా నాలుగు, ఐదు దఫాలుగా అది కూడా విద్యుత్ వినియోగం తక్కువగా ఉండే రాత్రి వేళల్లో ఇవ్వడం జరుగుతుంది. రైతులకు నీటి పారుదలకు అవసరమైన పంట కాలువలు లేక బావులు, బోరు బావులు అప్పులు చేసి వేసుకుంటే, విద్యుత్ కొరత, మోటార్లు కాలిపోవడం రైతుల జీవితాలను దుర్భరంగా మార్చి, చేసిన అప్పులు ఆత్మహత్యలకు ప్రేరేపిస్తున్నాయి.

నిపుణులు చెపుతున్నదేమంటే ఆర్థిక అసమానతల దృష్ట్యా ఈ ఉచిత విద్యుత్ అందరికి ఒకే విధంగా అందడం లేదు. ఉచిత విద్యుత్ ఫలితాలు కూడా అన్ని రకాల రైతులకు ఒకే విధంగా అందడం లేదు. పెద్ద రైతులు సంఘాలు ఏర్పాటు చేసుకొని ప్రభుత్వ పాలసీలను, పథకాలను తమకు అనుగుణంగా మార్చుకునే స్థాయి నుండి వాళ్లే ప్రభుత్వంలో భాగస్వాములై పథకాలు తయారు చేస్తున్నారు. అమలును పర్యవేక్షిస్తున్నారు. ఇటువంటి సందర్భంలో చిన్న, సన్నకారు రైతులకు, భూస్వాములకు పథకాల అమలు, ఉచిత విద్యుత్ నుండి ఎరువుల, విత్తనాల రాయితీల వరకు ఒకే విధంగా ఉండదు అనేది స్పష్టం. పైగా పెద్ద రైతులు ఉపయోగించే నీటి మోటార్లు ఎక్కువ శక్తి కలిగినవి, నాణ్యమైనవి. కాలిపోయిన ట్రాన్స్‌ఫార్మర్ల స్థానంలో కొత్తవి ఏర్పాటు చేయించుకోగలిగిన శక్తివంతులు వాళ్లు. కాబట్టి ఈ ఉచిత విద్యుత్ ఎవరికి ఉచితం అనేది తెలిసిపోయింది. చాలా సందర్భాల్లో ఈ పెద్ద రైతులు, చిన్న సన్నకారు రైతులకు పంటకు అవసరమయిన నీటిని అమ్ముకుంటున్నట్టుగా తెలుస్తోంది. అదే విధంగా హైదరాబాద్, రంగారెడ్డి పరిసర ప్రాంతాల్లో రాజకీయ భూస్వామ్య రైతులు వ్యవసాయ భూములలోని నీటితో వ్యవసాయం కాకుండా పట్టణంలోని ఫంక్షన్ హాల్స్, పెళ్లిళ్లకు నీటిని సరఫరా చేసే వ్యాపారం చేస్తున్నారని సాకి (ఎస్ఎసిఐ) వాటర్స్ అనే రిసర్చ్ సంస్థ అధ్యయనంలో వెల్లడైంది.

'విద్యుత్ కొరత దేశం అంతటా ఉంది. అయినా తన నియోజక వర్గంలో గతంలో కంటే ఎక్కువ పడింది. విద్యుత్ సమస్య లేదడానికి ఇదే నిదర్శనం' అని మంత్రి పొన్నాల లక్ష్మయ్య చెప్పింది ఇలాంటి భూస్వామ్య రైతులను దృష్టిలో పెట్టుకుని అయ్యుంటుంది. లేకపోతే కరీంనగర్‌లో పదిహేను మండలాల్లో ఎండిపోయిన 23,316 హెక్టార్ల పంట గురించి కూడా మాట్లాడి ఉండేవాడు.

ప్రజల నుండి పెద్ద ఎత్తున వచ్చిన నిరసనలతో ప్రభుత్వం వెనకడుగు వేసి 200 యూనిట్ల విద్యుత్ వినియోగం వరకు ధరల పెరుగుదల లేదు అని ప్రకటించింది. రాష్ట్రంలో రెండు కోట్ల గృహ వినియోగ కనెక్షన్లలో దాదాపు 1.86 కోట్ల మంది రెండు వందల యూనిట్ల లోపు కరెంటు వాడుతున్నారు కాబట్టి 72 శాతం రాయితీని భరిస్తున్నాం అని ప్రభుత్వం చెపుతుంది. దీని ద్వారా తెలిసేదేమంటే దాదాపు 92 శాతం కంటే ఎక్కువ గృహ వినియోగదారులు రెండు వందల యూనిట్ల లోపు వాడుతున్నారు. ఇది మొత్తం విద్యుత్‌లో చాలా తక్కువ శాతంగా ఉంటుంది. రెండు వందల యూనిట్లలోపు పెంపు లేదు అంటే పాత ధరలను వర్తింపజేస్తారు. అయితే ఈ పాత ధరలలో కూడా తక్కువ స్థాయిలో విద్యుత్‌ను ఉపయోగిస్తున్న వారి మీద కనీస ఛార్జిల పేరిట, ఇంధన సర్దుబాటు ఛార్జిల పేరిట వాళ్లు వాస్తవంగా ఉపయోగించిన

# నొవార్టిస్‌కు సుప్రీంకోర్టు చెంపదెబ్బ

***సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలు మార్కెట్‌పై ఆధిపత్యం కోసం పేటెంట్ హక్కులు పొంది స్థానిక కంపెనీలను ఎదగనివ్వకుండా, ప్రజలను ఎలా దోచుకుంటున్నాయో వివరిస్తున్నారు* పి.వి. రమణ**

స్విట్జర్లాండ్‌కు చెందిన ఫార్మా దిగ్గజం నొవార్టిస్‌కు వ్యతిరేకంగా సుప్రీంకోర్టు ఏప్రిల్ 1న ఇచ్చిన 98 పేజీల తీర్పును భారతీయ ఫార్మా కంపెనీలు, న్యాయ నిపుణులు, పేద క్యాన్సర్ రోగులు సంతోషంగా ఆహ్వానించారు.

మన దేశంలో రక్త, చర్మ క్యాన్సర్ రోగ చికిత్సకు వాడే 'గ్లివెక్' ఔషధం చాలా ఖరీదైనది. నెల రోజుల ఔషధం నొవార్టిస్ 1 లక్షా 20 వేల రూపాయలకు అమ్ముతుండగా, అదే ఔషధాన్ని భారతీయ కంపెనీలు ఉత్పత్తి చేస్తున్న జనరిక్ మందులు కేవలం ఎనిమిది వేల రూపాయలకు లభిస్తున్నాయి. గ్లివెక్ ఔషధంలో తాము ఆవిష్కరించిన ఇమాటినిబ్ మెసెలైట్ అనే పదార్థాన్ని ఉపయోగిస్తున్నామని, దానిపై తమకు పేటెంట్ హక్కు కావాలని నొవార్టిస్ 2006లో చెన్నైలో ఉన్న పేటెంట్ కంట్రోలర్ వద్ద నివేదించగా దానిని అక్కడ తిరస్కరించారు. 2007లో మద్రాస్ హైకోర్టు కూడా ఈ వాదనను తోసి పుచ్చింది. చివరిగా 2009 ఆగస్ట్‌లో నొవార్టిస్ భారతీయ కంపెనీలు తయారు చేస్తున్న జనరిక్ వెర్షన్ ఔషధ ఉత్పత్తిని నిరోధించాలని, తమకు పేటెంట్ అనుమతించాలని సుప్రీంకోర్టులో కేసు వేశారు. నొవార్టిస్ వాదనను తోసి పుచ్చుతూ 'ఈ ఔషధ తయారీలో ఉపయోగించినట్లు చెపుతున్న ఇమాటినిబ్ మెసైలైట్ ఇప్పటికే బహుళ ప్రాచుర్యం పొంది ఉందని, అందులో సరికొత్త ఆవిష్కరణేమీ తమకు కనిపించలేదని, భ్రమను కలిగించే పదాల మాయాజాలంతో పేటెంట్‌ను కోరితే దానికి లొంగిపోయి వారికి పేటెంట్ హక్కును అనుమతించలేమని' జస్టిస్ రంజన్ ప్రకాష్ దేశాయ్, జస్టిస్ ఆఫ్తాబ్ ఆలంల సారథ్యంలోని సుప్రీంకోర్టు ధర్మాసనం తీర్పునిచ్చింది.

'ఔషధాలపై పేటెంట్ లేకపోయినట్లయితే, వాటిని తాము సరసమైన ధరలకు అందుబాటులోకి తేగలమన్న భారతీయ ఫార్మా కంపెనీల వాదనకు ఇది విజయమని' రాన్‌బాక్సీ, సిప్లా కంపెనీల తరఫున వాదించిన న్యాయవాది ప్రతిభాసింగ్ వ్యాఖ్యానించారు. 'పాత పరిశోధనలను కొద్దిగా మార్చి కొత్త ఆవిష్కరణలుగా ప్రకటించే వాటికి తిరస్కారం తప్పదన్న సందేశాన్ని కూడా ఈ తీర్పు ద్వారా వెల్లడయింద'ని అన్నారు. 'పేద రోగులకు అనుకూలంగా వెలువడిన చారిత్రాత్మక తీర్పు ఇది' అని ఇండియన్ ఫార్మసూటికల్ అలయన్స్, భారత ఔషధ ఉత్పత్తిదారుల సంఘాలు కొనియాడాయి. తప్పుడు పేటెంట్లతో మార్కెట్‌లో గుత్తాధిపత్యం సాధించాలనుకునే వారికి ఇది గుణపాఠమని 'కాన్సర్ పేషెంట్స్ ఎయిడ్ అసోసియేషన్' లాయర్ వినా మెంగనాయ్ అన్నారు.

1995 కంటే ముందు భారతదేశ మార్కెట్‌లో అందుబాటులో ఉన్న ఔషధానికి కొద్దిపాటి మార్పులు చేసి 'గ్లివెక్'ను రూపొందించి దానికి పేటెంట్ కావాలని 1998 నుండీ నొవార్టిస్ డిమాండ్ చేస్తోంది. అప్పటికే ప్రాచుర్యం పొందిన ఔషధాలు పేటెంట్ హక్కుకు అర్హులు కావని 'భారత పేటెంట్ చట్టం'లో సెక్షన్ 3డి నిర్దేశిస్తుంది. ప్రజా ప్రయోజనాలు దెబ్బ తీసేవి, అప్పటికే మార్కెట్‌లో ఉన్న ఔషధాల కన్నా సమర్థవంతం కాని ఔషధాలకు పేటెంట్ ఇవ్వరాదని సెక్షన్ 3బి నిర్దేశిస్తుంది. ఈ నిబంధనల ఆధారంగానే గ్లివెక్‌కు జనరిక్ వెర్షన్ తయారు చేస్తున్న భారత ఫార్మా కంపెనీలు నొవార్టిస్ వాదనను తోసిపుచ్చాయి. ఔషధాల్లో చిన్న చిన్న

---

దానికన్నా ఎక్కువగా, కొన్ని సందర్భాల్లో ఎక్కువ యూనిట్ల విద్యుత్ వినియోగించే వారికంటే ఎక్కువగా చెల్లిస్తున్నారు.

0-50 యూనిట్లు వినియోగిస్తున్నవారు 50 శాతంగా ఉన్నారు. ఈ కేటగిరీలో విద్యుత్ ఛార్జి కేవలం యూనిట్‌కు రు.1.45. కానీ వీళ్లు నిజంగా చెల్లిస్తుంది యూనిట్‌కు రు. 3.52. ఇది మొత్తం గృహ వినియోగదారుల నుండి సగటున వసూలు చేసిన రు. 2.92 కంటే అధికం. 2012-13లో 0-50 యూనిట్లు వినియోగించిన వారికి కనీస నెల ఛార్జి రు. 50, వినియోగదారి ఛార్జి రు. 25 నుండి రు. 50 వరకు విధించడం జరుగుతుంది. ఇవే కాకుండా ఇంధన సర్దుబాటు సర్‌ఛార్జి అన్ని శ్లాబులకు వర్తిస్తుంది. కాబట్టి అంతా కలుపుకుని మొత్తం గృహ వినియోగదారుల సగటు కంటే ఎక్కువగా చెల్లిస్తున్నారు. కాబట్టి ప్రభుత్వం చెల్లించిన రాయితీల వల్ల కొంత భారం తగ్గవచ్చు. కానీ మొత్తంగా ఉపశమనం కలిగించవు. మొత్తం గృహ వినియోగదారుల్లో రెండు వందల యూనిట్ల కంటే తక్కువగా వినియోగించేవారు 92.42 శాతం. వీళ్లు మొత్తం విద్యుత్తులో వినియోగించేది 67.95 శాతం. రెండు వందల యూనిట్ల కంటే ఎక్కువగా ఉపయోగించేవారు 7.26 శాతం. వీరి మొత్తం విద్యుత్ వినియోగం 32.05 శాతం. మూడు వందల యూనిట్ల కంటే ఎక్కువ వినియోగించేవారు కేవలం 2.79 శాతం. కానీ మొత్తం విద్యుత్ వినియోగంలో వీరి వాటా 18.17 శాతం. వీరంతా ఎసిల వంటివి ఉపయోగిస్తూ జీవించే విలాసవంతులు. ఇప్పుడు పెంచిన ఛార్జిలు వీళ్లు వినియోగిస్తున్న దానికన్నా చాలా తక్కువ. అలాగే పెంపు లేదు అని, రాయితీలు ఇస్తున్నామని చెబుతున్న రెండు వందల యూనిట్ల లోపు వినియోగదారులు చెల్లిస్తున్నది వారు వినియోగిస్తున్న దానికన్నా ఎక్కువ.

'విద్యుత్ ఛార్జిలు భరించే వారికి పెరుగుతాయి తప్ప, పేదలపై ఎలాంటి భారం పడదు' అని ముఖ్యమంత్రి పత్రికల వాళ్లతో చెప్పారు. ఆ 'భరించే' వాళ్లను, భరించేది పేదలు అనే విషయం తెలియని లేదా అర్థంకాని పాలకులు ఉన్నన్నాళ్లు పేద, మధ్యతరగతి రైతు, కార్మికులకు ఈ అవస్థలు తప్పవు.

*(రచయిత అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి, సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

మార్పులు చేయడం లేదా ఒకే పదార్థంలో స్వల్ప మార్పులతో తిరిగి ఔషధాన్ని తయారు చేయడం ద్వారా, వాటికి 'నిరంతర పేటెంట్'గా మార్చేందుకు నొవార్టిస్ ప్రయత్నిస్తుందని భారత ఫార్మా కంపెనీలు వాదించాయి. సరిగ్గా పేటెంట్ కాలపరిమితి ముగిసే ముందు ఇలాంటి చర్యలకు పాల్పడడం, పేటెంట్లకు అదనపు కాలపరిమితి పొంది, చౌకగా ఉత్పత్తి చేస్తున్న జనరిక్ ఔషధాలకు అడ్డుతగలడం ఈ బహుళజాతి కంపెనీల వ్యూహమని ఈ కంపెనీలు ఆరోపించాయి. నొవార్టిస్ అభ్యర్థనకు అనుగుణంగా పేటెంట్ లభించి ఉంటే ఈ ఔషధంపై మరో ఇరవై సంవత్సరాల వరకు గుత్తాధిపత్యం లభించి ఉండేదని నిపుణులు అభిప్రాయ పడ్డారు.

ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) ఒప్పందంపై భారతదేశం సంతకం చేసిన తర్వాత వాణిజ్య సంబంధిత మేధోపర హక్కుల (టిఆర్ఐపిఎస్) నిబంధనకు అనుగుణంగా మన దేశంలో 2005లో కొత్త పేటెంట్ చట్టాన్ని ప్రవేశపెట్టారు. దీంతో అంత వరకూ ఉన్న '1970 పేటెంట్ చట్టం'లో ఉన్న ప్రజాహిత, జాతీయ ప్రయోజనా లన్నింటికీ తూట్లు పడ్డాయి. కార్పొరేట్ సంస్థలకు అపరిమితమైన అధికారాలు కట్టబెట్టే నూతన క్లాజులు చేర్చబడ్డాయి. దీని వలన ఆరోగ్యం, వ్యవసాయ రంగాలలో బహుళజాతి సంస్థలకు తిరుగులేని పరిస్థితి ఏర్పడింది. గతంలో గుత్తాధిపత్యాన్ని నివారించి పోటీ ద్వారా చౌక ధరలకు ప్రజలకు మందులు అందుబాటులోకి తీసుకురావాలన్న ఉద్దేశంతో మన దేశంలో మందుల ఉత్పత్తి ప్రక్రియకు మాత్రమే ఏడు సంవత్సరాల గడువుతో కూడిన పేటెంట్లు జారీ చేసే విధానం ఉండేది. 2005 చట్టం ప్రజా ప్రయోజనాలు దెబ్బతీసే విధంగా, ఉత్పత్తులు, ఉత్పత్తి ప్రక్రియలు రెండింటిపైనా, ఇరవై సంవత్సరాల గడువుతో 1995 తర్వాత ఆవిష్కరణలకు మాత్రమే పేటెంట్లను జారీ చేసే విధానం అమలు చేశారు. అప్పటి నుండి అనేక మందుల ధరలు సామాన్యులకు అందుబాటులో లేకుండా పోయాయి.

## బహుళజాతి సంస్థల అహంకారం

సుప్రీంకోర్టు తీర్పును విమర్శిస్తూ 'ప్రజలకు ఔషధాలు అందుబాటులో ఉండాలంటే పేటెంట్ విధానాన్ని ధ్వంసం చేయడం మార్గం కాదు. రోడ్డు మీద ఒక పిల్లాడు బట్టలు లేకుండా ఏడుస్తుంటే దానికి కారణం బట్టల పరిశ్రమలేనని తిడతామా? ప్రజల ఆరోగ్యానికి చేసే ఖర్చులో ఔషధాల ఖర్చు కేవలం 6 శాతం మాత్రమే. ఒకవేళ ఔషధాలు ఉచితంగా ఇచ్చినా మీరు ఆదా చేసేది కేవలం 6 శాతం మాత్రమే. మేం ఒక కొత్త ఔషధాన్ని ఆవిష్కరించడానికి పదిహేను సంవత్సరాలు పైన కష్టపడి, మూడు నుండి నాలుగు బిలియన్ డాలర్లు ఖర్చు పెట్టి, లక్ష ప్రమాణాలను పరిశీలించిన తర్వాత ఉత్పత్తి బయటకు వస్తుంది. ఉత్పత్తి బయటకు రాగానే ఆరు నెలలలోగా పేటెంట్ లభించకపోతే ఖర్చు పెట్టినదంతా బూడిద పాలవుతుంది. ఎందుకంటే అలాంటి ఉత్పత్తులు పోటీగా మార్కెట్‌లోకి వచ్చేస్తాయి. ఇక తాము భారత్‌లో పరిశోధనల కోసం (ఆర్&డి) పెట్టుబడులు పెట్టబోమని, తమకు అనుకూలమైన ఇతర దేశాలకు తరలిస్తామని' నొవార్టిస్ ఇండియా వైస్ ఛైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్ అయిన రంజిత్‌ను సహాని బెదిరించడమే బహుళజాతి కంపెనీల అహంకారాన్ని స్పష్టంగా బయట పెట్టింది.

'ఈ తీర్పు వల్ల భారతీయ ఔషధ పరిశ్రమకే నష్టం వాటిల్లుతుంది. వారు స్వతంత్ర పరిశోధనలకు పూనుకోరు గనుక ప్రజలకు అవసరమైన కొత్త ఔషధాల ఆవిష్కరణ జరగదు' అని బహుళజాతి కంపెనీల సంస్థ 'ఆర్గనైజేషన్ ఆఫ్ ఫార్మాసూటికల్ ప్రొడ్యూసర్స్ ఆఫ్ ఇండియా' ప్రకటించింది. 'కొత్త ఆవిష్కరణలు చేసే పెద్ద కంపెనీలకు ఇలా అడ్డంకులు కల్పిస్తే భవిష్యత్‌లో వాటి పెట్టుబడులు భారత దేశానికి రావు' అని కూడా బెదిరించారు.

బహుళజాతి కంపెనీల వ్యాఖ్యల్ని ఖండిస్తూ 'బడా ఫార్మా కంపెనీలు తమ పరిశోధనల వివరాలు, వాటి అభివృద్ధి క్రమాలను సమాజానికి తెలియనివ్వరు. అవి ప్రపంచ వ్యాప్తంగా మార్కెట్ కోసం పరిశోధనలు సాగిస్తాయి గాని ప్రత్యేకంగా ఏ దేశం కొరకు విడిగా పరిశోధనలు చెయ్యవు. భారతదేశం 2005లో పేటెంట్ చట్టం మార్చిన తర్వాత సెక్షన్ 3డి ఉపయోగించకుండా, సరైన పరీక్షలు జరపకుండా వందలాది ఔషధాలకు పేటెంట్లు ఇచ్చినట్లు అనేక పరిశోధనలు తెలుపుతున్నాయి' అని 'హెల్త్ గ్లోబల్ యాక్సిస్ ప్రాజెక్టు'కు చెందిన ప్రొఫెసర్ బ్రూక్ కె. బేకర్ అన్నారు.

మన పేటెంట్ చట్టం సెక్షన్ 83 ప్రకారం కొత్త పేటెంట్లను ప్రోత్సహించడానికి కారణం వారు భారతదేశంలో మరిన్ని కొత్త ఆవిష్కరణల ఫలితాలు ప్రజలకు అందుబాటులో ఉండే రీతిలో చేయాలి. కాని దానికి విరుద్ధంగా అమలు జరిగినట్లు అనేక ఉదాహరణలున్నాయి. నిజానికి బహుళజాతి ఫార్మా కంపెనీలు గత ఐదు సంవత్సరాలలో ఎక్కువగా కొత్త ఆవిష్కరణలేవీ చేయలేదు.

## పరిశోధనలపై ఖర్చు వెనుక అసలు రహస్యం

ప్రాణాల్ని రక్షించే ఔషధ పరిశోధన కోసం బిలియన్ల డాలర్లు ఖర్చు చేస్తున్నామని బహుళజాతి ఫార్మా కంపెనీలు నొవార్టిస్‌తో సహా అన్ని వాదిస్తున్నాయి. ఇది పెద్ద అబద్ధం. కాన్సర్ రోగ నివారణ కొరకు అమెరికాకు చెందిన నేషనల్ కాన్సర్ ఇన్‌స్టిట్యూట్ (ఎన్‌సిఐ), నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ (ఎన్ఐఎచ్) సంస్థలు రెండూ పరిశోధనలు ప్రారంభించాయి. ఈ రెండు సంస్థలూ అమెరికన్ ప్రజల పన్నులతోనూ, దాతలిచ్చిన విరాళాలతోనూ నడుస్తున్నాయి. వీటిని లాభాపేక్ష లేకుండా, పరిశోధనల ఫలితాలను ప్రజలకు దీర్ఘకాల ఆరోగ్యకరమైన జీవితాలను అందించాలనే లక్ష్యంతో ఏర్పాటు చేశారు. ఏదో ఒక జబ్బును వెంటనే నయం చేయాలనే ధ్యేయంతో దీర్ఘకాల శాస్త్రీయ పరిశోధనలతో రోగ నివారణ కన్నా, రోగ నిరోధానికి ఉపయోగపడేలా కార్యక్రమాలు సాగించాయి. గతంలో ఎన్ఐఎచ్ మలేరియా, లెప్రసీ, సానిటేషన్, జీర్ణకోశ సంబంధిత సమస్యలపై పరిశోధనలు జరిపింది. ఈ రోగాలన్నీ అభివృద్ధి చెందిన దేశాల కంటే అభివృద్ధి చెందుతున్న దేశాలకే చెందినవి.

1980 చివరలో ప్రారంభించి 1990ల మొదటి వరకూ ఈ రెండు సంస్థలకు చెందిన శాస్త్రజ్ఞులు జన్యు పద్ధతి ద్వారా కాన్సర్‌ను నయం చేసే ప్రక్రియను ప్రారంభించారు. అనేక పరిశోధనల ఫలితంగా 2001 నాటికి సెర్వికల్ కాన్సర్‌ను నయం చేసే గ్లివిక్‌ను ఆవిష్కరించారు. పరిశోధనలన్నీ పూర్తయ్యి, ఇక ఔషధం తయారీకి సిద్ధంగా ఉందని తెలిసిన వెంటనే బహుళజాతి కంపెనీ రాబందులు భారీ లాభాల కోసం కష్టపడకుండానే ఆ రెండు సంస్థలతో భాగస్వాములుగా మారిపోయారు. ఈ విధంగా ఎన్‌సిఐ, ఎన్ఐఎచ్ సంస్థల దీర్ఘకాల పరిశోధనల ఫలితంగా ఆవిష్కరించబడిన గ్లివెక్‌ను నొవార్టిస్ తనే కనిపెట్టినట్లు, దాని కోసం బిలియన్ల డాలర్లను ఖర్చు పెట్టానని చెప్పడం ఎంత బూటకమో తెలుస్తుంది. ఈ విధంగా ప్రజల సొమ్ముతో నడుస్తున్న సంస్థలు తమ

పరిశోధనల ఫలితాల్ని బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేయడం సామ్రాజ్యవాద విధానాలలో భాగమే.

పరిశోధనలకు బహుళజాతి సంస్థలు కోట్ల రూపాయలు ఖర్చు చేయాల్సి ఉంటుందన్న వాదనల్ని తిప్పి కొడుతూ 'ఈ కంపెనీలకు పరిశోధనల నిమిత్తం 39 నుండి 50 శాతం వరకు పన్నుల సబ్సిడీలు లభిస్తాయి. దీన్ని వార్షిక లెక్కల్లో చూపించకుండా పరిశోధనలకు అపరిమితమైన న్యాయం జరిగినట్టు ప్రచారం చేస్తారు' అని అమెరికాకు చెందిన స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీ ప్రొఫెసర్ డోనాల్డ్ డబ్ల్యు వైట్, కెనడా యూనివర్సిటీ ఆఫ్ విక్టోరియా ప్రొఫెసర్ రెబెక్కో వార్ బర్టన్‌లు వ్యాఖ్యానించారు.

పరిశోధనల కన్నా ఈ కంపెనీలు మందుల్ని కొనిపించడానికి డాక్టర్లకు ఇచ్చే లంచాలకు, మార్కెటింగ్‌కు, వ్యాపారస్తులకు ఇచ్చే ఖరీదైన పార్టీలకు విచ్చలవిడిగా ఖర్చు చేస్తాయి. అంతర్జాతీయ రంగంలో అతి పెద్ద ఫార్మా కంపెనీలయిన ఫైజర్, జె అండ్ జె, నొవార్టిస్ సంస్థల 2009-11 వార్షిక నివేదికల ప్రకారం మొత్తం ఖర్చులో మార్కెటింగ్, ఆఫీస్ వ్యవహారాలకు 29 నుండి 32 శాతం, పరిశోధనల కోసం కేవలం 11 నుండి 16 శాతం ఖర్చు పెట్టినట్లు తేలింది.

ఒక నివేదిక ప్రకారం 1950ల నుండి ప్రారంభమై 2008కు చేరే సరికి అమెరికా ఫార్మా కంపెనీలు నూతన ఔషధ ఆవిష్కరణలకు పెట్టే వ్యయం 80 రెట్లు పెరిగింది. ఫార్చ్యూన్ 500లో లిస్ట్ చేయబడ్డ అతి పెద్ద బహుళజాతి ఫార్మా కంపెనీలకు అదే కాలంలో 61.8 బిలియన్ డాలర్ల నుండి 63.1 బిలియన్ డాలర్ల వరకూ లాభాలు పెరిగాయి. అంటే దాదాపు 1000 రెట్లు అన్నమాట. 2001లో నొవార్టిస్ గ్లివెక్ ఔషధాన్ని ప్రారంభించిన నాటి నుండి నేటికి 30 బిలియన్ డాలర్లు సంపాదించింది. మిగతా బహుళజాతి సంస్థల లాభశాతం 4.6 శాతం ఉంటే నొవార్టిస్ లాభం 19 శాతంతో ప్రపంచంలోనే అత్యంత లాభసాటి వ్యాపారం అయిన చమురు ఉత్పత్తి లాభశాతం 19.8కి దగ్గరలోనే ఉంది.

భారతదేశంలో సంవత్సరానికి 70 వేల కోట్ల రూపాయల ఔషధ ఉత్పత్తి జరుగుతుంది. దాంట్లో నొవార్టిస్ వాటా కేవలం ఒక వెయ్యి కోట్ల రూపాయలు మాత్రమే. గత ఐదు సంవత్సరాలుగా నొవార్టిస్ పన్నులన్ని పోగా దాదాపు 15 శాతం లాభాలు సాధించింది. నొవార్టిస్ గ్లివెక్ ఒక మాత్ర రు. 4115కు అమ్ముతుంది. భారతీయ కంపెనీలు తయారు చేసే జనరిక్ మాత్ర కేవలం రు. 30 మాత్రమే. కొత్త మందుల పరిశోధనల కొరకు చాలాకాలం కృషి చేయాల్సి ఉంటుందని, దానికోసం కోట్ల డాలర్లు ఖర్చు చేయాల్సి ఉంటుందని నొవార్టిస్ వాదిస్తుంది. కాని మన దేశంలో 2012లో చేసిన మొత్తం ఉత్పత్తి ఖర్చు రు. 800 కోట్లు. దానిలో పరిశోధనలకు ఔషధ అభివృద్ధికి కేవలం 29 లక్షల రూపాయలు ఖర్చు పెట్టింది. అంటే మొత్తం ఖర్చులో కేవలం 0.03 శాతం మాత్రమే.

'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్' నిర్వహించిన 'ఫార్మా ఆవిష్కరణల్లో మారుతున్న పద్ధతులు' అన్న విషయంపై జరిపిన స్టడీ ప్రకారం '1989 నుండి 2000 వరకు అమెరికా ఫుడ్ అండ్ డ్రగ్ అథారిటీ (ఎఫ్‌డిఎ) 1035 కొత్త ఔషధాలకు అనుమతినిచ్చింది. వాటిలో 65 శాతం అప్పటికే మార్కెట్‌లో విస్తారంగా వాడుతున్న ఔషధాలలో కొద్దిపాటి తేడా ఉన్నవి. ఒకే విధంగా ఉన్న ఔషధాలు 11 శాతం ఉండగా కేవలం 15 శాతం మాత్రం అత్యంత నూతన ఆవిష్కరణలుగా గుర్తించారు.'

ఈ మధ్యనే 'ఇంటలెక్చ్యువల్ ప్రాపర్టీ అపిలేట్ బోర్డు' బహుళజాతి ఫార్మా కంపెనీ 'రోష్' ఉత్పత్తి చేసిన హెపటటిస్ సి రోగులకు వాడే 'పెగాసీస్' అనే ఔషధం. అధిక ధరలు కలిగి ఉండడమే కాకుండా, వాడుకలో ఉన్న ఇతర ఔషధాల కన్నా మెరుగైన ఫలితాలనివ్వలేదని రుజువు కావడంతో దాని పేటెంట్‌ను రద్దు చేసింది. అలాగే అస్తమా రోగులకు వాడే రెండు ఔషధాలు షెయిరింగ్ కార్పొరేషన్, నొవార్టిస్ కంపెనీలు ఉత్పత్తి చేస్తున్నాయి. వాటిని కూడా ఇలాంటి కారణాలతో పేటెంట్లను రద్దు చేశారు.

తమ దేశ పేటెంట్ల చట్టాలలో మార్పులు చేయాల్సిన అవసరం ఉందని ఆస్ట్రేలియా ప్రభుత్వం ప్రకటించింది. చిన్న చిన్న మార్పులు చేసి, కొత్త ఔషధ ఆవిష్కరణలుగా ప్రకటిస్తున్న కంపెనీలకు ఎటువంటి అడ్డంకులు లేకుండా పేటెంట్లు జారీ చెయ్యడాన్ని కట్టడి చేయాల్సి ఉందనీ, వీటిపై స్వతంత్ర సమీక్ష జరిపిన తర్వాతే పేటెంట్లు ఇవ్వాల్సి ఉంటుందని అభిప్రాయపడింది. ఇప్పటికే ఉన్న పేటెంట్లకు పొడిగింపు ఇవ్వరాదని, రోగాన్ని నియంత్రించడంలో ప్రత్యేకతలేని ఔషధాలకు పేటెంట్లు జారీ చేసే పద్ధతిని కఠినతరం చేయాలని కూడా నిర్ణయించింది.

## ఎవర్ గ్రీనింగ్, కంపల్సరీ లైసెన్సింగ్

పేటెంట్ ఇవ్వబడిన ఔషధానికి ఇరవై సంవత్సరాల కాలపరిమితి ఉంటుంది. నిబంధనల ప్రకారం ఆ తర్వాత అది రద్దయిపోతుంది. అందుకే ఈ బహుళజాతి కంపెనీలు కాల పరిమితి ముగుస్తుండగానే అదే ఔషధానికి చిన్న చిన్న మార్పులు చేసి, దానిని కొత్తగా కనిపెట్టిన ఔషధంగా మళ్లీ పేటెంట్ తీసుకుంటారు. దీన్నే 'ఎవర్ గ్రీనింగ్' అని పిలుస్తారు. మన పేటెంట్ చట్టం సెక్షన్ 3డి ప్రకారం నూతన ఆవిష్కరణలకు పేటెంట్ ఇస్తారు కాని చిన్న చిన్న మార్పులు చేసిన వాటికి ఇవ్వరాదు.

లక్షలాది రూపాయలు ఖరీదు చేసే ఔషధాల విషయంలో ప్రభుత్వం అత్యవసర పరిస్థితులలో, పేటెంట్ పొందిన బహుళజాతి కంపెనీ ఔషధాలను, దేశీయ ఫార్మా ఉత్పత్తిదార్లకు తప్పనిసరిగా లైసెన్సునివ్వడం ద్వారా ప్రజలకు చౌకధరలకు ఔషధాలు అందచేయడానికి వీలుంది. దీనికి దేశీయ కంపెనీలు బహుళజాతి కంపెనీలకు కొంత రాయల్టీ చెల్లిస్తాయి. ఈ విధంగానే కాన్సర్ మందులు ప్రజలకు తక్కువ ధరలకు లభిస్తున్నాయి.

ఎవర్ గ్రీనింగ్ పద్ధతుల్ని మొట్టమొదటిసారిగా భారతదేశంలో నిషేధించారు. మన పేటెంట్ చట్టంలో సెక్షన్ 3డి ని అనుసరించి ఫిలిప్పైన్స్‌లో వారి పేటెంట్ చట్టంలో మార్పులు చేశారు. అర్జెంటీనాలో క్రితం సంవత్సరం అందరికీ తెలిసిన పదార్థాలతో తయారైన ఔషధాలకు పేటెంట్ ఇవ్వరాదని నిర్ణయించింది. ఆస్ట్రేలియా, కెనడాల్లో కూడా ఇలాంటి చర్యలు తీసుకున్నారు. 'భారతదేశ సుప్రీంకోర్టు తీర్పు మా ప్రయత్నాలకు అదనంగా ఉపయోగపడుతుంది. కోర్టులు, చట్టాలు పేటెంట్లను నియంత్రించాల్సిన అవసరాన్ని ఈ తీర్పు ఎత్తి చూపింది' అని ప్రభుత్వానికి సలహానిచ్చే 'ఆస్ట్రేలియన్ ఫెయిర్ ట్రేడ్ అండ్ ఇన్వెస్ట్‌మెంట్ నెట్‌వర్క్'కు చెందిన పాట్రిసియం రోనాల్డ్ అన్నారు.

## పేటెంట్లు సామ్రాజ్యవాదుల కుట్రలో భాగమే

చారిత్రకంగా పేటెంట్లు అనేవి వలసవాదంతో ముడిపడి ఉన్నాయి. వలసవాద దశ ఆరంభంలో యూరప్ పాలకులు, ప్రపంచంలోని ఇతర

భూభాగాలను ఆక్రమించుకొనేందుకు ఈ తరహా పేటెంట్లను వినియోగించుకొన్నారు. ఇక ఇప్పుడు పేటెంట్లు ఆర్థిక వ్యవస్థలను జయించే సాధనాలుగా మారాయి. 1980ల చివరి కాలంలో అమెరికా తన దేశ ఆర్థిక వ్యవస్థకు, జపాన్ ఆర్థిక వ్యవస్థకు మధ్య తీవ్రమైన వ్యవస్థాగత సాంకేతిక అగాధం ఏర్పడుతుందని గుర్తించింది. అందుచేత అమెరికా పారిశ్రామిక రంగం అప్పటివరకూ కృత్రిమంగా సాగిస్తూ వస్తున్న ఆధిపత్యాన్ని తీవ్ర చర్యల ద్వారా కాపాడుకోవడానికి మేధో సంపత్తి హక్కుల విధానాన్ని విదేశాలకు విస్తరించే ముమ్మర ప్రయత్నం ఆరంభించింది. 1984లో అమెరికా నిర్వహించిన ఒక సర్వే దీనిని రుజువు చేస్తుంది. పేటెంట్ విధానాన్ని నూతన ఆవిష్కరణలకై కృషి చేసేందుకు కాకుండా, కేవలం 'సాంకేతిక రంగ విభాగాలలోనికి ప్రవేశాన్ని నిరోధించేందుకు' సాధనంగా వినియోగించుకోవడమే తమ ఉద్దేశమని 80 శాతం పైగా కంపెనీలు వెల్లడించాయి. కాబట్టి పేటెంట్ వ్యవస్థ పోటీని నియంత్రించి, నూతన ఆవిష్కరణలకు దారి తీస్తుందని, తద్వారా సాంకేతిక పరిజ్ఞానం విస్తృతంగా అందుబాటులోకి వస్తుందనేది పెద్ద అబద్ధం అని తేలుతుంది.

మేధో సంపత్తి హక్కుల వ్యవస్థ అనేది మార్కెట్ పరిస్థితులను వక్రీకరించే, ప్రభుత్వ ఆమోదముద్ర పొందిన గుత్తాధిపత్యం అనేది వాస్తవం. ఈ వ్యవస్థ ద్వారా కొద్దిపాటి బహుళజాతి సంస్థలు పేటెంట్లు పొంది, అక్రమాలకు పాల్పడుతూ, పేద దేశాల ప్రజల రక్తాన్ని పీలుస్తున్నాయి. అమెరికా తరహా పేటెంట్ చట్టాలను గాట్, డబ్ల్యుటిఒలకు సంబంధించిన మేధో సంపద హక్కుల (టిప్స్) ఒప్పందం విశ్వజనీనం చేసింది. దీనంతటి ప్రభావం మన మౌలిక అవసరాలైన ఆహారం, మందులపైన తీవ్రంగా పడుతుంది. మన పంటలు, వంట గదులు, అడవులు, మన పెరటిలోని ఔషధ మొక్కలపై కూడా మన కనీస హక్కులు చేజారిపోతున్నాయి. ప్రస్తుతం పేటెంట్ల జారీ కేవలం యంత్రాలకో, నూతన ఆవిష్కరణలకో పరిమితమై లేదు. నేడు అన్ని జీవజాతులు, భిన్న జీవజాతులు, మన బామ్మల నాటి చిట్కా వైద్యాలు, మన దేశంలో రోజువారీ అవసరాలకు ఉపయోగించే వేప, పసుపు కొమ్ములు నేరేడు పండ్లు, నేల ఉసిరి, కాకరకాయలు, నల్లమిరపకాయలు మొదలైన వందలాది ఆహార, వైద్య సంబంధిత వృక్ష జాతులు నేడు సామ్రాజ్యవాదుల లాభాలవేటలో పేటెంట్ల బారిన పడబోతున్నాయి. ఉదాహరణకు వేప చెట్టును తీసుకొందాం. వేపచెట్టును భారతదేశంలో శతాబ్దాలుగా వైద్యంలోనూ, వ్యవసాయంలోనూ వాడుతున్నాం. వేప చెట్ల గురించి ప్రస్తావన రెండు వేల సంవత్సరాల క్రితం రాసిన భారతీయ గ్రంథాలలో ఉంది. వాటిలో వేపను గాలిని శుద్ధి చేసేదిగానూ, మనుషులకు, జంతువులకు వచ్చే అన్ని రకాల వ్యాధులకు వైద్యంగానూ పేర్కొన్నాయి. కీటకాలను, క్రిములను పారదోలే లక్షణాలు వేపలో ఉండడమే దీనికి కారణం. అనేక పరిశోధనల ప్రకారం వేప ఉత్పత్తులు దాదాపు రెండు వందల రకాల కీటకాలను నశింప చేయగలవు. ఈ కీటకాలలో చాలా మేరకు క్రిమి సంహారక రసాయనిక మందులకు లొంగనివే. ఇక ఇప్పుడు వేప ఏ మాత్రమూ స్వేచ్ఛా వృక్షం కాదు. ఈ చెట్టుపై ఇప్పటికే 90 పేటెంట్లు తీసుకొన్నారు. అమెరికా, జర్మనీ, జపాన్‌లకు చెందిన కంపెనీలు పేటెంట్లకై అర్రులు చాస్తున్నాయి.

బహుళజాతి సంస్థలు దేశాల సరిహద్దుల ఆవల కూడా తాము పేటెంటు పొందిన సాంకేతిక పరిజ్ఞానంపై గట్టి అదుపును కొనసాగిస్తున్నాయి. మరోపక్క మూడవ ప్రపంచ దేశాలు తమ సాంకేతిక సామర్థ్యాన్ని కోల్పోతున్నాయి. మొదటగా మేధో హక్కులు వ్యవస్థ ద్వారా సాంప్రదాయిక సాంకేతిక పరిజ్ఞానాన్ని తస్కరించడం, దానిని పేటెంటు చేసుకోవడం జరుగుతుంది.

అమెరికా తరహా పేటెంట్ల వ్యవస్థ అమలు జరపడం వలన ఆరోగ్య, రక్షణ ఔషధాల వ్యయం ప్రపంచ వ్యాప్తంగా విపరీతంగా పెరిగి పోతుందనేది ఎయిడ్స్ వ్యాధి మహమ్మారి స్పష్టం చేస్తుంది. ఎయిడ్స్ వ్యాధి చికిత్సలో వాడే 'ఫోకనాజోల్' అనే ఔషధానికి థాయ్‌లాండ్‌లో పేటెంట్ లేదు. బహుళజాతి సంస్థ ఫైజర్ ఈ ఔషధాన్ని 6.2 అమెరికన్ డాలర్లకు అమ్ముతుంటే థాయ్ ఉత్పత్తిదారులు కేవలం 0.3 డాలర్లకు అమ్ముతున్నారు. అంటే ఫైజర్ కంపెనీ మందు కంటే 207 రెట్లు చౌకగా అందిస్తున్నారు. మరోపక్క జనరిక్ ఔషధాలు లభ్యంకాకపోవడం వలన దక్షిణాఫ్రికాలో ఫ్లోన్‌జోవ ఔషధం ఖరీదు 21.4 అమెరికా డాలర్లుగా ఉంది. పేటెంట్ హక్కులనేవి రోగుల హక్కులకు వ్యతిరేకంగా పని చేస్తున్నాయనేది సుస్పష్టం. పేటెంట్ల గుత్తాధిపత్యం వలన ఎక్కువ ఖర్చుతో కూడిన మందులు, వాటి అవసరమున్న పేదలకు చేరడం లేదు.

మన దేశంలో 90 వేల కోట్ల రూపాయల ఔషధ వ్యాపారం జరుగుతోంది. వీటిలో కనీసం 10, 12 ఔషధాలు కాన్సర్, ఎయిడ్స్, హెపటైటిస్ బి, హెపటైటిస్ సి లాంటి తీవ్రమైన వ్యాధులకు సంబంధించి బహుళజాతి సంస్థలు పేటెంట్లు పొంది ఉన్నాయి. విపరీతమైన ధరల వలన ఇవి సామాన్యులకు కాకుండా మధ్యతరగతి, ఉన్నత మధ్యతరగతి కుటుంబాలకు కూడా అందుబాటులోకి రాకుండా వారి ప్రాణాల్ని బలి తీసుకొంటున్నాయి. జెనీవాలో ఉన్న వరల్డ్ ఇంటలెక్చువల్ ప్రాపర్టీ ఆర్గనైజేషన్‌లో సుప్రీం కోర్టు తీర్పుపై నొవార్టిస్ సంస్థ విమర్శల్ని ప్రస్తావిస్తూ 'భారతదేశంలో అత్యంత లాభపడిన మూడు బహుళ జాతి సంస్థల్లో రోష్, సనోఫిల తర్వాత స్థానం నొవార్టిస్‌ది. ఇది 147 పేటెంట్లు కలిగి ఉంది. మరి ఆ 147 పేటెంట్ల గురించి మాట్లాడకుండా కేవలం గ్లివెక్ తీర్పుపై మాత్రమే మాట్లాడడం ఎందుకు' అని భారతదేశ వాణిజ్య, పరిశ్రమల శాఖ మంత్రి ఆనంద్ శర్మ అనడం బహుళజాతి సంస్థల తీరును వెల్లడిస్తుంది. కాని, బహుళజాతి కంపెనీలు తమ సేవకుల మాటలు లెక్క చేస్తాయా?

సామ్రాజ్యవాద కంపెనీల మార్కెట్లను సంతృప్తిపరుస్తూ, నేడు మన రోడ్ల మీద వందల రకాల ఖరీదైన కార్లు పరుగెడుతున్నాయి. విపరీతమైన కాలుష్యాన్ని సృష్టిస్తున్నాయి. వాహనాల నుండి వచ్చే పొగ కాన్సర్ రోగ కారకాలలో ఒకటని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు. కాన్సర్ ఇంతగా ప్రబలి పోవడానికి మన వాతావరణం, పరిసరాలు, రసాయనిక పరిశ్రమల కాలుష్యం కారణమని ఈ మధ్య హైదరాబాద్‌లో ఇండో-అమెరికా కాన్సర్ ఇన్‌స్టిట్యూట్ నిర్వహించిన గ్లోబల్ అంకాలజీ సమ్మిట్ - 2013లో ప్రముఖ అంకాలజిస్టులు పేర్కొన్నారు. దీన్ని బట్టి దేశంలో కాన్సరే కాకుండా అనేక రకాల తీవ్రమైన రోగాలన్నింటికీ పర్యావరణాన్ని నాశనం చేస్తూ, ప్రజలకి రోగాలను కలిగించేవి సామ్రాజ్యవాద విధానాలేనని స్పష్టంగా తెలుస్తుంది. మార్కెట్ల కోసం రోగాన్ని సృష్టిస్తున్న వారు ప్రజల ఆరోగ్యాన్ని పట్టించుకుంటాయనే భ్రమలు ఎవ్వరికీ లేవు. నొవార్టిస్‌కు వ్యతిరేకంగా సుప్రీంకోర్టు తీర్పు ప్రజలకు చిన్నపాటి విజయం. పూర్తి విజయం సాధించాలంటే సామ్రాజ్యవాదులకు గోరీ కట్టి, పేటెంట్ల విధానాన్ని తన్ని తరిమేసే లక్ష్యం కలిగిన నూతన సమాజం ద్వారానే సాధ్యమవుతుంది.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# అమరత్వానికి అటూ ఇటూ

***రాజ్యం ఒకవైపు బూటకపు ఎన్‌కౌంటర్‌లకు పాల్పడుతూ, మరోవైపు అబద్ధపు ప్రచారాలతో అమరుల త్యాగాలను మసకబార్చడానికి ప్రయత్నిస్తోందని అంటున్నారు* వరవరరావు**

మైదాన ప్రాంత బుద్ధిజీవుల ఆలోచనల్లో, చైతన్యంలో అడవి, ఆదివాసులు చోటుచేసుకోవడం చాల కష్టసాధ్యమైన విషయం. అందువల్ల వాళ్ల భూగోళం, చరిత్ర న్యాయంగా, కనీసం వాస్తవంగా నమోదు కావడం కూడ కనిపించదు. ఇంద్రవెల్లి మారణకాండలో ఎంతమంది చనిపోయి, ఎంతమంది గాయపడ్డారో ఇప్పటికీ అధ్యయనం, పరిశోధన చేసి, మానవశాస్త్ర, సామాజికశాస్త్రవేత్తలు తేల్చినట్లులేదు.

ఈ నెల 16వ తేదీన 'ఎన్‌కౌంటర్' జరిగిందని చెప్తున్న స్థలం సుకుమాజిల్లాలో వస్తుందా, బీజాపూర్ జిల్లాలో వస్తుందా ఆపరేషన్ గ్రీన్‌హంట్ నిపుణులు కూడ చెప్పలేదు. మొదట గుర్తింపబడని మృతదేహం కోసం ప్రయత్నించినపుడు గానీ అది సుకుమా జిల్లా పోలీసుస్టేషన్ కిందికి వస్తుందని స్పష్టం కాలేదు. ఒక్క బస్తర్‌జిల్లా మావోయిస్టు ఉద్యమాన్ని, వాళ్ల నాయకత్వంలో ఆదివాసి పోరాటాలను అణచివేసే క్రమంలో ఏడు జిల్లాలుగా వికేంద్రీకరింపబడడం వల్ల, పోలీసులకు జిల్లాల సరిహద్దులు తెలిసినంత సులభంగా రెవెన్యూ జిల్లాలు తెలిసేట్లు లేవు. అయినా ఇదంతా అకడమిక్ చర్చయేగానీ విప్లవానికి సరిహద్దులు లేనట్లుగానే విప్లవాన్ని అణచే రాజ్యాంగ యంత్రానికి కూడ ఏ చట్టాల పరిమితులు, నియమాలు లేవు. కిషన్‌జీ 'ఎన్‌కౌంటర్' కాలం నుంచి సర్కెన్‌గూడ (బాసగూడ) 'ఎన్‌కౌంటర్' దాకా ఆయా రాష్ట్రాల్లో సిఆర్‌పిఎఫ్ నాయకత్వంలో గాలింపులు, ఏకపక్ష కాల్పులు విన్నాం. అప్పుడు వాటిన్నింటికీ కుఖ్యాతి వహించిన సిఆర్‌పిఎఫ్ డైరెక్టర్ జనరల్ విజయకుమార్ నాయకత్వం వహించాడు. ఆయన రిటైరయ్యాడు.

ఈసారి ఈ సుకుమా జిల్లా (ఛత్తీస్‌గడ్) ఎన్‌కౌంటర్‌కు ఆంధ్రా గ్రేహౌండ్స్ నాయకత్వం వహించారు. వాళ్ల నాయకత్వంలోనే మూడు వైపుల నుంచి (చత్తీస్‌గడ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్) సిఆర్‌పిఎఫ్, కోయ కమాండోలు, తదితర అర్ధసైనిక బలగాలు మూడువేల మంది ముట్టడించి దాడి చేశారని ఒక సమాచారం. ఈ దాడి సందర్భంలో మావోయిస్టుల శిబిరం (క్యాంపు)లో ఇరవైనాలుగు మంది ఉన్నారని, అందులో కేంద్ర నాయకత్వం కటకం సుదర్శన్, మల్ల రాజిరెడ్డితోసహా ఉత్తర తెలంగాణ బాధ్యుడు చంద్రన్న, ఇంకా హరిభూషణ్, బడేదామోదర్, కంకణాల రాజిరెడ్డి దాకా ఉండి ఉండే అవకాసం ఉందని, ఆ అగ్రనాయకత్వాన్ని కాపాడే క్రమంలోనే పోరాడుతూ ఈ తొమ్మిదిమంది అమరులయ్యారని, మిగతా వాళ్లు తప్పించుకుపోయారని ఒక ధృవపడని సమాచారం. తునికాకు ఏరేకాలం గనుక తునికాకు కార్మికులతో తునికాకు రేట్లు పెంచే పోరాటం గురించి మాట్లాడి సేదదీరుతున్న వారిపై గ్రేహౌండ్స్ చేసిన దాడి అని చంద్రన్న పేరుతో ఒకపత్రికలో వచ్చిన ప్రకటన నమ్మడానికి అనుకూలంగా ఉన్నది. మల్ల రాజిరెడ్డి, కంకణాల రాజిరెడ్డిల గురించి 'ఎన్‌కౌంటర్' మొదలు గాయపడి పామేడు పోలీసుస్టేషన్‌లో ఉన్నారన్నంత వరకు 18వ తేదీ సాయంత్రం వరకు వార్తలు వస్తూనే ఉన్నాయి. పామేడ్ పోలీసుస్టేషన్‌లో మరో ఇద్దరు ఉత్తర తెలంగాణ నాయకులు హరిభూషన్, కిరణ్‌లు కూడ ఉన్నారని మాకు భద్రాచలంలో కూడ మీడియా వాళ్లు చెప్పడంతో వాళ్లుగానీ, ఇంకెవరైనాగానీ పోలీసుల అక్రమ నిర్బంధంలో ఉంటే వదలాలని మేం 18వ తేదీదాకా డిమాండు చేస్తూనే ఉన్నాం. కంకణాల రాజిరెడ్డి బంధువులే అందరికన్న ముందు కరీంనగర్ జిల్లా నుంచి భద్రాచలం చేరుకున్నారు. మృతదేహాలు చూసి అతడు లేడని నిర్ధారణతో వెనుతిరిగి పోయినా 18వ తేదీ సాయంత్రం కుంట నుంచి తిరుగు ప్రయాణంలో ఉన్న మాకు ఫోన్‌చేసి 'మా రాజిరెడ్డి మృతదేహం అడవిలో ఎక్కడో పడి ఉందట కదా?' అని ఆందోళన వ్యక్తం చేశారు.

ఏప్రిల్ 26, 27న బంద్ పిలుపు ఇస్తూ ఉత్తర తెలంగాణ మావోయిస్టు పార్టీ అధికార ప్రతినిధి చెప్పిన విషయాలు మాత్రమే మృతుల పేర్లు సంఖ్య విషయంలోనూ, ఊళ్లు, పేర్ల విషయంలోనూ ఇప్పటికి స్పష్టతనిచ్చిన అంశాలు. అట్లే ఆర్ఎస్ఐ ఎట్లా చనిపోయాడనే విషయంలో అది 16వ తేదీ, 17వ తేదీన ప్రజల, ప్రజాగెరిల్లాల చేతుల్లో జరిగిందని జగన్ చెప్పాడు. ఆరోజు అంటే 16న ఎన్‌కౌంటర్‌లోనే ఐదుగురు గ్రేహౌండ్స్ గాయపడి నలుగురు తప్పించుకోగలిగారని ఒక్క ఆర్ఎస్ఐ గాయపడి మావోయిస్టుల చేతికి చిక్కితే వాళ్లు చంపేశారని ఒక ప్రచారం. 18వ తేదీన మృతదేహాలు కుటుంబాలకు ఇప్పించడానికి ములుగు ఎంఎల్ఏ సీతక్క, ఆమె అనుయాయులు, అమరుల బంధుమిత్రుల సంఘం, మేం అక్కడ ఉండగా సాయంత్రం 4 గంటలకు కుంటా ఆకాశంపై ఒక హెలికాప్టర్ ఎగిరింది. అది చాల కింది నుంచి ఆకాశంలోకి దూసుకపోవడం చూశాం. కాసేపట్లో హెలికాప్టర్‌పై మావోయిస్టులు కాల్పులు జరిపారని, చాలమంది పోలీసులు మావోయిస్టుల బందీలిగా ఉన్నారని ఒక టివి ఛానెల్ హెలికాప్టరు, కాల్పులు వంటి దృశ్యాలను ప్రసారం చేయడం ప్రారంభించింది.

బిడిశర్మ గారు 19న నాకు ఫోన్‌చేసి ఒక పోలీసు డీహైడ్రేట్ అయి చనిపోయాడని, ఆయన శవం అప్పగించడానికి విజ్ఞప్తి చేయాలని తనకు ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఫోన్ చేసాడని, తాను విజ్ఞప్తి చేయదలచుకున్నానని చెప్పాక నాకు హోంమంత్రి సబితా ఇంద్రారెడ్డి ఫోన్ చేసింది. 16న ఎన్‌కౌంటర్‌లో ఒక పోలీసు ఆర్ఎస్ఐ కూడ చనిపోయాడు, ఆయన మృతదేహాన్ని కుటుంబ సభ్యులకు అప్పగించమని

విజ్ఞప్తి చేయండి అని. ఆ ప్రయత్నాల్లో బిడిశర్మగారు ఉన్నారని చెప్పాను. 18వ తేదీ ఉదయమంతా భద్రాచలంలో మృతదేహాలను గుర్తుపట్టిన రక్తబంధువులకు భద్రాచలంలోనే మృతదేహాలను అప్పగించే ఏర్పాటు చేయవలసిందిగా నేను హోంమంత్రిని కోరుతూనే ఉన్నాను. ఆమె అలాగే ఇంటెలిజెన్స్ చీఫ్‌కు చెప్తానని, ఆ తర్వాత ఆయన సిఎంతో పాటు ఢిల్లీలో ఉన్నాడు గనుక డిజిపికి చెప్తానని అంటూనే ఉన్నది. బిడిశర్మగారికి చత్తీస్‌గడ్ చీఫ్‌సెక్రెటరీ ఆమేరకు హామీ ఇచ్చాడని, భద్రాచలంలోనే మృతదేహాలు అప్పగించడానికి చత్తీస్‌గడ్ ప్రభుత్వానికి ఏ అభ్యంతరం లేదని నేనామెకు గుర్తు చేస్తూనే ఉన్నాను. ఇటువంటి ప్రయత్నాలు ఢిల్లీలో ఉన్న హరగోపాల్‌గారు కూడ చేస్తూనే ఉన్నారు. తీరా మేం భద్రాచలం చేరుకొని అక్కడి అమానవీయ బీభత్స దృశ్యాన్ని చూసి 'మృతదేహాలను మూటలుగా చత్తీస్‌గడ్‌కు తరలిస్తున్నారు – బంధువులకు అప్పగించమని మీరు చెప్పండి' అంటే ఆమె చల్లగా 'బంధుమిత్రులు మృతదేహాలను చూసారటకదా, ట్రాన్సిట్‌లో బంధువులకు చూపించి చత్తీస్‌గడ్ ప్రభుత్వానికి అప్పగించమన్నది కోర్టు ఆర్డర్' అని చెప్పింది.

ఉదయానికే అక్కడికి చెరుకున్న రక్తబంధువులు, ఎపిసిఎల్‌సి, అమరుల బంధుమిత్రుల సంఘం నాయకులు కొందరు, ఎంఎల్ఎ సీతక్క, న్యాయవాదులు, మీడియా, వందలాది మంది ప్రజలు చేసిన ఆందోళన, గుర్తింపు కొరకు మృతదేహాలను బంధువులకు తొమ్మిదిగంటల లోపుగా చూపాలన్న కోర్టు ఉత్తర్వులు మాత్రమే ఈ మాత్రమైన ఆఖరిచూపుకు అవకాశం ఇచ్చాయని, కుంటలో ఆసుపత్రి దగ్గర చెట్టు కింద అడ్డదిడ్డంగా అర్థనగ్నంగా పడవేసిన మృతదేహాలను అట్లా మండుటెండలో గంటలకు గంటలు చూడగలిగినపుడు మాత్రమే బంధువులు సరిగా పోల్చుకోగలిగారనేది మాత్రం చేదునిజం.

ఈ మాత్రపు 'మానవీయత'కే ఆంధ్రా పోలీసు అధికారులు 'తాడోపేడో తేల్చుకుందామని విర్రవీగుతున్నారు. అడవుల్లో మరణించిన తొమ్మిది మంది మావోయిస్టుల మృతదేహాలను హెలికాప్టర్ ద్వారా తీసుకొచ్చి వారి బంధువులకు అప్పగించామ'ని (అప్పగించడానికి తెచ్చారా? వాళ్లే అప్పగించారా? ఎంత పచ్చి అబద్ధం) 'ఇదే సమయంలో ఆర్ఎస్ఐని కాల్చిచంపిన మావోయిస్టులు, శవాన్ని అట్టిపెట్టుకొని సవాలు విసరడం గతంలో ఎన్నడూ లేదని... దీనిని ఉపేక్షిస్తే భవిష్యత్తులో మావోయిస్టులు తమ ముందుకు వచ్చి సవాలు విసురుతారని, వారితో తాడోపేడో తేల్చుకోవాలని' సీనియర్ ఐపిఎస్‌లు నిర్ణయం తీసుకున్నారట.

ప్రభుత్వాలు రాజ్యాంగం ప్రకారం కాకుండా పోలీసులు ప్రతీకారంగా తాడోపేడో తేల్చుకునే స్థితికి ఫాసిస్టు రాజ్యం చేరుకున్నదనడానికి గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగంగా గ్రేహౌండ్స్ నాయకత్వంలో ఈ దాడియే నిదర్శనం. ఈసారి కేంద్రహోంమంత్రి ఏర్పాటుచేసిన ముఖ్యమంత్రుల సమావేశానికి మావోయిస్టు ప్రభావం ఉన్న రాష్ట్రాల నుంచి ముఖ్యమంత్రులు వెళ్లలేదు. హోంమంత్రులు వెళ్లలేదు. డిజిపిలు వెళ్లారు. మన రాష్ట్రం నుంచి డిజిపి, చీఫ్‌సెక్రెటరీ వెళ్లారు. అందుకే గ్రేహౌండ్స్ నాయకత్వంలో సిఆర్‌పిఎఫ్‌తో సహా యునిఫైడ్ కమాండోఫోర్స్. 1986లో అప్పటి డిఐజి పోలీసు కెఎస్.వ్యాస్ గ్రేహౌండ్స్ పోలీసు బలగాన్ని ఏర్పాటు చేసినప్పటినుంచీ ఇప్పటిదాకా దానికి చట్టబద్ధతలేదు. శాసనసభ ఆమోదం లేదు. వాళ్లకు జవాబుదారీతనం లేదు. యూనిఫారాలు, నేమ్‌ప్లేట్స్ ఉండవు. పోలీసు వాహనాలు కూడ వాడనక్కర్లేదు. ఖర్చుకు జవాబుదారీ కాదు. హోంమంత్రికే సమాచారం తెలియదు. (కొయ్యూరు 'ఎన్‌కౌంటర్' జరిగేదాకా బెంగళూరు నుంచి ముగ్గురు పీపుల్స్‌వార్ అగ్రనేతలను పోలీసులు కిడ్నాప్ చేసి తెచ్చారని అప్పటి హోంమంత్రి దేవేందర్‌గౌడ్‌కు తెలియదు) ఇటీవల ఒక దినపత్రిక అభిప్రాయ సేకరణలో మనరాష్ట్ర డిజిపి చాల పవర్‌ఫుల్ అని వెల్లడయిందట!

ఇక 'ఎన్‌కౌంటర్' వివరాల్లోకి పోతే, సిపిఐ మావోయిస్టు ఉత్తర తెలంగాణ అధికార ప్రతినిధి జగన్ ప్రకటన ప్రకారం 'ఛత్తీస్‌ఘడ్‌లోని సుకుమా జిల్లా పువ్వర్తిలో 'ఎన్‌కౌంటర్' ఏకపక్షంగా జరిగింది. ఇన్‌ఫార్మర్, కోవర్టులపై ఆధారపడి ఈనెల16వ తేదీన యునిఫైడ్ కమాండ్ ఫోర్స్ పేరుతో మూడువేల ఎపి గ్రేహౌండ్స్ బలగాలు కెకెడబ్ల్యూ (ఖమ్మం, కరీంనగర్, వరంగల్) దళంపై నరహంతక దాడి జరిపారు. ఇది ఏకపక్షం. ఈ దాడుల్లో అమరులైన తొమ్మిదిమంది

1) మద్రి రవి (38) సుధాకర్. కెకెడబ్ల్యూ కార్యదర్శి, ఉత్తరతెలంగాణ స్పెషల్‌జోనల్ కమిటీ సభ్యుడు. సీతారాంపురం గ్రామం. ఘనపురం (ములుగు) మండలం. యాదవ కుటుంబంలో పుట్టిన రవి 18వ ఏటనే విప్లవోద్యమంలోకి వచ్చి ప్రజాప్రతిఘటన పార్టీనుంచి మావోయిస్టు పార్టీలో చేరి దళసభ్యుని స్థాయినుంచి అంచెలంచెలుగా రాష్ట్రస్థాయి నాయకత్వానికి ఎదిగాడు. ఇంటర్మీడియట్ వరకు చదువుకున్నాడు. రాజకీయస్పష్టతకు, నైశిత్వానికి పెట్టిందిపేరు.

2) గుగ్లోతు లక్ష్మి (32) పుష్ప – జిల్లా కమిటీ సభ్యురాలు. రామపురం, భూపాలపల్లి మండలం లంబాడీ కుటుంబంలో పుట్టి 10వ ఏట నుంచే విప్లవోద్యమంలోనే పెరిగి సుధాకర్‌ను పార్టీలోనే పెళ్లి చేసుకొని 2007లో బయటికి వచ్చి పిల్లవాణ్ని కని సుధాకర్ చెల్లెలికి పెంచుకోవడానికిచ్చి మళ్లీ అజ్ఞాతంలోకి వెళ్లిపోయింది. మూడు సంవత్సరాల క్రితం అడవిలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో కామ్రేడ్ సింగన్న అమరుడు కాగా పుష్పక్క బుల్లెట్ గాయంతో తప్పించుకుంది. గెరిల్లా యుద్ధంలో ఆరితేరిన యోధురాలు.

3) ఎట్టి నర్సక్క (33) సబిత – జిల్లా కమిటీ సభ్యురాలు. గోగుపల్ల, ఏటూరు నాగారం మండలం. కోయ కుటుంబంలో పుట్టింది. అమరుడు బడే నాగేశ్వరరావు సహచరి. మహదేవపూర్, ఏటూరు నాగారం కార్యదర్శి.

4) బడే ఊర్మిళ (24) దళ సభ్యురాలు. కాల్వపల్లి, ఏటూరు నాగారం మండలం. కోయ. బడే నాగేశ్వరరావు చెల్లెలు. ఈ కుటుంబం నుంచి ఇప్పటికి ముగ్గురు అమరులయ్యారు.

5) ఆరెల్లి వెంకట్ (35) గౌతమ్, కిరణ్. ఏరియా కమిటీ సభ్యుడు. కరీంనగర్ జిల్లా, కానాపురం, మంథని మండలం. ప్లాటూన్ కమాండర్.

6) అజయ్ (20) కాశెట్టిపాడు. సభ్యుడు. మాదిగ.

7) జనగామ రాజు – దుర్గం రాజు (26) సేతగాని మాల. బుట్టాయగూడెం, ఏటూరు నాగారం మండలం. కమాండర్.

8) మద్దిసీత – నవత. పూరేడిపల్లి, మంగపేట మండలం. సభ్యురాలు.

9) వసంత – అన్నారం, రాళ్లగూడెం దగ్గర బీజాపూర్ మండలం. దేవాదులకు దగ్గరవుతుంది.

'ఈ ఏకపక్ష దాడియే కాకుండా పువ్వర్తి, జబ్బగుట్ట, మర్కనగూడెం, మెట్లగూడెం తదితర గ్రామాలపై ఏపి గ్రేహౌండ్స్ బలగాలు దాడులు చేసి ఇళ్లల్లోకి చొరబడి ధాన్యం, విలువయిన సామగ్రి ధ్వంసం చేసి, ప్రజలను దోచుకున్నారు. ఆయా గ్రామాలలో ఆదివాసీలను కొట్టి చిత్రహింసలు పెట్టి ముప్పై మందిని అదుపులోకి తీసుకున్నారు. స్థానిక ఆదివాసీ కేడర్ మధ్య విభేదాల కారణంగా సమాచారం బయటికి పొక్కడంతో పోలీసులు దాడి చేశారు. పోలీసు అధికారులు, పాలకవర్గాలు మీడియా ద్వారా చేస్తున్న తప్పుడు ప్రచారాన్ని మానుకోవాలి. తొమ్మిది మంది కామ్రేడ్లను చంపి కెకెడబ్ల్యు ఖతం అని విర్రవీగుతున్నారు.

ప్రజల బిడ్డలను చంపినందుకు ప్రజలు, ప్రజా గెరిల్లాలు పోలీసు అధికారిని ఖతం చేసారు. అయితే అతడు 17న చనిపోయాడు. ఆర్ఎస్ఐని క్రూరంగా చంపినట్లు తెలుగు మీడియాలోనూ, ముఖ్యంగా రెండు ప్రముఖ తెలుగు దినపత్రికలు (ఆంధ్రజ్యోతి, ఈనాడు) వచ్చిన వార్తలు అబద్ధం. ప్రతిఘటన సందర్భంలో లోకల్ మిలీషియా చేతిలో సంప్రదాయ ఆయుధాలతో జరిపిన దాడిలో అతడు చనిపోయాడు. పోలీసుల ఆధీనంలో ఉన్న ముప్పై మంది ఆదివాసులను వెంటనే బేషరతుగా విడుదల చేయాలి. అమరులయిన తొమ్మిది మంది కామ్రేడ్లు తెలంగాణ విముక్తి కోసం, దేశంలో, ప్రపంచంలో దోపిడీ లేని నవసమాజం కోసం రక్త సంబంధీకులను, రాష్ట్రాలను వదిలిపెట్టి ప్రజల కోసం పనిచేశారు. ప్రజల కోసం పోరాడారు. ప్రజల కోసం ప్రాణాలర్పించారు. వీరి స్థానాలను తప్పకుండా యువతీ యువకులు భర్తీ చేస్తారు. అమరుల తల్లిదండ్రులకు, రక్త బంధువులకు విప్లవ వందనాలు.

ఈ తొమ్మిది మంది అమరుల్లో ఏడుగురు వరంగల్ జిల్లా వాళ్లే. అందులోను ఘనపురం (ములుగు) భూపాలపల్లి, కాల్వపల్లి, ఏటూరు నాగారం వంటి గోదావరి లోయ అడివంచు ఊళ్లు. ఆ విధంగా చూసినపుడు కరీంనగర్ జల్లా మంథని దగ్గరి కానాపురం కూడా అడివంచు ఊరు. అటు చత్తీస్‌గడ్‌లోని బీజాపూర్ జిల్లా వసంతదయినా దేవాదుల దగ్గరి అన్నారం తాళ్లగూడెం దగ్గరి ఊరు – వరంగల్ జిల్లా సరిహద్దు గ్రామమే. ఈ తొమ్మిది మందిలో ఐదుగురు మహిళలు. ముప్పై రెండేళ్ల కన్నా తక్కువ వయసు వాళ్లు. అందరూ ఆదివాసులు, దళితులు. ఆదివాసుల్లోను ఎక్కువగా కోయలు. దళితుల్లో మాదిగలు. మర్రి రవి అణగారిన వెనుకబడిన కులం నుంచి వస్తే మిగతా పురుషులు కూడ దళితులు. ఈ అందరికీ గోదావరి లోయ, అడవి, అడవిలోని ఆదివాసీ జీవితాలు, పోరాటాలు తప్ప వేరే 'నాగరిక' ప్రపంచం తెలియదు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, నక్సల్బరీ, జగిత్యాల పోరాటాల వారసత్వంగా ఈ ఏజెన్సీ ఏరియాలో వీళ్ల కళ్లు తెరిచిందీ, పెరిగిందీ, ఎంచుకున్నదీ, ప్రాణాలర్పించిందీ విప్లవోద్యమంలోనే.

ఒక విధంగా చూసినపుడు ఇది ఉత్తర తెలంగాణ మూడు జిల్లాల విప్లవోద్యమానికి తీవ్రమైన నష్టంగా కనిపించినా మరొక విధంగా చూసినపుడు ఉత్తర తెలంగాణ విప్లవోద్యమం సెట్‌బ్యాక్ తర్వాత పునర్నిర్మాణమవుతున్న ఉద్యమంలోకి ఎంతగడ్డి వేళ్ల స్థాయి నుంచి, విప్లవకర వర్గాల నుంచి శ్రేణులు (క్యాడర్) వస్తున్నారో ఇది ఎటువంటి పరిణతియోనని ఎక్కడలేని విశ్వాసం కలుగుతుంది. వాళ్లకింకా విప్లవం తప్ప మరొక జీవితం లేదు. అడవి తప్ప నీడ లేదు. ప్రజలు తప్ప ఒడి లేదు. అమరులై వాళ్లు తల్లిదండ్రులు తెచ్చుకుంటే తమ ఊళ్లకు వచ్చారు గానీ సరిహద్దులు చెరిపేసి వాళ్లు దండకారణ్య విప్లవోద్యమం తల్లి ఒడిలో తమ శ్వాస, ధ్యాస, జీవితం, పోరాటంగా కలిసిపోయారు.

తాను వరంగల్ రాజధానిగా పాలించిన కాకతీయులకు వారసున్నని, తమ పూర్వీకులు ఆరు వందల సంవత్సరాల క్రితం బస్తర్‌కు రాజులుగా వచ్చారని చెప్పుకున్న ప్రవీర్ చంద్ర బాంజ్‌దేవ్ 1965లో తన ఆత్మకథలో నేను కాంగ్రెస్ పార్టీని వలస పాలకులుగా నిందించాడు. 'ఈ ప్రభుత్వ విధానాలు పారిశ్రామికీకరణ, ఆధునికీకరణతో పాటు కాంట్రాక్టర్ల సంక్షేమం (ఆదివాసులకు వ్యతిరేకంగా), ఈ కుట్ర అంతం కావాలి. ఒక ఆదర్శప్రాయమైన, సమానత్వాన్ని ఇవ్వగల వ్యవస్థలోకి ప్రజల్ని నడిపించడంలో ఘోరంగా విఫలమైంది. అందుకే ఈ (కాంగ్రెస్) పరిపాలనను నామరూపాలు లేకుండా అంతం చేయాలి' అని రాసుకున్నాడు. 'ఆయన రాజ్యానికి వ్యతిరేకంగా' ఆదివాసులతో కలిసి 'యుద్ధాన్ని' ప్రకటించడానికి, అందుకే ఆయనకు బుద్ధి చెప్పడానికి 1966 మార్చ్ 26న ఆయన రాజప్రసాదంపై దాడి చేసి పోలీసులు ఆయనను చంపేసారు. ఆ దాడిలో పన్నెండు మంది ఆదివాసులు కూడా చనిపోయినట్లు ప్రకటించినా అంతకన్న పెద్ద సంఖ్యలోనే చనిపోయి ఉంటారని 'దండకారణ్య సమాచార్' అనే పత్రిక రాసింది. తెలుగు రాజులు కాకతీయులకు ప్రవీర్‌చంద్ర వారసుడైనట్లే 'ఇవ్వాళ తెలుగు మాట్లాడే మావోయిస్టులకు ప్రవీర్ చంద్ర 'వారసత్వం ఉందా?' అని ఒక ప్రభుత్వాధికారి అన్నాడట. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించిన రాంజీగోండు గోండురాజు రాజా గోండు అయినా, సామ్రాజ్యవాద దళారీ కాంగ్రెస్ పాలనను ప్రశ్నించిన గోండు రాజు ప్రవీర్ చంద్ర అయినా, భూంకాల్ మిలీషియాను నిర్మించి బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పోరాడిన గూండాధర్ మొదలు, 'మా ఊళ్లో మా రాజ్యం' అని బ్రిటిష్‌తో, నైజాంతో తలపడిన కొమురం భీము వరకు దేశభక్తులయిన స్థానిక ఆదివాసీ రాజుల, పోరాట ప్రజల వారసులే పెద్ది శంకర్ మొదలు సుధాకర్ వరకు మావోయిస్టు విప్లవకారులు.

ఆ మృతదేహాలను గ్రేహౌండ్స్ హెలికాప్టర్‌లో బుధవారం 17న తెచ్చారు. అది మనుషుల పట్ల, మృతదేహాల పట్ల గౌరవంతో కాక అందులో విప్లవోద్యమ అగ్ర నాయకత్వం, కేంద్ర కమిటీ ప్రముఖ నాయకులు ఉన్నారు – పెద్ద క్యాచ్ అన్న ధీమాతో ఇక్కడ మాజీలతో, తమ దగ్గర ఉన్న సమాచారంతో ధృవపరుచుకోవడానికి తెచ్చారు. రోడ్డు వెంబడి తెస్తే అప్పుడే ప్రతిఘటన, ప్రతీకారం ఉంటుందనే భయంతో కూడా తెచ్చారు. తీరా వీళ్లలో కేంద్ర కమిటీ నాయకత్వం ఎవరూ లేరని ఇక్కడ తమ దగ్గర ఉన్న సమాచారం, మాజీల గుర్తింపుతో తేలిపోయాక, భద్రాచలం ఏరియా ఆసుపత్రిలో వాళ్ల మృతదేహాలను చెత్తలో పడేసారు. 17న నెట్‌లో వచ్చిన మృతదేహాల ఎన్‌లార్జ్‌డ్ ఫొటోలను చూసి విప్లవాభిమానులు, సుధాకర్‌ను ఎరిగిన వాళ్లు ఆయనను పోల్చుకోగలిగారు కానీ 18న ఉదయం భద్రాచలం ఏరియా ఆసుపత్రి మార్చురీలో తన కొడుకు మృతదేహాన్ని మర్రిరవి తండ్రి పోల్చుకోలేక పోయాడు. ఆ తొమ్మిది మృతదేహాల్లో తన కొడుకు శవం లేదని మీడియాకు చెప్పాడు కూడా. అంతకు ముందు రాత్రే తీసిన

మీడియా ఫొటోల ఎన్‌లార్జ్ రూపాలను చూపితే గానీ ఆయన గుర్తు పట్టలేకపోయాడు. ఆ విప్లవకారుడు 18 సంవత్సరాల క్రితం ఇల్లు వదలడం ఒక కారణమైతే, మృతదేహాలను భద్రాచలం తెచ్చిన దగ్గర్నించీ అమానవీయంగా చెత్తలో పడేసి భద్రపరిచే జాగ్రత్త తీసుకోకపోవడం మరో కారణం. 18న తొమ్మిది పది గంటల మధ్యన రక్తబంధువులకు మాత్రం చూపి మొహాలు కనిపించకుండా మూటలు కట్టి రెండు ట్రేలర్‌లతో తొమ్మిది మృతదేహాలను ఒక దానిపై ఒకటి మూటల వలెనే పడేసి రోడ్డు మార్గంగా డెబ్బై కిలోమీటర్ల దూరంలో ఉన్న చత్తీస్‌గడ్‌లో ఉన్న కుంటాకు పంపించారు. వాస్తవానికి బిడి శర్మ గారి అభ్యర్థనపై చత్తీస్‌గడ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి గుర్తించిన రక్త బంధువులకు మృతదేహాలను భద్రాచలంలోనే అప్పగించవచ్చునని ఆమోదం తెలిపాడు. అయినా భద్రాచలం పోలీసు అధికారులు మొదలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వరకు రక్తబంధువుల ఈ అభ్యర్థనను పెడచెవిన పెట్టింది. బేఖాతరు చేసింది. హైకోర్టు ఉత్తర్వులతో వెళ్లిన ఎపిసిఎల్‌సి, ఇతర ప్రజా సంఘాల నాయకులను, న్యాయవాదులను, అమరుల బంధు మిత్రుల సంఘ నాయకులను, ప్రజాస్వామ్యవాదులను మృతదేహాల పరిసరాలకు రానివ్వలేదు. తోసివేశారు. చాల తృణీకార భావంతో వ్యవహరించారు. హైకోర్టు ఉత్తర్వుల నెపం చెప్పారు తప్ప, ఉదయం తొమ్మిది గంటల లోపల మృతదేహాలను రక్త బంధువులకు చూపాలన్న ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు ఉత్తర్వును గౌరవించలేదు, పాటించలేదు. పైన పేర్కొన్న ప్రజాసంఘాల నాయకులు, ప్రజాస్వామ్యవాదులు, న్యాయవాదులు, ఆసుపత్రిలో అమరుల ఆఖరిచూపు కోసం వచ్చిన వందలాది మంది ప్రజలు నిరసనల వల్ల, తీవ్ర స్పందన వల్ల మాత్రమే ఉదయం తొమ్మిది గంటల తర్వాత మృతదేహాలను రక్తబంధువులను చూడనిచ్చారు. మృతుల కుటుంబాల పట్ల, ప్రజాస్వామిక హక్కుల పట్ల, న్యాయం కోసం, చట్టాలను గౌరవించడం కోసం న్యాయవాదులు చేసిన పోరాటం వల్ల పోలీసులకు ఎంత అక్కసు ఉన్నదనడానికి నిదర్శనమే ఆర్‌ఎస్‌ఐ మృతదేహం తాము పెట్టిన గడువు లోపల అప్పగించకపోతే ఎపిసిఎల్‌సి సంయుక్త కార్యదర్శి రఘునాథ్ (అడ్వకేట్), ఆయన భార్య శిరీష (టీచర్), పిల్లలను, సిఆర్‌పిపి కార్యదర్శి బల్లా రవీంద్రనాథ్ (అడ్వకేట్), ఆయన భార్య సిఆర్‌పిపి కమిటీ సభ్యురాలు అడ్వకేట్‌లను చంపేస్తామన్న బూతులతో కూడిన బెదిరింపు ఫోన్‌కాల్స్.

ఈ బెదిరింపు ఫోన్‌కాల్స్‌తో నిమిత్తం లేకుండానే ఆర్‌ఎస్‌ఐ మృతదేహం అడవిలో చెరువు పక్కన పడి ఉన్నదని మీడియా ద్వారా తెలుసుకున్న ఎపిసిఎల్‌సి అధ్యక్షుడు ప్రొ. శేషయ్యగారు ఆర్‌ఎస్‌ఐ మృతదేహాన్ని ఆయన కుటుంబ సభ్యులకు అప్పగించాలని విజ్ఞప్తి చేసే ఉన్నాడు. ఎపిసిఎల్‌సి గానీ, ప్రజాస్వామ్యవాదులు గానీ ఎవరో అడిగారని, ఒత్తిడి తెచ్చారని, బెదిరించారని, విజ్ఞప్తి చేశారని కాకుండా ప్రజాస్వామిక విశ్వాసాల వల్లనే మొదటి నుంచీ ఎవరి మృతదేహాలైనా వారి కుటుంబాలకు అప్పగించాలనే సూత్రబద్ధమైన వైఖరి తీసుకున్న వాళ్లే. ఆ విషయం ప్రజలందరికీ తెలుసు. ఆర్‌ఎస్‌ఐ మృతదేహంతో పోలీసులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎటువంటి శవరాజకీయాలు చేసిందో గమనిస్తే ఈ విషయం ఇంకా స్పష్టంగా అర్థమవుతుంది.

'ఎన్‌కౌంటర్' గురించి మీడియాలో వార్తలు వచ్చిన 17వ తేదీ సాయంత్రానికి పరస్పర భిన్నమైన కథనాల వలన ప్రొ. శేషయ్య గారు జస్టిస్ దేశాయ్, ఎన్‌ఎచ్‌ఆర్‌సి నిర్దేశక సూత్రాలకు అనుగుణంగా మృతదేహాలను భద్రపరిచి, రీపోస్ట్‌మార్టం జరిపించాలని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చీఫ్ జస్టిస్ ముందు హౌజ్ మోషన్ చేశారు. హైకోర్టు అదే రాత్రి జస్టిస్ ఎల్. నర్సింహారెడ్డి గారిని ఈ రిట్ మీద విచారించాల్సిందిగా నిర్దేశించింది. ఆ న్యాయమూర్తి ముందు అందుబాటులో ఉన్న సమాచారం పెట్టడానికి నెట్ నుంచి మృతదేహాల ఫొటోలు తీసినప్పుడు ప్రతి మృతదేహం నుదుటి మీద తుపాకి మడమలతో కొట్టిన దెబ్బలు, నెత్తురు కదుములు కట్టినట్టుగా ఉంది. అట్లే, ఆసిడ్ పోసినట్టుగా నుదురు, చెంపలు, ఇతర భాగాలు చర్మం కాలి ఊడి వచ్చాయి. శరీరాల నిండా గాయాలున్నాయి. కనుక ఏదైనా ఆహారంలో మత్తు కలవడమో, కోవర్టు ప్రయత్నంలో విషాహారం ఇవ్వడమో జరిగి వాళ్లు సొమ్మసిల్లి ఉంటారని అప్పటికి ఊహించడమైంది. భద్రాచలంలో మృతుల కుటుంబాలు మృతదేహాలు చూసిన తర్వాత వెలుబుచ్చిన అనుమానాలకు కూడా మీడియాతో ఒకమారు నేను అనుమానం వెలిబుచ్చాను. ఇది ధృవపడిన వార్త కాదు.

19న శుక్రవారం చత్తీస్‌గడ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, హోం సెక్రటరీ ఢిల్లీలో ఉన్న బిడి శర్మ గారికి ఫోన్ చేసి 18న సప్లైస్‌కు వెళ్లిన హెలికాప్టర్ తిరుగు ప్రయాణంలో ఒక పోలీసును వదిలేసిందని, అతడు డీహైడ్రేట్ అయి చనిపోయాడని, అతని మృతదేహం చుట్టూ గ్రామస్తులున్నారని, ఆ మృతదేహాన్ని మృతుని కుటుంబానికి అప్పగించాలని విజ్ఞప్తి చేయమన్నారు. అటువంటి ఏర్పాటేదో చేయమని బిడి శర్మ గారు నన్ను కోరారు. అడవిలో ఉన్న వారికి సమాచారం అందే అవకాశం బిబిసి హిందీ వార్తలు, ఆకాశవాణి ప్రాంతీయ వార్తలే కనుక, బిబిసి వాళ్లు కూడా ఆసక్తి చూపినందున ఆ ఏర్పాటు చేశాను. నేను కూడా బిబిసి వాళ్ల కోరికపై ఈ విషయాలే టైమ్స్ నౌకు చెప్పాను. 18న ఢిల్లీలో ఉన్న ప్రొ. హరగోపాల్‌తో కలిసి బిడి శర్మగారి ఇంట్లో ఎన్‌డిటివి ఇంటర్వ్యూ చేసింది. 19న మళ్లీ ఢిల్లీలో ప్రొ. హరగోపాల్ ప్రకటనను బిబిసి హిందీ రికార్డు చేసి ప్రసారం చేసింది. ఇట్లా మూడు రోజులు అడవిలో ఆర్‌ఎస్‌ఐ శవం పడి ఉంటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం లేదా చత్తీస్‌గడ్ ప్రభుత్వం బిడి శర్మ గారి వంటి వాళ్ల దగ్గరికి అడవికి వాళ్ల విజ్ఞప్తిని చేరవేయగల ఆకాశవాణి వంటి ప్రసార సాధనాలను పంపించే ఏ ఏర్పాటూ, ప్రయత్నమూ చేయలేదు.

ఒడిశాలోని మల్కన్‌గిరి జిల్లా కలెక్టర్ వినీల్ కృష్ణను, చత్తీస్‌గడ్‌లోని సుకుమా జిల్లా కలెక్టర్ పాల్ ఎక్స్ మీనన్‌లను మావోయిస్టులు బందీలుగా తీసుకున్నప్పుడు ఆయా ప్రభుత్వాలు చేసిన ప్రయత్నాలతో ఒక్కసారి ఈ ఆర్‌ఎస్‌ఐ మృతదేహాన్ని ఆయన కుటుంబ సభ్యులకిప్పించే విషయంలో చేసిన జాప్యాన్ని, నిర్లక్ష్యాన్ని పోల్చుకొని చూడాల్సిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను. ఏ ప్రయత్నమూ చేయకపోగా ఎట్లాగూ చచ్చిన వాడు ఆర్‌ఎస్‌ఐ, పైగా ఏం చేసినా మళ్లీ ప్రాణాలతో తిరిగిరాడు కనుక అతని శవం కుళ్లి పురుగులు పడి ఏమైనా కానీ శవ రాజకీయాలు చేయాలని పథకం వేసుకున్నారు. ఇంక ఎన్ని అబద్ధాలు ప్రచారం చేసారు. అంతేకాదు 16న జరిగింది నిజమైన ఎన్‌కౌంటర్ అనడానికి – ఈ

# ఢిల్లీ అత్యాచార సంఘటన, నిరసనలు

***స్త్రీలపై నిత్యం జరుగుతున్న అత్యాచారాలకు మూలాలు సమాజంలో పాతుకుపోయిన బ్రాహ్మణీయ పితృస్వామ్య భావజాలంలోనే ఉన్నాయనీ, దాని నిర్మూలనకు ప్రతి ఒక్కరూ పాటు పడాలనీ అంటున్నారు* డా. ఎ. సునీత**

ఢిల్లీలో విద్యార్థిని నిర్భయపై బస్సులో జరిగిన సామూహిక అత్యాచార సంఘటన, ఆమె మరణం దేశంలో అనేక మందిని దిగ్భ్రమణకు, భయాందోళనకు గురిచెసాయి. ఈ సంఘటన మన దేశ లైంగిక అత్యాచారాల చరిత్రలో మొదటిది కాదు. దినపత్రికలలో వస్తున్న రిపోర్టులు చూస్తే చివరిది కూడా కాదని అర్థమవుతుంది. గత దశాబ్ద కాలంలోనే ఈశాన్య రాష్ట్రాల్లో, కశ్మీర్‌లో, చత్తీస్‌గడ్‌లో సైన్యం, పారా మిలటరీ బలగాలు ఉగ్రవాద అణచివేత పేరుతో స్త్రీలపై జరిపిన లైంగిక దాడులలో మరణించిన మనోరమ, కశ్మీరీ షోపియన్ స్త్రీలు, పోలీసు కస్టడిలో ఉంటూ నరకం అనుభవిస్తున్న సోని సోడి మన మస్తిష్కం నుంచి తొలగిపోలేదు. ఆయా సంఘటనలకు వ్యతిరేకంగా నిరసనలు వచ్చినప్పటికీ, ఢిల్లీ సంఘటనకు వ్యతిరేకంగా వచ్చిన నిరసనలు మాత్రమే మన దేశంలో బహిరంగ ప్రదేశాల్లో స్త్రీలపై జరుగుతున్న హింస గురించి, స్త్రీలపై జరిగే లైంగిక దాడుల గురించి అనేక ప్రశ్నలు లేవనెత్తాయి.

మన దేశంలో ఈ హింసకు సంబంధించిన చట్టాలు ఎందుకు పని చేయడం లేదు? అసలు సరయిన చట్టాలున్నాయా? వాటిని అమలు పరచవలసిన యంత్రాంగం ఎందుకు పని చేయడం లేదు?

పట్టణ ప్రాంతాలలో పెరుగుతున్న ఇటువంటి హింసను ఏ విధంగా అర్థం చేసుకోవాలి? దీనికీ, ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీ పురుష సంబంధాల అవగాహనలకీ, రూపు మార్చుకుంటున్న బ్రాహ్మణీయ పితృస్వామ్యానికీ సంబంధమేమిటి? అత్యాచారాలు, లైంగిక దాడులు అపరిచితులు మాత్రమే చేస్తారా?

అపరిచితులు దాడులకు పాల్పడినప్పుడు ప్రజల్లో పెల్లుబికే ఆక్రోశం, కులపరమైన, మతపరమైన దాడులు, కుటుంబంలో సభ్యులు చేసే అత్యాచారాల విషయంలో ఎందుకు వెలువడదు? చట్టంలో వచ్చే మార్పులు వీటిని ఆపడానికి ఏ రకంగా ఉపయోగపడతాయి? అత్యాచార బాధితులకు సమాజ సానుభూతి లేకుండా, సంస్థాగత, వ్యవస్థీకృత మార్పులు తేవడానికి చట్టంలో మార్పులు సరిపోతాయా? ఈ ప్రశ్నల్లో కొన్నిటికి సమాధానం వెతికే దిశగా ఈ వ్యాసంలో ప్రయత్నిస్తాను.

---

ఆర్‌ఎస్‌ఐ ఆ ఎన్‌కౌంటర్‌లోనే మరణించాడని ప్రచారం చేసారు. ప్రతీకారంతో ఈ ఆర్‌ఎస్‌ఐని చంపి శవం చుట్టూ మందుపాతరలు పెట్టారని ప్రచారం చేసారు. 'దమ్ముంటే వచ్చి మీ ఆర్‌ఎస్‌ఐ శవాన్ని తీసుకపోండి' అని సవాల్ విసిరారని ప్రచారం చేసారు. ఈ ప్రచారంలో పోలీసు పాత్ర ఎంత, మీడియా పాత్ర ఎంత అనేది చెప్పడం కష్టం. కేంద్ర కమిటీ ప్రముఖ నాయకులు ఈ ఎన్‌కౌంటర్‌లో చనిపోయారన్న దగ్గర్నించీ, హెలికాప్టర్‌ను కూల్చివేయడం దగ్గర్నించీ, మందుపాతరలు, సవాళ్ల వరకు తాము చూసినట్లు, విన్నట్లు, ప్రత్యక్ష ప్రసారాల వలె, కొన్ని పాత క్లిప్పింగులను టెక్నికల్ ట్రిక్కులను – అక్కడ ఎన్‌కౌంటర్ జరుగుతుంటే, హెలికాప్టర్‌పై కాల్పులు జరుపుతుంటే, శవం చెరువు పక్కన పడి ఉంటే ఫొటోలు తీసి ప్రసారం చేసినట్లుగా ప్రసారం చేసాయి. అంతా అయిపోయాక ఒక ప్రముఖ దినపత్రిక కళ్లు పీకేసి, చేతులు నరికేసి ఆర్‌ఎస్‌ఐని చంపారని ఒక ఫొటో కూడా వేసింది. ఆ ఫొటోలో కళ్లు పీకేసినట్లుగానీ, చేతులు నరికేసినట్లు గానీ ఏ స్పష్టతా లేదు. ఎందుకంటే ఇంత చేస్తే మూడోరోజు హక్కుల సంఘాల వాళ్లు, ఆదివాసీ సంఘాల వాళ్లే వెళ్లారు. గ్రామస్తులే ట్రాక్టర్లో తెచ్చారు, చెర్ల మండల కేంద్రం దాకా వాళ్లే తెచ్చారు. అక్కడి నుంచి భద్రాచలం అయినా, భద్రాచలం నుంచి విశాఖపట్నం అనకాపల్లి ఆయన తల్లిదండ్రుల దగ్గరికయినా పోలీసులు మూడు రోజులు అడవిలో పడి ఉన్న శవాన్ని, ఆ స్థితిలో రోడ్డు వెంబడి తీసుకపోయారే తప్ప ఎక్కడా హెలికాప్టర్‌లు గానీ, గాలింపు చర్యలకు ఉపయోగిస్తున్న సైనిక విమానాలు గానీ వాడుకోలేదు. అదీ ఆర్‌ఎస్‌ఐ మృతదేహం పట్ల వాళ్లకున్న పట్టింపు, గౌరవం.

అననుకూల వాతావరణంలో నల్లమల అడవుల్లో కూలిన హెలికాప్టర్‌లో మరణించిన ముఖ్యమంత్రి మృతదేహం ఇప్పటికే ఆంధ్రప్రదేశ్ రాజకీయాలను నడిపిస్తున్నది. ఆంధ్రప్రదేశ్ పాలకవర్గాల రాజకీయాలన్నీ 2009 ఆగస్ట్ నుంచీ ఆ హెలికాప్టర్ ప్రమాదంలో ముఖ్యమంత్రి మరణం చుట్టే తిరుగుతున్నది. చివరికీ ఆర్‌ఎస్‌ఐ మృతికి కూడా ఆయన బతికుండగా అనుసరించిన రాజనీతియే సారాంశంలో కారణం. గ్రామస్తులు, హక్కుల సంఘాల వాళ్లు, ఆదివాసీ సంఘాల వాళ్లు చర్లకు తెచ్చిన తర్వాత భద్రాచలం రోడ్డు ద్వారా తెచ్చి భద్రాచలంలో గౌరవ వందనం చేయడాన్ని మించి ఆంధ్రప్రదేశ్ పోలీసు ఉన్నతాధికారులు, ప్రభుత్వం ఆర్‌ఎస్‌ఐ మృతదేహం స్వాధీనం చేసుకోవడానికి చేసిన ప్రయత్నాలేమిటి? కృషి ఏమిటి? ప్రజలకు, ప్రజాస్వామ్య వాదులకు, ఆదివాసులకు బెదిరింపులు తప్ప. అబద్ధపు ప్రచారాలు తప్ప. వారం రోజులు ఈ ఉదంతం తిరిగిన మలుపులు దగ్గరగా పరిశీలించి విశ్లేషించినపుడు నాకు నలభై ఏళ్ల క్రితం సృజనలో డి. వెంకటరామయ్యగారు రాసిన 'ఒక చావు – ఒక మరణం' కథ గుర్తుకు వస్తే అది నా తప్పు కాదు.

*(రచయిత విప్లవ కవి, విప్లవ రచయితల సంఘం నాయకులు)* వీ

**ప్రపంచీకరణ – రాజకీయ ఆర్థిక పరిస్థితులు – ఢిల్లీ సంఘటన**

ముందుగా ఢిల్లీ సంఘటనను అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం. రాజ్యహింసలో భాగంగా జరిగే లైంగిక దాడులను పక్కన పెడితే, సంఖ్యాపరంగా చూసినప్పుడు మొత్తం స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలలో బహిరంగ ప్రదేశాల్లో స్త్రీలపై సామూహిక దాడులు తక్కువ సంఖ్యలో జరుగుతాయనేది పోలీసు నివేదికల్లోనూ పరిశోధనల్లోనూ వెల్లడైన విషయం. చాలావరకు ఇరుగు పొరుగువారు, కుటుంబ సభ్యులు, పరిచయస్తులు, తెలిసిన వారే తమకు తెలిసిన స్త్రీలపై సమయం చూసుకుని అత్యాచారానికి పాల్పడతారు. నిర్భయ వంటి అపరిచితులపై ఇంత క్రూరంగా దాడులు చేయడం అరుదుగా జరిగే సంఘటన. అయితే ఢిల్లీ వంటి మహానగరాలలో ఇటువంటి సంఘటనలు ఈ మధ్య బాగా పెరిగడానికి ఒక నేపథ్యం ఉంది. ప్రపంచీకరణ తరువాత మారుతున్న సామాజిక, రాజకీయ ఆర్థిక పరిస్థితులు, వాటి నీడలో రూపు మార్చుకుంటున్న బ్రాహ్మణీయ పితృస్వామ్య వ్యవస్థ దాని భావజాలం.

ప్రస్తుతం దేశంలోనే అత్యంత ఎక్కువగా స్త్రీలపై బహిరంగ హింస జరుగుతున్న నగరాల్లో ఢిల్లీ పట్టణం అగ్రస్థానంలో ఉంది. రెండు, మూడు రకాల సామాజిక ఆర్థిక మార్పులు ఇటువంటి హింస పెరగడానికి అనువయిన పరిస్థితులు కల్పిస్తున్నాయి. ఒక పక్క అభివృద్ధి క్రమంలో గ్రామాల నుండి స్త్రీలు, ఆడపిల్లలు పనికోసం, చదువు కోసం, ఉద్యోగాల కోసం నగరాలకు చేరడం పెరిగింది. పెరిగిన జనాభాకి తగ్గట్లుగా కావాల్సిన రక్షణ వ్యవస్థను మన ప్రభుత్వం పెంచలేదు. ఇంకో పక్క ప్రపంచీకరణ తరువాత వేగంగా డబ్బు సంపాదించి, అత్యంత శక్తిమంతంగా తయారైన వర్గానికి చెందిన మగవారు ఎటువంటి సామాజిక వర్గానికి చెందిన స్త్రీలనైనా తాము వాడుకోవచ్చనే అంచనాకి వచ్చారు. స్త్రీలను కూడా వాడి పడేసే వస్తువులుగా చూసే ఈ వర్గానికి, ఖరీదైన కార్లలో తిరుగుతూ ఆడవారిపై అత్యాచారం చెయ్యడం గత దశాబ్దంలో ఒక క్రీడగా మారింది. తామేమి చేసినా చెల్లుతుందనే వారి నమ్మకానికి ఢిల్లీలోని పోలీసు వ్యవస్థ అసమర్థత, నిర్లక్ష్యం, నిష్క్రియాపరత్వం కూడా తోడయ్యాయి. ఢిల్లీలో గత పది సంవత్సరాలలో రోడ్డుపై తిరుగుతున్న ఖరీదైన కార్లలో జరిగిన అత్యాచారాలు, బస్సుల్లో, ఆటోలలో తిరిగే స్త్రీలపై అత్యంత సాధారణంగా మారిన లైంగిక వేధింపులు ఈ మార్పుకి ఒక నిదర్శనం.

ఈ వర్గ భావజాలం, ఆలోచనా విధానం, ఢిల్లీ చుట్టు పక్కల ఖాప్ పంచాయితీలల్లో ఇప్పటికీ అమలవుతున్న బ్రాహ్మణీయ పితృస్వామ్య న్యాయం, సంస్కృతి నుండి బలాన్ని పొందుతోంది. ఢిల్లీ నగరం సరిహద్దుల్లో ఉన్న హర్యానా రాష్ట్రంలో గత సంవత్సర కాలంలో దళిత సంఘాలు పోరాడగా బయటికొచ్చిన సంఘటనల్లో, ఝాట్ కులస్తులు దళిత స్త్రీలపై జరిపిన అత్యచారాలెన్నో ఉన్నాయి. వీటిల్లో పోలీసులకు రిపోర్ట్ అయినవి చాలా తక్కువ. అయినా కేసులయినవి ఇంకా తక్కువ. ఈ ఝాట్ పంచాయితీలు తమ గ్రామాల్లో అత్యాచారాలు జరగవనే తీర్పులు ఇవ్వడమే కాకుండా, నిందితులపై పోలీసులకు రిపోర్టులు అందకుండా ఆపాయి. అంతే కాదు యువకులు పెళ్లి కాని అమ్మయిలు ఉంటే ఉద్రేకాలకు గురవుతున్నారు కాబట్టి, అమ్మాయిలకు చిన్నప్పుడే పెళ్లిళ్లు చెయ్యాలనే మనువాద న్యాయ సూత్రాలననుసరించి సూచనలు కూడా ఇచ్చాయి. స్త్రీలు, దళితుల విషయంలో భారత రాజ్యాగం, శిక్షా స్మృతి ఇంకా అమలవని పరిస్థితులు ఇక్కడ కొనసాగుతున్నాయా అనే అనుమానం అందరికీ కలుగచేస్తాయి. బ్రాహ్మణీయ పితృస్వామ్య సంస్కృతిని ప్రోత్సహించే ఇటువంటి సామాజిక నేపథ్యం నుండి వచ్చిన ఢిల్లీ పట్టణంలోకి ప్రవేశిస్తున్న ఆధిపత్య వర్గాల మగవారికి స్త్రీలు కూడా సమాన పౌరులు అనే విలువ ఎంత మాత్రం ఆలోచనలోకి ప్రవేశించిందో సందేహమే.

ఇటువంటి ఢిల్లీ సంస్కృతిలోకి ప్రవేశిస్తున్న రెండో వర్గం – గ్రామాలలో పని దొరక్క, నయా ఉదారవాద అభివృద్ధిలో వేగంగా విస్తరిస్తున్న నగరాలలోకి పనికోసం వలస వస్తున్న – అత్యంత పేద వర్గాలకి చెందిన శ్రామిక వర్గ మగవాళ్లు. పారిశ్రామీకరణ, పట్టణీకరణలో భాగంగా వ్యవసాయ రంగానికి ప్రభుత్వం సహకారాన్ని పూర్తిగా ఉపసంహరించింది. ఉపాధి కోల్పోయిన మగవారికి అక్కడే కొత్తగా ఏర్పడుతున్న ఫ్యాక్టరీలలో పని దొరకడంలేదు. వీరు ఢిల్లీ వంటి పట్టణాలకి వలస వచ్చి ఏ వసతులు, హక్కులు లేని మురికివాడల్లో జీవిస్తున్నారు. అసంఘటిత రంగంలో కూలీలుగానో నిలకడలేని ఇతర ఉద్యోగాల్లోనో, మహా అయితే డ్రైవర్లుగానో జీవిస్తున్నారు. వీరి జీవితం ప్రతిక్షణం సంఘర్షణగానే ఉంటుంది. వారు తమ మానవత్వాన్ని, ఆత్మ గౌరవాన్ని, మానవ హక్కుల్ని కాపాడుకోవడానికి చేసే యుద్ధంలో అందే సమాజ సహకారం చాలా తక్కువ. అంతే కాకుండా, ఢిల్లీ వంటి నగరాలలో లభించే స్వేచ్ఛ, పురుషాధిపత్యం, ఢిల్లీలో సంస్కృతి వేరే రకమయిన సంస్కృతిలోకి వారిని అహ్వానిస్తున్నాయి. లైంగిక దాడులకు పాల్పడే అవకాశాలనూ, ప్రోత్సాహాన్నీ కల్పిస్తున్నాయి. సమూహ సంస్కృతి నుండి వేరయిన ఈ మగవారు పై వర్గాల, వర్ణాల మగవాళ్లని అనుకరిస్తూ, కొత్త సంస్కృతిలో తమని తాము 'మగవాళ్లు'గా నిరూపించుకునే ప్రయత్నంలో, తాము కూడా రోడ్లపైన, బస్సుల్లోను, కార్లలోను స్త్రీలపై, బాలికలపై దాడులకు పాల్పడుతున్నారు. నిర్భయపై జరిగిన దాడిని ఇటువంటి సామాజిక, ఆర్థిక విధానాల మార్పుల నేపథ్యంలో మారుతున్న పితృస్వామ్య సంస్కృతి నుండి వేరుచేసి చూడలేం.

**అత్యాచార వ్యతిరేక నిరసనలు**

1970లలో అత్యాచారాలకి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా స్త్రీ సంఘాలు చేపట్టిన నిరసనలకి, ఢిల్లీ సంఘటన వ్యతిరేక నిరసనలకి చాల తేడా ఉంది. ఢిల్లీ నిరసనలు అప్రయత్నంగా వచ్చిన నిరసనలు. స్త్రీ సంఘాలు చేపట్టినవీ, వారి నాయకత్వంలో నడిచినవీ కావు. పితృస్వామ్య వ్యతిరేక నినాదాలు ఉన్నా కూడా, ప్రత్యేకించి పితృస్వామ్యాన్ని వ్యతిరేకించాలనే అజెండాతో వచ్చినవి కూడా కావు.

1978లో మథుర అనే ఆదివాసీ బాలికపై పోలీసులు జరిపిన అత్యాచారం కేసులో దేశ అత్యున్నత న్యాయస్థానం ఇచ్చిన తిరోగమన తీర్పుకి వ్యతిరేకంగా నలుగురు ప్రముఖ న్యాయకోవిదులు న్యాయ స్థానానికి ఉత్తరం రాసారు. ఆ సందర్భంలోనే స్త్రీ సంఘాలు స్త్రీలని తప్పుబట్టే సంస్కృతికి వ్యతిరేకంగా, తీర్పును వ్యతిరేకించి, చట్టాలలో మార్పు కోసం ఉద్యమించాయి. అప్పటికి అత్యాచారం స్త్రీలు బయటికి చెప్పుకునే హింస కాదు. చట్టపరంగా వ్యతిరేకించగలిగే నేరంగా కూడా

లేదు. పదహారేళ్లు వచ్చిన స్త్రీలందరికీ తమను తాము రక్షించుకోగలిగే సామర్థ్యం ప్రకృతి ప్రసాదిస్తుందనీ, వారి 'అనుమతి' లేకుండా, ఏ పురుషుడు కూడా ఆమెతో లైంగిక క్రియ జరపలేడనీ నమ్మిన సమాజం అప్పటిది. అత్యాచారం జరిగిన స్త్రీని 'మానం' కోల్పోయిన స్త్రీగా, చెడిపోయిన స్త్రీగా సమాజమే కాక చట్టం కూడా చూసింది. ఫిర్యాదు చేసిన స్త్రీనే పితృస్వామ్య విలువలను ఉల్లంఘించిన స్త్రీలుగా 1870లలో రూపొందించబడి, 1970ల దాక అమలయిన చట్టం పరిగణించేది. స్త్రీ సంఘాలు ఈ చర్యలు స్త్రీల శీలానికి సంబంధించినవి కావనీ, స్త్రీల శీలానికి, లైంగిక దాడులకు సంబంధం లేదనీ, వాటిని మానభంగాలుగా చూడకూడదనీ, హింసగా చూడాలనీ వాదించాయి. స్త్రీల గురించిన పితృస్వామ్య భావజాలాన్ని వ్యతిరేకించి, శతాబ్ద కాలంగా విక్టోరియన్ భావజాలంతో పనిచేస్తున్న చట్టాలని మార్చాలనీ, రాజ్యాంగ విలువల ప్రకారం కొత్త చట్టాలు రుపొందించాలనీ పోరాడాయి. ఈ పోరాటాల ఫలితంగా 1983 లో ఇండియన్ పీనల్ కోడ్‌లో అత్యాచార నిర్వచనాన్ని కొంతమేరకు మార్చారు. అధికార హోదాల్లో ఉన్నా పురుషులు అత్యాచారానికి పాల్పడినప్పుడు, నేరం చెయ్యలేదని నిరూపించుకోవాల్సిన బాధ్యతా వారిపైనే పెట్టారు.

అప్పటి ఉద్యమం నడిచినప్పుడు చట్టాల పనితీరు కొంత మారినప్పటికీ, అప్పటి నుండి ఇప్పటిదాకా అత్యాచార చట్టాల పనితీరు అత్యంత బాధాకరంగా కొనసాగుతోంది. పోలీసులు, కోర్టులు ఇప్పటికీ అత్యాచారాల బాధితులను హీనంగానే చూస్తున్నారు. డిఫెన్సు న్యాయవాదులు బాధితులను అబద్ధాల కోరులుగాను, వేశ్యలు గాను లేదా వేరే కారణాలతో అత్యాచార ఫిర్యాదు చేశారని నిరుపించడానికి ప్రయత్నిస్తున్నారు. వైద్య పరీక్షలు బాధిత స్త్రీల గాయాల గురించి కాక, వారి వ్యక్తిత్వాన్ని కించపరిచే విధంగా చేస్తారు.

1970 స్త్రీల ఉద్యమాలు కొత్త చట్టాల కోసం అడిగితే, ఢిల్లీ సంఘటన తరువాత వచ్చిన నిరసనలు ఆయా చట్టాలని పనిచేయించమని డిమాండ్ చేశాయి. ఆయా చట్టాలని పనిచేయకుండా ఆపుతున్న పరిపాలనా వ్యవస్థల వైఫల్యాలని ఎత్తి చూపాయి. పనిచేసే చట్టాలు, పోలీసు వ్యవస్థ కావాలని అడుగుతున్నాయి. జరిగిన హింస చెప్పుకోలేనిదిగా భావించిన పరిస్థితులు 1970ల నాటివయితే, తాము స్త్రీలమవడం వల్లే తమపై హింసను గుర్తించట్లేదు అని 'సమాన పౌరసత్వాన్ని' అడుగుతున్నాయి ఈ నిరసనలు. అప్పుడు కొత్త చట్టాల కోసం అడిగితే, ఇప్పటి యువ ఉద్యమకారులు కొత్త పాలనా సంస్కృతిని అడుగుతున్నారు.

1970ల నాటి స్త్రీవాదం శీలం, స్త్రీత్వం, పితృస్వామ్యం స్త్రీలపై మోపే భారమని, వాటి ప్రాధాన్యతని కుటుంబాలు, సమాజం, రాజ్యం పెంచి పోషిస్తాయనీ, దానిలో భాగంగానే స్త్రీలపై దాడులను కప్పిపెడతాయని చెపుతూ, అటువంటి స్త్రీతత్వ భారాన్నుండి స్త్రీలు విడుదల కావాలని వాదించింది. 2012లో నిరసనలు చేసిన యువత రకరకాల కారణాల వాళ్ల ఇటువంటి భావజాల భారాన్నుండి కొంతమేరకు విడుదలయిన వారు. దానికి స్త్రీల ఉద్యమం కొంత కారణమయితే, ప్రభుత్వం చేపట్టిన 'స్త్రీల సాధికారత' నినాదాలు, కార్యక్రమాలు కూడా కొంత మేరకు కారణమని చెప్పుకోవచ్చు. 1990ల తరువాత ప్రభుత్వాలు స్త్రీవాదాన్ని పరిపాలనా సంస్కృతిలో భాగం చేసుకునే క్రమంలో స్త్రీల సాధికారత నినాదాన్ని బాగా ప్రచారం చేశాయి. 'స్త్రీలు అన్ని రంగాల్లో ముందుకు రావాలి' అన్న నినాదం, పాలనా రంగంలో స్త్రీలను భాగస్వాములను చేసుకునే ప్రయత్నాలు స్త్రీలకి తాము కూడా ప్రభుత్వ పాలనలో భాగమే అన్న భావనను నయానా భయానా కల్పించింది.

ఢిల్లీ ప్రభావిత నిరసనలని స్త్రీవాద ఉద్యమాల (పాతవయినా, కొత్తవయినా) నుండి వేరు చేసే ఇంకొక ప్రధాన తేడా - న్యాయం గురించిన అవగాహన. 2013లో కొత్త పాలనా సంస్కృతిని అడుగుతున్న వారిలో వివిధ నేపథ్యాల నుండి వచ్చిన వారున్నారు. వారిలో గ్రామీణ ప్రాంతాల నుండి వలస వచ్చి పట్టణాల్లో తమ ఆడపిల్లల్ని చదివిస్తున్న వాళ్లు ఉన్నారు. కరుడుకట్టిన అధికార దాహం, పాలనా వైఫల్యాలు, మధ్యతరగతి పట్టణ ప్రజల విషయాల పట్ల రాజకీయ నిర్లిప్తతను వ్యతిరేకించిన హజారే 'నిరసనల' ద్వారా వీధుల్లోకి వచ్చిన మధ్యతరగతి ప్రజలూ ఉన్నారు. అయితే వీరిలో అనేక మంది అత్యాచారాలు ఆపాలంటే సత్వర న్యాయం కావాలని, సత్వర న్యాయమంటే త్వరగా కఠిన శిక్షలు పడాలనే నమ్మకాలతో ఉన్నారు. నిరసనల్లో నేరుగా పాల్గొనని చాలామంది అబ్బాయిలూ, అమ్మాయిలూ కూడా, ఇంటర్నెట్‌లో ఇటువంటి అభిప్రాయాలు పంచుకున్నారు. హైదరాబాదులో రాజకీయ పార్టీల నుండి, ముస్లిం స్త్రీల సంఘాల వరకు ఇటువంటి నినాదాలతోనే అనేక నిరసనల్లో పాల్గొన్నారు.

స్త్రీవాద సంఘాలు ఇటువంటి నమ్మకాలని, కఠిన శిక్షల సిద్ధాంతాన్ని పూర్తిగా వ్యతిరేకించాయి. ఉరి శిక్షలు ఎప్పుడూ కూడా అత్యాచారాలని, లైంగిక దాడులని ఆపడానికి పనికిరావనీ, దానికి బదులు ప్రతి సంఘటనకు తప్పకుండ శిక్ష పడుతుందనే భయమే కొంతయినా అత్యాచారాలని ఆపడంలో పనికొస్తుందనీ వాదించాయి. ఢిల్లీ సంఘటన తరువాత దేశమంతా 'మరణ శిక్ష' అనే పిచ్చిలో ఊగిపోతుంటే, స్త్రీవాద సంఘాలు దానికి వ్యతిరేకంగా పోరాడాయి.

**మరయితే ఢిల్లీ ప్రభావిత నిరసనల ప్రాముఖ్యతేమిటి?**

పట్టణాల్లో రోడ్లపై, ఇతర బహిరంగ ప్రదేశాల్లో నిర్భయ వంటి స్త్రీలపై అపరిచితులు జరిపే దాడుల పట్ల వ్యక్తమయిన ఈ నిరసన, స్త్రీలపై వ్యవస్థీకృత హింస పట్ల, రాజ్య హింస పట్ల, కుల, మత పరమయిన హింస పట్ల ఎందుకు వ్యక్తం కాలేదనే ప్రశ్న, నాతో సహా, అనేకమంది రాజకీయ కార్యకర్తలని బాధించింది. అయితే ఢిల్లీ ప్రభావంతో దేశవ్యాప్తంగా జరిగిన నిరసనలు, యువ పౌరులు తమ కోసం తాము చేపట్టినా, సార్వజనీన రాజ్యాంగ విలువలు, పాలనా సంస్కృతిని మార్చడానికి సహకరించేవే. ప్రపంచీకరణ తరువాత మధ్య తరగతి యువత తమ కోసం తామే బతికే వారుగా తయారయ్యారు; వారికి సమూహాల అవసరం, సామూహిక ప్రయత్నాల ప్రాధాన్యత తెలియకుండా పోయిందని అనుకుంటూ వస్తున్నాం. మన అభిప్రాయాలని ఈ నిరసనలు కొంతయినా మార్చాయి. ప్రపంచీకరణ నేపథ్యంలో చిన్న, పెద్ద ఉద్యోగాల్లో చేరిన స్త్రీలందరూ లింగ వివక్ష లేదనో, తాము వివక్షకు గురికావడం లేదనో, గురవుతున్నామని చెప్పుకోవడం తమ వ్యక్తిత్వంపై మచ్చగానో అనుకోవడం మామూలయి పోయింది. పట్టణాల్లో మధ్యతరగతి స్త్రీలు రోజువారీ జీవితంలో

ఎదురయ్యే లైంగిక వేధింపులను ఎలాగో అల తప్పించుకుంటూ, ఆ అనుభవాల గురించి ఆలోచించ కుండా బతకడం నేర్చుకున్నారు. ఈ నిరసనలు వారి నిర్లిప్తతను బద్దలుకొట్టి వారిని రోడ్లపైకి తీసుకొచ్చాయి. మధ్యతరగతికి చారిత్రకంగా లభించిన అధికారం, పాత్ర వల్ల, మధ్యతరగతి స్త్రీలు రోడ్లపైకి రావడం జాతీయ మీడియా, ప్రభుత్వం సీరియస్‌గా తీసుకున్నాయి. సామాజికంగా, రాజకీయంగా స్త్రీలు ఎదుర్కొంటున్న వివక్ష, స్త్రీ పురుష అసమానతలూ, లైంగిక హింస మళ్లీ సమాజం ముందుకు, రాజకీయ అజెండాలోకి వచ్చాయి.

ఈ సందర్భం అనేక ఉద్యమాల్లో పనిచేస్తున్న స్త్రీలకూ, స్త్రీ వాదులకూ లైంగిక హింసకు సంబంధించిన చట్టాలను మార్చాలని సుదీర్ఘంగా చేస్తున్న పోరాటాన్ని ప్రభుత్వం ముందుకు తీసుకువెళ్లే అవకాశాన్ని కల్పించింది. అపరిచితులు జరిపే అత్యాచారాలే కాక, సైన్యం, పోలీసు బలగాలు, కుటుంబ సభ్యులు జరిపే దాడులను పరిగణనలోనికి తీసుకోవాలనీ, స్త్రీలని, పిల్లలని లైంగిక దోపిడీ కోసం రవాణా చేయడాన్ని నేరపూరిత చర్యగా చేయాలనీ వాదించడానికి అవకాశం కల్పించింది. స్త్రీలపై బయట జరిగే హింసనే కాక, బాధితులపై పోలీసు స్టేషన్లలోనూ, న్యాయస్థానాలలో విచారణ పేరుతో జరిగే హింసను చర్చించి, పోలీసు యంత్రాంగం, న్యాయస్థానాల సంస్కృతిని మార్చాల్సిన అవసరాన్ని చర్చించే అవకాశాన్ని కల్పించింది. స్త్రీల భద్రత అనేది, ఒక వ్యక్తిగత విషయంగానో లేదా మానవ ప్రవృత్తికి సంబంధించిన అంశంగానో కాక, పరిపాలనా సంస్కృతికి సంబంధించిన అంశంగా ముందుకు తేవడానికి సహాయపడ్డాయి. జస్టిస్ వర్మ కమిటీ మంచి రిపోర్ట్ రాయడానికి తోడ్పడ్డాయి.

**జస్టిస్ వర్మ కమిటీ సిఫార్సులు**

జస్టిస్ వర్మ కమిటీకి వెళ్లిన వేల కొద్ది విజ్ఞాపన పత్రాలలో, వికలాంగ మహిళా సంస్థలు, దళిత మహిళా సంఘాలు, సెక్స్ వర్కర్ల సంఘాలతో సహా అనేకమంది పంపించినవి ఉన్నాయి. తాము హింసనెదుర్కొన్న సందర్భాల్లో, చట్టవ్యవస్థలతో తాము ఎదుర్కొన్న ఇబ్బందులను వివరించి, వాటిని తొలగించడానికి అవసరమయిన పాలనా సంస్కరణలు చేపట్టాలని కోరాయి.

ఈ నివేదిక స్త్రీలపై ఆంక్షలు విధించడం, లేదా ఉరిశిక్ష వంటి కఠినశిక్షలు అమలు చేస్తే అత్యాచారాలు తగ్గుతాయనే వాదనలకు విరుద్ధమయిన అభిప్రాయాలను వెలిబుచ్చింది. మొదటగా, పెరుగుతున్న అత్యాచారాలు, వేధింపులు దేశంలో కొనసాగుతున్న పితృస్వామ్య ఆధిపత్యం, స్త్రీ పురుష అసమానతల నేపథ్యంలో జరుగుతున్నాయని చెప్పింది. రెండు, లింగ వివక్ష లేని పరిపాలన అందించాలనే రాజ్యాంగ లక్ష్యాన్ని ప్రభుత్వాలు మరవడమే దీనికి కారణమంది. మూడవది, భారత స్త్రీలు తమపై జరిగిన హింస, వేధింపుల గురించి బయట చెప్పుకోడానికి సిగ్గుపడతారనే వాదనను తొసిపుచ్చింది. పోలీసు స్టేషన్లలో, న్యాయస్థానాల్లో బాధితులను అవమానించడమే దీనికి కారణం తప్ప, భారతీయతకు, స్త్రీత్వానికి సంబంధించిన కారణాలేవీ లేవన్నది. సానుకూల పరిస్థితులు కల్పిస్తే మరింత మంది స్త్రీలు తమకు జరిగిన అన్యాయాన్ని బయట చెప్పుకుంటారంది. నాలుగు, అత్యాచారాలకి స్త్రీలు, బాలికలు మాత్రమే కాదు, బాలురు స్వలింగ సంపర్కులు కూడా గురవుతున్నారని గుర్తించింది. వీరందరికీ న్యాయం జరగాలంటే, ప్రపంచంలో అత్యంత ప్రగతిశీల చట్టాలను అమలు చెయ్యాలని సూచించింది.

అత్యాచార నమోదును పోలీసులు తిరస్కరిస్తే నేరంగా పరిగణించాలని, బాధితులు ఏ పోలీసు స్టేషన్‌లో అయిన నమోదు చేసుకునే అవకాశం ఉండాలని చెప్పింది. అత్యాచార విచారణలో బాధితుల లైంగిక చరిత్ర గురించి, శీలం గురించి ప్రశ్నలు వెయ్యకూడదని ఎప్పటి నుండో మొత్తుకుంటున్న స్త్రీల సంఘాల ప్రతిపాదనను ఒప్పుకుంది. అత్యాచార నిర్ధారణకు ప్రస్తుతం అమలులో ఉన్న 'రెండు వేళ్ల' పరీక్షను తొలగించాలని చెప్పింది. అత్యాచార నిర్వచనాన్ని విస్తృత పరిచింది. కేవలం 'పురుషాంగం యోని లోపలికి వెళ్లడం' మాత్రమే అత్యాచారమనే పితృస్వామ్య నిర్వచనాన్ని కాక, ఒక వ్యక్తికి ఇష్టం లేకుండా ఎటువంటి లైంగిక క్రియను జరిపినా (నోటి ద్వారా, వస్తువు ద్వారా చేతుల ద్వారా) అది అత్యాచారంగా పరిగణింపబడాలి అని సూచించింది.

ఇంతేకాదు, అత్యాచారాల నిరోధానికి ఉరిశిక్షలు పనికిరావనీ, అంతకంటే ముఖ్యంగా ప్రతి నిరుపించబడ్డ అత్యాచారంలో తప్పనిసరిగా శిక్ష పడడమే ముఖ్యమని చెప్పింది. వీటిని నిరోధించడానికి వీధి దీపాలు వెలగడం, ప్రజా రవాణా సౌకర్యాలను మెరుగుపరచడం అవసరమంది. అంతేకాదు, తోపుడుబండ్ల వాళ్లు ఉండడం కూడా అత్యాచార నిరోధానికి ఉపయోగపడతాయంది.

వర్మ కమిటీ సిఫార్సులను భారత పార్లమెంటు మార్చి 19న ప్రవేశ పెట్టిన చట్టంలో చోటు కల్పించింది. భర్తలు భార్యలపై జరిపే అత్యాచారాలను గుర్తించడం వంటి కొన్నిటిని మినహాయించింది. అయితే ఇవి మన సమాజంలో పనిచేయాలంటే కొనసాగుతున్న బ్రాహ్మణీయ పితృస్వామ్య విలువలని ప్రశ్నించి, స్త్రీ–పురుష సమానత్వాన్ని వివిధ రకాల అసమానతల నేపథ్యంలో అర్థం చేయించాల్సిన అవసరం ఉంది.

**ఆధునిక సమాజంలో కొనసాగుతున్న బ్రాహ్మణీయ పితృస్వామ్య విలువలు**

స్త్రీలు ఒద్దికగా ఉండాలి, బయట తిరిగితే చెడిపోతారు; బయట పనిచేసే స్త్రీలు శీలవంతులు కారు అనే బ్రాహ్మణీయ పితృస్వామ్య భావజాలం కొంతమేరకు మారినప్పటికీ, స్త్రీ పురుష సంబంధాల గురించి ఉదారవాద దృక్పథం మన సమాజంలో రాలేదు. అమ్మాయిలకి చదువుకునే స్వేచ్ఛ, ఉద్యోగంలో చేరే స్వేచ్ఛ వచ్చాయి కాని, అవి రెండూ కూడా కుటుంబానికి సేవ చేయడం కోసం, పిల్లలకి చదువు చెప్పడం కొసమే వినియోగించాలి. యూనివర్సిటీల్లో పనిచేసే ప్రొఫెసర్లు కూడా చాలామంది తమ నెల జీతం భర్తల చేతిలో పెట్టవలసిన స్థితిలోనే ఉన్నారు. కుటుంబం కోసం త్యాగాలు చేయని స్త్రీలను 'స్వార్థపరులు దుర్మార్గులు, కుటుంబమంటే ప్రేమలేని వారుగాను' చిత్రీకరించడం చాల మామూలు. ఈ కట్టడులు భరించలేకపోయినా, వాటిని ధిక్కరిస్తే చదువు, ఉద్యోగం కొనసాగించే పరిస్థితులు లేకపోవడం వల్ల ఎంతో కొంత భయం, ఒప్పుకోలు, లొంగుబాటు ధోరణులతో అనేకమంది స్త్రీలు రోజువారి జీవితం గడుపుతున్నారు.

ఈ పరిస్థితులు గ్రామాలకి, కుటుంబాలకి పరిమితం కాలేదు. ఆధునిక అధికార సంబంధాల్లో ఉండే పురుషులు తమ కింద పనిచేసే బాలికలనూ, బాలురనూ, స్త్రీలనూ; హాస్టల్ వార్డెన్లు దళిత పిల్లలనీ; ఫ్యాక్టరీ మేనేజర్ వర్కర్లనీ; డాక్టర్లు నర్సులనీ, వివాహ సంబంధాల్లో

భర్త భార్యనూ, బాయ్‌ఫ్రెండ్ తన గర్ల్‌ఫ్రెండ్‌ను తమ ఆస్తిగానే భావించే సందర్భాలు ఎన్నో. అనేక ఇంజినీరింగ్ కాలేజీల్లో, మెడికల్ కళాశాలల్లో, యూనివర్సిటీల్లో 'తమ, తమ' అమ్మాయిలను, ఆయా కులాలకీ, సమూహాలకి చెందిన అబ్బాయిలు, సంఘాలవారు కూడా కట్టడి చేయడం చాల మామూలు విషయం. ఇవన్నీ కూడా ప్రేమ, ఇష్టం పేరుతో చలామణి అవుతున్నాయి. స్వంత వ్యక్తిత్వంతో స్త్రీలు ఎదగాలంటే ఇటు వంటి ప్రేమను, ఇష్టాన్ని, వాటిని పోషించే సంస్కృతిని ధిక్కరించాల్సిందే.

ఇష్టం, బలవంతం ఇంతగా కలసి ఉన్న మన సంస్కృతిలో బలవంతం చేయడానికీ, అత్యాచారానికీ, వేధింపులకీ, పరస్పర అంగీకారయుత ప్రేమకీ, స్నేహానికీ, శృంగారానికీ, తేడాలు ఉంటాయనేది ప్రస్తుతం చాలామందికి అర్థమవ్వని విషయం. మీడియా చర్చల్లో చాలమంది ప్రతిపాదించినట్లు లైంగికత ప్రకృతికీ, మనుషుల సహజ ప్రవృత్తికీ, లేదా వారి సైకాలజీకీ సంబంధించిన సమస్య కాదు. స్త్రీతత్వమూ, పురుషత్వమూ మధ్య ఉన్న అనేక రకాల జండర్లు కూడా సామాజికంగా రూపొందినవే. స్త్రీల మధ్య, పురుషుల మధ్య, ఇద్దరి మధ్య సంబంధాలు, ఒక రాజకీయ-సామాజిక విషయంగా అర్థం చేసుకున్నప్పుడు, వాటి ప్రాతిపదిక కూడా ఎప్పటికప్పుడు మార్చుకోవాల్సిన విషయంగా చేసుకోవాల్సి వస్తుంది.

సమానత్వం, పరస్పర గౌరవం పర లింగ సంపర్కమయినా, స్వలింగ సంపర్కమయినా, భార్య భార్తలయినా, పెళ్లికి ముందు సంబంధమయినా - శృంగారం లేదా లైంగిక సంబంధం అంటే - అది స్వేచ్ఛగా, స్వచ్ఛందంగా, పరస్పర అంగీకారంతో జరిగినప్పుడు మాత్రమే సరయినవీ, మంచివీ అనే విలువ, అవగాహన సమాజపరంగా రావడానికి మనమేం చేయగలం? ఇది చట్టపరంగా, ప్రభుత్వ పరంగా చేయవలసిన పనుల కంటే ముఖ్యమైనది. సమాజంలో అనేక సంస్థలు తమ బాధ్యతగా చేయవలసింది. విద్యాసంస్థలూ, కుల సంఘాలూ, విద్యార్థి సంఘాలు, స్త్రీల సంఘాలు - దీని గురించి తమ తమ కార్యరంగాల్లో నిర్దిష్టంగా ఏమి చేయాలో ఈ సందర్భంలో చర్చించడం చాలా అవసరం.

ఇటువంటి కట్టుడులను ధిక్కరించడానికి స్త్రీలకూ, పురుషులకూ కూడా సరయినంత సంస్థాగత సహకారం చాల స్థాయిల్లో దొరకట్లేదు. సంస్థాగత చర్యలు లేకుండా ఆధునిక విలువలూ, ఉదారవాద విలువలూ వాటంతట అవే రావు. స్త్రీల సాధికారత అంటే స్త్రీలు (వారికి సహకరించే పురుషులు) అన్ని రకాల అవరోధాలను వ్యక్తిగతంగా ఎదుర్కోవడం కాదు. ప్రభుత్వంతో పాటు అన్ని రకాల సంస్థలు కొన్ని చర్యలు చేపట్టడం అత్యంత అవసరం. కాలేజీలు, మీడియా సంస్థలు, కార్పొరేట్ సంస్థలు, యూనివర్సిటీలు, అన్ని రకాల ప్రైవేటు సంస్థలు, ప్రభుత్వేతర సంస్థలు, ప్రభుత్వం నడిపే స్వచ్ఛంద సంస్థలూ, హోటళ్లూ - అన్ని కూడా జండర్ సమానత్వం కోసం పనిచేయాలి. తమ తమ ఉద్యోగుల్లో స్త్రీ ఉద్యోగుల సంఖ్య తగినంత ఉండేటట్లు చూడాలి. లైంగిక వేధింపుల వ్యతిరేక కమిటీలను పెట్టాలి. జండర్ సమానత్వం పట్ల తమకు నిబద్ధత ఉందని చెప్పుకోవడానికి, సిసి టీవీ కెమెరాల కంటే ఇవి చాల ముఖ్యం.

**వేరు వేరు అసమానతలతో కూడిన జండర్ చర్చ**

అయితే జండర్ గురించిన చర్చ చాలా వరకు స్త్రీ పురుష సంబంధాలపై మాత్రమే సాగకూడదు. గత దశాబ్దంలో, వికలాంగ స్త్రీలు, స్వలింగ సంపర్కులు, ట్రాన్స్-జండర్ వ్యక్తులు, సెక్స్ వర్కర్లు, బాలల హక్కుల సంఘాలు అనేక మంది తమ తమ శరీరాలపై తమ హక్కును ప్రకటించుకుంటూ, తమ హక్కుల ఉల్లంఘనకు పితృస్వామ్యానికి ఉన్న సంబంధాన్ని విశదీకరిస్తూ వస్తున్నారు. జండర్ పట్ల అవగాహనను చాల విస్తృత పరిచారు. స్త్రీలెదుర్కొనే వివక్షతో పాటు ఇతర అసమానతలతో - కులం, వర్ణం, సెక్సువల్ మైనారిటీలు, మతపరమయిన మైనారిటీలు ఎదుర్కునే వివక్షలను - కలిపి చర్చించినపుడే వివిధ అసమానతల మధ్య ఉండే సంబంధాలు అందరికీ అర్థమయ్యే అవకాశాలున్నాయి. సాధారణంగా జండర్‌పై చర్చల్లో మగపిల్లలు పాల్గొనక పోవడానికి కారణం ఆ భావనను కేవలం స్త్రీత్వం-పురుషత్వం అనే రెండింటికి కుదించి చూడడం వల్ల. చర్చ చాలా వరకూ స్త్రీలపైనే - స్త్రీలు ఎక్కడ ఉండాలి, ఏ బట్టలు ధరించాలి, ఏ రకంగా సంస్కృతిని నిలబెట్టాలి వంటి విషయాలపై - జరుగుతోంది. వివిధ రకాల అసమానతల్లో జండర్‌ను కూడా కలిపి చర్చించినపుడు అమ్మాయిలకీ, అబ్బాయిలకీ కూడా జండర్‌పై అవగాహన పెరిగే అవకాశం వుంటుంది. కాలేజీల్లోకి, విశ్వ విద్యలయాల్లోకీ కుల వివక్ష, మతపరమయిన వివక్ష, పేదరికం అనుభవించిన విద్యార్థులు, వివిధ రకాల లైంగిక అస్తిత్వాలతో అనేక మంది ప్రవేశిస్తున్న తరుణంలో, జండర్ అవగాహనని ఈ రకంగా పరిచయం చెయ్యడం చాలా ముఖ్యం.

జండర్ సమానత్వాన్ని సాధించడంలో, స్త్రీలపై వేధింపులు ఆపడంలో ఢిల్లీ అత్యాచార సంఘటన, దాని తరువాత పరిణామాలు మన దేశంలో, సమాజంలో ఈ వ్యవస్థాగత, సంస్థాగత, సాంస్కృతిక మార్పుల అవసరాన్ని మరింత బలంగా ముందుకు తెచ్చాయి. అయితే ఆయా మార్పుల కోసం శతాబ్దాలుగా జరుగుతున్న పోరాటాలలో ఈ పరిణామాలు ఒక మజిలి మాత్రమే!

*(రచయిత సీనియర్ ఫెలో, అన్వేషి)* వీ

**రాబోయే సంచికలలో...**

- **నగదు బదిలీ పథకం - జి. సూరి**
- **డా. కేశవరెడ్డి నవలల్లో రైతు - వలస పాలన - భూస్వామ్యం - ఎస్. జగన్‌రెడ్డి**
- **కులం పుట్టుక - నిర్మూలన - బి. సైదులు**
- **ఆకాశంలో సగం - అయినా అడుగు భూమి లేదు - డా. జి. లచ్చయ్య**
- **వ్యవస్థీకృతమైన అవినీతి - వై. రామచంద్రం**

# కొరియా ద్వీపకల్పంలో రణగర్జనలు

***అమెరికా అవలంబిస్తున్న కవ్వింపు ధోరణులే ఉత్తర కొరియా, దక్షిణ కొరియా దేశాల మధ్య యుద్ధ వాతావరణాన్ని సృష్టిస్తున్నాయని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

**తూ**ర్పు ఆసియాలోని కొరియా ద్వీపకల్పం (ఉత్తర, దక్షిణ కొరియాలు) లో యుద్ధ భయాలు ఆవరించాయి. అమెరికా కూటమి రాజ్యాలైన జపాన్, తైవాన్, దక్షిణ కొరియాల మధ్య ఒంటరిగా జీవిస్తున్న చిన్న దేశం ఉత్తర కొరియా. ఉత్తర కొరియా తాజా అణు పరీక్షలు అమెరికాను తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేశాయి. ఇంతకాలం తనకు ఎదురు లేదంటూ కండకావరంతో విర్రవీగిన ప్రపంచాధినేతను ఉత్తర కొరియా భీతిల్లేలా చేసింది. ఇప్పటికే పశ్చిమాసియా నుండి మధ్య ఆసియా, ఇప్పుడు తూర్పు ఆసియాలో ఉత్తర కొరియా పరిణామాలు అమెరికా తలకి బొప్పి కట్టిస్తున్నాయి.

ఉత్తర కొరియా మూడవసారి 2013 ఫిబ్రవరి 12న చేపట్టిన అణు పరీక్షల కార్యక్రమంపై అమెరికా విరుచుకుపడడంతో కొరియాలో యుద్ధ వాతావరణం తలెత్తింది. ఐక్యరాజ్యసమితి ఆంక్షల పూర్వరంగంలో తమ ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణంతో పాటు అమెరికా అణ్వాయుధ ప్రమాదాన్ని నిలువరించేందుకు అవసరమైన అణ్వాయుధాలను పెంచుకుంటామని ఉత్తర కొరియా నిర్ద్వందంగా ప్రకటించింది. ఉత్తరకొరియా చేస్తున్న యుద్ధ హెచ్చరికలను అమెరికా తీవ్రంగా పరిగణించింది. సైనిక ఒప్పందంలో భాగంగా దక్షిణ కొరియాకు మద్దతుగా అమెరికా తన బలగాలను అప్రమత్తం చేసింది. అందుకు ప్రతిగా ఉత్తర కొరియా దేశాధినేత కిమ్ జొంగ్ ఉన్ దేశంలో 'యుద్ధ అత్యవసర స్థితి'ని ప్రకటించారు. ఉత్తర కొరియా సరిహద్దులోని కీసాంగ్ ఉమ్మడి పారిశ్రామిక ప్రాంతంలో పనిచేసేందుకు వస్తున్న దక్షిణ కొరియా కార్మికుల ప్రవేశాన్ని ఉత్తర కొరియా నిషేధించింది.

కొరియాల మధ్య తగాదాకు ఎంతో చరిత్ర ఉంది. అనేక సహజ వనరులకు నిలయమైన మంచూరియాను స్వాధీనం చేసుకునే యత్నంలో జపాన్ 1945లో దురాక్రమణకు దిగగా, అంతకుముందు పెరల్ హార్బర్ దుర్ఘటనతో హిరోషిమా, నాగసాకీలపైన అమెరికా తొలి అణుబాంబులతో దాడి చేసి లక్షలాది మంది పౌరులను బలిగొన్నది. ఆ సమయంలోనే మంచూరియా, కొరియాలను దురాక్రమించి కూర్చున్న జపాన్‌ను ఎదుర్కోవడానికి సోవియెట్ రెడ్ ఆర్మీ మంచూరియా, కొరియా, సఖాలిన్, కురిల్స్‌లోకి సేనల్ని నడిపించి విముక్తి చేసింది. 1910 నుంచి 1945 దాకా కొరియాను జపాన్ దురాక్రమించి, అధికారం వెలగబెట్టింది. ఇక్కడ అమెరికా, రష్యా, చైనా, జపాన్‌ల ప్రయోజనాలు ఇమిడి ఉన్నాయి. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత జపాన్ ఆధీనం నుంచి బయటికొచ్చిన కొరియా 1945లో అగ్రరాజ్యాల మధ్య ప్రభావిత ప్రాంతాల పంపిణీలో భాగంగా రెండు దేశాలుగా చీలిపోయింది. ఉత్తరభాగంపై సోవియట్ యూనియన్, దక్షిణ భాగంపై అమెరికా పట్టు సాధించాయి. ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో 1948లో ఎన్నికలు జరిగాయి. రెండు దేశాలూ స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకుని అధికారాన్ని చేపట్టాయి. యుద్ధానంతరం జరిగిన ఈ విభజనలో దక్షిణ కొరియాలో అమెరికా పలుకుబడితో దాని తైనాతీగా సింగ్మనరీ ప్రజాస్వామ్య వ్యతిరేక నిరంకుశ పాలనా వ్యవస్థకు అంకురార్పణ చేయగా, ఉత్తర కొరియాలో వర్కర్స్ సోషలిస్టు (కమ్యూనిస్టు) ప్రభుత్వం ఏర్పాటుకు నాటి సోవియట్ సోషలిస్టు కూటమి దోహదం చేసింది.

సరిహద్దు వివాదం కారణంగా 1950లో రెండు దేశాల మధ్య యుద్ధం మొదలైంది. దక్షిణ కొరియాకు ఐక్యరాజ్యసమితితో పాటు, అమెరికా, బ్రిటన్ సాయంగా నిలిచాయి. ఉత్తర కొరియాకు చైనా, రష్యా మద్దతు పలికాయి. ఈ యుద్ధంలో ఆ రెండు దేశాలకు, చైనా, అమెరికాలకు చెందిన ఆరు లక్షల మంది సైనికులు చనిపోయారు. 1953లో యుద్ధ విరమణ ప్రకటించారు. 1991లో ఈ రెండు దేశాల్ని ఐరాస గుర్తించింది. 1970ల నుంచి దక్షిణ కొరియాతో కలిసి అమెరికా సైనిక విన్యాసాలు నిర్వహిస్తోంది. స్వాతంత్ర్యం ప్రకటించుకున్నప్పటి నుంచీ ఉత్తర కొరియాను కిమ్ కుటుంబీకులే పాలిస్తున్నారు. ప్రచ్ఛన్న యుద్ధానంతర కాలంలో రెండు కొరియాల మధ్య సంబంధాలు ఒక మేరకు మెరుగయ్యాయి.

అనేక ఏళ్ళుగా సైనిక పాలనలో మగ్గుతున్న ఉత్తర కొరియాలో పేదరికం తాండవిస్తోంది. ఐక్యరాజ్యసమితి తరచూ విధిస్తున్న ఆంక్షలు ఈ దేశ ఆర్థిక పురోగమ నానికి సంకెళ్లు వేస్తున్నాయి. కొరియా చుట్టూ చెలరేగుతున్న రాజకీయాలకు ప్రధాన కారణం ఆసియాలోనే మూడు పెద్ద రాజ్యాలుగా ఉన్న సోవియట్, జపాన్, చైనాల మధ్య అది ఉండడమే.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం మిత్రమండలి రాజ్యాల (అమెరికన్, పశ్చిమ రాజ్యాలు, సోషలిస్టు రాజ్యాల) మధ్య కుదిరిన ఒప్పందాలు ప్రాతిపదికగా యుద్ధ విరమణ షరతులను పాటించవలసి వచ్చిన ప్రాంతాలలో ఒకటి కొరియా దేశం. కానీ ఆ ఒప్పందాలను ఏదో ఒక మిషపైన ఉల్లంఘిస్తూ వచ్చిన అమెరికా పాలనా వ్యవస్థ విస్తరణవాద రాజకీయంతో దక్షిణ కొరియా కేంద్రంగా దక్షిణాసియా, ఆగ్నేయాసియా రాజ్యాలను, వాటి సహజ వనరులను యథేచ్ఛగా వాడుకోవడానికి, సోషలిస్టు దేశాలపై దురాక్రమణ యుద్ధాలకు కాలుదువ్వడానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంది. ఆయుధ వ్యాపార ప్రయోజనాల కోసం స్థానిక యుద్ధాలను ఎప్పటికప్పుడు రెచ్చగొడుతూనే ఉంది. అగ్రరాజ్యాలు మాత్రం స్వీయరక్షణ పేరిట సంప్రదాయక ఆయుధాలనే కాదు, ఆధునిక,

అత్యాధునిక అణ్వాయుధాలను కొల్లలుగా ఉత్పత్తి చేసుకోవచ్చుగాని, మరే దేశమూ వాటి ఛాయలకు కూడా పోవడానికి సాహసించరాదన్నది అమెరికా దుర్నీతి. ఏ కొరియా ఏకీకరణకూ, స్వాతంత్ర్య ప్రతిపత్తికీ అగ్రరాజ్యాలు హామీ పడ్డాయో ఆ రెండు కొరియాల ఏకీకరణను సాధ్యం కాకుండా అమెరికా పాలకులు ఆది నుంచీ అడ్డుకుంటున్నారు. అమెరికా తన అధీనంలో ఉన్న దక్షిణ కొరియాకు 'అణ్వస్త్ర' గొడుగుపడుతూ ఉత్తర కొరియాను అస్త్రసన్యాసం చేయమని ఒత్తిడి చేస్తూ వచ్చింది. కాని, ఉత్తర కొరియాలోని పాత, కొత్త పాలనాతరం తాటాకు చప్పుళ్లకు జడిసే రకం కాదు. తన శక్తియుక్తులతో అదీ అణ్వస్త్రశక్తిగా ఇటీవల అవతరించింది.

1994 నుంచి నేటి వరకు ఉత్తర కొరియా ప్రపంచంలో ఒక ఉద్రిక్త కేంద్రంగానే ఉంది. ఈ కాలమంతా సుదీర్ఘ చర్చలు, వివాదాలు, ఆంక్షలతో ఉద్రిక్త వాతావరణమే కొనసాగుతోంది. ఉత్తర కొరియాకు ఆంక్షలు, బెదిరింపులు కొత్తకాదు. బహుశా ప్రపంచంలో అమెరికా చేత అతి సుదీర్ఘకాలం ఆంక్షలకు గురైన దేశాలలో మొదటిది. ఆ తర్వాతే క్యూబా ఉంటుంది. ఆంక్షల మధ్య పుట్టి, ఆంక్షల మధ్య పెరిగి, వాటి మధ్యే మరణించిన ఒక తరం ప్రజలు ఉత్తర కొరియాలో తప్ప వేరే దేశంలో లేరు. చివరికి 2006 అక్టోబర్ 9న ఉత్తర కొరియా అణ్వస్త్ర పరీక్ష జరిపింది. ఇది బయటకు చూడడానికి ఒక్క అమెరికా సామ్రాజ్యవాదం మీదనే తిరుగుబాటు కావచ్చు. కాని ఐక్యరాజ్య సమితి భద్రతా మండలిలోని ఐదు శాశ్వత సభ్యత్వం (వీటో అధికారం గల) కలిగి ఉన్న దేశాల మీద చేసిన ధిక్కారమే! అంతే కాకుండా అగ్రరాజ్యాల ఆధిపత్య విధానాలను ఎదిరించడమే! అణ్వస్త్రాలున్నాయనే అహంకారంతో అమెరికా నాయకత్వంలోని సామ్రాజ్యవాద సంకీర్ణ కూటమి తమ మాట వినని, సహజ వనరుల దోపిడీకి సహకరించని స్వతంత్ర దేశాలపై విచ్చలవిడిగా సైనిక చర్యలకు పూనుకుంటోంది. కుంటి సాకులతో దేశాధినేతలను (అలెండీ, సద్దాం హుస్సేన్, కల్నల్ గడాఫీ) హతమార్చి తన తొత్తు పాలకులను ఏర్పాటు చేసుకుంటున్న నేపథ్యంలో ఉత్తర కొరియా నిజంగానే అణ్వస్త్ర తయారీకి దిగి ఘన విజయాన్ని సాధించింది.

కొరియా ప్రజలు స్వాతంత్ర్య ప్రియులు, దేశభక్తులు, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట యోధులు. లక్షలాది మంది 1950 ఉద్యమంలో స్వాతంత్ర్యానికై ప్రాణాలిచ్చారు. నేటికీ అదే వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు. విద్యార్థి దశ నుంచే సైనిక శిక్షణ ఉంటుంది. యుద్ధ కాలంలో క్షణాల మీద లక్షలాది సైన్యం తయారవుతుంది. సాధారణ సమయాల్లో వ్యవసాయపు పనులు చేసుకుంటారు. సోవియట్ రష్యా పతనం, చైనాలో మారిన పరిస్థితులు ఉత్తర కొరియాకు ఇబ్బందిగా మారాయి. అంతర్జాతీయ సహకారం ఏమాత్రం లేదు. చైనా, రష్యాలు అమెరికాతో కలిసి ఐరాసలో ఆంక్షల తీర్మానాన్ని విధించాయి. అయినా అమెరికా, రష్యా, చైనా మధ్య పోటీ ఉంది. అంతర్జాతీయంగా ఆర్థిక, రాజకీయ ఆధిపత్యం విషయంలో ఘర్షణ ఉంది. వీరి మధ్య పరిష్కరింప వీలు కాని వైరుధ్యాలు ఉన్నాయి. అందుకే రష్యా, చైనాలు మెలకువగా పావులు కదుపుతున్నాయి. దీనిని బట్టి ప్రచ్ఛన్న యుద్ధకాలం నాటి ప్రాధాన్యాలు మారాయని అర్థమవుతుంది. గత కాలపు చారిత్రక, సాంస్కృతిక, రాజకీయ, వ్యూహాత్మక మైత్రీ బంధం ఇక ముందు కొనసాగే అవకాశం సన్నగిల్లింది. అందువల్లనే ఒక అంచనాకు వచ్చి ఉత్తర కొరియా తన స్వీయ రక్షణ కోసం స్వంత కాళ్ల మీద అధారపడాలన్న ధృఢమైన అభిప్రాయానికి వచ్చి ఉంటుంది. ఈ పూర్వరంగంలో అణుబాంబును తయారు చేసే లక్ష్యానికి వచ్చి ఉంటుంది.

నిజానికి ప్రచ్ఛన్న యుద్ధకాలంలో రూపొందించిన వివక్షాపూరితమైన అణువ్యాప్తి నిరోధక ఒప్పందం (ఎన్‌పిటి) మీద సంతకం చేయడానికి ఆనాడే ఉత్తర కొరియా వ్యతిరేకించింది. అయితే మిత్ర దేశమైన సోవియట్ యూనియన్ ఇచ్చిన రెండు హామీలతో ఎన్‌పిటిపై సంతకం చేసింది. మొదటిది, ఎన్‌పిటి ప్రకారం అణు ఇంధనం తయారీ కోసం ఆటంకాలు రాకుండా అవకాశాలు కల్పిస్తామని. రెండవది, ఒకవేళ అమెరికా దక్షిణ కొరియాకి అణుబాంబులు తరలిస్తే తాము ఉత్తర కొరియాకి తరలిస్తానన్నది. ఈ రెండు హామీలతో ఎన్‌పిటిపై సంతకం చేసిన ఉత్తర కొరియా భంగపడింది. ప్రచ్ఛన్న యుద్ధకాలంలో చైనా, రష్యాల నుండి లభించిన హామీలు మృగ్యమయ్యాయి. ఈ నూతన చారిత్రక దశను ఉత్తర కొరియా దీర్ఘ దృష్టితో అంచనా వేసింది. కనుకనే ప్రచ్ఛన్న యుద్ధానంతరం నుంచే అణు రియాక్టర్ల కోసం ప్రయత్నాలు ప్రారంభించింది.

ప్రపంచ ఆర్థిక సంక్షోభంతో ఆర్థికంగా బలహీనపడిన అమెరికాకు, యూరోపియన్ యూనియన్ పెట్టుబడి సహకారంతో దూసుకుపోతున్న చైనాకు మధ్య ప్రపంచ మార్కెట్‌లో తీవ్ర పోటీ నెలకొని ఉంది. అత్యాధునిక శాస్త్ర సాంకేతిక, యుద్ధ, అంతరిక్ష పరికరాల తయారీలో వినియోగించే అరుదైన భూలోహాలను ఉత్తర కొరియాలో అత్యంత చౌకగా ఉత్పత్తి చేసి అమ్మడంలో చైనా ప్రపంచ మార్కెట్‌లో అగ్రస్థానంలో ఉంది. దానికి తోడు దక్షిణ చైనా సముద్రంలోని అపార సముద్ర ఖనిజ సంపద కోసం చైనా దూకుడుగా ముందుకుపోవడమే కాకుండా ప్రపంచంలోని కీలక సముద్ర మార్గాలు, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలలోని సహజ సంపదలను, మార్కెట్లను క్రమంగా సొంతం చేసుకుంటోంది. చైనా దూకుడును నిలువరించేందుకు ఇరాన్, సిరియా, ఉత్తర కొరియా అంతర్గత విషయాలలో అమెరికా జోక్యం చేసుకుంటోంది.

ఉత్తర కొరియా, అమెరికా దేశాల మధ్య తలెత్తిన జగడం కొత్తదికాక పోవచ్చు. అంతర్జాతీయ ఆర్థిక ఆంక్షలు, అణ్వస్త్ర హెచ్చరికలు, మధ్యవర్తిత్వాలు, తాత్కాలిక ఒడంబడికలు సాధారణమే కావచ్చు. అయితే గత కొద్ది సంవత్సరాలుగా కొరియా ద్వీప కల్పాన్ని అణ్వాయుధ రహితంగా ఉంచేందుకు, ఉభయ కొరియాల విలీన ప్రక్రియ ప్రారంభమయింది. చైనా, రష్యా, అమెరికాతో సహా ఆరు దేశాలు సంప్రదింపులు జరపడంతో ఉత్తర కొరియా తన కార్యక్రమాన్ని నిలిపేస్తున్నట్లు 2005లో ప్రకటించింది. అందులో భాగంగా ఉత్తర కొరియా అణ్వస్త్ర వ్యాప్తి నిరోధక ఒప్పందం (ఎన్‌పిటి)పై కూడా సంతకాలు చేసింది. 2005లో ఉత్తర కొరియా తన అణు కార్యక్రమాన్ని నిలిపి వేయడమే కాక, కొన్ని షరతుల మేరకు 2008లో అణు రియాక్టర్ కూలింగ్ టవర్‌ను అంతర్జాతీయ మీడియా సమక్షంలో కూల్చివేసింది. అందుకు పరిహారంగా 40 కోట్ల డాలర్లను అమెరికా అందజేసేందుకు అంగీకరించింది. అణు కార్యక్రమాన్ని నిలిపివేసినా ఉగ్రవాద దేశాల జాబితానుంచి ఉత్తర కొరియాను తొలగించక పోగా ఒప్పుకున్న

షరతులను సైతం అమెరికా పరిపూర్తి చేయలేదు. 2008 డిసెంబర్‌లో ఆరు దేశాల చర్చలు విఫలమయ్యాయని ఉత్తర కొరియా ప్రకటించింది. తరువాత ఐక్యరాజ్యసమితి ఉత్తర కొరియాపై ఆంక్షలు విధించడం, వాటిని ఖాతరు చేయని ఉత్తర కొరియా అమెరికా వ్యవహార శైలిని నిరసిస్తూ డిసెంబర్ 2012లో రాకెట్ ప్రయోగాన్ని, ఫిబ్రవరి 2013లో అణు పరీక్షలను తిరిగి ప్రారంభించింది. దక్షిణ కొరియా నౌక ఒకటి అనుమానాస్పద పరిస్థితుల్లో మునిగిపోతే దానిని ఉత్తర కొరియా ముంచివేసిందని ఒక తప్పుడు ఆరోపణ చేశారు. దానికి అమెరికన్లు వంతపాడారు.

ఉత్తర కొరియా దాడులు జరిపే ప్రమాదముందంటూ హిందూ మహాసముద్రం, పసిఫిక్ మహాసముద్రం, దక్షిణ చైనా సముద్రాలలో కేంద్రీకృతమైన ప్రాంతీయ భౌగోళిక రాజకీయ స్పర్థల నేపథ్యంలో చైనాకు వ్యతిరేకంగా దక్షిణ కొరియా, జపాన్ దేశాలకు రక్షణ కల్పించే సాకుతో అమెరికా తన నౌకా దళాలను ఆ ప్రాంతానికి తరలించింది. అలాస్కా నుంచి కాలిఫోర్నియా వరకూ తన మిత్ర దేశాల రక్షణకు క్షిపణి నిరోధక వ్యవస్థలను 30 నుంచి 44కు పెంచనున్నట్లు ప్రకటించింది. కొరియా ద్వీప కల్ప ప్రాంతానికి విమాన వాహక నౌక జార్జివాషింగ్టన్‌లో సహా సప్తమ నౌకా దళం, జపనీస్ ఎఫ్-22 విమానాలు, అమెరికన్ మెరైన్ దళాలు రానున్నాయని దక్షిణ కొరియా ప్రకటించింది. అమెరికా తన భూభాగం నుంచి అణ్వస్త్రాలను ప్రయోగించే సామర్థ్యంగల బి2 బాంబర్లతో దక్షిణ కొరియా భూభాగంపై బాంబుల ప్రయోగ విన్యాసాలు జరిపింది. అమెరికా - దక్షిణ కొరియాలు 'ఈగల్ ఫోల్' పేరుతో వార్షిక ఉమ్మడి యుద్ధ విన్యాసాలను నిర్వహించాయి. ఈ యుద్ధ విన్యాసాలు, భద్రతా మండలి ఆంక్షల నేపథ్యంలో అంతర్జాతీయంగా కమ్యూనికేషన్ హాట్ లైన్ వ్యవస్థను ఉత్తర కొరియా నిలిపివేసింది. దక్షిణ కొరియా, అమెరికా సంయుక్త సైనిక విన్యాసాలకు నిరసనగానే ఉత్తర కొరియా 2009లోనే కీసాంగ్‌ను మూసివేసింది. దక్షిణ కొరియాతో 1953లో చేసుకున్న తాత్కాలిక యుద్ధ విరమణ ఒప్పందాన్ని రద్దు చేసుకున్నట్లు ప్రకటించింది.

అమెరికా అండతో దక్షిణ కొరియా, చైనా ప్రోద్బలంతో ఉత్తర కొరియా పరస్పరం యుద్ధానికి కాలు దువ్వుతున్నాయి. సరిహద్దులో దక్షిణ కొరియాతో కలిసి అమెరికా ఎప్పటిలాగానే ఈ ఏడాది కూడా సంయుక్త సైనిక విన్యాసాలకు దిగడం తాజా అగ్నికి ఆజ్యం పోసింది. తమ దేశంపై ఆకస్మిక దాడి కోసమే ఈ సైనిక విన్యాసాలు చేస్తున్నారని భావించిన ఉత్తర కొరియా అమెరికా, దక్షిణ కొరియాలకు అణుయుద్ధం హెచ్చరికలు చేసింది. పసిఫిక్ ప్రాంతంలోని హవాయి, గ్వామ్‌లోని అమెరికా స్థావరాలపై తమ సైన్యం దాడులు చేయడానికి వెనుకాడబోదని కిమ్ జొంగ్ ఉన్ స్పష్టం చేశాడు. ఈ సందర్భంలో ఇరు దేశాలు బాధ్యతాయుతంగా వ్యవహరించాలని రష్యా, ఫ్రాన్స్, చైనా దేశాధినేతలు కోరారు. కొరియా ద్వీపకల్ప సంక్షోభం అదుపు తప్పుతోందని ఐక్యరాజ్యసమితి సెక్రెటరీ జనరల్ బాన్‌కీ మూన్ ఆందోళన వ్యక్తం చేశారు. తమ అణ్వాయుధ కార్యక్రమానికి అవసరమైన ఇంధనాన్ని అందించేందుకు గతంలో మూసివేసిన యాంగ్ బ్యాన్ అణు కర్మాగారాన్ని తిరిగి తెరవనున్నట్లు ఉత్తర కొరియా ప్రకటించిన నేపథ్యంలో బాన్‌కీ మూన్ వ్యాఖ్యలు ప్రాధాన్యం సంతరించుకున్నాయి.

2012లో ఉత్తర కొరియా వాతావరణ మార్పులను అధ్యయనం చేసేందుకు ఉద్దేశించిన ఒక విఫల రాకెట్ ప్రయోగం జరిపింది. అయితే అమెరికన్లు దానిని ఖండాంతర దాడులు జరిపేందుకు పరీక్షించిన క్షిపణి ప్రయోగంగా వర్ణించి మరోసారి ఉత్తర కొరియాపై కాలుదువ్వారు. అయితే ఉత్తర కొరియా తిరిగి ఐదు నెలల్లోనే మరో రాకెట్ ప్రయోగం జయప్రదంగా జరిపింది. దాంతో ఐరాస ఆంక్షలను మరింత కఠినతరం గావించింది. ఆ తరువాత ఈ ఏడాది ఫిబ్రవరిలో ఉత్తర కొరియా మరోసారి అణు పరీక్ష జరిపింది. సిరియా, ఇరాన్‌లపై దాడి చేసి తమ స్వాధీనంలోకి తెచ్చుకోవాలన్న అమెరికా ప్రయత్నాలకు చైనా అడ్డుగా ఉన్న విషయం తెలిసినదే. ఆ కడుపు మంటతో అమెరికన్లు ఉత్తర కొరియాను అడ్డు పెట్టుకొని చైనాపై ఒత్తిడి, బ్లాక్‌మెయిలింగ్‌కు పాల్పడుతున్నారు. చైనాకు కూతవేటు దూరంలో ఉన్న సెనెకాకు దీవులు తమవని జపాన్ కబ్జా పెట్టుకోవడం వాటిలో ఒకటి. అమెరికన్లు ఎంతగా రెచ్చగొడుతున్నప్పటికీ ఉత్తర కొరియా ఎంతో సంయమనం పాటిస్తోంది. అమెరికా తన భూభాగం నుంచి బి2 బాంబర్లను తక్కువ ఎత్తులో ప్రయోగించి దక్షిణ కొరియా భూభాగంపై బాంబుల ప్రయోగవిన్యాసాలు చేయడమంటే ఉత్తర కొరియాను కవ్వించడమే కాదు, బహిరంగ సవాలు విసరడమే. ఆ బాంబర్లు ఎనిమిది వేల కిలోమీటర్ల దూరం ప్రయాణించి అణ్వాయుధాలతో సహా అనేక మారణాయుధాలను ప్రయోగించ గలిగినవి. ఇదే బాంబరు 1999లో యుగోస్లావియా రాజధాని బెల్‌గ్రేడ్‌లోని చైనా రాయబార కార్యాలయంపై దాడి చేసింది. అయితే దానిని ఆనాడు అమెరికా ప్రమాదంగా వర్ణించింది. దానిని ఎవరూ నమ్మలేదు. నిజానికి ఆనాడు అదొక ప్రయోగం. దాడిగానే అనేక మంది నిపుణులు పరిగణించారు.

ఉత్తర కొరియా నుంచి నిజంగా అమెరికాకు ప్రమాదం ఉందా? ఉత్తర కొరియా అణుపరీక్షలు జరపవచ్చు, కొన్ని రాకెట్లను ప్రయోగించ వచ్చు తప్ప వాటితో వేలాది కిలోమీటర్ల దూరంలో ఉన్న అమెరికాపై దాడి చేసేంతటి పరిజ్ఞానం అది సంపాదించాలంటే ఇంకా కొన్ని సంవత్సరాలు పడుతుందన్నది బహిరంగ రహస్యం. ఇరాక్‌లో సద్దాం హుస్సేన్ మానవాళిని అనేకమార్లు హతమార్చగల మారణాయుధాలను గుట్టలుగా పోసుకుని కూర్చున్నాడని ఇరాక్‌పై దాడి సందర్భంగా అమెరికా ప్రపంచాన్ని ఊదరగొట్టింది. అది వాస్తవం కాదని ఇరాక్‌ను ఆక్రమించు కునేందుకే అలాంటి తప్పుడు ప్రచారం చేసినట్లు తరువాత ప్రపంచానికి తేటతెల్లమైంది. ఇరాన్‌పై కూడా అలాంటి ప్రచారమే చేస్తోంది. తాము లొంగదీసుకోవాలనుకున్న దేశంపై గోబెల్స్ తరహాలో తప్పుడు ప్రచారం చేసి దెబ్బతీయడం అమెరికన్ల నైజం. ఉత్తర కొరియా ద్వీపకల్పంలో యుద్ధ వాతావరణం సృష్టించిన అమెరికన్లు ఉత్తర కొరియాపై ఆరోపణలు వేస్తూ రెచ్చగొడుతున్నారు. మరోవైపున ఉత్తర కొరియా ప్రకటనల ద్వారా ప్రత్యుత్తరమిస్తున్నది తప్ప సైనికంగా ఎలాంటి మోహరింపులు చేయడం లేదని వాషింగ్టన్ పోస్టు పత్రిక విశ్లేషకుడు ఒకరు రాయడం గమనార్హం.

దక్షిణ కొరియాతో కలిసి తాము కేవలం సైనిక విన్యాసాలు జరిపామే తప్ప ఉత్తర కొరియాను కవ్వించాలన్న ఉద్దేశం తమకు లేదన్న అమెరికా వాదనను కిమ్ జొంగ్ ఉన్ ప్రభుత్వం నమ్మడం లేదు. 'అమెరికా, దక్షిణ కొరియాలు జరిపినవి కేవలం యుద్ధ విన్యాసాలు కాదు, మమ్మల్ని బెదిరించడానికి, మా అణు కార్యక్రమాన్ని నిలిపివేసేలా చేయడానికి

ఉద్దేశించినవే' అన్న ఉత్తర కొరియా అధినేత వాదననూ కొట్టివేయడానికి వీల్లేదు. ఆ భయంతోనే బిలియన్ల కొద్దీ డాలర్లను ఇచ్చినా తమ అణు కార్యక్రమాన్ని వీడేది లేదని, రక్షణపరంగా అణ్వాయుధాలే తమకు సర్వస్వమన్న ప్రకటనను కిమ్‌జోంగ్ చేయాల్సి వచ్చింది. కిమ్ ప్రకటనల తీవ్రత అంతరార్థాన్ని పరిశీలిస్తే యుద్ధం చేయాలన్న ఆలోచన కంటే కూడా పశ్చిమ దేశాలు తమను గుర్తించాలన్న ఆరాటమే కనిపిస్తోంది. పశ్చిమ దేశాలు తమకు దౌత్యపరమైన గుర్తింపునివ్వాలని, దక్షిణ కొరియాతో సమానంగా హోదాను కల్పించాలన్న తన డిమాండ్‌ను సాధించుకోవడానికే కిమ్ జోంగ్ 'యుద్ధ'తంత్రానికి పదును పెడుతున్నారన్న వాదనా వినిపిస్తోంది.

ప్రస్తుతం ఉత్తర కొరియా తీరం వెంబడి వేలాది మంది అమెరికన్ సైనికులు, నావికా, వైమానిక దళాలను మోహరిస్తూ యుద్ధ క్రీడకు అమెరికా సన్నద్ధమవుతుంటే, మరోవైపు ఈ దూకుడుకు వ్యతిరేకంగా అనేక మంది అమెరికన్లు రోడ్డెక్కుతున్నారు. లాస్‌ఏంజెల్స్‌కు చెందిన ఇంటర్నేషనల్ యాక్షన్ సెంటర్ అనే సంస్థ ఆధ్వర్యంలో ఇక్కడి కొరియా వలస కార్మికుల సంఘం మిన్‌జోక్‌టాంగ్‌షిన్, ఇతర కొరియా సంఘీభావ సంఘాల సభ్యులు ఇటీవల లాస్‌ఏంజెల్స్‌లో సైనిక నియామక కేంద్రం ముందు భారీ నిరసన ప్రదర్శన నిర్వహించారు. కొరియా ద్వీపకల్పంలో శాంతిని కాపాడండి, ఉత్తర కొరియాతో శాంతి అవగాహన కుదుర్చుకోండి అంటూ వారు ఒబామా సర్కారును డిమాండ్ చేశారు.

అయితే ఉత్తర కొరియాలోని సోషలిస్టు ప్రభుత్వాన్ని కూల్చివేయాలని మొదటి నుండి పట్టు వీడకుండా అమెరికా కుట్రలు కుతంత్రాలు సాగిస్తూనే ఉంది. అమెరికా కుట్రలను ఎప్పటికప్పుడు ఉత్తర కొరియా తిప్పికొడుతూ వస్తోంది. ఉత్తర కొరియాతో శాంతి ఒప్పందాన్ని కుదుర్చుకోవడానికి అటు రిపబ్లికన్లు, ఇటు డెమొక్రాట్‌ల నేతృత్వంలోని ప్రభుత్వాలు వ్యతిరేకత వ్యక్తం చేస్తున్నాయి. ప్రస్తుతం అక్కడ నిరాయుధీకరణ ఒప్పందం అమలులో వుంది. అమెరికా ఇదే వైఖరిని కొనసాగిస్తే తాము నిరాయుధీకరణ ఒప్పందాన్ని గుర్తించబోమని, తమ భూభాగాన్ని ఆక్రమించుకోవాలని చూస్తే అమెరికా, దాని కీలుబొమ్మలకు తగిన బుద్ధి చెబుతామని ఒబామా సర్కారును హెచ్చరించింది.

ఈ సమయంలోనే ఉత్తర కొరియా స్వీయ రక్షణార్థం అణ్వస్త్ర శక్తిగా రూపొందకుండా చూడడం కోసం బీజింగ్ సహా అనేక చోట్ల అమెరికా - చైనాల సమక్షంలో ఇంతకు ముందు ఉత్తర కొరియా ప్రతినిధులతో విస్తృతంగా సంప్రదింపులు జరిగాయి. కానీ అమెరికా యుద్ధ బెదిరింపులకు ప్యాంగ్యాంగ్ పాలకులు లొంగలేదు. క్షిపణులను అప్రమత్తంగా ఉంచుకుంది. తనకుతానై కవ్వించదు, కవ్విస్తే మాత్రం ఆ సంగతి వేరు!

యుద్ధ హెచ్చరికలతో కాలు దువ్విన ఉత్తర కొరియా ఆ మేరకు సన్నాహాల్లో నిమగ్నమైనట్టు అమెరికా, దక్షిణ కొరియా నిఘా వర్గాలు అనుమాని స్తున్నాయి. దక్షిణ కొరియా, జపాన్ దేశాల్లో లక్ష్యాలను ఛేదించగల మధ్యశ్రేణి క్షిపణులను ఉత్తర కొరియా తన తూర్పుతీరానికి తరలిస్తున్నట్టు వార్తలు అందుతున్నాయి. ఈ నేపథ్యంలో ఉత్తర కొరియా కదలికలను నిశితంగా పరిశీలిస్తున్నామని అమెరికా పేర్కొంది. ఉత్తర కొరియా హెచ్చరికల దరిమిలా గ్వామ్‌లోని సైనిక స్థావరంలో బాలిస్టిక్ క్షిపణి రక్షణ వ్యవస్థను సిద్ధం చేస్తామని అమెరికా ప్రకటించింది. అంతేకాకుండా, ఉత్తర కొరియా ప్రయోగించే క్షిపణులపై నిఘా ఉంచేందుకు సముద్ర గర్భంలో ఎస్‌బిఎక్స్ రాడార్ వ్యవస్థను తాము ఏర్పాటు చేసినట్లు అమెరికా నౌకాదళ అధికారులు తెలిపారు. మరోవైపు ఉత్తర కొరియా ప్రకటనల, చర్యల వల్ల దక్షిణ కొరియా, జపాన్‌లతో పాటు ఆ ప్రాంతంలో అమెరికా ప్రయోజనాలకు ప్రమాదం వాటిల్లినట్టేనని అమెరికా రక్షణ మంత్రి హెగెల్ పేర్కొన్నారు. కొరియా ద్వీపకల్పంలో ప్రస్తుత పరిస్థితులను చక్కదిద్దేందుకు చైనాతో కలిసి పని చేస్తామన్నారు.

ఉగ్రవాదులున్నారని 2001లో అఫ్ఘానిస్థాన్‌లోనూ, సామూహిక జనహనన అస్త్రాలున్నాయని 2003లో ఇరాక్‌లోనూ, ప్రజాస్వామ్య పరిరక్షణ పేరుతో 2012లో లిబియాలోనూ అమెరికా సైనిక చర్యలకు దిగింది. అదే తీరులో రెండున్నర కోట్ల జనాభాతో ఆర్థికంగా అత్యంత బలహీనమైన ఉత్తర కొరియాపై నేడు అంతర్జాతీయంగా ఒత్తిడి తెస్తోంది. ప్రస్తుత ఉద్రిక్తతలు ఇలాగే కొనసాగితే.. సంప్రదాయ యుద్ధానికి దారి తీయొచ్చు. అమెరికా-దక్షిణ కొరియా కంబైన్డ్ ఫోర్సెస్ కమాండ్ (సిఎఫ్‌సి) ముందు ఉత్తర కొరియా సైనిక శక్తి నిలువలేకపోవచ్చు. సిఎఫ్‌సి బలగాలు ప్యాంగ్‌యాంగ్‌వైపు చొచ్చుకుపోవచ్చు. అయితే నాటి సోవియట్ రష్యా తరహా 'సోషలిస్టు' రాజ్య అవశేషంగా మిగిలిన కిమ్ ప్రభుత్వానికి అమెరికా, చైనా భౌగోళిక ఆధిపత్యాన్ని ఎదుర్కోగల శక్తి లేదు. ఆరు దశాబ్దాల నాటి కొరియా యుద్ధంలో అమెరికా అగ్రరాజ్యానికి బుద్ధిచెప్పిన ఉత్తర కొరియా ప్రజలు ప్రస్తుతం అన్నిరకాల ఆధిపత్యాలను ప్రతిఘటిస్తేనే తమ దేశ సార్వభౌమత్వాన్ని కాపాడుకోవడం సాధ్యం. గతంలో ఉత్తర కొరియాకు చైనా, రష్యాల అండదండలు లభించాయి. ఇప్పుడు నూతన దశ ఏర్పడింది. దక్షిణ కొరియాలో రాకెట్ లాంచర్స్ చైనా వైపు గురిపెట్టబడి ఉన్నాయి. చైనా భయపడుతుంది. అదే సమయంలో ఉత్తర కొరియా అణుపరీక్షలు నిర్వహించడం చైనాకు ఇష్టం లేదు. ఈ సంక్లిష్ట పరిస్థితుల్లో రష్యా, చైనాల పట్ల భ్రమలొదిలి ఉత్తర కొరియాకు అండగా ఉండాల్సిన బాధ్యత పీడిత ప్రపంచం మీద ఉంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

*ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం, సమాచారం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు రాయడం గానీ, ఫోన్ చేసి చెప్పడం గానీ చేయాలి. అలాగే, బ్యాంక్ అకౌంట్‌లోకి నగదు బదిలీ చేసినప్పుడు అది ఎందుకో వివరాలు వీక్షణం కార్యాలయానికి ఫోను ద్వారా గాని, కార్డు ద్వారా గాని తెలపాలి. - సం.*

# పిల్లల అనారోగ్యానికి అద్దం పట్టిన కాగ్

*దేశంలో పెరుగుతున్న పిల్లల మరణాలను నిరోధించడానికి పరిజ్ఞానం, నిధులు ఉన్నా, వాటిని ఉపయోగించకుండా, చేసిన ఖర్చులో అవినీతి పెరిగిపోయిందని వెల్లడించిన కాగ్ నివేదికను విశ్లేషిస్తున్నారు* **డా. నళిని**

ఇటీవల విడుదలైన 2012-13 కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) నివేదిక ప్రకారం మన పిల్లల స్థితి చాలా దయనీయంగా ఉందని అర్థమవుతోంది. ఈ 22వ కాగ్ నివేదిక మన 'సమగ్ర శిశు అభివృద్ధి పథకం' (ఐసిడిఎస్) లోపాల్ని ఎత్తి చూపింది. మరోసారి పిల్లల పోషకాహార లోపం ఎజెండా మీదకి వచ్చింది.

కాగ్ నివేదిక ప్రకారం, 2006-07లో ఐసిడిఎస్‌లో ఇచ్చే అదనపు ఆహారం వల్ల లబ్ధిపొందిన వారు 7.06 కోట్లు అయితే, 2011-12కి వారి సంఖ్య 9.72 కోట్లకి పెరిగింది. అలానే, ఇంకా స్కూళ్లో చేరని ప్రీ స్కూలు పిల్లలు (ఆరేళ్ల లోపు వారు) 2006-07లో ఐసిడిఎస్ వల్ల 3.01 కోట్ల మంది లబ్ధిపొందితే, వారు 2011-12లో 3.58 కోట్లకి పెరిగారు. కానీ వారికి అందించే సేవలు సక్రమంగా లేవని కాగ్ నివేదిక నిర్ధారించింది. దీనికి కారణాలు అన్వేషించే ముందు అసలు కాగ్ నివేదికలో ఏముందో చూద్దాం.

ఇప్పటి నివేదికలో నిర్ధారణలకు రావడానికి ముందు కాగ్ పదమూడు రాష్ట్రాలలోని 67 జిల్లాల్లో ఉన్న 2730 అంగన్‌వాడి సెంటర్లని పరిశోధించింది. అందులో మన రాష్ట్రం కూడా ఉంది. పోషకాహార లోపం గల పిల్లల సంఖ్యని పేర్కొంటూ, ఐసిడిఎస్ పథకం వైఫల్యాలను కూడా కాగ్ నివేదిక వెల్లడించింది.

ఈ పథకం లబ్ధిదారుల్లో పోషకాహార లోపం గల పిల్లల సంఖ్య పది రాష్ట్రాల్లో 42 శాతం మించి ఉంది. బీహార్‌లో 82 శాతం మందికి ఆహార లోపం ఉంటే, వారిలో 26 శాతానికి తీవ్రమైన పోషకాహార లోపం (సివియర్ ఎక్యూట్ మాల్ న్యూట్రిషన్ – శామ్) ఉంది. ఒడిశా, ఢిల్లీ, దమన్ దియుల్లో అది 50 శాతం, మన రాష్ట్రంలో 49 శాతం, హర్యానా, రాజస్థాన్‌లలో 43 శాతం, ఉత్తర్‌ప్రదేశ్‌లో 41 శాతం, జార్ఖండ్‌లో 40 శాతం మంది పిల్లలు పోషకాహార లోపానికి గురవుతున్నారు. తీవ్రమైన లోపం (శామ్) గుజరాత్‌లో 5 శాతం, పశ్చిమ బెంగాల్లో 4 శాతం, కర్నాటక, మహారాష్ట్రల్లో 3 శాతం ఉంది. ఈశాన్య రాష్ట్రాల్లో ఈ లోపం తగ్గుతోందనడం ఆశాజనకమైన విషయం.

ఏ దేశంలోనైనా ఆరోగ్య పరిస్థితిని అంచనా వేయడానికి కొన్ని సూచికలను ప్రమాణంగా తీసుకుంటాం. మన దేశం తాను నిర్దేశించుకున్న లక్ష్యాలకు బహుదూరంలో ఉందని కాగ్ నివేదికలో వెల్లడయింది. ఉదాహరణకి ఐదు సంవత్సరాల లోపు వయసు గల శిశు మరణాల సంఖ్య (ఐఎంఆర్) 2010లో వెయ్యి పుట్టుకలకు 48 మరణాలుగా ఉంది. (మన లక్ష్యం 30). నాలుగేళ్ల లోపు వయసు గల బాలల మరణాల సంఖ్య (సిఎంఆర్) 2010లో వెయ్యి పుట్టుకలకి 63 మరణాలుగా ఉంది (మన లక్ష్యం 31). మన పొరుగు దేశాలతో పోలిస్తే మనం ఎంత దిగజారుడుగా ఉన్నామో అర్థమవుతుంది.

| దేశం | ఐఎంఆర్ | సిఎంఆర్ |
|---|---|---|
| భారతదేశం | 48 | 63 |
| చైనా | 16 | 18 |
| శ్రీలంక | 14 | 17 |
| అభివృద్ధి చెందిన దేశాలు | 5 | 6 |

మన దేశంలో పోషకాహార లోప మహమ్మారి ఎన్నో రకాలుగా పిల్లల్ని దెబ్బతీస్తోంది. అందుకే దీన్ని 'నిశ్శబ్దంగా దాడి చేసే అత్యవసర పరిస్థితి' (సైలెంట్ ఎమర్జెన్సీ) గా వర్ణిస్తారు. పై లెక్కలే దీనికి తార్కాణం. చేతులు కాళ్లు పుల్లల్లా వేలాడుతూ, పొట్ట ఉబ్బిన 'మరాస్‌మస్' పిల్లలు గాని, మరణాలకి కారణమయే 'క్యాషియార్కర్' సోకిన ఉబ్బిన పిల్లలు గాని ఈ మహమ్మారి కొసలు మాత్రమే. అట్టడుగున, ఎత్తు పెరగని, బరువు పెరగని పిల్లలు, ఎండిపోతున్న పిల్లలు మరెంతో మంది ఉన్నారు. ఆ దాడి నిరంతరం నిశ్శబ్దంగా కొనసాగుతూనే ఉంది. ప్రపంచంలో ఉన్న ప్రతి ఐదు మంది పిల్లల్లో మన దేశంలో ఒకరుంటారు. మన దేశంలో ప్రతి రెండో పిల్లకి పోషకాహార లోపం ఉంటుంది. నలుగురు పిల్లల్ని చూస్తే ముగ్గురికి రక్తహీనత ఉంటుంది. ప్రతి రెండో శిశువుకి అయొడిన్ లోపం వల్ల మెదడు ఎదుగుదల దెబ్బతిని ఎడ్డితనం సోకే అవకాశం ఉంది.

అంతేకాక, తీవ్రమైన పోషకాహార లోపానికి (శామ్) గురవుతున్న పిల్లలు ప్రపంచ వ్యాప్తంగా 5 శాతం ఉంటే, మన దేశంలో 3 నుంచి 10 శాతం మంది ఉన్నారు. ఐదేళ్ల లోపు పిల్లలు సంవత్సరానికి పది మిలియన్లు చనిపోతే, అందులో 50 శాతం మంది పోషకాహార లోపం వల్లనే చనిపోతున్నారు. ఈ మరణాలకు కారణం పౌష్టికాహార లోపంతో పాటు వచ్చే అంటు వ్యాధులు. కృశించిపోయిన పిల్లల్లో అంటు సోకడం అతి తేలిక. వారిలో రోగనిరోధక శక్తి తగ్గిపోతుంది. (విటమిన్లు, ఖనిజాలు వంటి మైక్రో న్యూట్రియంట్స్ లోపం వల్ల). ఎందుకంటే నిరోధక శక్తినిచ్చే పళ్లు, కూరగాయలు వారికి అందని ఫలాలు. రోగ నిరోధక శక్తినిచ్చే రక్త కణాలు వారిలో వృద్ధి చెందవు. అలా అంటు సోకడం వల్ల వారి పోషకాహార లోపం స్థాయి మరింత పెరుగుతుంది. ఫలితంగా మరిన్ని రోగాలు సంప్రాప్తిస్తాయి. మనం వైద్యపరంగా, ఆహార విధానాల పరంగా ఎక్కడో అడ్డుకట్ట వేయకపోతే ఈ విషవలయం అలాగే కొనసాగి మరణాలకు దారితీస్తుంది.

ఈ పరిస్థితిని మెరుగుపరచడం కోసం ప్రాథమిక, సామాజిక సంక్షేమ పథకంగా ప్రభుత్వం 1975లో సమగ్ర శిశు అభివృద్ధి పథకాన్ని (ఐసిడిఎస్) ఏర్పాటు చేసింది. ఈ పథకం లబ్ధిదారులు – యుక్త వయసు వరకు ప్రతి ఆడపిల్ల, ఆరేళ్ల లోపు పిల్లలందరు, గర్భిణీ స్త్రీలు, పాలిచ్చే బాలింతలు. ఆడపిల్లల్ని మగపిల్లల స్థాయికి పెంచే లక్ష్యం ఈ పథకంలో కీలకాంశం.

**ఐసిడిఎస్ పథకం లక్ష్యాలు**

- ఆరేళ్ల లోపు పేద పిల్లల ఆరోగ్య స్థాయిని, పోషకాహార స్థాయిని పెంచడం.
- మన దేశంలో పిల్లల మానసిక, శారీరక, సామాజిక అభివృద్ధికి బాటలు వేయడం.
- శిశు మరణాలని తగ్గించి, పోషకాహార లేమిని పారదోలి, పాఠశాల విద్యని మధ్యలోనే విరమించుకునే 'డ్రాప్ అవుట్స్' సంఖ్యని తగ్గించడం.
- చిన్న పిల్లల తల్లులకు ఆరోగ్యం, ఆహార విషయాలపై శిక్షణనిచ్చి, పిల్లల పెంపకంలో వారి స్థాయిని పెంచడం.

ఇన్ని ఉన్నత లక్ష్యాలను నిర్దేశించుకున్న ఐసిడిఎస్ పథకం పరిధి – టీకాలు, అదనపు ఆహారం, ఆరోగ్య పరీక్షలు, అవసరమైతే పై సెంటర్లకి పంపే రిఫరల్ వ్యవస్థ, ఇంకా బడికి వెళ్లని ప్రీ స్కూల్ పిల్లలకి అనియత విద్యని అందించడం (ఇది ఈ పథకానికి వెన్నెముక అంటారు), ఆరోగ్యం, ఆహారం గురించిన సమాచారాన్ని వ్యాప్తి చేయడం. ఇలాంటి సేవల్లో భాగంగా ఈ పథకం కింద ప్రతి ఆరేళ్ల లోపు పిల్లకి 300 కేలరీలు, 8–10 గ్రాముల మాంసకృతులు అందాలి. యుక్త వయసు పిల్లలకి, గర్భిణీ స్త్రీలకి, బాలింతలకి 500 కేలరీలు, 25 గ్రాముల మాంసకృతులు అందాలి. పోషకాహార లోపం గల పిల్లలకి 600 కేలరీలు, 16–20 గ్రాముల ప్రోటీన్లు అందాలి. ఇవన్నీ అదనపు ఆహారం (సప్లిమెంటరీ న్యూట్రిషన్)గా అందుతాయి.

కాని, నిజానికి ఏమి జరుగుతోంది? 1975లో ఐసిడిఎస్‌ని ఏర్పాటు చేసే నాటికి సంవత్సరం లోపు శిశు మరణాల సంఖ్య వెయ్యికి 44. ఇప్పుడు అది 48. ఐదేళ్ల లోపు పిల్లల మరణాల సంఖ్య వెయ్యికి 93. ఇప్పుడు అది 61 (మన లక్ష్యం 38). అయితే 18 శాతం శిశు మరణాలు ఈ వయసులో సంభవిస్తున్నాయి. (చైనాలో ఐదేళ్ల లోపు మరణిస్తున్న వారు వెయ్యికి 15, బంగ్లాదేశ్‌లో 46, కెనడాలో 6, జపాన్‌లో 3, కువైట్‌లో 11, లెబనాన్‌లో 9, దక్షిణాఫ్రికాలో 47). మన ఐసిడిఎస్ ఆరంభించే నాటికి బరువు తక్కువ నవజాత శిశువులు 25 శాతం. ఇప్పుడు అది 28 శాతం. మరి ఈ పథకం ప్రయోజనాలు ఏమవుతున్నాయి? దాని పనితీరుపై కాగ్ నివేదిక ఒక అవగాహన కల్పిస్తుంది, చూడండి.

- ఈ పథకం మరింత ఎక్కువ మందికి చేరాలంటే డిసెంబర్ 2008 నాటికి 14 లక్షల అంగన్‌వాడి సెంటర్లు పనిచేయాలని సుప్రీంకోర్టు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఉత్తర్వులు జారీ చేసింది. కాని, ప్రభుత్వం 13.71 లక్షల సెంటర్లని మాత్రమే మంజూరు చేసింది. వాటిలో 13.17 లక్షలు మాత్రమే పని చేస్తున్నాయి.
- కాగ్ పరిశీలించిన అంగన్‌వాడిల్లో 61 శాతానికి సొంత భవనాలు లేవు. 25 శాతం పాకల్లోనో, ఆరు బయటో పనిచేస్తున్నాయి. 40–65 శాతం సెంటర్లకి వంటకోసం ప్రత్యేక స్థలం లేదు. ఆహార పదార్థాలు భద్రపరిచే చోటు లేదు. గది లోపల, ఆరు బయట పిల్లలకు నిర్వహించ వలసిన కార్యకలాపాలకి తగిన ప్రదేశం లేదు.
- పరిశుభ్రత లోపం కనిపిస్తుంది. 52 శాతం సెంటర్లకి మరుగు దొడ్లు లేవు. 32 శాతానికి మంచినీటి సౌకర్యం లేదు.
- పిల్లల బరువు తూచే మెషిన్లు 26 శాతం సెంటర్లలో లేవు. గర్భిణీ స్త్రీల బరువు తూచే మెషిన్లు 58 శాతం సెంటర్లలో లేవు. (తూకం వేయకపోతే మెరుగుదలని నిర్ధారించలేం.)
- అదనపు ఆహారాన్ని వండడానికి ఉపయోగించే గిన్నెలు చాలా సెంటర్లలో లేవు.
- దాదాపు 33–49 శాతం సెంటర్లలో మందుల సరఫరా కిట్‌లు లేవు. కేంద్రం నుంచి విడుదలైన నిధులను ఈ సెంటర్లలో వినియోగించని రాష్ట్ర ప్రభుత్వాల వైఫల్య ఫలితం ఇది.
- అన్ని స్థాయిల్లో సిబ్బంది కొరత వేధిస్తోంది.
- అదనపు ఆహారం కోసం 2006–09లో మనిషికి రు.2.06 లు కేటాయిస్తే, 1.52 నుంచి 2.01 రూపాయలు మాత్రమే వాడారు. అలానే, 2009–11 కాలానికి మనిషికి రు. 4.21లు కేటాయిస్తే, 3.08 నుంచి 3.64 రూపాయలు మాత్రమే వాడారు.
- పిల్లల ఎదుగుదలని కొలవడానికి వారి బరువు తూయాలి. కానీ 33 నుంచి 47 శాతం పిల్లల్ని అసలు తూయనే లేదు. అలానే, పిల్లల పోషణని సూచించే కొలతల్లో ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రమాణాలను పాటించవలసి ఉండగా, వాటిని గాలికి వదిలేశారు.
- గుర్తించిన లబ్ధిదారుల్లో సేవలందిన లబ్ధిదారులు 33 నుంచి 45 శాతం మాత్రమే ఉన్నారు.
- గోధుమ ఆహారం గల పథకంలో వివిధ శాఖల మధ్య సమన్వయం కొరవడింది. మాతా శిశు అభివృద్ధి శాఖలకి, ఆహారం, ప్రజా పంపిణీ శాఖకి, రాష్ట్ర ప్రభుత్వాలకి మధ్య సయోధ్య లేదు. ఫలితంగా, రాష్ట్రాలు కోరిన ఆహార ధాన్యాల్లో 78 శాతం మాత్రమే సమకూరాయి. అందులో మళ్లీ 66 శాతాన్ని మాత్రమే ఆయా రాష్ట్రాలు వినియోగించుకున్నాయి.
- దాదాపు 41–51 శాతం సెంటర్లలో ఆరేళ్ల లోపు బాలలకి అందించే అనియత విద్యకి సంబంధించిన ప్రీస్కూల్ కిట్స్ లేవు.
- ఈ పిల్లల్లో ఎంత మంది తర్వాత నియత విద్యని చేపట్టి ప్రధాన విద్యా వ్యవస్థలోకి ఇమిడారో కూడా లెక్కలు లేవు. ఆంధ్ర, ఛత్తీస్‌గఢ్, ఒడిశా, రాజస్థాన్, కర్ణాటకల్లో ఈ సంఖ్య 7 నుంచి 30 శాతాన్ని మించలేదు.
- చాలా రాష్ట్రాల్లో సమాచారం కోసం, శిక్షణ కోసం విడుదలైన మొత్తంలో 40 నుంచి 100 శాతం నిధుల్ని వినియోగించనే లేదు.
- ఈ పథకంలో పనిచేసే ఉద్యోగుల కోసం 2008–09లో 13 రాష్ట్రాలకు, 2009–11లో 15 రాష్ట్రాలకు మొత్తం రు. 1753 కోట్లు విడుదల కాగా, వ్యయమైన మొత్తాన్ని రు. 2853 కోట్లుగా చూపించారు. అంటే, అవాస్తవికమైన ఖర్చులు చూపించి, కీలకమైన

విభాగాల నుంచి సొమ్ముని ఇతర రంగాలకు తరలించడం వంటి తప్పుడు పద్ధతులు అవలంబించారు.

- దాదాపు 57.82 కోట్ల రూపాయల నిధుల్ని ఐసిడిఎస్ పరిధిలోకి రాని కార్యకలాపాలకు వినియోగించారు. పైగా, 70.11 కోట్ల రూపాయలను బ్యాంకుల్లో, ట్రెజరీల్లో భద్రపరచడం వల్ల అవి వినియోగించే వీలు లేని విధంగా తాళం పడి ఉండిపోయాయి.
- కేంద్ర పర్యవేక్షక విభాగం తన పనిని సరిగ్గా నిర్వహించలేదు. ఎప్పటికప్పుడు ఈ పథకం పనితీరుని విశ్లేషించి, రాష్ట్రాల నుంచి వచ్చిన నివేదికల ద్వారా దాని బాగోగులని అర్థం చేసుకోలేక పోయింది.
- ఈ పథకం కింద అందిస్తున్న సేవల వల్ల ఎంత ప్రయోజనం కలిగిందో నిర్ధారణలు లేవు. పిల్లల పోషకాహార స్థాయి వంటి సూచికలను ఈ పర్యవేక్షక బృందం పరిగణించలేదు.
- మంత్రిత్వ శాఖ స్థాయిలో అంతర్గత విశ్లేషణ, అంచనా అరకొరగా ఉండడం వల్ల పదే పదే అవే లోపాలు పునరావృతమవుతున్నాయని కాగ్ నివేదిక వెల్లడించింది.

అలా, అట్టడుగు వర్గాల పిల్లలకు, స్త్రీలకు ఎంతో మేలు చేయగల సమగ్ర శిశు అభివృద్ధి పథకం నిరర్థకమైపోతోంది. అందుకే ఇంకా 47 శాతం మంది పిల్లలు పోషకాహార లోపానికి గురవుతున్నారు. 50 శాతం మహిళల్లో రక్తహీనత కనిపిస్తోంది. 836 మిలియన్ ప్రజలు ఒంటి పూట భోంచేస్తున్నారు. ప్రపంచంలో ఆరోగ్యాన్ని దెబ్బతీసే కారణాల్లో ఆకలిది మొదటిస్థానం. క్షయ, మలేరియా, ఎయిడ్స్ వంటి వ్యాధులతో మరణించే వారి సంఖ్య కంటే ఆకలితో చనిపోతున్న వారి సంఖ్యే ఎక్కువ. ఆకలితో అలమటించే ప్రజల్లో 98 శాతం అభివృద్ధి చెందుతున్న దేశాల్లోనే ఉన్నారు. వారిలో 15 శాతానికి పోషకాహార లోపం ఉంది. యూనిసెఫ్ లెక్కల ప్రకారం మన దేశంలో ఐదేళ్ల లోపు పిల్లల్లో 2.6 మిలియన్ల పోషకాహార లోపంతో చనిపోతున్నారు. అంటే, అది ప్రపంచంలో మూడవ వంతు. ఆరుగురు పిల్లల్లో ఒకరు పొట్టిగా ఉంటున్నారు (ఆహార లోపం వల్ల). ప్రాథమిక విద్యని అభ్యసించే పిల్లల్లో 66 మిలియన్ల ఖాళీ కడుపులతోనే స్కూలుకి వెళ్తున్నారు. హాజరు వేసే సమయంలో ఎంత మంది తిని వచ్చారో టీచర్లు లెక్కకడితే ఈ సంఖ్య బాధాకరంగా ఉంటుంది.

ప్రపంచ బ్యాంకు తాజా లెక్కల ప్రకారం రోజుకు 65 రూపాయలతో నడుస్తున్న కుటుంబాలు మన పేదరికానికి అద్దం పడుతున్నాయి. ప్రపంచంలోని ప్రతి ముగ్గురు పేదల్లో ఒకరు భారతదేశంలో ఉన్నారు. మూడు దశాబ్దాల క్రితం పేదలు ఎక్కువగా ఉన్న దేశాల జాబితాలో మనది ఐదవ స్థానం. ఇప్పుడు మనం శరవేగంగా పైకి ఎగబాకి, ఆఫ్రికన్ దేశాల సరసన నిలిచాం. ఈ కాలంలో పేదరికం 22 శాతం నుంచి 33 శాతానికి పెరిగింది. మన దేశంలో ప్రస్తుతం 40 కోట్లకి పైగా పేదలున్నారని ప్రపంచ బ్యాంకు అంచనా. ఆ పేదల్లో 75 శాతం గ్రామాల్లో నివసిస్తున్నారు. ప్రజలకి అందే వైద్య సేవలు నాసిరకంగా ఉండడం, పిల్లల్లో పోషకాహార లోపం ప్రబలడం, సరైన విద్య – శిక్షణలు లేకపోవడం, పిల్లలు పాఠశాల విద్యకి దూరం కావడం వంటి అనేక సమస్యలు మన దేశంలో పేదరికం పెరగడానికి కారణమని కూడా ప్రపంచ బ్యాంకు విశ్లేషించింది.

అయితే, పేదరికం, పోషకాహార లోపం అనేవి ఒకదానితో ఒకటి పెనవేసుకుని, విషవలయంగా తయారయ్యాయి. అలానే అంటు వ్యాధులు, పేదరికం అనేది మరొక విషవలయం. ఇవి కాక, మన పరిసరాలు, పర్యావరణం కూడా ఈ పోషకాహార లోపానికి దోహదం చేస్తున్నాయి. తాగునీటి సౌకర్యం, మరుగుదొడ్లకు, చెత్తని సక్రమంగా విసర్జించడం (పారిశుధ్యం), కాలుష్యం, శబ్దం, నివాసం, గాలి, రేడియేషన్, క్రిమికీటకాలు, చట్టం అనే పది అంశాలతో నిర్ధారించబడే పర్యావరణం కూడా ఆరోగ్యంపై ఎంతో ప్రభావాన్ని చూపుతుంది. వీటిలో ఏ ఒక్కటీ సక్రమంగా లేకపోయినా, అది పోషకాహార లోపాన్ని పరోక్షంగా పెంచుతుంది. పేదరికం, ఆహార లోపం, కొనుగోలు శక్తి క్షీణించడం, నిరుద్యోగం, అదుపులేని అధిక ధరలు మాత్రం పోషకాహార లోపాన్ని ప్రత్యక్షంగా ప్రభావితం చేస్తాయి.

ప్రపంచ ఆకలి సూచిక (జిఎచ్ఐ) ఆకలికి మూడు ప్రమాణాలను తీసుకుంటుంది. అవి 1) పోషకాహార లోపం; 2) బరువు తక్కువ పిల్లలు; 3) చిన్న పిల్లల మరణాల సంఖ్య. స్థూలంగా చూస్తే, జిఎచ్ఐ సంఖ్య తక్కువ ఉంటే, ఆ దేశంలో పేదరికం తక్కువ ఉన్నట్టు. ఆర్థికంగా ఎంతో ప్రగతిని సాధించినట్టు చాటుకుంటున్న మన దేశం ఆకలిని మాత్రం జయించలేక పోతోంది. మన ఇరుగు పొరుగు దేశాలైన పాకిస్తాన్, శ్రీలంక, చైనాల కంటే మనం ఎంతో వెనకబడిపోయాం.

**ప్రపంచ ఆహార సూచి (జిఎచ్ఐ)**

అజర్‌బైజాన్ – 5.0; చైనా – 5.1; మలేషియా – 5.2; మారిషస్ – 5.7; ఎల్‌సాల్వడార్ – 5.8; దక్షిణాఫ్రికా – 6.9; పాకిస్తాన్ – 19.7; నేపాల్ – 20.3; భారతదేశం – 22.9; బంగ్లాదేశ్ – 24.0.

అంతర్జాతీయ ఆహార విధానాల పరిశోధన సంస్థ లెక్కల ప్రకారం రోజుకు 1,800 కేలరీల కంటే తక్కువ ఆహారాన్ని తినే వారంతా పోషకాహార లోపానికి గురవుతున్నట్టే. ఆహారానికి దూరమవుతున్నట్టే. ఖాళీ కడుపులతో అలమటిస్తున్నట్టే.

ఇతర అంశాలను వెంటనే పట్టించుకోకపోయినా, కనీసం ఐసిడిఎస్ ద్వారా అయినా పోషకాహార లోపాన్ని కొంత మేరకు నియంత్రించ వచ్చునుకుంటే, దాని పని తీరు ఎంత అధ్వాన్నంగా ఉందో కాగ్ నివేదిక తేటతెల్లం చేసింది. నిజానికి అక్కడ అవినీతి రాజ్యమేలుతోంది. అంగన్‌వాడి కేంద్రాల్లో సరుకుల సరఫరా సక్రమంగా ఉండదు. కానీ, లెక్కల్లో ఏ లోపం కనపడదు. ఆయాలకి నెలనెలా ఇచ్చే కట్టెల బిల్లుల్లో అధికారులకి వాటా కావాలి. పిల్లల కోసం వచ్చే నూనె ప్యాకెట్లు మాయమవుతున్నాయి. సకాలంలో సరుకు సరఫరా కాని కారణంగా పిల్లలు నెలలో పదిహేను రోజులు ఆహారానికి దూరమవుతున్నారు. కానీ, లెక్కల్లో మాత్రం 25 రోజులు ఆహార పంపిణీ జరుగుతున్నట్టు ఉంటుంది. నెలవారీ మీటింగ్‌లకి హాజరయ్యే సిబ్బంది రవాణా ఖర్చులో కొంత భాగాన్ని నిర్వాహకులు కాజేస్తున్నారు. వేతనాలు పెరిగాయని ఆనందించే లోపే ఆ బిల్లులు చెల్లించడానికి 700 నుంచి 1000 రూపాయలు కమిషన్లుగా చేతులు మారుతాయి.

అందుకని, ముందుగా ఐసిడిఎస్‌ని ప్రక్షాళణ చేసి, నిధులను సక్రమంగా వినియోగించేలా చూడాలి. అలా ఆరేళ్ల లోపు వయసుగల

పిల్లల పోషణపై కేంద్రీకరించి, తీవ్రమైన పోషకాహార లోపం (శామ్) గల పిల్లల్ని గుర్తించి, వారి ఆహారం, ఆరోగ్యం రెంటినీ పరిరక్షించే విధంగా పాటుపడాలి. వ్యవసాయాన్ని కూడా ఆహార లోపాన్ని తీర్చే విధంగా మెరుగుపరచాలి. పేద ప్రజల ఆహారపు అవసరాలను సక్రమంగా తీర్చాలి. ఆహార ధాన్యాల నిల్వలను సమగ్రంగా వినియోగించాలి. ప్రజా పంపిణీ వ్యవస్థని సరిదిద్దాలి. సామూహిక పారిశుధ్య పరిరక్షణ వైపు దృష్టి మళ్లించాలి. ప్రజారోగ్య వ్యవస్థలో ఆహారానికి ప్రాధాన్యత పెంచాలి. స్త్రీ పురుష వివక్షకి, కుల వివక్షకి వ్యతిరేకంగా పోరాడాలి. అప్పుడు మాత్రమే ఐదేళ్ల లోపు పిల్లల మరణాల్లో 35 శాతానికి కారణమైన పోషకాహార లోపాన్ని తగ్గించగలం. లేకపోతే వారు చదువులో వెనకబడతారు. పేదరికం పెరుగుతుంది. వారు అనారోగ్యం పాలవుతారు. మాతా శిశు మరణాల రేటు పెరుగుతుంది.

ఆహారంలో ఒక ఐరన్ (ఇనుము శాతం) లోపమే ఎంతో హాని చేస్తుంది. నిస్సత్తువ, మనసు నిలకడ లేకపోవడం, పాలిపోయిన దేహం, ఆయాసం, రోగ నిరోధక శక్తి తగ్గడం, పేగుల్లో పుళ్లుపడి రక్తం చిమ్మడం, రుతుస్రావం ఎక్కువ కావడం, నరాల బలహీనత, గుండె దడ వంటి పరిణామాలకు స్త్రీలు, పురుషులు, పిల్లలు సమానంగా బలవుతున్నారు. ఇంకా, జాతీయ ఆహార సంస్థ (ఎన్ఐఎన్) అంచనా ప్రకారం 40 శాతం పోషకాలు ధాన్యం నించి పొందాలి. మిగిలిన పోషకాలు కూరగాయలు, పళ్లు, మాంసం, పాలు, పెరుగు, మసాలాల ద్వారా పొందాలి. కానీ గ్రామీణ ప్రాంతాల్లో 72 శాతం పోషకాలు ధాన్యం వల్ల మాత్రమే పొందుతున్నారు. ఈ లోపాన్ని సవరించకపోతే చాలా నష్టం జరుగుతుంది. అలానే, మన శరీర రక్షణ వ్యవస్థకి అవసరమైన విటమిన్లు, ఖనిజాల లోపాన్ని 'మరుగున పడిన ఆకలి' (హిడెన్ హంగర్)గా గుర్తిస్తాం. అందులో మనది మొదటి స్థానం. దీని వల్ల మాతా శిశు మరణాల రేటు పెరుగుతోంది. ఈ లోపం ఉంటే పిల్లలు అవయవ దోషంతో పుట్టవచ్చు. పైగా, పుట్టిన పిల్లల ఎదుగుదల సక్రమంగా ఉండదు. మన ఉత్పాదకత పెరగదు. పైగా, పుట్టిన పిల్లల ఎదుగుదల సక్రమంగా ఉండదు. మన ఉత్పాదకత పెరగదు. పేదరికం మాత్రం పెరుగుతుంది. ఇంకా బడికిపోని పిల్లల్లో 'ఎ' విటమిన్ లోపం ఎక్కువ కనిపిస్తుంది. సంవత్సరానికి 3,30,000 మంది పిల్లలు దీని వల్ల చనిపోతున్నారు. ఐదేళ్ల లోపు పిల్లల్లో 9 శాతం మంది అతిసార వ్యాధితో చనిపోతున్నారు. 60 శాతం గర్భిణీ స్త్రీలు, 63 శాతం పాలిచ్చే తల్లులు, 70 శాతం ప్రీస్కూలు పిల్లలు రక్తహీనతకి గురవుతున్నారు. 71 శాతం ఇళ్లలో మాత్రమే అయొడిన్ ఉప్పు వాడుతున్నారు. అయొడిన్ తక్కువైతే మెదడు ఎదగదు.

మనకి జబ్బు ఏమిటో తెలుసు. దానికి కారణం తెలుసు. నివారణకి కావలసిన వనరులున్నాయి. కానీ, ప్రజల జీవన ప్రమాణాలను పెంచాలనే చిత్తశుద్ధి మాత్రం లేదు. అందుకే, ఎన్ని పథకాలు రచించినా, ఎంత సొమ్ము కేటాయించినా, ఎన్ని నియంత్రణలు చేపట్టినా, అవన్నీ అవినీతి, లంచమనే మహా ప్రవాహంలో కొట్టుకుపోతున్నాయి. చివరికి సిగ్గు చేటయిన కాగ్ నివేదికలు మిగులుతున్నాయి.

మన పదకొండవ పంచవర్ష ప్రణాళిక (2007-2012)లో పెట్టుకున్న లక్ష్యాల ప్రకారం 2012 నాటికి మూడేళ్ల లోపు పిల్లల్లో పోషకాహార లోపాన్ని సగానికి తగ్గించాలి. పిల్లల్లో, స్త్రీలల్లో రక్తహీనతని సగానికి తగ్గించాలి. లింగ వివక్ష వల్ల ఆడపిల్లలు, స్త్రీలు ఆహార లేమికి, అన్ని విధాలైన లోపాలకు గురికావడాన్ని తగ్గించాలని 12వ పంచవర్ష ప్రణాళిక ప్రతిపాదించింది. ప్రతి ముగ్గురు స్త్రీలలో ఒకరు ఆహార లేమికి, ఇద్దరిలో ఒకరు రక్తహీనతకు గురవుతున్నారు కాబట్టి, ప్రాథమిక విద్యపై కేంద్రీకరించాలని, యుక్త వయసు పిల్లల్లో రక్తహీనతని తగ్గించి, గర్భిణీ స్త్రీల పరిరక్షణ పెంచాలని ప్రతిపాదించింది.

జీవించాలనే ప్రాథమిక హక్కుకి బాలలు దూరం కాకూడదు. ఆ జీవితానికి అవసరమైన పోషకాలన్నీ వారికి అందాలి. పిల్లల్లో, స్త్రీలల్లో పోషకాహార లోపాన్ని నివారిస్తే అది ఈ తరానికే కాక ముందు తరాలకి కూడా బంగారు బాట వేసినట్టు అవుతుంది.

అంతటి ప్రయోజనం గల సమగ్ర శిశు అభివృద్ధి పథకాన్ని ఇలా దిగజార్చడం నేరం. ప్రభుత్వం 'కుపోషణ్ భారత్ ఛోడో' అంటూ నినదించినంత మాత్రాన పోషకాహార లోపం తోక ముడిచి పారిపోదు. ఆహార భద్రత, వ్యవసాయానికి సరైన గిట్టుబాటు ధరలు, వ్యవసాయ రంగ అభివృద్ధి, ప్రజా పంపిణీ వ్యవస్థ మెరుగుదల, ఆహారానికీ, ఆరోగ్యానికీ నిధుల కేటాయింపులు పెంచడం, మెరుగైన ఆరోగ్య వ్యవస్థ, పోషకాలు కలిగిన అదనపు ఆహార పంపిణీ, టీకాలు, పారిశుధ్యం వగైరా నియంత్రణలు, అవినీతి లేని స్వచ్ఛమైన పాలన, ప్రజల ఆర్థిక పరిస్థితుల మెరుగుదల, పేదరికం నిర్మూలన మాత్రమే సమస్యని పరిష్కరించగలవు. పథకాల రచనచాలదు, వాటి అమలులో పారదర్శకత, చిత్తశుద్ధి, ప్రజలకి సంజాయిషీ ఇవ్వగల ధైర్యం ఎంతో అవసరం.

అప్పుడే శిశు మరణాలు తగ్గుతాయి. పోషకాహార లోపం, రక్తహీనత మాయమవుతాయి. పురిటికందులు పెరిగి పెద్దవుతారు. వయసుకి తగిన బరువుతో తెలివిగా పైకొస్తారు. ఐదేళ్ల లోపు పిల్లల రోగ నిరోధక శక్తి పెరుగుతుంది.

అలా, మన ఆరోగ్య వ్యవస్థ మెరుగుపడిన నాడు మాత్రమే మన పిల్లలు కిలకిల నవ్వుతారు. సరైన ఆహారం అంది కళకళలాడుతారు. చెంగు చెంగున తుళ్లుతూ ఆడుకుంటారు. ఆ పిల్లల చిరునవ్వు మాత్రమే మన చేతలకి, పథకాలకి ప్రామాణిక సూత్రం కాగలదు.

*(రచయిత శిశు వైద్యులు,*
*ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక నాయకులు)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. - సం.*

# ఆధార్ కార్డుల జారీ - తీరుతెన్నులు

***ప్రజా సంక్షేమ పథకాలను నీరుగారుస్తూ, ప్రజలకు ఉపయోగకరం కాని పథకాలకు ప్రజాధనాన్ని వెచ్చిస్తూ పాలకులు దేశ ప్రజలను తప్పదోవ పట్టిస్తున్నారని అంటున్నారు*** **చిమ్మె జాన్ బర్నబాస్**

దేశంలోని ఓటర్లందరికీ 'ఒకే గుర్తింపు కార్డు'ల జారీ ప్రక్రియ కన్నా ఈ ఆధార్ కార్డు జారీ పెద్ద పరిగణనగా ప్రభుత్వం భావిస్తోంది. యునిక్ ఐడెంటిఫికేషన్ (ఒకే గుర్తింపు) ప్రక్రియను ఆధార్ కార్డు ద్వారా యునిక్ ఐడెంటిఫికేషన్ అథారిటీ ఆఫ్ ఇండియా (యుఐఎఐ) భారత ప్రణాళికా సంఘం నేతృత్వంలో ఏర్పాటు చేశారు. ఇదొక బృహత్పథకంగా భారత ప్రభుత్వం భావిస్తోంది. అదే విధంగా రాష్ట్ర ప్రభుత్వాలను ఈ పథకంలో భాగస్వాములయ్యే విధంగా కృషి చేస్తోంది. జాతీయ జనాభా పుస్తకం కూడా ఒకటి రూపొందించబడుతున్నది. ఈ జాతీయ జనాభా పుస్తకం కోసం వివరాలు సేకరించే కార్యక్రమం, ఆధార్ గుర్తింపు పత్రాల కార్యక్రమం సమాంతరంగా నడుస్తున్నాయి. జనాభా గణన కోసం ఇంటింటికీ వెళ్లి సమగ్ర వివరాలను సేకరించాలి. వాటిని ప్రభుత్వ ఉద్యోగులైన ఉపాధ్యాయులు, అంగన్ వాడీ టీచర్లు తదితరులు చేస్తారు. అయితే ఆధార్ కార్డు కోసం, అన్ని వివరాలు అవసరం లేదు. రేషన్ కార్డు (పౌర సరఫరాల శాఖ జారీ చేసే గుర్తింపు కార్డు) జిరాక్స్ కాపీ తీసుకొని, ఆధార్ కార్డు నమోదు కేంద్రాల దగ్గరకు పోయి, ఒక అప్లికేషన్ ఫామ్ పూర్తిచేసి, వారు అప్లికేషన్‌లో కనబరిచిన వ్యక్తుల వేలి ముద్రలు, కళ్లు ఐరిష్ కెమెరాల ద్వారా బంధించుకొని, తిరిగి మనకు ఒక రిసీట్‌ను ఇస్తారు. దాదాపుగా ఆధార్ కార్డు జిరాక్స్ కాపీ మాదిరిగానే అది ఉంటుంది. ఒరిజినల్ కార్డు పోస్ట్ ద్వారా అందుతుంది.

దాదాపుగా రెండు సంవత్సరాలు పూర్తి అయినప్పటికీ, ఆధార్ కార్డుల జారీ 20 శాతం మించలేదు. ఇంతవరకూ, ఈ ఏడాది మార్చి నాటికి 40 కోట్ల మందికి ఆధార్ కార్డును సమకూర్చనున్నట్లు 2011లో ప్రభుత్వం ప్రకటించింది. కానీ కనీసం 20 శాతం కూడా అమలుకు నోచుకోలేదు. కాబట్టి, ఆధార్ కార్డు ఆధారంగా చేపట్టబోయిన నగదు బదిలీ పథకం బాలారిష్టాల పాలయింది. ఈ అనుభవం నుంచి కూడా ప్రభుత్వాలు గుణపాఠం నేర్చుకోలేదు. ఆధార్ కార్డు ఆధారంగానే వంట గ్యాస్ విడుదలకు కూడా ముడిపెట్టడం, ప్రభుత్వం దివాళాకోరు తనానికి నిదర్శనం. భవిష్యత్తులో గ్యాస్‌పై సబ్సిడీని ఎత్తివేసే కుట్రలో భాగంగానే, ప్రభుత్వం ఈ విధమైన చర్యలకు పాల్పడుతున్నట్లు స్పష్టమవుతోంది.

దేశంలోని ప్రజలందరికీ ఆధార్ కార్డులు రూపొందించి, పంచడానికి దాదాపు మరీ రెండేళ్లయినా పట్టవచ్చునేది అధికార వర్గాల అంచనా. వంట గ్యాస్‌ను ఈ గుర్తింపుతో ముడిపెట్టకుండా ఉంటే మేలు. ఆధార్ కార్డులను పొందడానికి ఉత్సాహం ప్రదర్శించని బద్ధకస్తులను కుదపడానికి, కదలిక పుట్టించడానికి ప్రభుత్వం సదాశయంతో వంట గ్యాస్ పథకానికి ముడిపెట్టడం కూడా ఒక భాగమే. ఎందుకంటే, ఆధార్ కార్డు పొందిన, అర్హులైన జనం, మొత్తం గ్యాస్ కనెక్షన్‌లను కొనుగోలు చేయడం లేదు. పల్లె ప్రాంతాలలోని అత్యధిక కుటుంబాలలో, ప్రభుత్వం వంటగ్యాస్ అంతరించిపోయింది. కొన్ని చోట్ల బయో గ్యాస్, ఎలక్ట్రిక్ పొయ్యిలు వాటి స్థానంలోకి వచ్చాయి. అయితే ప్రస్తుతం, చాలా చోట్ల గ్రామాలలో సైతం బయోగ్యాస్ కూడా లేదు. పాడి పశువులు, చెట్లు అంతరించిపోతున్నాయి కాబట్టి అందువల్ల గోబర్ గ్యాస్ (బయో గ్యాస్) పెంపొందించడం లేదు.

ప్రభుత్వ సబ్సిడీ వంట గ్యాస్ పొందుతున్న పట్టణ వాసులందరూ ఆధార్ గుర్తింపు పత్రాలను పొందినప్పటికీ 'లక్ష్యం' నెరవేరలేదు. దేశ ప్రజలందరికీ అద్వితీయమైన క్రమ సంఖ్యతో గుర్తింపు కార్డులను ఇవ్వాలన్న కార్యక్రమం విజయవంతం కావడానికి ఒక్కటే మార్గం. ప్రభుత్వ ఉద్యోగులు గ్రామ, గ్రామాన ఇళ్లను సందర్శించి, ప్రజల వద్దకే ఆధార్ మిషన్‌లను సాధ్యమైనంత దగ్గరకు, అంటే దాదాపు రెండు వందల ఇళ్లకు ఒకటి తీసుకొని పోతే తప్ప ఈ కార్యక్రమం విజయవంతం కాదు. ప్రజలకు వెంటనే ఒక నమోదు రసీదును కూడా అందజేయాలి. ఓటర్ల నమోదు కార్యక్రమాన్ని ఇంటింటికీ తిరిగి చేస్తున్నప్పుడు ఆలోచిస్తే ఆధార్ నమోదు కార్యక్రమం కూడా పెద్ద కష్టమేమీ కాదనిపిస్తున్నది. ప్రభుత్వంలోని పెద్దలు, మంత్రులు, ఎంఎల్ఎలు, ఎంపిలు కొంత విజ్ఞతతో ఆలోచిస్తే, ఈ కార్యక్రమం వెంటనే విజయవంతం అవుతుంది. కావాలనే ప్రభుత్వం కొంత వెనుకంజ వేస్తున్నట్లు కనబడుతున్నది.

అసలు ప్రభుత్వ సంకల్పం ఏమిటంటే, వంట గ్యాస్‌పై, ఎరువులపై, విత్తనాలపై సబ్సిడీలను క్రమంగా తగ్గించేదిగా మనకు కనిపిస్తోంది. ప్రపంచీకరణ మొదలయినప్పటి నుంచీ సంపన్న దేశాల వాణిజ్య ముఠాలు, బృందాలు, సంపన్న దేశాలకు బందీలైన అంతర్జాతీయ వాణిజ్య సంస్థలు (ఆర్థిక సంస్థలు) ఈ సబ్సిడీలను రద్దు చేయవలసిందిగా వర్ధమాన దేశాలపై ఒత్తిడి తెస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వాన్ని కూడా బెదిరిస్తున్నాయి. అందువలన ప్రధానమంత్రి, ఇతర మంత్రులు, ప్రభుత్వ ఆర్థిక నిపుణులు, సలహాదారులు, ప్రణాళికా సంఘం, రిజర్వ్ బ్యాంక్ ఒకే పాట పాడుతున్నారు. వీటన్నింటి ఉమ్మడి లక్ష్యమేమంటే డీజిల్, పెట్రోల్, ఎరువుల, విత్తనాల, విద్యుత్, నీటి ధరలు పెంచాలి. అందులో భాగంగానే ఆధార్‌తో వంటగ్యాస్‌ను ముడిపెట్టడం, ప్రజల ప్రతిస్పందనను గమనించడానికి జరిగిన మరో ప్రయోగం.

ప్రజా సంక్షేమ కార్యక్రమాలు (పథకాలు) లబ్ధిదారులకు సక్రమంగా చేరడం లేదని, దళారీల ప్రాబల్యం పెరిగిపోయిందని, అందువలన వేలాది కోట్ల రూపాయల ప్రజాధనం వృథా అవుతోందని, దానిని అరికట్టడానికి ఆధార్ కార్డును అమలులోకి తెచ్చామని చెపుతున్న

# సామ్రాజ్యవాద ముట్టడిలో దండకారణ్యం

***ప్రజల కోసం ఉపయోగించవలసిన వనరులను పాలకులు కార్పొరేట్, బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేస్తున్నారనీ, దీనిని వ్యతిరేకిస్తున్న ప్రజసమూహాలను తీవ్ర అణచివేతకు గురిచేస్తున్నారనీ అంటున్నారు* దబ్బేటి మహేష్**

**భా**రతదేశ రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులను కాలరాసే అధికారం ఏ ప్రభుత్వానికి గాని, ఏ వ్యక్తికి గాని లేదు. అపారమైన ఖనిజ సంపదను కలిగి ఉన్న దండకారణ్యం నేడు ఒక యుద్ధ క్షేత్రంగా మారుతోంది. ఇక్కడి ఆదివాసుల జీవనాన్ని అతలాకుతలం చేసే 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' మొదలయింది. దాని పేరిట భారతరాజ్యం తలపెట్టిన సాయుధ కార్యక్రమం ఆదివాసుల బతుకులను ఛిద్రం చేస్తున్నది. ఈ హరితవేట బయటకు మాత్రమే మావోయిస్టుల ఏరివేత లక్ష్యంగా కనబడుతున్నా, దీని వెనుక ముమ్మాటికి ఆదివాసి సమూహాలను నిర్మూలించి, ఆ ప్రాంతాలను ఖాళీ చేయించి ఆ తరువాత అక్కడి ఖనిజ సంపదను వెలికితీసేందుకు దారులు సుగమం చేసి, బహుళజాతి కంపెనీలకు ధారదత్తం చేయడమే దీని అసలు లక్ష్యం. ఈ రాజ్యం నిజ స్వరూపం.

మన దేశంలో 329 మిలియన్ చదరపు కి.మీ. విస్తీర్ణంలో అడవి ఉంది. ఇందులో 9.60 శాతం దట్టమైన అడవులు కలిగి ఉన్నాయి. జియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా 1995 లెక్క ప్రకారం ఈ అడవి ప్రాంతంలో 4.386 మిలియన్ టన్నులు డోలమైట్, 2,10,000 మిలియన్ టన్నుల బొగ్గు నిక్షేపాలు, 176 మిలియన్ టన్నుల జింక్, సీసమ్, 167 మిలియన్ టన్నుల మాంగనీస్, 2.462 మిలియన్ టన్నుల బాక్సైట్, 340 మిలియన్ టన్నుల మాగ్నటైట్, 461 మిలియన్ టన్నుల రాగి, 10.052 మిలియన్ టన్నుల హైమటైట్, 86 మిలియన్ టన్నుల క్రీమైట్‌తో పాటు 39 రకాల ఖనిజ నిక్షేపాలు ఉన్నాయని తేల్చింది.

ఈ నిక్షేపాలు ఆదివాసి ప్రాంతంలో ఉన్నాయి. ఈ ప్రాంతం నుంచి ఆదివాసులను వేరు చేస్తుంటే ప్రతిఘటించేది మావోయిస్టులే కనుక 'గ్రీన్‌హంట్' పేరుతో భారత పాలక వర్గాలు తమ సాయుధ బలగాలతో వీరిని తుదముట్టించడానికి అనేక ప్రయత్నాలు చేస్తున్నాయి. టాటా, జిందాల్, పోస్కో, ఎస్సార్, వేదాంత, మిట్టల్ వంటి బహుళ జాతి కంపెనీలు, ఇండియన్ కంపెనీలు లైన్‌లో ఉన్నాయి. ఈ సంపదను సులభంగా ధారాదత్తం చేయవచ్చు అనేది పాలక వర్గాల కుట్ర. ఈ కుట్రలో భాగమే సల్వాజుడుం.

తెగ భూస్వామ్య అధికారానికి, పితృస్వామిక అధికారానికి సవాలుగా నిలిచిన ఆదివాసి రైతాంగాన్ని చూసి సహించలేని కల్మ మసాలు (మహేంద్ర కర్మ) లాంటి భూస్వామ్య ప్రతినిధులు రాజ్యంతో చేయి కలిపి 'జన జాగరణ్' పేరుతో కాలి కింద అణగదొక్కాలని చూశారు. 1990 లోనూ, 1997 లోనూ, తెచ్చిన జనజాగరణ్‌ను ఆదివాసి రైతాంగం ఎదుర్కొని నిలదొక్కుకున్నారు. 2005 జూన్ నుండి జనజాగరణ్ వేషం మార్చుకున్నది. సల్వాజుడుం ఆదివాసి ప్రజానీకాన్ని అణచివేస్తున్నది. 2005 నుండి దంతెవాడ, బస్తర్, బీజాపూర్‌లో నిలువనీడ లేకుండా చేసింది. ఇల్లు, పొలం, గుడిసె, కాలిబాట, ఇప్పచెట్టు, ఈతపొద ఎక్కడా ఆదివాసిలకు రక్షణ లేకుండా చేసింది. జుడుం మూకలు తోడేళ్ల గుంపులా మీదపడి మహిళలను నెత్తురోడే మాంసపు ముద్దలుగా చేశారు. నాగా, మిజో, సిఆర్‌పిఎఫ్ బలగాలు పశుత్వపు కోరలతో మహిళల శరీరాల్ని ముక్కలుగా చేశాయి. పోలీసుల భద్రతా బలగాల దాడులకు, లైంగిక అత్యాచారాలకు బలికాని గడప ఒక్కటి కూడ మిగల లేదంటే, ఆ హింస స్థాయిని ఊహించవచ్చు.

భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో ఆర్టికల్స్ 38,39 ప్రజల మధ్య ఆర్థిక అసమానతలు తగ్గించాలని, దేశ సంపదను అందరికి అందుబాటులోకి తేవాలని, ఈ దేశ సంపదనంతటిని ఈ దేశ పౌరులకు సమానంగా పంచాలని చెపుతాయి. పాలకులు రాజ్యాంగం మీద ప్రమాణం చేసి రాజ్యాంగ బద్ధంగా ఉంటామంటూ, నిత్యం ప్రజాస్వామ్యం గురించి మాట్లాడుతూ ఎన్నికలలో నిలబడి గెలవడం దేశ సంపదను

---

పాలకులు, ఈ కార్యక్రమం అమలుకు ఎన్నివేల కోట్ల వ్యయం చేస్తున్నారో చూస్తే అర్థం అవుతుంది. ఎలాంటి 'చట్టబద్ధత లేని సంస్థ' ద్వారా ఆధార్ నమోదు పూర్తయ్యేసరికి వ్యయం చేసే సొమ్ము దాదాపు 72 వేల కోట్ల రూపాయలవుతుందని ప్రభుత్వ అంచనా. మొదటి రెండు దశలలో ఈ పథకానికి ఖర్చయింది నాలుగు వేల కోట్ల రూపాయలు. ఇంత సొమ్ము ఖర్చు చేసినా, ఈ పథకం లోపభూయిష్టమైనదని చెప్పలేం. తాము (ప్రభుత్వం) సేకరిస్తున్న పౌరుల వ్యక్తిగత వివరాలు ప్రమాద కరమైన శక్తుల చేతుల్లో పడడం ఖాయమని తెలియడంతో, బ్రిటన్ ఈ తరహా కార్యక్రమాన్ని మధ్యలోనే నిలుపుదల చేసింది. ప్రపంచంలోని మరికొన్ని అభివృద్ధి చెందిన దేశాలు కూడా ఇదే విధమైన చర్యలు చేపట్టినవి. కాబట్టి మన కేంద్ర ప్రభుత్వం, ఈ పథకంపై పునరాలోచిస్తే బాగుంటుంది. లేకుంటే, ఇదే ఖర్చు మరొక పథకంపై పెడితే బాగుంటుంది. జనాభా లెక్కలు – రేషన్ కార్డులూ అన్నీ కలిపి పౌరసత్వ కార్డు మరొకటి తయారు చేయాలనేది కూడా ప్రభుత్వం ఆలోచనలో ఉంది. ఏదైనా ప్రజాస్వామ్యానికి ఉపయోగపడే విధంగా ఉండాలి. సామాన్యుడు మేల్కొనాలి.

*(రచయిత న్యాయవాది,*

*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

దోచుకోవడానికి అర్హతగా భావిస్తున్నారు. కాని ఈ దేశ రాజ్యాంగం గురించి, రాజ్యాంగ భావనల గురించి, రాజ్యాంగ ఆదర్శాల గురించి తెలియని ఆదివాసిలు గ్రామ స్వరాజ్యాలను ఏర్పాటు చేసుకొని వారి గ్రామ సంపదనంతటిని అందరు సమానంగా పంచుకొని ఆదర్శంగా నిలుస్తున్నారు, అటువంటి వారిమీద ప్రభుత్వం యుద్ధం ప్రకటించింది. జనజాగరణ సమితి సల్వాజుడుంగా మారి మళ్లీ రూపాంతరం చెంది ఇవాళ కోయ కమాండోగా పేరు మార్చుకున్నది. ప్రభుత్వమే వారికి ఆయుధాలు ఇచ్చి వారిని గిరిజన గూడెంల మీద గుండాయిజం చేయడానికి ఉసికొల్పింది. అందుకే కొంతమంది దీనిని ఆదివాసి సమాజంలో అంతర్యుద్ధం అంటున్నారు. నిజానికి ఇది అంతర్యుద్ధం కాదు. ఆదివాసి సమాజం మీద ప్రభుత్వం, పారామిలటరీ బలగాలు చేసే పాశవిక దాడి. నేరం చేసిన వ్యక్తులను చట్ట ప్రకారంగా శిక్షించి వారిలో మార్పుకోసం ప్రభుత్వం కృషి చేయాలి. కాని ప్రభుత్వమే వారికి ఆయుధాలిచ్చి మరిన్ని నేరాలు చేయమని ప్రోత్సహిస్తున్నది.

రాజ్యాంగంలోని ఆర్టికల్ 19(1)(డి) ప్రకారం ప్రతి పౌరుడు భారతదేశంలోని ఏ ప్రాదేశిక భూ భాగంలోనైన స్వేచ్ఛగా సంచరించ డానికి హక్కు కలిగి ఉన్నాడు. అయితే షెడ్యూల్డు తెగల, కులాల వారి శ్రేయస్సు దృష్ట్యా పౌరుల సంచారంపై పరిమితులు విధించవచ్చు. అంటే ఇతర వర్గాలకు చెందిన ప్రజలతో ఆదివాసులు సంబంధాలు పెంచుకున్నప్పుడు వారి అమాయకత్వాన్ని ఆసరా చేసుకొని బయటి వ్యక్తులు వారిని మోసం చేసే అవకాశం ఉన్నదని దాని భావం. కాని ఇవాళ ఆదివాసి ప్రజలను అటవీ ప్రాంతంలోనే తిరుగకుండా కొన్ని ప్రాంతాలకు రానీయకుండా రాజ్యం నిర్బంధిస్తున్నది. నిజానికి ఆదివాసిలపై జులుం ప్రదర్శించే జుడుంను ఆదివాసుల భద్రతకు ముప్పుగా పరిణమించిన పారామిలటరీ బలగాలను అటవీ ప్రాంతంలో సంచరింప చేస్తూ రాజ్యాంగ ఉల్లంఘనకు పాల్పడుతున్న రాజ్యం ఆదివాసులను మాత్రం వారి కనీస అవసరాల కోసం తిరగనివ్వడం లేదు. వారు సేకరించిన అటవీ ఉత్పత్తులను మార్కెట్‌లో అమ్ముకోవ డానికి, కొనుక్కోవడానికి వీలు కల్పించే ఆర్టికల్ 19(1)(జి), 19(6) అమలు కావడం లేదు. అటువంటిది ఆదివాసిలు అడవిలో ఆరుగాలం కష్టపడి సేకరించిన అటవీ ఉత్పత్తులను అమ్ముకోవడానికి కూడ అవకాశం లేకుండా చేస్తున్నది.

ఆదివాసిలపై ప్రభుత్వం దాడి ఇవాల్టిది కాదు. ఇంద్రవెల్లి నుండి చింతల్‌నారు మొదలుకొని బాసగూడ వరకు వారు ఈ దేశ సంపదను కాపాడడానికి, ఈ దేశ సార్వభౌమత్వాన్ని నిలబెట్టడానికి నిత్యం నిర్బంధాన్ని అనుభవిస్తూ, ప్రాణాలను కోల్పోతున్నారు. ప్రాణాలను కోల్పోయిన మనుషులను దహనం చేసిన, ఖననం చేసిన స్థలాలకు ప్రాధాన్యత ఉంటుంది. సామాన్య ప్రజల అంత్యక్రియలు చేసిన ప్రదేశంలో ఒక గోరినో, ఒక రాయినో పాతుకుంటారు. ఆ గోరిని, ఆ రాయిని అప్పుడప్పుడు చూసుకుంటారు. నలుగురికీ చెప్పుకుంటారు. కానీ ఈ ప్రజలకు తమవాళ్లు ఎక్కడ మట్టిల కలిశారో తెలియనే తెలియదు. ఈ పేద ప్రజలు మట్టిలో కలిసిపోయిన స్థలాలను కనీసం అప్పుడప్పుడు తమ ఆత్మీయులు చూసుకోవడానికి కూడ వీల్లేకుండా చేయడం ఎంత అమానుషత్వం? నిజానికి తమ వాళ్లను ఆకరి చూపు చూసుకోవడం అనేది ఏదో భావోద్వేగమో మరొక్కటో కాదు. అది చట్ట ప్రకారం ప్రతి ఒక్కరికీ సంక్రమించాల్సిన హక్కు.

చట్టాన్ని, న్యాయాన్ని పరిరక్షించడమే తమ లక్ష్యమని చెప్పుకునే కోర్టులు కూడా ఇటువంటి విషయాల్లో కళ్లూ, చెవులూ మూసుకుంటున్నాయి. ఈ బాధిత పేద ప్రజలు తమంతట తాము కోర్టులకు వెళ్లకపోయినా కోర్టులు ఈ విషయంలో జోక్యం చేసుకోవచ్చు. ప్రభుత్వాలకు ఇబ్బంది కలిగిన ఎన్నో సందర్భాల్లో ఇలా కోర్టులు జోక్యం చేసుకున్న దాఖలాలు కూడ ఉన్నాయి. ప్రసార మాధ్యమాలు చిన్న చిన్న విషయాలనే సెన్సేషనల్‌గా మార్చి అసలు ఏమీ లేనిచోట కూడ వార్తలను సృష్టించి ప్రజల దృష్టినంతా ఆకర్షించే విధంగా ప్రసారం చేస్తున్నాయి. కాని ఇటువంటి దారుణ విషయాల పట్ల, ప్రజల దృష్టికి నిజంగా తీసుకెళ్లాల్సిన విషయాల పట్ల ఉదాసీనంగా వ్యవహరిస్తున్నాయి, లేదంటే వక్రీకరిస్తున్నాయి.

భారత పాలక వర్గాలు ఆదివాసి ప్రజానీకంపై తలపెట్టిన ఈ దాడి రెండవ దశకు చేరుకునే సరికే విధ్వంసం కనబడితే, ఈ దాడి ఉధృతం అయితే ఇక్కడ ఆదివాసి జాతి నాశనం జరుగుతుందనడంలో సందేహం లేదు. సామ్రాజ్యవాదులకూ, బహుళజాతి సంస్థలకూ ఇక్కడి అటవీ సంపదను ధారాదత్తం చేయడాన్ని వ్యతిరేకిస్తున్నందువల్లే, ఈ అడవి మాదే అని నినదిస్తున్నందువల్లే ఆదివాసి ప్రజానీకంపై పాలక వర్గాలు ఇంతటి అమానుషకాండను తలపెట్టినాయి. స్వాతంత్ర్యం వచ్చిందని ప్రకటించుకొని 60 ఏళ్లు దాటినా ఏనాడు ఆదివాసి ప్రాంతాల అభివృద్ధిని పాలకవర్గాలు పట్టించుకోలేదు. కానీ ప్రస్తుతం అభివృద్ధి జపం చేస్తూ అభివృద్ధికి ఆటంకంగా ఉందంటూ మావోయిస్టు పార్టీని అణచివేస్తామని ప్రకటిస్తోంది. నిజానికి నేడు దేశం ముందు ఎన్నో పెను సవాళ్లు ఉన్నాయి. రోజురోజుకు పేదరికం పెరిగిపోయి ప్రజల జీవన ప్రమాణాలు అడుగంటుతున్నాయి. నిరుద్యోగం, అధిక ధరలు, ఆకలి చావులు, అనారోగ్యం, అవిద్య, అభద్రత, అవినీతి, ఆహార కొరత వంటి ఎన్నో సమస్యలతో ప్రజల జీవితాలు అతలాకుతలం అవుతున్నాయి. ప్రస్తుతం ఆర్థిక సంక్షోభం దేశాన్ని కుదుపుతూ ప్రజలను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. ఈ సమస్యలను పరిష్కరించే శక్తి, చిత్తశుద్ధి ఈ రెండు లేని పాలకవర్గాలు ఈ సమస్యల నుండి ప్రజల దృష్టిని మళ్లించడం కోసం నక్సలైట్ సమస్యను భూతద్దంలో పెట్టి చూపిస్తూ వామపక్ష తీవ్రవాదం మాత్రమే నేడు దేశం ముందున్న పెను సవాల్‌గా దుష్ప్రచారం చేస్తున్నది. మావోయిస్టు పార్టీని అణచివేసే సాకుతో పెద్ద ఎత్తున సాయుధ బలగాలు ఈ ప్రాంతంలోకి అడుగుపెట్టి ఇక్కడి ప్రజల్ని విచక్షణా రహితంగా చంపుతూ, సర్వం విధ్వంసానికి పాల్పడుతూ, ఒక భయానక, భీభత్స వాతావరణాన్ని సృష్టించాయి. ఈ గడ్డ నుంచి ప్రజలను తరిమేయాలనే కుటిల పథకాన్ని సామ్రాజ్యవాదుల అండదండలతో పాలక వర్గాలు రచించాయి. ఈ పథకాన్ని ఓడించాల్సిన తక్షణ అవసరం నేడు దేశ ప్రజలందరిపైన, ప్రజాస్వామిక వాదులందరిపైనా ఉంది. ఈ అడవి మాదే అని నినదిస్తోన్న ఈ ఆదివాసిల పోరాటం కేవలం వాళ్లకు సంబంధించినది మాత్రమే కాదు. దేశాన్ని దోచుకుంటున్న సామ్రాజ్యవాదులకూ, దళారీ పాలకులకూ వ్యతిరేకంగా ఎక్కుపెట్టిన ఈ పోరాటం దేశ సార్వభౌమత్వానికి స్వాతంత్ర్యానికీ, స్వావలంబనకూ, స్వయం ప్రతిపత్తికి సంబంధించిన విషయం. ఈ పోరాటంపై పాలక వర్గాలు తలపెట్టిన దమనకాండను వ్యతిరేకించడం బుద్ధిజీవుల కర్తవ్యం.

*(రచయిత రాజనీతి శాస్త్ర పరిశోధక విద్యార్థి,*
*కాకతీయ యూనివర్సిటీ, వరంగల్)*

వీ

# చత్తీస్‌గడ్ పెట్టుబడులు - అభివృద్ధి బూటకం

***అభివృద్ధి పేరు మీద జరుగుతున్న ఒప్పందాలు బడా కార్పొరేట్ బహుళజాతి సంస్థల ప్రయోజనాలకేననీ, వీటి వల్ల సామాన్య ప్రజానీకానికి ఎటువంటి ప్రయోజనం చేకూరదనీ అంటున్నారు* విశ్వం**

'రండి, చత్తీస్‌గడ్‌పై విశ్వాసముంచండి. మొత్తం దేశాన్నే బంగారు భవిష్యత్తు వైపుకు తీసుకువెళ్లే బలం చత్తీస్‌గడ్ రాష్ట్రానికి ఉంది. నిరాశ వాతావరణంలో ఉన్న మీకు చత్తీస్‌గడ్ రాష్ట్రం వెలుగురేఖలా పనిచేస్తుంది. ఇక్కడి ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, ఇతర సాధనాలు పారిశ్రామిక అభివృద్ధికి అనుకూలంగా ఉన్నాయి. ఇక్కడ పెట్టుబడులు పెట్టడానికి గొప్ప అవకాశాలున్నాయి. చత్తీస్‌గడ్‌లో కరెంటు కోత మాటే లేదు. ఇతర రాష్ట్రాలలో ఎనిమిది నుండి పది గంటల వరకు కరెంటు కోత కొనసాగుతున్నది. పరిశ్రమలపై, ఇతర రంగాలపై యాభై సంవత్సరాల వరకు మీకు ఉత్తేజం నిలిపి ఉంచేలా మా నియమాలు ఉన్నాయి. చత్తీస్‌గడ్‌లో పరిశ్రమల అభివృద్ధికై పారదర్శకంగా, భాధ్యతాయుతమైన ప్రభుత్వంగా మీకు ఉత్తమ సేవలను అందించడానికి మేము సర్వవేళలా సిద్ధమై ఉన్నాం. పర్మిట్ పనులు సకాలంలో పుర్తయ్యేలా చూస్తాం. మా ప్రభుత్వ కార్యదర్శి నిరంతరం మానిటరింగ్ చేస్తాడు. నేను కూడా మీకు ఎల్లప్పుడు అందుబాటులో ఉంటాను. ఇటువంటి వాతావరణం మీకు దేశంలో మరెక్కడా కనిపించదు. చత్తీస్‌గడ్ వెనుకబడ్డది అనేవారు. ఇప్పుడది గెంతు వేసి దేశంలో అగ్రశ్రేణిలో ఉన్న రాష్ట్రాల సరసన చేరింది. చత్తీస్‌గడ్‌ను దర్శించండి. ఇక్కడి అనుకూలాంశాలను తెలుసుకోండి. చత్తీస్‌గడ్‌లో ఇదే మీకు మా స్వాగతం!' అంటూ 2012, నవంబర్ 2–3 తేదీల్లో జరిగిన గ్లోబల్ ఇన్వెస్టర్స్ మీట్ సందర్భంగా పెట్టుబడిదారు లకు, కార్పొరేట్ సంస్థలకు తన హృదయ పూర్వక స్వాగతం పలికాడు ముఖ్యమంత్రి రమణ్‌సింగ్. రెండు రోజులు జరిగిన ఈ మీట్‌కై ప్రభుత్వం 50 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టింది.

ఈ గ్లోబల్ మీట్‌కి వేదాంత గ్రూపు ఛైర్మన్ అనిల్ అగ్రవాల్, ఎస్సార్ నుండి ప్రశాంత్ రుయియా, అదాని గ్రూప్ నుండి రాజేష్ అదాని, గోద్రేజ్ ఛైర్మన్ ఆది గోద్రేజ్, దైనిక్ భాస్కర్ పత్రిక సమూహం నుండి రమేశ్ చంద్ర అగ్రవాల్, జిందాల్ స్టీల్ అండ్ పవర్ లిమిటెడ్ ఛైర్మన్, పార్లమెంట్ సభ్యుడు నవీన్ జిందాల్, అశోక్ హిందూజా, లాఫర్జ్, కల్యాణి స్టీల్, రుచిసోయా, ఆటో రంగంలోని లీలాండ్, ఎయిటెక్‌లు, ఇంకా అమెరికా కౌన్సిల్ జనరల్ పీటర్‌హాస్‌తో పాటు ఐస్‌లాండ్, కువైత్, కొస్టారికా, క్యూబా మొదలైన 18 దేశాలకు చెందిన ప్రతినిధులు కూడా పాల్గొన్నారు. ప్రభుత్వం చేసిన ప్రయత్నాల వల్ల కొన్ని కార్పొరేట్ సంస్థలు ప్రభుత్వంతో చేతులు కలిపాయి. మొదటిరోజే 55 వేల కోట్ల రూపాయల విలువైన ఎంఒయులు జరిగాయి. మొత్తంగా లక్ష కోట్ల రూపాయల విలువ గల పెట్టుబడులను ఈ మీట్‌లో ఎంఒయులు జరిగినట్టు తెలిసింది.

నయా రాయపూర్ అభివృద్ధి మండలితో కలిసి పనిచేయడానికి ఆరు బడా కార్పొరేట్ సమూహాలు ముందుకు వచ్చి 23 వేల 450 కోట్ల రూపాయల పెట్టుబడులు పెట్టడానికి తమ సుముఖతను చూపాయి. నయా రాయపూర్‌లో 80 హెక్టార్ల భూమిలో కాపిటల్ కాంప్లెక్స్ భవన నిర్మాణం జరుగుతున్నది. మొత్తం ఎనిమిది వేల హెక్టార్లలో నిర్మాణమవు తున్న కొత్త రాజధాని ఆకర్షణీయంగా రూపుదిద్దేందుకు సహజ సిద్ధమైన జలాశయాలు, చెరువుల నిర్మాణంతోపాటు గోల్ఫ్ కోర్స్, అత్యాధునికమైన హోటల్స్, షాపింగ్ మాల్స్, కన్వెషన్ సెంటర్, దేశంలోని ఉన్నత శిక్షణ కేంద్రాలయిన ఐఐఎం, ఎఐఐఎంఎస్, ఎన్ఐటి, నేషనల్ లా యూనివర్సిటీ లాంటివి ఉన్నాయి. ఇంకా అంతర్జాతీయ క్రికెట్ స్టేడియం, స్పోర్ట్స్ సిటీ, కాలనీలలో స్విమ్మింగ్ పూల్స్, జిమ్నాషియంలు, ఇండోర్ గేమ్స్, బిలియార్డ్స్, బ్యాడ్‌మింటన్ కోర్టులు లాంటివి కూడా ఉన్నాయి. వంద ఎకరాల స్థలంలో రు. 136 కోట్ల ఖర్చుతో ట్రేడ్ సెంటర్‌ని నిర్మించి ఏటా పరిశ్రమల వ్యాపార మేళాలు నిర్వహిస్తారు. ఎంబియాన్స్ మాల్ అనే సంస్థ రు. 10,700 కోట్ల ఖర్చుతో షాపింగ్ మాల్, కాలనీలు, హోటల్ నిర్మాణానికి ఒప్పందం చేసుకుంది. ఆమ్రపాలి అనే సంస్థ నయా రాయపూర్‌లో గోల్ఫ్‌కోర్స్, స్పోర్ట్స్ సిటీ, హౌసింగ్ ప్రాజెక్టుల కోసం తొమ్మిది వేల కోట్లు ఖర్చుపెడుతోంది. జిఎంఆర్ సంస్థ గృహ నిర్మాణాలకు వెయ్యి కోట్లు, సారడా ఎనర్జీ అర్బన్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌లో రు. 1500 కోట్లు, డెనియర్ గ్రూప్ హాస్పిటల్స్, ఎడ్యుకేషనల్ సెక్టర్‌లో రు. 1100 కోట్లు, అగ్రవాల్ ప్యాకర్స్ అండ్ మూవర్స్ లాజిస్టిక్ హబ్ కోసం రు. 150 కోట్ల పెట్టుబడులు పెట్టడానికి ఒప్పందాలు చేసుకున్నాయి. మొత్తంగా నయా రాయపూర్ కేంద్రంగా నగరాభివృద్ధికి, రియల్ ఎస్టేట్‌లపై పెట్టుబడుల కేంద్రీకరణ జరిగింది.

రమణ్‌సింగ్ ప్రభుత్వం పెట్టుబడులను ఆకర్షించే పేరుతో రియల్ ఎస్టేట్ వ్యాపారానికి పెద్ద ఎత్తున రాయితీలను కల్పించింది. టౌన్‌షిప్‌కై 54 ఎకరాలుగా ఉన్న భూ పరిమితిని ఎట్టకేలకు ప్రభుత్వం రద్దు చేసింది. ఇప్పుడు ఏ బిల్డర్ అయినా పెద్ద పెద్ద ఏరియాలలో కాలనీలను నిర్మించవచ్చు. గతంలో దీనికి విరుద్ధంగా 54 ఎకరాల సీలింగ్ ఉండేది. రియల్ ఎస్టేట్ వ్యాపారానికి వ్యవసాయ భూములు డైవర్షన్ కూడా పెద్ద అడ్డంకిగా ఉండేది. రమణ్‌సింగ్ ప్రభుత్వం ఆ నిబంధనలను మార్చి కొత్త చట్టాన్ని తయారు చేసింది. ఈ కొత్త చట్టం ప్రకారం ఎవరైనా వ్యవసాయ భూములు కొని గృహనిర్మాణ ప్రాజెక్టులను తయారు చేయవచ్చు. 200–250 ఎకరాలలో కూడా పెద్ద పెద్ద టౌన్‌షిప్‌లను నిర్మించవచ్చు. ఈ కొత్త చట్టంతో రియల్ ఎస్టేట్ వ్యాపారానికి ఏ అడ్డంకులు లేకుండా పోయాయి. ఈ చట్టం మార్పుతో రియల్ ఎస్టేట్ వ్యాపారం త్వరితగతిన అభివృద్ధి చెందేలా చేసిందంటూ ప్రముఖ రియల్ ఎస్టేట్ డీలర్ అయిన ఆనంద్ సింఘానియా సంతృప్తిని వ్యక్తం చేసాడంటే, రమణ్‌సింగ్ ప్రభుత్వం ఎవరి ప్రయోజనాలను కాపాడుతుంది అనేది చెప్పకనే అర్థం అవుతుంది.

ఈ గ్లోబల్ మీట్‌లో రాష్ట్రంలోని నిరుద్యోగ యువతకు ఉద్యోగావకాశాలు కల్పించే విషయానికి ప్రాముఖ్యతనివ్వడమే తమ ప్రభుత్వ లక్ష్యంగా చెప్పింది. ఈ మీట్‌లో లక్ష కోట్ల రూపాయల విలువైన ఎంఒయులు జరిగినా దాంట్లో రు. 20,700 కోట్ల పెట్టుబడులు హౌసింగ్ నిర్మాణాలకే వచ్చాయి. ఎల్‌పిజి గ్యాస్ పైపులైన్ నిర్మాణానికి మరో 2500 కోట్ల రూపాయలు, సారడా ఎనర్జీ లిమిటెడ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌కై 1500 కోట్ల రూపాయలు. ఇలా మొత్తంగా రు. 24,700 కోట్లు నిర్మాణ సంబంధిత

పనులకు సంబంధించినవే. ఈ పెట్టుబడులేవీ నిరుద్యోగ యువతకు పర్మనెంట్ ఉద్యోగాలు కల్పించలేవు. మహా అయితే మట్టి గిట్టి మోసే కూలీపనులు కొంత దొరకవచ్చు. తాపీ మేస్త్రీ లాంటి అసంఘటిత కార్మికులకు కొద్దిరోజులు పనులు దొరికే మాట వాస్తవమే అయినా బంగ్లాలు, రోడ్లు, బ్రిడ్జీలు, మురికి కాల్వలు, పైపులైన్లు, కాలనీలు లాంటి నిర్మాణాలు పూర్తి కాగానే పనులన్నీ అయిపోతాయి. పెట్టుబడులు రాబట్టడం ద్వారా జరిగిన అభివృద్ధి ఇదే అంటే ఎవరు నమ్ముతారు. రియల్ ఎస్టేట్ వ్యాపారం లాభసాటి కావడంతో ప్రభుత్వం కూడా జాయింట్ వెంచర్ మొదలు పెట్టింది. ప్రస్తుత పెట్టుబడులలో రు. 31,650 కోట్లు రియల్ ఎస్టేట్‌తో సహా నయా రాయపూర్ నగరాభివృద్ధిపై కేంద్రీకరించాయనేది స్పష్టం. ఢిల్లీలోని ఇంజనీరింగ్ ప్రాజెక్టు ఇండియా లిమిటెడ్ అనే కంపెనీ రాయపూర్ నుండి నయా రాయపూర్‌కి రు. 4500 కోట్ల పెట్టుబడితో మోనో రైలును నడిపేందుకు సిద్ధపడింది. అయితే ముప్పై కిలోమీటర్ల పొడవైన రైలు మార్గాన్ని మాత్రం చత్తీస్‌గడ్ ప్రభుత్వం రెండేళ్లలో నిర్మించి ఇవ్వాలి. రమణ్‌సింగ్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే నూతన పారిశ్రామిక విధానాన్ని రూపొందించి పెట్టుబడిదారులకు ఉచితంగా భూమి, నీరు, విద్యుత్తు లభించేలా రాయితీలను కల్పిస్తూ నిర్ణయాలు చేసింది. పరిశ్రమల కోసమని ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌ను ప్రభుత్వాలు ప్రజాధనంతో తయారు చేసి పెడితే లాభాలను మాత్రం కార్పొరేట్ సంస్థలు దున్నుకుపోతున్నాయి. ఎన్‌టిపిసి రాయగఢ్‌లో మెడికల్ కాలేజీకి వంద కోట్ల రూపాయలు, రాయపూర్‌లో ఇంజనీరింగ్ కాలేజీకి మరో వంద కోట్ల రూపాయలు ఖర్చు పెట్టేందుకు ఒప్పందాలు కుదిరాయి. డెనియర్ గ్రూప్ కూడా హాస్పిటల్, ఎడ్యుకేషన్ సెక్టర్‌లో 1100 కోట్ల రూపాయల పెట్టుబడులు పెట్టడానికి సిద్ధపడింది. ఎడ్యుకేషనల్ సెక్టార్‌లో కార్పొరేట్ సంస్థల ప్రవేశంతో విద్య సామాన్యులకు అందుబాటులో లేకుండా పోయింది. ఐఐటిలో ఏడాదికి ఫీజు 90 వేల రూపాయలు. ఉన్నత విద్యను అభ్యసించేందుకు ఖర్చులు విపరీతంగా పెరిగిపోవడంతో రాష్ట్రంలో ఉన్నత విద్యను అభ్యసించే విద్యార్థుల సంఖ్య కేవలం 9.3 శాతమే ఉంది.

కొత్త రాజధాని ఏర్పాటుతో నయా రాయపూర్, రాయపూర్‌లలో రియల్ ఎస్టేట్ వ్యాపారం ఊపందుకుంది. నయా రాయపూర్‌లోని ఎనిమిది వేల హెక్టార్లలో నిర్మించే గృహ సముదాయాలలో ఐదు లక్షల ఇళ్లను నిర్మించే యోజన ఉంది. ఈ రియల్ ఎస్టేట్ వ్యాపారం సుమారు ఇరవై లక్షల కోట్ల రూపాయలకు పైగానే ఉంటుందని అంచనా. బిల్డర్స్ పుట్టగొడుగుల్లా వెలిసారు. పెద్ద ఎత్తున సాగుతున్న రియల్ ఎస్టేట్ వ్యాపారంతో భూముల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. భూ కబ్జాలు పెరిగాయి. భూ మాఫియా ముఠాలు కూడా తయారైనాయి. రియల్ ఎస్టేట్ వ్యాపారం బిల్డర్స్ పాలిట బంగారు కాసుల పంట తయారయింది. మరో పక్క భూములు కోల్పోయిన రైతాంగం తీవ్ర ఆవేదనకు గురై అనేక కష్టాల పాలవుతున్నారు. కాపిటల్ కాంప్లెక్స్ నిర్మాణంకై భూములను ఖాళీ చేసిన రాఖి గ్రామస్తులకు భూమి ధరతో పాటు, పది సంవత్సరాల పాటు ఏటా పదిహేను వేల రూపాయల ప్రత్యేక ఆర్థిక ప్యాకేజీ రమణ్‌సింగ్ ప్రకటించగా, నిర్వాసితులు ఆ ఆర్థిక ప్యాకేజీని తిరస్కరిస్తూ, హర్యానా ప్రభుత్వం లాగా భూమి ధరతోపాటు 33 సంవత్సరాల పాటు రు. 21,000లుగా ప్రత్యేక ప్యాకేజీని ఇవ్వాలంటూ తమ ఆందోళనను కొనసాగిస్తున్నారు. కొత్త రాజధాని కోసం సేకరించిన ఎనిమిది వేల హెక్టార్ల భూముల కోసం నిర్వాసితులకు చెల్లించే మొత్తం రెండు వేల కోట్ల రూపాయలకు మించడం లేదు. కానీ, ఆ భూముల మీదనే 20–30 లక్షల కోట్ల రూపాయల విలువగల రియల్ ఎస్టేట్ వ్యాపారం సాగుతున్నది. ఇది రమణ్‌సింగ్ ప్రభుత్వం పెట్టుబడుల భాగోతం.

చత్తీస్‌గడ్ రాష్ట్ర అవతరణతో రాష్ట్ర ప్రభుత్వంలోని ఉన్నతాధికారుల (బ్యూరోక్రాట్స్) సెక్షన్ బలపడుతున్నది. అపారమైన ఖనిజ సంపదలు గల చత్తీస్‌గడ్‌లో ప్రజలను కంట్రోల్ చేయడానికి ప్రభుత్వానికి ఈ బ్యూరోక్రాట్స్ అవసరం ఎంతో ఉంది. విఐపి సిటీ పేరుతో నిర్మాణం మొదలుపెట్టిన కాలనీలో ఒక్కో ఇండిపెండెంట్ బంగ్లా ఖరీదు 70 లక్షల రూపాలు. ఇంకా ఈ కాలనీలో స్విమ్మింగ్ పూల్, జిమ్నాషియం, ఇండోర్ గేమ్స్, బ్యాడ్మింటన్ కోర్టు వగైరాలు ఉన్నాయి. ఇంతటి విలాసవంతమైన నయా రాయపూర్‌లో ఎంఐజి గ్రూపు ఇళ్లను మాత్రం 21 శాతానికే పరిమితం చేసింది ప్రభుత్వం.

రియల్ ఎస్టేట్ తరువాత పర్యాటక రంగంలో పెట్టుబడులు ప్రవేశించాయి. ఇందులో రు. 1572 కోట్ల విలువైన పెట్టుబడులకు ఎంఒయులు జరిగాయి. కార్పొరేట్ కంపెనీలు ఎక్కువగా ఫైవ్‌స్టార్ హోటల్స్‌కి, ఎయిర్ కనెక్టివిటీకి పెట్టుబడులు పెట్టడానికి ముందుకు వచ్చాయి. ముంబాయిలోని ఇన్నొవేటివ్ అండ్ ఎంటర్‌టైన్మెంట్ కంపెనీ ఫన్‌సిటీ పార్కు కోసం రు. 400 కోట్లు, మరో కంపెనీ బిలయ్‌లో హర్బల్ ప్లాంట్‌కి రు. 200 కోట్లు, టోటల్ ఇంఫర్మేమేటివ్ హోటల్‌కై రు. 200 కోట్లు, జిందాల్ యూనివర్సల్ ఇండియా రాయగఢ్‌లో హోటల్ కోసం రు. 450 కోట్లు, యూనిటీ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఫైవ్‌స్టార్ హోటల్‌కై రు. 200 కోట్లు, గౌతంరాజ్ డెవలప్‌మెంట్ ఫైవ్‌స్టార్ హోటల్‌కై వంద కోట్ల రూపాయలు, ఇంకా రూట్స్ కార్పొరేషన్ వంద కోట్ల రూపాయలు, సౌభాగ్య తిలక్ ఇరవై కోట్ల రూపాయలు, కాస్మో స్పాంజ్ పవర్ రు. 75 కోట్లు హోటళ్లకై ఖర్చు పెడుతున్నాయి. రియల్ ఎస్టేట్ తరవాత పర్యాటక రంగంలో హోటళ్ల వ్యాపారం లాభసాటిగా తయారయింది.

విలాసవంతమైన ఈ ఫైవ్‌స్టార్ హోటళ్లలో ఒకరోజు విడిది లక్షల్లో మాట. సామాన్యుడికి ఏ మాత్రం అందుబాటులో లేనటువంటిది. రోజుకి ఇరవై రూపాయలతో బతుకులెల్లదీసే సగం జనాభా కలిగిన చత్తీస్‌గడ్ రాష్ట్రంలో, స్వర్గాన్ని మరిపించే ఈ ఫైవ్‌స్టార్ హోటళ్ల సంస్కృతి వాస్తవానికి ఇది సామ్రాజ్యవాద సంస్కృతే. వీటిని పెంచి పోషించడం బడా కార్పొరేట్ సంస్థల ముందు మోకరిల్లే రమణ్‌సింగ్‌కే చెల్లుబాటవు తుంది. పర్యాటక రంగంలో అభివృద్ధి అంటే వ్యభిచారం, తాగుడు, డ్రగ్స్‌ని పెంచి పోషించడమే.

రాష్ట్రం ఏర్పడిన నాటి నుండి 173 పెద్ద మధ్య తరహా పరిశ్రమలు నెలకొల్పబడ్డాయి. వాటి పెట్టుబడుల విలువ రు. 75,241 కోట్లు. అలాగే 44,623 చిన్న తరహా పరిశ్రమలు కూడా నెలకొల్పబడ్డాయి. వాటి మొత్తం పెట్టుబడి రు. 1602 కోట్లు. గుప్పెడు పరిశ్రమల్లో పెట్టుబడి కేంద్రీకరణ ఏమి తెలియజేస్తున్నది. టాటా స్టీల్ బస్తర్‌లో పదివేల కోట్ల రూపాయల ఖర్చుతో ఏటా యాభై లక్షల టన్నుల ఇనుము ఉత్పత్తిగా లోహండిగూడాలో, ఆరువేల కోట్ల రూపాయల ఖర్చుతో ఎన్ఎండిసి ఏటా 32 లక్షల టన్నుల లక్ష్యంతో నగర్‌నార్‌లో స్టీల్ ప్లాంట్‌ల ఏర్పాటుకు అనుమతులనిచ్చింది ప్రభుత్వం. అయితే ఈ రెండు బడా కంపెనీలు భూసేకరణలో అవలంబించిన విధానాల వల్ల మూలకు పడ్డాయి. ప్రజలు తమ జీవనాధారమైన వ్యవసాయ భూములను ఇచ్చేందుకు ఇష్టపడడం లేదు. రమణ్‌సింగ్ ప్రభుత్వం బడా కంపెనీల పక్షాన నిలబడి వేలాదిగా పోలీసు బలగాలను దింపి ప్రజలపై తీవ్ర నిర్బంధాన్ని ప్రయోగిస్తున్నది. ప్రజలు కూడా వెరవక తమ ప్రతిఘటనను కొనసాగిస్తున్నారు. ఇంద్రావతి నదిపై బోద్‌ఘాట్ వద్ద ప్రభుత్వం తలపెట్టిన 500 మెగావాట్ల జల విద్యుత్తు ప్రాజెక్టు పరిస్థితి కూడా ఇంతే. సర్‌గుజా, బస్తర్‌లోని లోహండిగూడ, బోద్‌ఘాట్, రావ్‌గాట్, నగర్‌నార్‌లలో పరిశ్రమల (ప్రాజెక్టులు) స్థాపన

అంటే అక్కడి ఆదివాసుల విస్తాపనగా తయారయింది పరిస్థితి. మల్టీనేషనల్ కంపెనీలకు ఊడిగం చేసే రమణ్‌సింగ్‌కు నిర్వాసితులవుతున్న ఆదివాసుల కడగండ్లు ఎందుకు కనిపిస్తాయి.

టాటాలాంటి స్టీల్ ఫ్యాక్టరీలు స్థాపించడమే అభివృద్ధికి సూచిక అనుకుంటే అది ఒట్టి బూటకం మాత్రమే. జంషెడ్‌పూర్‌లోని టాటా స్టీల్ ఫ్యాక్టరీ నెలకొల్పి వంద సంవత్సరాలు అయినా జార్ఖండ్ రాష్ట్రం ఏ మాత్రం అభివృద్ధికి నోచుకోకుండా ఎలా ఉండగలిగింది. మల్టీ నేషనల్ కంపెనీలు, బడా కార్పొరేట్ సంస్థలు ప్రజల అభివృద్ధిని కాంక్షించి పెట్టుబడులను ఎప్పుడు పెట్టవు. వాటికి లాభాలు ముఖ్యం. లాభాలు తప్పించి వాటికి మరే ధ్యాస ఉండదు. అభివృద్ధి మాట ఎలా ఉన్నప్పటికీ, ఈ కార్పొరేట్ కంపెనీలు మాత్రం మరో పదేళ్ల కాలానికి పదో లేక ఇరవయో వేల కోట్ల రూపాయలను వెనకేసుకోవడం మాత్రం ఖాయం. ఇందుకు వేదాంత కంపెనీనే ఉదాహరణగా తీసుకోవచ్చు. దేశంలో సరళీకరణ విధానాలు మొదలైన నాడు అనిల్ అగ్రవాల్ పేరును ఎవరు ఎరుగరు. అదే ఇరవై ఏళ్లలో ఆయన సంపద 1025 రెట్లు పెరిగింది. అదే ఇరవై ఏళ్లలో టాటా సంపద 38 రెట్లు పెరిగింది. ఇలా మహీంద్ర 270 రెట్లు, ముకేష్ అంబానీ 101 రెట్లు తమ సంపదలను పెంచుకున్నారు. ముకేష్ అంబానీ రిలయన్స్ ఇండస్ట్రీస్ ఒక్క సంవత్సరం లోనే 6601 కోట్ల రూపాయల పెట్టుబడిని పెంచుకుంది. పెట్టుబడులను ఆహ్వానించడమంటే కర్కశంగా కార్పొరేట్ సంస్థలు, మల్టీనేషనల్ కంపెనీలు తమ సంపాదనలు మరింత పెంచుకోవడానికి లైసెన్సును మంజూరు చేయడం లాంటిదే. ఆదివాసుల, రైతుల భూముల నుండి ఖనిజాన్ని తవ్వి అమ్ముకోకుండా, కార్మికుల శ్రమను దోచుకోకుండా ఏ కార్పొరేట్ సంస్థ తన సంపదను పెంచుకోలేదు. తమ లాభాలను దన్నుకోవడానికి బడా కంపెనీలు ప్రజలపై ఎలాంటి దయా దాక్షిణ్యాలు చూయించలేవు. అందుకు గాను, రమణ్‌సింగ్ తన ప్రభుత్వ సాయుధ బలగాలతో ఎల్లప్పుడు వారికి అందుబాటులో ఉండనే ఉన్నాడు. బడా కంపెనీలు, రాజకీయ నాయకులు, ప్రభుత్వంలోని ఉన్నత శ్రేణి అధికారుల త్రయం ఒక్కటై ప్రజల మూల్గులను పీల్చివేస్తున్నాయి.

రాష్ట్ర అభివృద్ధి కోసం పెట్టుబడులను ఆకర్షించేందుకే ఈ గ్లోబల్ ఇన్వెస్టర్స్ మీట్ అంటున్నాడు రమణ్‌సింగ్. కాని, వాస్తవానికి రాష్ట్రాన్ని కార్పొరేట్ కంపెనీల ముందు అమ్మకానికి పెట్టినట్టుంది వ్యవహారమంతా. అందుకే ఓ కాంగ్రెస్ నేత 'బిజెపి ఇప్పటికే రాష్ట్రాన్ని తెగ అమ్మింది. ఇంకా ఏమి మిగిలిందని ఈ మీట్‌లో అమ్మడానికి' అంటూ వ్యాఖ్యానించాడు. కాంగ్రెస్ తానేమి తక్కువయ్యినట్టు.

అసలు రమణ్‌సింగ్ ప్రభుత్వానికి అభివృద్ధా, పరిశ్రమలా, పెట్టుబడులా ఏమి కావాలి? పరిశ్రమల స్థాపన ద్వారానే అభివృద్ధిని సాధించాలనే చిత్తశుద్ధి గనక ఉంటే, దేశంలోని వివిధ పరిశ్రమలకు సప్లయి చేస్తున్న ముడిసరుకుల ఆధారిత పరిశ్రమలను ఎన్నింటినో నెలకొల్పవచ్చు. రాష్ట్రంలో స్పాంజ్ ఐరన్ పరిశ్రమలు 105 వరకు ఉన్నాయి. వీటికి ముడిసరుకుగా ఉపయోగపడే ఐరన్ ఓర్ ధరను ఎన్ఎండిసి మొండిగా పెంచడంతో, ఆ ధరను చెల్లించలేక ఇరవైకి పైగా స్పాంజ్ ఐరన్ పరిశ్రమలు మూతపడ్డాయి. మరికొన్ని మూత పడేందుకు సిద్ధంగా ఉన్నాయి. ఉత్పత్తి 30 శాతానికి పడిపోయింది. ఎన్ఎండిసి ఐరన్ ఓర్‌ను చిన్న, మధ్య తరహా పరిశ్రమల కంటే జపాన్ లాంటి విదేశాలకే ఎగుమతి చేసేందుకు సిద్ధంగా ఉంది. ఐరన్ ఓర్ ధరను 1500 రూపాయల వరకు తగ్గించాలని చత్తీస్‌గఢ్ స్పాంజ్ ఐరన్ పరిశ్రమల అసోసియేషన్ డిమాండ్ చేస్తున్నది. ఎన్ఎండిసి మాత్రం కేవలం 300 రూపాయలు మాత్రమే తగ్గించింది. ఈ ధరకు ఐరన్ ఓర్‌ను కొనలేక రాష్ట్రంలోని స్పాంజ్ ఐరన్ పరిశ్రమల అస్తిత్వానికే ముప్పు ఏర్పడింది.

గత పది సంవత్సరాలుగా మందేర్ (రాయపూర్) అకల్‌తరా (జాంజ్‌గిర్) లోని సిసిఐ కింద ఉన్న సిమెంట్ కంపెనీలు మూతపడ్డాయి. కేంద్రం వాటిని ఇప్పుడు అమ్మివేయాలని చూస్తున్నది. ఈ మూతపడ్డ కంపెనీలు తిరిగి తెరచుకునేలా తగిన నిధులను సమకూర్చి, వీధినపడ్డ కార్మికులను ఆదుకోవచ్చు గదా! కానీ, అలా జరగడం లేదు. రమణ్‌సింగ్ ప్రభుత్వానికి ఏ మాత్రం నిజాయితీ లేదనేది తెలుస్తూనే ఉంది.

బైలదిల్లా గనుల నుండి వెలికి తీస్తున్న ఐరన్ ఓర్‌కి రాష్ట్రంలోని చిన్న తరహా పరిశ్రమలకు సప్లయి అయ్యేలా రమణ్‌సింగ్ ఏ మాత్రం చొరవ చూపడం లేదు. కొరబా గనుల నుండి తీసే ముడి సరుకులో తమకు 50 శాతం కేటాయించాలని రాష్ట్రం స్పాంజ్ ఐరన్ పరిశ్రమల అసోసియేషన్ అధ్యక్షుడైన అనిల్ నాచ్‌రాని ప్రభుత్వాన్ని డిమాండ్ చేసాడు. వాస్తవానికి బైలదిల్లా నుండి ఉత్పత్తి అవుతున్న ముడిసరుకు మొదటగా రాష్ట్ర పరిశ్రమలకు అందించిన తరువాతనే ఇతర దేశాలకు ఎగుమతి చేయాలనేది న్యాయసమ్మతమైన విషయం. కాని, బడా కార్పొరేట్ కంపెనీలకు దాసోహం అయిన రమణ్‌సింగ్ ప్రభుత్వానికి చీమకుట్టినట్టు కూడా లేదు. అంతకంటే ఎక్కువ ఆశించడం కూడా మన తప్పే అవుతుంది. రమణ్‌సింగ్ ప్రభుత్వం అభివృద్ధి, పరిశ్రమలు, పెట్టుబడులు అన్నీ వట్టి నీటిబుడగలని తేలిపోయింది.

గతంలో కోర్ సెక్టారులలో పెట్టుబడులను అనుమతించడం ద్వారా రాష్ట్రంలో ఉద్యోగవకాశాలు మెరుగు పడతాయనుకున్నారు. కాని, ప్రభుత్వం ప్రచారం చేసినట్టుగా జరగలేదు. బడా కంపెనీలు ఖనిజ తవ్వకాలలో మానవ శ్రమకు బదులు పెద్ద ఎత్తున భారీ యంత్రాలతో పనులు చేస్తూ లాభాన్వేషణలో అనుకున్న దానికన్న ముందుగానే ఖనిజాన్ని స్వాహ చేస్తున్నాయి. లోపభూయిష్టమైన ప్రభుత్వ విధానాల వల్ల రాష్ట్ర ప్రజలను కనీసం మైనింగ్ పనుల్లో చివరకు కూలీ అయినా దక్కకుండా పోయింది. ఈ గ్లోబల్ ఇన్వెస్టర్స్ మీట్ సందర్భంగా ఐటి, ఆటోమోబైల్ రంగాలకు ప్రాధాన్యతనిస్తున్నట్టు ప్రభుత్వం తెలిపింది. అయితే ఐటి రంగంలో పెట్టుబడులు ఆశించిన విధంగా రాలేదు. బెంగుళూరులోని డెలీ మాట్రిక్స్ సంస్థ మాత్రం రు. 13.5 కోట్లు పెట్టడానికి సిద్ధపడింది. ప్రస్తుతం ఐటి రంగంలో కూడా మందగమనం మొదలైన సూచనలు కనబడుతున్నాయి. ఐటి పరిశ్రమ తక్కువ సంఖ్యలో ఉన్న ఉన్నత వర్గానికి మాత్రమే ఉపయోగపడుతుంది. సర్వీసు రంగం కంటే మాన్యుఫ్యాక్చరింగ్ రంగంలో పెద్ద సంఖ్యలో చిన్న పెద్ద ఉద్యోగావకాశాలుంటాయి. భారతదేశం మొత్తంగానే వ్యవసాయిక రంగం అభివృద్ధి సాధించకుండా, చత్తీస్‌గఢ్ రాష్ట్రం సమగ్ర అభివృద్ధిని సాధించే మాటే లేదు.

రాష్ట్ర అవతరణ జరిగి పన్నెండేళ్లయినా వ్యవసాయం పట్ల రమణ్‌సింగ్ ప్రభుత్వం తీవ్ర నిర్లక్ష్యం వహించింది. పైగా ఇప్పటికే చేసింది చాలదన్నట్టుగా, వ్యవసాయాన్ని కూడా కార్పొరేట్ పరం (పిపిపి కింద) చేస్తున్నది. వ్యవసాయంలో ప్రభుత్వ ప్రాజెక్టులు సరిగా అమలు జరిగే విధంగా ఈ బాధ్యతలను కార్పొరేట్ సంస్థలకు ఇచ్చేందుకు తయారీలు చేస్తున్నది రాష్ట్ర ప్రభుత్వం. ఇది రైతులను తమ వాకిట్లోనే దోచుకునే పద్ధతి. కార్పొరేట్ సంస్థలు తమ ధన బలంతో రైతుని నియంత్రించేందుకు అవకాశం ఉంది. రైతు పొలంపై రైతుకు కాకుండా 50 శాతం సబ్సిడీని కార్పొరేట్ సంస్థలకే అందచేస్తున్నది ప్రభుత్వం.

చత్తీస్‌గఢ్‌లోని గ్రామాల్లో రైతుల పరిస్థితి దయనీయంగా తయారయింది. నీటి సౌకర్యం సరిగా లేకపోవడం, ఖర్చులు పెరిగి పోవడంతో వ్యవసాయం గిట్టుబాటు లేకుండా పోతున్నది. తీసుకున్న రుణాలు తీర్చలేక ఎంతోమంది రైతులు తమ పంట పొలాల్లోనే ఆత్మహత్యలు

చేసుకుంటున్నారు. రమణ్‌సింగ్ పాలించిన ఈ అయిదు సంవత్సరాల కాలంలోనే ఏడు వేల మందికి పైగా రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. ఆత్మహత్యల్లో చత్తీస్‌గడ్ అయిదో స్థానంలో నిలిచింది. 2010లో ఒక సంవత్సరంలోనే 1126 మంది ఆత్మహత్యలు చేసుకున్నట్లు రికార్డయింది. కార్పొరేట్ కంపెనీలకు 24 గంటలు అందుబాటులో ఉంటానన్న రమణ్‌సింగ్‌కి రైతులు పడుతున్న కష్టాలు తలకెక్కడం లేదు. ఇది రమణ్‌సింగ్ కార్పొరేట్ బానిస బుద్ధి.

మండల్ సభ్యుడైన డా. ఎం.ఎల్. అడిల్ రాయపూర్‌లో జరిగిన చత్తీస్‌గడ్ పంచాయతీ మేళాలో మాట్లాడుతూ 'అన్నదాత గురించి అందరూ మాట్లాడుతారు. కాని, చత్తీస్‌గడ్‌లోని ఇరవై వేల గ్రామాల్లోని ఓ అయిదు గ్రామ పంచాయితీలను వ్యవసాయ అభివృద్ధి చెందిన ఆదర్శ గ్రామాలుగా చూపించమనండి' అంటూ ప్రభుత్వాన్ని నిలదీస్తాడు. రాష్ట్రంలో నేటికి 65 శాతం ప్రజలు తమ తమ జీవనోపాధి కోసం వ్యవసాయం మీదనే ఆధారపడి జీవిస్తున్నారు. కొద్దిమందిగా ఉన్న భూస్వాముల కుటుంబాల వద్దనే ఎక్కువ శాతం భూమి కేంద్రీకరించబడి ఉంది. 75 శాతంగా ఉన్న పేద, చిన్న, మధ్యతరగతి రైతాంగం దగ్గర కేవలం 2 నుండి 5 ఎకరాల భూమి మాత్రమే ఉంది. నేటి స్థితిలో వీరందరూ రైతుకూలీల స్థితికి దిగివచ్చారు. దాన్ కా కటోరిగా పేరు గాంచిన చత్తీస్‌గడ్ రైతాంగం రమణ్‌సింగ్ ప్రభుత్వం తీవ్ర నిర్లక్ష్యానికి గురై బతుకులీడుస్తున్నారు. బ్రిటిష్ వారు దేశం విడిచి 65 సంవత్సరాలు దాటినా ఇప్పటికీ రాష్ట్రంలో భూ సంస్కరణలు అమలు జరగలేదు. రైతాంగానికి తగినంత భూమి దొరకనంత కాలం వారి ఆర్థిక పరిస్థితి మెరుగుపడడం అసాధ్యం. తగినంత భూమి, నీటి వసతి, ఎరువుల లభ్యతా లాంటివి రైతాంగానికి సులువుగా లభించడం ద్వారా వ్యవసాయం లాభసాటిగా తయారై రైతుకు వెసులుబాటు నిస్తుంది. తద్వారా మంచి పంటలు రావడం వల్ల రైతుల కొనుగోలు శక్తి పెరుగుతుంది. దాంతో సైకిళ్లు, సైకిల్ మోటర్లు, రేడియోలు, గడియారాలు, టివిలు, వంట పాత్రలు, బట్టలు, గృహ ఉపయోగ వస్తువులు, బల్బులు, వైర్లు లాంటి ఎలక్ట్రికల్ గూడ్స్, ప్రయాణాలకు ఉపయోగపడే జీపులు, బస్సులు, ట్రక్కులు, వ్యవసాయానికి ఉపయోగపడే పారలు, గడ్డపారలు, గొడ్డళ్లు లాంటి పనిముట్లతో సహా ట్రాక్టర్లు, ఎరువులు లాంటి కంపెనీలలో తయారయ్యే వస్తువుల డిమాండ్ కూడా పెరిగి పారిశ్రామిక అభివృద్ధి తీవ్ర గతిన సాగుతుంది. తేయాకు, చక్కెర, నూలు, కాఫీ, సిగరెట్, బిస్కట్ ఇవన్నీ కూడా వ్యవసాయం మీద ఆధారపడిన పరిశ్రమలే. నూనె మిల్లులు, రైసు మిల్లులు, చేనేత వస్త్రాలు, బీడీలు లాంటి చిన్న, కుటీర పరిశ్రమలకు కూడా వ్యవసాయం నుండే ముడిసరుకు సరఫరా అవుతుంది. ట్రాన్స్‌పోర్ట్ రంగానికి కూడా వ్యవసాయమే ముఖ్య ఆధారం. రోడ్డు, రైలు మార్గాల ద్వారా ఎక్కువ శాతం వ్యవసాయ ఉత్పత్తులనే వివిధ ప్రాంతాలకు చేరవేయడం జరుగుతున్నది. దేశం నుండి ఎగుమతి అయ్యే వస్తువులలో 20 శాతం వరకు వ్యవసాయ రంగానికి చెందినవే. ఇలా క్రమానుగతంగా వ్యవసాయాన్ని ఆధారం చేసుకుని పరిశ్రమ అభివృద్ధి అనేది శీఘ్రగతిలో వృద్ధిని సాధిస్తుంది. వ్యవసాయం వెనుకబడడంతో విద్య, వైద్య సేవలను అశేషమైన ప్రజానీకం వాటిని విరివిగా ఉపయోగించుకునే అవకాశాలు లేకుండా పోయాయి. ఆ కారణంగా వాటి అభివృద్ధిలో కూడా మందగమనం కొనసాగుతోంది. ఆటోమోబైల్ రంగం కూడా అంతే. అలాగాక కేవలం పెట్టుబడులను ఆకర్షించడం ద్వారా రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలో తీసుకెళతాననడం రాష్ట్ర ప్రజలను మభ్యపెట్టడమే. గ్లోబల్ మీట్ సందర్భంగా దిగిన పెట్టుబడుల వల్ల మల్టీ నేషనల్, బడా కార్పొరేట్ కంపెనీలకు, వారికి సేవచేసే లేదా కమిషన్ కోసం పాకులాడే రాజకీయ నాయకులకు, ఉన్నతశ్రేణిలో అధికారులకు ప్రయోజనం తప్ప, రాష్ట్ర ప్రజలకు ఒరిగే ప్రయోజనం మాత్రం శూన్యం.

ఇక్కడ మరో విషయం చర్చించాల్సి ఉంది. రాష్ట్ర అవతరణ దినోత్సవాల సందర్భంగా ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ తమ ప్రభుత్వం సాధించిన అభివృద్ధి ఫలాలను గురించి వివరిస్తూ 'గర్వించాల్సిన విషయమేమిటంటే చత్తీస్‌గడ్ దేశంలో మొదటి స్థానాల్లో నిలిచింది. రాష్ట్రం గణనీయమైన ప్రగతిని సాధించింది. అభివృద్ధిలోని ప్రతి అడుగులో మా ముఖ్య ధ్యేయమేమిటంటే, అభివృద్ధి లాభాలు మొట్టమొదటగా సమాజంలోని ఆఖరి లైనులోని ఆఖరి మనిషి వరకు చేరడం. ఇప్పుడు రాష్ట్రంలో ప్రతి వ్యక్తి ఆదాయం రు. 44,057కు పెరిగింది. ఇది మనందరం గర్వించాల్సిన విషయం' అంటూ ఏదేదో వివరిస్తూపోయాడు.

వక్రమార్గంలో జరుగుతున్న అభివృద్ధి వల్ల రాష్ట్ర ప్రజలకు ఏ మాత్రం ప్రయోజనం చేకూరలేదు. పన్నెండేళ్లుగా వచ్చిన లాభాలన్నింటినీ ఒక వర్గం మాత్రమే చేజిక్కించుకున్నది. సాధారణ ప్రజలంతా మరింత పేదలయ్యారు. బస్తర్‌లోని ఆదివాసులు గత ఏడు సంవత్సరాలుగా సల్వాజుడుం – గ్రీన్‌హంట్ నిర్బంధకాండలో నలిగిపోతున్నారు. అభివృద్ధి పేరుతో సాగే కార్పొరేట్ విధ్వంసక పదఘట్టనల కింద పడి ఆఖరి లైనులోని ఆఖరి మనిషి అయిన ఆదివాసి కూడా నలిగిపోకుండా తప్పించుకోలేకపోయాడు. దేశంలోని మూడింట ఒక వంతు జనాభా అంటే నలభై కోట్ల మంది ప్రజలు కడుపేదరికంతో బతుకులెల్లదీస్తుంటే, చత్తీస్‌గడ్‌లో సగటు మనిషి ఆదాయం పెరిగిందనేది ఒట్టి మోసం, దగా మాత్రమే. నేషనల్ నమూనా సర్వే లెక్కల ప్రకారం చత్తీస్‌గడ్‌లో నెలకు 780 రూపాయలు ఖర్చు పెడుతుంటే, టెండుల్కర్ కమిటీ సర్వే ప్రకారం నెలకు 512 రూపాయలు మాత్రమే ఖర్చు పెడుతున్నారు. అంటే సంవత్సరానికి 9,360 రూపాయలు లేదా, టెండుల్కర్ లెక్కల ప్రకారం 6,154 రూపాయలు సగం జనాభా ఖర్చు పెడుతుంటే, రమణ్‌సింగ్ ప్రభుత్వం చెబుతున్న విధంగా రాష్ట్రంలోని ప్రతి వ్యక్తి ఆదాయం 44,057 రూపాయలుగా ఎక్కడ పెరిగినట్టు. రాష్ట్రంలోని కడు పేదవాని 6,154 లేదా 9,360 రూపాయలతో అనిల్ అగ్రవాల్ (వేదాంత) రమేశ్‌చంద్ర అగ్రవాల్, ఎస్సార్ ప్రశాంత్ రుయియాల ఆదాయాలతో కలిపి రాష్ట్రంలోని ప్రతి వ్యక్తి ఆదాయం ఈ పది సంవత్సరాలలో 10,375 నుండి 44,057 రూపాయలకు పెరిగిందంటే ఎవరు నమ్ముతారు. ఇవన్నీ ప్రజలను మభ్యపెట్టేందుకు చేసే గణాంకాలు. నిజానికి విషయాన్ని మరో కోణం నుండి చూస్తే రాష్ట్రంలోని ప్రతి వ్యక్తి ఆదాయం 44,057 రూపాయలుగా పెరిగిన మాట వాస్తవమే. అయితే అది వారికి దక్కడం లేదు. బడా కంపెనీలు వాటిని కాజేస్తున్నాయి. సామాజిక ఉత్పత్తిలో అందరూ భాగస్వాములై సమిష్టిగా ఉత్పత్తిని కొనసాగిస్తున్నారు. అందుకని వాటి ఫలాలు అందరికి చెందాల్సిందే. అయితే అది ఎలా సాధించాలి అనేదే తేల్చుకోవాల్సిన విషయం.

తమ అభివృద్ధిలో ఆదాయం పెరిగిన విషయం వివరించాడు. కాని, ప్రజల పేరుతో ప్రభుత్వాలు చేసిన రుణం ఎంతుందో తెలపలేదు. చత్తీస్‌గడ్‌లోని ప్రతి వ్యక్తి రుణం 2010–11లో 26,600 రూపాయలుంటే, అది 2011–12 నాటికి 32,812 రూపాయలకు పెరిగింది. ఈ రుణాల్ని ప్రజలందరి పేరు మీద కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల తరఫున అంతర్జాతీయ ఆర్థిక సంస్థల నుండి, ప్రపంచ బ్యాంక్ నుండి తామే బాధ్యత పడి తీసుకున్నాయని, తిరిగి ఆ రుణాన్ని తీర్చే బాధ్యత ప్రజలందరి మీద ఉందని, దాన్ని పన్నుల ద్వారా వచ్చిన ఆదాయంతో తిరిగి చెల్లిస్తున్నామని రమణ్‌సింగ్ చెబితే మరీ బావుండేది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# కోరుకొండ గ్రామాలపై గ్రీన్‌హంట్ దాడులు

*ఆదివాసుల జీవనాధారమైన భూమి, వనరులను బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేస్తున్న పాలకులు, దాన్ని వ్యతిరేకిస్తున్న వారిని తీవ్ర చిత్రహింసలకు, అణచివేతలకు గురి చేస్తున్నారంటున్నారు* **కొర్ర జ్యోతి**

ఆంధ్ర, ఒడిశా సరిహద్దులోని విశాఖ జిల్లా చింతపల్లి మండలం బలపం పంచాయతి 33 గ్రామాలు ప్రభుత్వ అభివృద్ధి, సంక్షేమానికి ఆమడ దూరంలో ఉన్నాయి. ఐదు వేల జనాభాతో పచ్చని కొండల మధ్య చాలా ఆనందంగా కనిపిస్తున్న గ్రామాలు ఇవి. ఇక్కడ తెగలవారీగా చూస్తే పిటిజి (కువ్వి) గ్రామాలు పది, తెలుగు గ్రామాలు 21, ఒడియా గ్రామాలు 2 (భగత, వాలిమిక్, పొర్జ, బడియా, కువ్వి, నూక దొర, ఇండ దొర తెగలు) ఉన్నాయి. ఆదివాసులకు ఆదాయం ప్రధానంగా అడవిలో అడ్డాకు, కొండ చీపురు, ఉసిరికాయ, తేనె, షీకాయ, జిగురు వివిధ రకాల వాటిపై ఆధారపడి జీవనం సాగిస్తున్నారు. వీరి వ్యవసాయం కొండ పోడు పొల్లు, సామలు, కొండ కందులు, గొచ్చ కందులు, చిక్కుళ్లు, జొన్నలు, అల్పులు, పసుపు ప్రధాన ఆదాయంగా ఉంది. ధాన్యం 5-10 బస్తాలు (కొన్ని కుటుంబాలకు 20-25) పండిస్తారు. ఈ పంటలు కూడా సంవత్సరానికి నాలుగు నుండి ఐదు నెలల్లోపే. మిగతా సమయం అడవిపై ఆధార పడాల్సిందే. అడవి నుండి ఆదివాసులను వేరుగా చూడలేం. అడవి నుండి ఆదివాసులను వేరు చేస్తే తల్లిబిడ్డలను వేరు చేసినట్లుగా ఉంటుంది.

1980ల నుండి ఎపిఎఫ్‌డిసి అధికారులు ఈ ప్రాంతంలో సిల్వర్ ప్లాంటేషన్ పేరుతో వచ్చి కాఫీ తోటల్ని నాటి స్థిరపడ్డారు. మొక్కల్ని నాటిన నుండి పెంపకం వరకు ఆదివాసుల శ్రమ ఉంది. 1879 షెడ్యూల్డ్ డిస్ట్రిక్ట్స్ ఆక్ట్ వచ్చింది. ఈ ప్రాంతంలో గిరిజనేతరులకు భూ బదలాయింపులను నిషేధిస్తూ 1917లో భూ అన్యాక్రాంత నిషేధ చట్టం వచ్చింది. అదే చట్ట సవరణలతో 1/59 గాను, ప్రస్తుతం 1/70 గాను నేటికి కొనసాగుతుంది. ఈ చట్టాలను కూడా ప్రభుత్వాలు పరిగణనలోకి తీసుకొని పని చేయడం లేదు. బలపం ప్రాంతంలో 110 హెక్టార్ల కాఫీ తోటలని నాటించి ఆదివాసుల ద్వారా కూలీ చేయించుకొని ఎపిఎఫ్‌డిసి కోట్ల రూపాయలను ఆర్జిస్తోంది. 1980 నుండి వివిధ దఫాలుగా కూలీ రేట్ల కోసం కదిలిన ఆదివాసులు 2008లో మొదటిసారి మర్రిపాకల ఎస్టేట్ 66 హెక్టార్లు స్వాధీనం చేసుకున్నారు. ఇది చూసిన తోటి ఆదివాసులు 2010, డిసెంబర్ 6న బలపం పంచాయతీలోని 33 గ్రామాలు ఐక్యమై 110 హెక్టార్ల కాఫీ తోటల్ని స్వాధీనం చేసుకున్నారు. అప్పటి నుండి కత్తి కట్టిన రాష్ట్ర ప్రభుత్వం మంగి గిరిజనులపై కేసులు పెట్టి వేధిస్తుంది. 2010 డిసెంబర్ చివరన కోరుకొండ గ్రామానికి చెందిన గెమ్మల చిట్టిబాబు, మత్స్య రాజులను (వారపు సంతకు వెళ్లి వస్తున్న వారిని) పట్టుకొని మూడు నెలలు జైలులో బంధించి తీవ్రమైన చిత్రహింసలకు గురిచేశారు. అదే గ్రామానికి చెందిన తల్లే ఆనందరావుని పట్టుకొని చెట్టుకు వేళ్లాడదీసి తీవ్రమైన హింసలకు గురిచేసి మావోయిస్టుల జాడ చెప్పాలంటూ వేధించారు. అదే సమయంలో వేట నిమిత్తం వెళ్లిన తోకపాడు గ్రామస్తులపై 70 రౌండ్లు ఫైరింగ్ చేశారు. ఈ దాడి నుంచి గ్రామస్తులు తప్పించుకున్నారు.

ఇక 2011 జనవరి నుండి గ్రామాలపై ఎపిఎఫ్‌డిసి అధికారులు, పోలీసులు కలిసి దాడులు చేస్తున్నారు. 2011 ఫిబ్రవరి 2న రాళ్లగెడ్డ గ్రామంపై ఎపిఎఫ్‌డిసి అధికారులు, పోలీసులు దాడి చేసి 195 కిలోల కాఫీ పిక్కల్ని స్వాధీనం చేసుకొన్నారు. ఇరవై నాలుగు మంది గిరిజన యువకుల్ని మావోయిస్టు పార్టీ ఆర్మ్‌డ్ మిలీషియా సభ్యులుగా బూటకపు సరెండర్స్ చూపించారు. 2011 జూలై 25న కోరుకొండ ఇటిక బెడ్డల్ గ్రామాలపై వందల మంది గ్రేహౌండ్స్ పోలీసులు, తోడేళ్ల గుంపు మేకల మందపై పడ్డట్టు పడి ఆరుగురు గిరిజనులను రాత్రికి రాత్రే చింతపల్లి ఎఎస్‌పి ఆఫీస్‌కు తీసుకుపోయారు. తెల్లవారి వీరికి మద్దతుగా 33 గ్రామాలకు చెందిన వెయ్యి మంది గిరిజనులు (తమ్మగుల, కాడిమిసార, అన్నవరం, లొత్తుగెడ్డ పంచాయితీల వారు) స్థానిక అన్నవరం పోలీసు స్టేషన్, చింతపల్లి ఎఎస్‌పి ఆఫీస్‌ని ఒకే సమయంలో ముట్టడించారు. ఆదివాసుల ఆగ్రహాన్ని చవిచూసిన పోలీసులు ఏ కేసు లేకుండానే నిర్బంధించిన వారిని విడిచిపెట్టారు.

2011 నుండి 2012 ఫిబ్రవరి 14 వరకు సాయుధ ఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. ఫిబ్రవరి 14 రాత్రి రాళ్లగెడ్డ గ్రామంపై మూడు వందల మంది పోలీసులు దాడి చేసి మహిళలు, పిల్లలు అని చూడకుండా కర్రలతో చితకబాదారు. మూడు పొగబాంబులు, ఐదు రౌండ్ల ఫైరింగ్ చేసి ఒక డిష్ టివిని, ఇంటి పెంకుల్ని ధ్వంసం చేసి సిందేరికార్ల అనే గ్రామ పెద్దని బలవంతంగా లాక్కుపోయారు. ఆదివాసులకు పోలీసులకు మధ్య మూడు గంటల పాటు ఘర్షణ జరిగింది.

2012 మార్చ్ నుండి మే చివరి వరకు మూడు విడతలుగా కూంబింగ్‌కు వచ్చిన పోలీసులు వారు తయారు చేసుకున్న ఇన్ఫార్మర్‌ల ద్వారా కాఫీ తోటల్ని (స్వాధీనం చేసుకున్న తోటల్ని) బుగ్గిపాలు చేశారు. గ్రామాలకి నోటీసులు పంపిస్తూ భయం సృష్టించారు. ఇదే అదునుగా చూసిన బూర్జువా పార్టీలు మార్చ్ 29న 75 మంది గిరిజనుల బూటకపు సరెండర్ నాటకం మరోసారి ముందుకు తెచ్చాయి. ఈ మూడు సంవత్సరాల నుండి సరెండర్స్ వారిని కలుపుకొని మొత్తం 149 మందిని పట్టుకున్నారు. మరికొంత మంది ఉన్నారంటూ పోలీసులు ప్రకటనలు చేస్తున్నారు. మొదటి నుండి వీరికి కావల్సింది 95 మందే అని చెపుతున్నారు. మరి ఏ సంబంధం లేని వారిని ఎందుకు పట్టుకున్నారు? ఎవరి ప్రయోజనాల కోసం సరెండర్స్ చేయించారు? ఇంకా ఎంతమంది ఉన్నారు? పోలీసుల దృష్టిలో 95 మందే ఉన్నారా? సంఖ్య తగ్గింది అనుకోవాలా? పెరిగింది అనుకోవాలా?

2012, మే 10న లువ్వసింగి గ్రామం వద్ద మావోయిస్టులకు, పోలీసులకు మధ్య జరిగిన ఎదురుకాల్పుల్లో ఇరు వర్గాలకు ఏమీ కాలేదు. ఆ సమయంలో ఒంటంపాడు, ఎస్తాల్ గ్రామాలకు చెందిన రైతులు గుర్రాలని వతకసాక అడవికి వెళ్లిన వారిని పట్టుకొని కాల్చి చంపారు. మరో వ్యక్తి తృటిలో తప్పించుకున్నారు. ఈ రెండు కుటుంబాలు పెద్దదిక్కు కోల్పోయి వీధిన పడ్డాయి. ఆ గ్రామం నుండి ఒక ఇంటిలో ఐదు వేల రూపాయలు, ఒక కాఫ్ తుపాకిని స్వాధీనం చేసుకొని చనిపోయిన వారి వద్ద పెట్టి మావోయిస్టు పార్టీ సభ్యులుగా చిత్రీకరించారు.

# మహిళలపై ప్రపంచీకరణ ప్రభావం

***పురుషాధిక్య సమాజంలో తీవ్ర అణచివేతలను ఎదుర్కొన్న మహిళలు, ప్రపంచీకరణ తర్వాత మార్కెట్ వస్తువుగా మారడం వారి జీవన స్థితిగతులను ఇంకా దిగజార్చిందని అంటున్నారు*** **తోట జ్యోతిరాణి**

ఏ సమాజంలోనైనా ఉనికిలో ఉన్న సామాజిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక నిర్మాణాలే అక్కడి ప్రజల జీవన స్థితిగతులను నిర్ణయిస్తాయి. వీటికి తోడు అస్తిత్వంలో ఉన్న పితృస్వామ్యం కూడా కలిసి స్త్రీల జీవితాలను నిర్ధారిస్తుంది, నిర్దేశిస్తుంది. అందువల్లనే ఈ నిర్మాణాలను ప్రభావితం చేసే ఏ అంశమైనా మహిళలపై ప్రత్యేక ప్రభావం చూపుతోంది. అంటే ప్రతి అంశానికి జెండర్ కోణం ఉంటుంది. ఈ దృష్ట్యా పరిశీలించినప్పుడు భారతదేశం మీద ప్రపంచీకరణ కలగజేసే ప్రభావానికి జెండర్ కోణం ఉంటుంది. ట్రికిల్ డౌన్ సిద్ధాంతానికి వ్యతిరేకంగా అభివృద్ధి ఫలితాలు వాటంతటవే మహిళలకు అందవన్నది చారిత్రక సత్యం. కాని సంక్లిష్ట పరిస్థితులు ఏర్పడినప్పుడు వాటి దుష్ఫలితాలకు స్త్రీలు బలికావడం సర్వసాధారణం. ఇందుకు అస్తిత్వంలో ఉన్న పితృస్వామిక సూత్రాలు, నియమాలు, భావజాలం ఒక బలమైన నెట్‌వర్క్‌గా పనిచేస్తాయి. ఈ నేపథ్యంలో భారతదేశ సామాజికార్థిక, సాంస్కృతిక నిర్మాణాలను ప్రపంచీకరణ ఏ విధంగా ప్రభావితం చేసింది? అది పితృస్వామిక సూత్రాలను, భావజాలాన్ని మరింత బలపరిచిందా? బలహీనపరిచిందా? అన్న అంశాల మీద భారతదేశ మహిళలపై ప్రపంచీకరణ ప్రభావం ఆధారపడి ఉంటుంది.

1980వ దశకం చివరి భాగంలో భారతదేశంలో ఆర్థిక సంక్షోభం పరాకాష్ట దశకు చేరుకున్నది. ఈ సమస్యకు పరిష్కారం ప్రపంచీకరణ మాత్రమేనని, ఇందుకు ప్రత్యామ్నాయం మరేదీ లేదనే వాదన బలంగా ముందుకు వచ్చింది. ప్రభుత్వ రంగం, ప్రభుత్వ జోక్యం, అజమాయిషీలతో ముడిపడి ఉన్న అవినీతి, లంచగొండితనం, పక్షపాతం, అసమర్థతలతో విసిగిపోయిన ప్రజలకు గ్లోబలైజేషన్ ఒక సమర్థవంతమైన ప్రత్యామ్నాయంగా కనిపించింది. 1990-91లలో నూతన ఆర్థిక విధానం పేరిట ప్రపంచీకరణ భారతదేశంలోకి ప్రవేశించినప్పుడు దానికి వ్యతిరేకత అంత బలంగా ఏమీలేదు. వామపక్షాల నుండి మాత్రం కొద్దిగా నిరసన వినిపించింది. కాని గ్లోబలైజేషన్ స్థిరపడి, బలపడే కొద్దీ దాని దుష్పరిణామాల ప్రభావానికి మెజారిటీ ప్రజలు గురికావడమనే ప్రక్రియ అధికమైంది. గ్లోబలైజేషన్ వల్ల భారతదేశ ఆర్థిక వ్యవస్థ ఒక సమర్తవంతమైన ఆర్థిక వ్యవస్థగా రూపుదిద్దుకుంటుందనుకున్న ప్రజల ఆశ ఎందుకు

---

న్యాయం కోసం ఈ కుటుంబాలు తిరగని ఆఫీసు లేదు. అయినా ఇప్పటికీ వారికి న్యాయం జరగలేదు. పైగా ఈ రెండు కుటుంబాలకు పాడేరు ఎఎస్‌పి నుండి బెదిరింపులు వస్తున్నాయి. వీరిని పట్టించుకొనే నాథుడే లేడు. ఈ ఘటనని కప్పి పెట్టుకోవడానికి, రాళ్లగెడ్డ గ్రామంలో జూన్ మొదటివారంలో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేశారు. 2012, జూన్ 17 నుండి జూలై 8 వరకు ఎడతెరపి లేకుండా వందల మంది స్పెషల్ పార్టీ, సిఆర్‌పిఎఫ్ పోలీసులు కలిసి గ్రామాలపై దాడులు చేశారు. కుడుముల గ్రామంపై జూన్ 18 నుండి జూలై 2 వరకు నాలుగు వైపుల నుండి దాడులు చేశారు. ఈ కూంబింగ్‌లో భాగంగానే ఎస్సార్ పైపులైన్ పనులు పూర్తి చేసుకొనే ప్రయత్నం చేసారు. ఈ ప్రాంత ప్రజలు ఎస్సార్ పైపులైన్ పనులను తీవ్రంగా వ్యతిరేకించడంతో వెనుతిరిగి పోయారు. పంచాయితీల వారీగా అభివృద్ధి కార్యక్రమాలు చేస్తాం అని పంచాయితీ పెద్దలకు డిమాండ్ పత్రాలు పంపించారు. డిమాండ్స్‌ని ప్రజలు స్వీకరించలేదు. పోలీసుల అండతో రాత్రికి రాత్రి వచ్చి పైపులైను పనుల్ని పూర్తి చేసుకొనిపోయారు. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు కలిసి పైపు వెల్డింగ్‌లను ఊడతీయడంతో కొంత కాలం సద్దుమణిగినట్లయింది. 2013 నుండి ఆ ప్రయత్నాలు తీవ్రంగా చేస్తున్నారు. ఇలా మన దేశ పాలకులు, ప్రజలకు సంబంధం లేని పనులు చేస్తూ, ప్రజాస్వామ్య దేశమని చెప్పుకోవడం ఎంతవరకు సమంజసం? 2011 డిసెంబర్ 25న కలాహ కమిటీ (బాక్సైట్ సర్వే కమిటీ)కి అండగా అడుగు అడుగునా వందల మంది స్పెషల్ పార్టీ పోలీసులను పెట్టుకొని సర్వే కోసం తీవ్రంగా ప్రయత్నం చేశారు. కలాహ కమిటీకి వ్యతిరేకంగా నిరసనలు, ధర్నాలు, రాస్తారోకోలు చేస్తున్న గిరిజనుల్ని పోలీసులు బెదిరించారు. చివరికి జెర్రిల పంచాయితి గోపురం కొండ వద్ద (ఐదు వందల మంది) హెలికాప్టర్‌ని ల్యాండ్ కాకుండా గిరిజనులు సాంప్రదాయక ఆయుధాలతో అడ్డుకున్నారు. దీంతో సర్వేని మధ్యంతరంగా ముగించుకొని వెళ్లిపోయారు.

మన్యం ప్రాంతంలో ఉన్న విలువైన ఖనిజాన్ని వెలికి తీయడంలో భాగంగానే మావోయిస్టు పార్టీ ఏరివేతలో భాగంగా ప్రభుత్వం ఆపరేషన్ గ్రీన్‌హంట్ దాడులు చేస్తోంది. దేశ మూలవాసులైన గిరిపుత్రులపై, ముఖ్యంగా ఈ మూడు సంవత్సరాల నుండి బాక్సైట్ ఉద్యమంలో కీలకపాత్ర పోషిస్తున్న బలపం పంచాయితీ 33 గ్రామాలపై రాష్ట్ర ప్రభుత్వం కక్ష సాధింపు దాడులకు పూనుకుంది. బహుళజాతి కంపెనీల ప్రయోజనాలలో భాగంగానే 2013, జనవరి 26 న వేట కోసం అడవికి వెళ్లిన గిల్లలబంద గ్రామస్తులపై గ్రేహౌండ్స్ పోలీసులు 20 రౌండ్లు ఫైరింగ్ జరిపారు. ఈ దాడి నుంచి గ్రామస్తులు ప్రాణాపాయం లేకుండా తప్పించుకున్నారు. కల్లు చెట్టుకు వెళ్లిన మరో నలుగురిని పట్టుకొని మావోయిస్టు పార్టీ ఆచూకి చెప్పమని తీవ్రమైన చిత్రహింసలు పెడుతూ ఒక రోజు మొత్తం అదుపులో పెట్టుకున్నారు. ఈ సంఘటనను ఏ బూర్జువా పార్టీ ఖండించిన పాపాన పోలేదు. ఆ పార్టీలు కూడా బహుళజాతి కంపెనీలకు, గ్రీన్‌హంట్ దాడులకు వంత పలుకుతున్నాయి. ఈ పంచాయితీ 33 గ్రామాలపై జరుగుతున్న దాడుల గురించి బయట ఉన్న ప్రజాస్వామికవాదులు తెలుసుకొనే అవకాశాలు చాలా తక్కువ. ఇప్పటికైనా నిర్బంధంలో ఉన్న ఈ ప్రాంతాలను తిరిగి గ్రీన్‌హంట్ దాడుల వివరాలు, గిరిజనుల స్థితిగతులను తెలుసుకొని, బయటి ప్రపంచానికి తెలియజేయాలి. ఈ పంచాయితీ గిరిజనులకు అండగా నిలవాలి.

*(రచయిత ఆదివాసీ మహిళా సంఘం సభ్యులు)* వీ

భగ్నమైంది? అన్నది పరిశీలించవలసిన అంశం.

సంక్షిప్తంగా చెప్పాలంటే, ప్రైవేటీకరణ, వాణిజ్యీకరణ, సరళీకరణలతో ప్రపంచీకరణ ముడిపడి ఉంటుంది. అంతేకాకుండా ఇవి ఒక దానిని మరొకటి బలోపేతం చేసుకుంటాయి. ఈక్రమం గుత్తాధిపత్యాన్ని, బహుళజాతి సంస్థల ఆధిపత్యాన్ని బలోపేతం చేస్తుంది. ప్రభుత్వ గుత్తాధిపత్యం స్థానంలో ఏర్పడిన ప్రైవేటు గుత్తాధిపత్యం ఏవిధంగా మెరుగైంది? అన్నది ప్రధాన ప్రశ్న. పైగా ప్రైవేటు గుత్తాధిపత్యాన్ని ప్రోత్సహించడమే ప్రభుత్వ లక్ష్యమైంది. కాబట్టి అందుకనుకూలమైన విధానాలను ప్రభుత్వం రూపొందిస్తున్నది. పారిశ్రామిక లైసెన్సులను రద్దుచేయడం, ఎంఆర్‌టిపి చట్టాన్ని, ఫెరా చట్టాన్ని బలహీనపరచడం ఇందులో భాగమే. ఈ విధానాలు భారతదేశ ఆర్థికవ్యవస్థపై ఎటువంటి ప్రభావాన్ని కలుగ జేశాయి? దాని ఫలితంగా మహిళల జీవితాలలో వచ్చిన మార్పేమిటి? వంటి అంశాలను పరిశీలించాలి.

ప్రపంచీకరణ విస్తరణను వేగవంతం చేస్తున్న అంతర్జాతీయ సంస్థలు మూడు అవి – అంతర్జాతీయ ద్రవ్యనిధి (ఐఎంఎఫ్), ప్రపంచబ్యాంకు (ఐబిఆర్‌డి), ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ). ఈ మూడు సంస్థలను అదుపు చేస్తున్నది గ్రూప్ ఆఫ్ 7 గా గుర్తింపు పొందిన సంపన్న దేశాల కూటమి. అందువల్లనే ఈ దేశాల ప్రయోజనాలకు అనుగుణంగానే ఈ విత్త సంస్థల విధానాలుంటాయి. దారిద్ర్య రహిత సమాజ స్థాపన లక్ష్యంతో ఐఎంఎఫ్, ఆర్థిక స్థిరత్వాన్ని సాధించే లక్ష్యంతో ప్రపంచ బ్యాంకు ఉనికిలోకి వచ్చాయి. కాని గ్లోబలైజేషన్ క్రమాన్ని విస్తరించడానికి అవి అవలంభిస్తున్న విధానాలు వర్ధమాన దేశాలలో దారిద్ర్య తీవ్రతను, ధనికులు–పేదల మధ్య అంతరాన్ని, ఆర్థిక వ్యవస్థలలో అస్థిరతను పెంచుతున్నాయి.

యుఎన్‌డిపి, యుఎన్ఐడిఒ, బైనేఫెల్ట్, ప్రపంచబ్యాంకు అధిపతిగా పనిచేసిన జోసెఫ్ స్టిగ్లిట్జ్ నిర్వహించిన అధ్యయనాలు, వర్ధమాన దేశాలలో పేదరికం తీవ్రమవుతున్నదన్న అంశాన్ని ధృవపరిచాయి. దీనినే గ్లోబలైజేషన్ ఆఫ్ పావర్టీగా మైఖేల్ ఛాసుడోవస్కీ అభివర్ణించాడు. ఇందులో భాగంగానే భారతదేశ పరిస్థితి ఉంటుంది. అంటే భారతదేశం లో కూడా నిరపేక్ష పేదరికం, సాపేక్ష పేదరికం అధికమైనాయి.

ఖచీణా రూపొందించిన 'మానవాభివృద్ధి నివేదిక' 1995 ప్రకారం పేదరికానికి స్త్రీ ముఖం ఉంది. అంటే పేదరికంలో జీవిస్తున్న ప్రజలలో 70 శాతం మంది మహిళలే. ఈ ధోరణినే, 'ఫెమినైజేషన్ ఆఫ్ పావర్టీ'గా పేర్కొనడం జరుగుతున్నది. పురుషులతో పోల్చినప్పుడు సంఖ్యాపరంగా సాపేక్షికంగా ఎక్కువ మంది మహిళలు పేదరికంలో మగ్గిపోవడం ఒక అంశమైతే పితృస్వామిక విలువలు అమలులో ఉండడంవల్ల పేదరిక భారం తీవ్రత మహిళలపైననే అధికంగా ఉండడం మరొక అంశం.

పితృస్వామిక కౌటుంబిక సూత్రాలు ప్రధానంగా కుటుంబంలోని సంపద, వనరులు ఎవరి ఆధీనంలో ఉంటాయి? ఇంటి పని పంపిణీని, వినియోగం తీరును నిర్ణయించే సూత్రాలు సహజంగానే పురుష ప్రయోజనాలకు, పెత్తనానికి, ఆధిపత్యానికి అనుకూలంగా ఉంటాయి. స్త్రీల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉంటాయి. ఇక పేద కుటుంబాలలో మహిళల మీద పని ఒత్తిడిని ఇవి అధికం చేస్తాయి. పితృస్వామిక కుటుంబాలలో ఇంటిల్లిపాదికి ఆహార భద్రతను సమకూర్చవలసిన బాధ్యత పూర్తిగా స్త్రీల బాధ్యతనే. అందుకోసం మహిళ నిరంతరం పనిచేస్తూనే ఉంటుంది. అవి సంపాదన పనులు కావచ్చు, సంపాదన లేని పనులు కావచ్చు. మొత్తం మీద మహిళ తన గురించి ఆలోచించు కోకుండా కుటుంబానికి ఆహార భద్రతను సమకూర్చే లక్ష్యంతో శ్రమిస్తూనే ఉంటుంది. వంట చెరుకును తెస్తుంది, అడవిలోని పండ్లను, కాయగూరలను తెస్తుంది. కోళ్లను, పాడి పశువులను పోషిస్తుంది. ఎక్కడి నుండో నీళ్లను మోసుకొస్తుంది. ఇంటి పెరడులో కాయగూరలు పండిస్తుంది. ఇంటి నిర్వహణకు సంబంధించిన పనులన్నింటిని విశ్రాంతి అనేది లేకుండా చేస్తూనే ఉంటుంది. అపారమైన ఉపయోగిత విలువ ఉన్న ఈ పనులన్నీ స్త్రీ చేయడం వల్లనే కుటుంబాల మనుగడ సాధ్యమవు తోంది. 'బాధ్యతల నిర్వహణే బలహీనత'గా పరిగణించే సామాజిక సూత్రాలు అమలులో ఉండడం వల్ల కుటుంబ మనుగడకే కారణమైన, ఆధారమైన మహిళ అధీనత్వ స్థితిలో ఉండడం ఒక సీరియస్ వైరుధ్యం.

యుఎన్‌డిపి ప్రచురించిన 'మానవాభివృద్ధి నివేదిక, 2006' ను అనుసరించి వర్ధమాన దేశాలలో అందులో భాగంగా భారతదేశంలో వంటచెరుకు కొరత, నీటికొరత రోజురోజుకూ తీవ్రమవుతున్నాయి. జెండర్ ఆధారిత శ్రమ విభజన దృష్ట్యా ఈ రెండు పనులను నిర్వహించ వలసిన బాధ్యత స్త్రీదే. వంటచెరుకును, నీళ్లను సమీకరించడం కోసం స్త్రీలు రోజుకు 5–6 గంటల సమయం కేటాయించవలసి వస్తున్నది. మానవులు తమ శక్తులను అభివృద్ధి పరుచుకొనడానికి సమయం అనేది ఒక ముఖ్యమైన వనరు. నీటికొరత వల్ల ఈ మహిళలు ఆదాయ పేదరికానికి తోడు సమయ పేదరికాన్ని ఎదుర్కొంటారు. ఫలితంగా మహిళలకు తమ నైపుణ్యాలను పెంచుకోవడానికి, శక్తులను వినియోగించుకోవడానికి అవకాశమే ఉండదు. ఈ విధంగా పేదరిక భారం మహిళల మీద తీవ్రంగానే ఉంటుంది. ఇది మహిళల అభివృద్ధిని సీరియస్‌గా ఆటంక పరుస్తోంది. ఇట్లా భారతదేశంలో విస్తరిస్తున్న ప్రపంచీకరణ క్రమం ఫలితంగా పెరిగిన పేదరికం మహిళల జీవితాలను దుర్భరం చేస్తోంది. వాళ్ల ఎదుగుదలకు సీరియస్ ప్రతిబంధకాలను సృష్టించింది.

సామాజికాభివృద్ధికి దోహదపడే అంశాలలో స్త్రీ విద్య కీలకమైంది. వ్యక్తి స్వేచ్ఛకు, అభివృద్ధి ప్రక్రియకు వ్యూహాత్మకమైన అంశం. యుఎన్‌డిపి రూపొందించే మానవాభివృద్ధి నివేదికలోని జెండర్ అభివృద్ధి సూచికకు మహిళా అక్షరాస్యత ఒక ప్రాతిపదిక. సమాజాన్ని మానవీయం చేసుకోవడానికి 2000లో యుఎన్ఒ రూపొందించిన మిలీనియం అభివృద్ధి లక్ష్యాలు 2015 నాటికి సంపూర్ణ మహిళా అక్షరాస్యతను సాధించాలని నిర్దేశించాయి. కాని ప్రస్తుతం వయోజన మహిళా అక్షరాస్యత 60 శాతాన్ని మించలేదు. అంతేకాకుండా ఖచీణా సమీక్ష ప్రకారం బడికి వెళ్లవలసిన ఆడపిల్లలు బడికి వెళ్లలేని ప్రస్తుత పరిస్థితుల ప్రకారం 2040 వరకు కూడా భారతదేశంలో సంపూర్ణ మహిళా అక్షరాస్యతను సాధించడం దుర్భరమే. కేవలం అక్షరాస్యత స్త్రీల సామాజిక అవసరాలను ఎంతమేరకు మెరుగుపరుస్తాయనేది సందేహం. పైగా ఈ తక్కువస్థాయి అక్షరాస్యతలో కూడా కుల ప్రాతిపదికగా, గ్రామీణ – పట్టణ ప్రాంత వ్యత్యాసాలున్నాయి. అట్టడుగుస్థాయిన ఉన్నది గ్రామీణ దళిత మహిళ అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

విద్య, వైద్య రంగాలు ప్రభుత్వ నియంత్రణలో ఉన్నప్పుడే అవకాశాల విస్తరణ సాధ్యమవుతుందని జీన్ డ్రెజ్, అమర్త్యసేన్ అభిప్రాయపడ్డారు. కాని భారతదేశంలో ప్రపంచీకరణ ప్రభావానికి అంటే ప్రైవేటీకరణకు ముందు లోనైంది విద్యారంగమే. ప్రపంచీకరణ ప్రభావం వల్ల విద్యా రంగం నుండి ప్రభుత్వం వైదొలుగుతూ ప్రైవేటురంగ విస్తరణకు అవకాశం కల్పించింది. లాభార్జన లక్ష్యంగా ప్రైవేటు విద్యాసంస్థల విస్తరణలో విద్య ఒక వ్యాపార వస్తువైంది. అవి వసూలు చేసే ఫీజులను పేదవర్గం భరించడం అసాధ్యమవుతోంది. అటువంటప్పుడు ఆ కుటుంబాలు త్యాగం చేసేది ఆడపిల్ల చదువునే. దీనితోపాటు రోజురోజుకు పెరుగుతున్న వరకట్న సమస్య ఆడపిల్లల చదువుకు పెద్ద అవరోధంగా నిలుస్తున్నది.

ఒకవైపు ఇంజనీరింగ్, వైద్య విద్యలలో ఆడపిల్లలు కూడా ప్రవేశించడం కనిపిస్తుంది. సీట్లలో మహిళలకు 33 శాతం ప్రాతినిధ్యం ఉండడం వల్ల

ఈ కోర్సులు ఎక్కువ మంది ఆడపిల్లలకు అందుబాటులోకి వస్తున్నట్లు గమనించవచ్చు. ఇది ఆహ్వానించదగిందే. కాని కేవలం 4 శాతం మహిళలకు మాత్రమే ఉన్నత విద్యను అభ్యసించే అవకాశాలు వస్తున్నాయి. కాని గ్లోబలైజేషన్ పెంచిన పేదరిక తీవ్రత ఒక వైపు, విద్యారంగంలో ఆధిపత్యం కలిగిన ప్రైవేటు సంస్థలు వసూలు చేసే అధిక ఫీజులు మరొక వైపు స్త్రీలకు విద్యను అందకుండా చేస్తున్నాయి.

ప్రపంచీకరణ ప్రభావం వల్ల తృతీయ ప్రపంచ దేశాలలో, అందులో భాగంగా భారతదేశంలో ఉద్యోగిత స్థాయి ఎటువంటి మార్పుకు లోనైందనే అంశాన్ని పరిశీలిస్తే, ప్రపంచీకరణలో అతిముఖ్యమైన అంతర్భాగం ప్రైవేటీకరణ. అంటే ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ పాత్రను కుదించి, ప్రైవేటు సంస్థలకు ఆర్థిక వ్యవస్థను అప్పగించడం. గుత్త పెట్టుబడిదారీ దశలో ప్రైవేటు సంస్థలంటే కార్పొరేటు గుత్తసంస్థలు, బహుళజాతి సంస్థలే. ఈ సంస్థల సంపూర్ణ లక్ష్యం ప్రపంచ వనరుల మీద ఆధిపత్యం, అధిక లాభార్జన. అందుకోసం ఇవి ఉద్యోగాల సంఖ్యను తగ్గిస్తాయి. ఉన్న ఉద్యోగాలను నిర్మూలిస్తాయి. అందువల్లనే భారతదేశం లో ప్రపంచీకరణ ప్రభావం వల్ల నిరుద్యోగ సమస్య మరింత తీవ్రమైంది. ఇది మహిళల మీద ఎటువంటి ప్రభావాన్ని చూపించిందన్నది ఒక అంశం. కాగా, తీవ్రమవుతున్న నిరుద్యోగ సమస్య వల్ల చాలీచాలని ఆదాయాలు ఒకవైపు, ఆకర్షణీయంగా రూపొందిన వస్తు వినిమయ సంస్కృతి మరొకవైపు కుటుంబాలను అశాంతికి గురిచేస్తున్నాయి. ఈ ఒత్తిడి మహిళల మీద ఎక్కువగా ఉంటుందన్నది కచ్చితమైన వాస్తవం. అంతేకాకుండా, నిరుద్యోగ సమస్య వల్ల సమాజంలో నేర ప్రవృత్తి, హింస ప్రబలుతున్నాయి. వీటికి బలయ్యేది మహిళలేనన్న వాస్తవాన్ని రోజు రోజుకు తీవ్రమవుతున్న కుటుంబ హింస, వరకట్న వేధింపులు, మహిళలపై అత్యాచారాలు మొదలైనవాటికి సంబంధించిన గణాంకాలు రుజువు చేస్తున్నాయి.

గౌరవప్రదంగా జీవించాలంటే స్వంత సంపాదన ఒక కచ్చితమైన షరతు. మహిళల అభివృద్ధికి, స్వావలంబనకు ఇది పునాది. ఆర్థిక స్వావలంబన లేకుండా మహిళాభివృద్ధి, మహిళా విముక్తి సాధ్యంకావు. పేద కుటుంబాల ఆహార భద్రతకు, మనుగడకే పేద మహిళల ఉపాధి, సంపాదనలే మూలం.

యుఎన్‌డిపి రూపొందించే మానవాభివృద్ధి నివేదికలో మహిళా అభివృద్ధి కొలమానం, మహిళా సాధికారత కొలమానం రెండింటిలో కూడా స్త్రీల సంపాదన ఒక ముఖ్యమైన ప్రమాణం. ఇందుకు సంపాదన గల పనులలో స్త్రీలు భాగస్వాములు కావాలి. ప్రపంచీకరణ ప్రభావం వల్ల పెరిగిన పేదరికం, పర్యావరణ క్షీణత, సమిష్టి వనరుల అంతర్ధానం వీటన్నింటివల్ల వంటచెరుకును, నీటిని సమీకరించుకోవడానికి పేద స్త్రీలు నిర్విరామంగా, నిరంతరాయంగా శ్రమించవలసి వస్తున్నది. పేద కుటుంబాల మనుగడకు, ఆహార భద్రత కోసం స్త్రీలు ఎంత శ్రమించినా వాటి ఉపయోగిత విలువ అపారమే. కాని ఆర్థిక ప్రతిఫలం శూన్యం. ఖచీఆ రూపొందించిన మానవాభివృద్ధి నివేదిక, 2004 ప్రకారం భారతదేశంలో రోజుకు ఒక స్త్రీ సగటున 457 నిమిషాలు పనిచేస్తే పురుషుడు 391 నిమిషాలు పనిచేస్తున్నాడు. కాని మహిళలు చేస్తున్న పనులలో కేవలం 35 శాతం మాత్రమే సంపాదన గల పనులు. కాగా పురుషుల విషయంలో ఇది 92 శాతం. అందువల్లనే పురుషుల సంపాదనలో కేవలం 38 శాతం మాత్రమే స్త్రీల సంపాదన ఉన్నది. గ్లోబలైజేషన్ స్త్రీల మీద సంపాదనలేని పనుల ఒత్తిడిని పెంచింది, అధీనత్వాన్ని పెంచింది. ఫలితంగా స్త్రీల జీవితం మరింత సంక్లిష్టమైంది.

గ్లోబలైజేషన్ సృష్టించిన మరొక ధోరణి ఏమిటంటే రెగ్యులర్ ఉద్యోగిత తగ్గడం, దినసరి వేతన ఉద్యోగాలు పెరగడం. క్యాజువల్ స్వభావం గల పనులలో మహిళల శాతం క్రమంగా పెరుగుతున్నట్లు ఎన్ఎస్ఎస్ గణాంకాలు సూచిస్తాయి. ఒకవైపు సంపాదన గల పనులలో స్త్రీల భాగస్వామ్యం తగ్గడం మరొకవైపు క్యాజువల్ శ్రామికులుగా స్త్రీలు స్థిరపడడం రెండూ ప్రపంచీకరణ ఫలితాలే.

వ్యవసాయేతర రంగాలలో మహిళలకు ఉపాధిని కల్పించడం వల్ల మహిళాభివృద్ధి, జెండర్ సమానతలు సాధించవచ్చని యుఎన్ఓ నూతన శతాబ్ది లక్ష్యాలు నొక్కి చెప్పినప్పటికీ వ్యవసాయ శ్రామికులుగా మహిళలు బతకవలసి వస్తున్నది. గ్రామీణ ప్రాంతాలలో 85 శాతం మంది మహిళలు వ్యవసాయం, వ్యవసాయ అనుబంధ పనులను ఆశ్రయించి బతకడం గమనించదగింది. ఇది మహిళలపై పేదరిక భారాన్ని తీవ్రతరం చేసే ప్రక్రియ.

ప్రపంచీకరణ క్రమం మెజారిటీ ప్రజలను అందులో భాగంగా మహిళలను అభివృద్ధి ప్రక్రియ నుండి బయటకు నెట్టివేస్తున్నది. అందువల్లనే వీళ్లంతా అవ్యవస్థీకృత రంగాన్ని ఆశ్రయించి బతకవలసి వస్తున్నది. భారతదేశంలోని మహిళలు 96 శాతం ఈ రంగంలోనే ఉపాధిని పొందే అంశాన్ని వివిధ గణాంకాలు సూచిస్తున్నాయి. అవ్యవస్థీకృత రంగంలో పని గంటలు ఎక్కువ, సంపాదన తక్కువ. ఉద్యోగంలో అనిశ్చిత పరిస్థితి. రెగ్యులర్ ఉద్యోగులకు లభించే సౌకర్యాలు, రాయితీలు, జీతభత్యాలు, ప్రసూతి సెలవు, ఇన్స్యూరెన్సు మొదలైనవేవీ ఈ రంగంలో పనిచేసే మహిళలకు లభించవు.

ఇక ప్రపంచీకరణ అనుకూల ప్రభావం వల్ల ఎదిగిన రెడీమేడ్ దుస్తుల తయారీ, తోలు పరిశ్రమలలో మహిళలకు ఉపాధి అవకాశాలు పెరిగినాయి. కొన్ని పనులనైతే పూర్తిగా 'మహిళీకరించడం' (ఫెమినిజం ఆఫ్ జాబ్స్) కూడా కనిపిస్తుంది. పురుషులతో పోల్చినప్పుడు స్త్రీలకు తక్కువ వేతనాలనిచ్చి, ఎక్కువ పని చేపించుకోవడం సాధ్యమవు తున్నందున ఈ ధోరణి బాగా పెరిగింది. అంతేకాకుండా రోజువారీ వేతనం మీద క్యాజువల్ శ్రామికులుగా మహిళలు మిగిలి పోతున్నారు. సంఘటిత రంగంలో అసంఘటిత శ్రామికులుగా మహిళలు దోపిడీ, పీడనలకు గురవుతున్నారు.

ఇక ప్రపంచీకరణ క్రమం అభివృద్ధి చేసిన సాఫ్ట్‌వేర్, ఔట్‌సోర్సింగ్ ఉద్యోగాలలో అధిక వేతనాలతో మహిళలు పనిచేయగలగడం ప్రపంచీకరణ మహిళల అభివృద్ధికి దోహదం చేసినట్లు కన్పిస్తుంది. కాని ఈ అంశాన్ని సునిశితంగా పరిశీలించనప్పుడు నిర్దేశించిన లక్ష్యాలను నిర్ణీత గడువులో పూర్తి చేయడానికి స్త్రీలు కూడా పగలు, రాత్రి భేదం లేకుండా పనిచేయడానికి స్వచ్ఛందంగా సిద్ధపడతారు, పడాలి కూడా. కాని ఇంటి నిర్వహణ బాధ్యత స్త్రీది కావడం వల్ల ఇది స్త్రీల మీద ఒత్తిడిని అధికం చేస్తుంది. ఈ స్ట్రెస్ వల్ల మనుషులుగా ఎదుర్కొనే అనారోగ్యం ఒకవైపు, స్త్రీలుగా పునరుత్పత్తి విధులకు సంబంధించిన అనారోగ్యాలు, దానివల్ల కుటుంబ సంబంధాలలో ఏర్పడే అశాంతి, అభద్రత స్త్రీల జీవితాలను సంక్లిష్టం చేస్తున్నది.

పైగా స్త్రీలు ఈ రంగాలకు చెందిన తక్కువస్థాయి ఉద్యోగాలలో స్థిరపడుతున్నారని వివిధ గణాంకాలు తెలియజేస్తున్నాయి. అంతేకాకుండా బహుళజాతి సంస్థలలో పనిచేసే పురుషుని సంతోషం, సంక్షేమం కోసం ఇంటికే అంకితమయ్యే ఇల్లాలు అవసరం. ఇక పసిపిల్లలను చూసుకోవడానికి స్త్రీ ఉద్యోగాన్ని ఒదులుకోక తప్పదు. ఆ క్రమంలో స్త్రీ తనదైన స్వంత సంపాదన గల ప్రత్యేక ఉద్యోగానికి పరాయీకరించ బడుతుంది. కాబట్టి ఈ రంగంలో అభివృద్ధి, మహిళను ఇల్లాలుగా స్థిరీకరించడంలో సఫలమవుతున్నది.

మొత్తం మీద మహిళల ఆర్థిక హోదా రోజురోజుకూ క్షీణించడం ప్రపంచీకరణ ఫలితమే.

ఇక జనాభాలో స్త్రీ–పురుష నిష్పత్తిలో స్త్రీల సంఖ్య గణనీయంగా తగ్గడం, ఆందోళన పడవలసిన స్థాయికి చేరుకోవడం మహిళలపై పెరుగుతున్న హింస, వివక్షలకు పరాకాష్ట. ప్రపంచీకరణ ఫలితంగా సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణాలలో చోటు చేసుకున్న మార్పులు ఆడపిల్లను పెంచడం ఒక పెద్ద సమస్యగా భావించే భావజాలన్ని బలోపేతం చేసింది. గర్భస్థ పిండంగానే ఆడపిల్ల అంతరిస్తున్నది. ఆడపిల్ల 'అదృశ్య మహిళగా' మిగిలిపోతున్నది. ఒకవేళ పుట్టినా, ఆడపిల్లల మరణాల రేటులో స్థానాన్ని సంపాదించుకుంటున్నది. పౌష్టికాహార లోపంతో రకరకాల సమస్యలకు గురయ్యే ఆడపిల్లల సంఖ్య విషయంలో ప్రపంచంలో మొదటి స్థానం సంపాదించుకోవడం కోసం భారతదేశం పోటీపడుతున్నది.

ప్రపంచీకరణ వల్ల మెజారిటీ ప్రజలు, అందులో భాగంగా మహిళలు అభివృద్ధి క్రమం నుండి బయటకు నెట్టివేయబడుతున్నారన్న అంశాన్ని ప్రభుత్వం గుర్తించడం వల్లనే 'సమ్మిళిత వృద్ధి' లక్ష్యంగా 12వ పంచవర్ష ప్రణాళిక రూపొందించింది. కాని రూపొందించిన విధానాలు, తీసుకున్న చర్యలు ఇందుకు వ్యతిరేకమైన ఫలితాలనిచ్చేవే. ఇందుకు ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు, చిల్లర వ్యాపార రంగంలో విదేశీ పెట్టుబడులను అనుమతించడాన్ని తాజా ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఈ రెండింటిలో కూడా జెండర్ కోణం ఉన్నది.

ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు కోసం గ్రామాలను మొత్తంగా ఖాళీ చేయించినప్పుడు విస్థాపనకు గురై ప్రజలు పొట్టచేత పట్టుకొని పట్టణాలకు తరలి వెళ్లినప్పుడు ఆ కుటుంబాలకు చెందిన స్త్రీల పరిస్థితి ఏమిటి? వివక్ష, పని ఒత్తిడి, అనిశ్చితి, అనారోగ్యం, దైన్యమైన జీవితం ఇవన్నీ వీళ్ల మీద దోపిడీని బలోపేతం చేసేవే. ఈ పరిస్థితులలో వాళ్లకు రక్షణ ఉంటుందా? లైంగిక వేధింపులకు బలికారా వాళ్లు?

చిల్లర వ్యాపార రంగంలో అసంఘటిత రంగానిది పెద్దవాటా. 2004లో సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్ అంచనా ప్రకారం కేవలం అసంఘటిత చిల్లర వర్తకం 3.95 కోట్ల మందికి ప్రత్యక్షంగా ఉపాధిని కల్పిస్తున్నది. ఈ రంగం ఈ విధంగా విస్తరించడానికి భారతదేశంలోని 'ఉద్యోగరహిత వృద్ధి' ప్రధాన కారణమని చెప్పవచ్చు. అల్పోద్యోగితకు కూడా చిల్లర వ్యాపార రంగం ఒక పరిష్కారం కూడా. చిల్లర వ్యాపార రంగంలో అట్టడుగున ఉండేది వీథుల వెంట తిరిగి అమ్ముకునే మహిళలు. వీళ్లు ఇంటి ముందరికి వచ్చి సరుకులనందిస్తారు. పట్టణాలకు వలస వచ్చిన కుటుంబాలకు చెందిన మహిళలు, పట్టణ శివారు గ్రామాలలో నివసించే పేద మహిళలు సంపాదనలోకి సులభంగా ప్రవేశించగల వృత్తి ఇది. ఈ సంపాదన తోడైతే తప్ప ఈ పేద కుటుంబా లకు మనుగడే లేదు. చిల్లర వ్యాపారంలోకి కార్పొరేటు రంగం ప్రవేశిస్తే అది వీళ్లను వీళ్ల ఉపాధి నుండి వేరు చేసి బయటకు గెంటేస్తుంది. వాళ్ల మనుగడనే ప్రశ్నార్థకంగా మారుస్తుంది.

ప్రపంచీకరణ ప్రక్రియ ఒక నయా ధనిక వర్గాన్ని సృష్టించింది. వీళ్ల చేతిలో సంపద పోగుపడడంతో వీళ్ల విలాసాలకు అడ్డూ అదుపూ లేకుండా పోతున్నది. వీళ్ల విలాసాల కోసం స్త్రీని ఒక భోగ వస్తువుగా మలిచే క్రమం మరింత బలోపేతమైంది. ఫలితంగా ఈ సంపన్నుల వికృత చేష్టలను భరించే వస్తువైంది స్త్రీ. మరొకవైపు రోజు రోజుకూ బలోపేతమవుతున్న వస్తు వినియోగ సంస్కృతి. వస్తువుల కోసం వెంపర్లాట. ఈ పరిస్థితులలో స్త్రీలు తమను తామే విలాస వస్తువులుగా మలుచుకుంటుంటే, మరొక వైపు మోసగించబడి మరికొందరు మహిళలు ఈ విషవలయంలోకి నెట్టబడుతున్నారు. ఈ ప్రక్రియ మహిళల జీవితాలను 'విజయవంతంగా' విధ్వంసం చేస్తున్నది.

ఈ విధంగా ప్రపంచీకరణ ప్రభావాన్ని మహిళల కోణం నుండి సునిశితంగా పరిశీలించినప్పుడు స్త్రీల జీవితంలోని సంక్లిష్టత అర్థమవుతుంది. ఈ పరిస్థితి నుండి విముక్తి చెందాలంటే అస్తిత్వంలో ఉన్న సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక నిర్మాణాలను మానవీయం చేసుకోవాలి. మహిళలు ఆత్మగౌరవంతో బతకగలిగే పరిస్థితుల నేర్పరచుకోవడానికి కావలసిన వ్యూహరచన, అమలు జరగాలి.

ఉపయుక్త గ్రంథాలు:


1. Jean Dre'ze and Amartya Sen (1995) 'India Economic Development and Social Opportunity' Oxford University Press, New Delhi.
2. Sen, Amartya (1999) 'Resources, Value and Development', Oxford University Press, New Delhi.
3. Stiglitz, Joseph, E. (2006) 'Making Globalisation Work', Penguin Allen Lane.
4. Todaro Michael (1985) Economic Development in Third World Countries, Orient Longman, New Delhi.
5. Jyothi Rani, Thota, Political Economy of Special Economic Zones (SEZs) KUJOSS, January-June, 2011 & July-December, 2011, Kakatiya University, Warangal.
6. తోట జ్యోతిరాణి (2001): సామ్రాజ్యవాదం – మతతత్వం – మహిళలు, మైత్రీ బుక్ హౌస్, విజయవాడ.
7. తోట జ్యోతిరాణి, కాత్యాయని విద్మహే (2007): ప్రపంచీకరణ పరిణామాలు, ప్రభావాలు–మహిళల జీవితం, నవోదయ బుక్ హౌస్, హైదరాబాద్.
8. తోట జ్యోతిరాణి, మానవాభివృద్ధి దిశగా మహిళలు–వాస్తవాలు, స్త్రీ సంఘటన, సెప్టెంబర్–నవంబర్, 2007, సికింద్రాబాద్.
9. తోట జ్యోతిరాణి, విద్యలో జెండర్ వివక్ష –ఒక పరిశీలన, స్త్రీ సంఘటన, డిసెంబర్–ఫిబ్రవరి, 2008, సికింద్రాబాద్.
10. తోట జ్యోతిరాణి, పర్యావరణ సమస్య సంబంధంలో మహిళలు – ఒక అధ్యయనం, స్త్రీ సంఘటన, సెప్టెంబర్–నవంబర్, 2008, సికింద్రాబాద్.
11. తోట జ్యోతిరాణి, ప్రభుత్వ విధానాలు–సమ్మిళిత వృద్ధి – విమర్శనాత్మక పరిశీలన, స్త్రీ సంఘటన, జూన్ –నవంబర్, 2011, సికింద్రాబాద్.
12. తోట జ్యోతిరాణి, భారతదేశ పారిశ్రామిక విధానాలు – అమలు – అభివృద్ధి–విమర్శనాత్మక పరిశీలన, సంఘటన, జూన్ – ఆగస్టు, 2012, సికింద్రాబాద్.
13. తోట జ్యోతిరాణి, భారతదేశ చిల్లర వ్యాపార రంగంలోకి ప్రవేశిస్తున్న కార్పొరేట్ పెట్టుబడులు, స్త్రీ సంఘటన, డిసెంబర్ – మే, 2012, సికింద్రాబాద్.
14. తోట జ్యోతిరాణి, కాత్యాయని విద్మహే (2012): మహిళా సాధికారత–సవాళ్లు–సమాజ సాహిత్య స్వభావాలు, జనాభ్యుదయ అధ్యయన సంస్థ, వరంగల్.


నివేదికలు :


1) యుఎన్‌డిపి ప్రచురించే వివిధ మానవాభివృద్ధి నివేదికలు.
2) భారతదేశ ప్రభుత్వం ప్రచురించే వివిధ జనాభా లెక్కల నివేదికలు.
3) భారతదేశ ప్రభుత్వం ప్రచురించే వివిధ జాతీయ శాంపిల్ సర్వే రౌండ్ల నివేదికలు.
4) భారతదేశ ప్రభుత్వం ప్రచురించే వివిధ కేంద్ర గణాంక సంస్థల నివేదికలు.


*(రచయిత ఆచార్యులు, అర్థశాస్త్ర విభాగం,*
*కాకతీయ విశ్వవిద్యాలయం)*

వీ

# రెండు సదస్సులు - ఎన్నో ఆశాసూచికలు

***సమాజం పట్ల, సమాజ పరివర్తన పట్ల, భవిష్యత్తు పట్ల మార్క్సిస్టు అవగాహన లోతు గురించి, విస్తృతి గురించి జరిగిన చర్చల అనుభవాలను చెబుతున్నారు ఎన్ వేణుగోపాల్***

మార్చ్ చివరివారంలో విజయవాడలో, ఏప్రిల్ రెండోవారంలో నేపాల్ రాజధాని కాట్మండులో జరిగిన రెండు వేరువేరు సదస్సులు సమకాలీన మార్క్సిస్టు ఆలోచనాధారలోని వైవిధ్యానికి అద్దం పట్టాయి. వేరువేరు విషయాల మీద, విభిన్న భౌగోళిక, రాజకీయ, సామాజిక వాతావరణాల్లో జరిగినప్పటికీ, ఆ రెండు సదస్సులూ కూడ మార్క్సిస్టు సిద్ధాంత సమస్యల గురించి, ప్రజాపోరాటాల గురించి, పోరాట భవిష్యత్తు గురించి ఎన్నో చర్చనీయాంశాలను వెలికి తెచ్చాయి. సమాజం పట్ల, సమాజ పరివర్తన పట్ల, భవిష్యత్తు పట్ల మార్క్సిస్టు అవగాహన లోతు గురించి, విస్తృతి గురించి ఎన్నో ఆలోచనలను ప్రేరేపించాయి. ప్రజా ఉద్యమాల పురోగమనం గురించి ఆశలు కల్పించాయి.

**విజయవాడ సదస్సు**

గుంటూరు కేంద్రంగా పది సంవత్సరాలకు పైగా దాదాపు వంద మార్క్సిస్టు సిద్ధాంత పుస్తకాలు ప్రచురించిన లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ మార్చ్ 29, 30 తేదీల్లో విజయవాడలో 'భారత సమాజం – ఉత్పత్తి విధాన పరిణామం' అనే అంశం మీద చర్చా కార్యక్రమాన్ని నిర్వహించింది.

భారత సమాజంలో ఉత్పత్తి విధానం (మోడ్ ఆఫ్ ప్రొడక్షన్) ఏమిటనేది మార్క్సిస్టుల మధ్య గత నాలుగైదు దశాబ్దాలుగా ఎడతెగని చర్చగా ఉంటున్నది. మార్క్సిజాన్ని, చారిత్రక భౌతికవాదాన్ని శాస్త్రంగా, శస్త్రంగా గ్రహించేవారందరూ ఉత్పత్తి విధానమే సమాజానికి మూలమని, ఉత్పత్తి విధాన పరిణామం ద్వారానే సామాజిక పరివర్తన జరుగుతుందని భావిస్తారు. సమాజ పరిణామానికి భౌతిక చలన సూత్రాలున్నాయని, సమాజం దశలుగా పురోగమిస్తున్నదని, వర్గపోరాటం చోదకశక్తిగా అది ఒక్కొక్క ఉత్పత్తి విధాన దశనూ దాటుకుంటూ పయనిస్తుందని నమ్ముతారు. భారత సమాజ ప్రస్తుత దశ ఏమిటి, ఈ దశనుంచి అది ఏదశకు పరివర్తన చెందవలసి ఉంది, ఆ పరివర్తనకు దారితీసే వర్గ పోరాటంలో పాల్గొనే, నాయకత్వం వహించే సామాజిక వర్గాలు ఏవి, ఆ పరివర్తనను అడ్డుకునే సామాజిక వర్గాలు ఏవి అనే చర్చ మార్క్సిస్టులకు మాత్రమే కాదు, సమాజ పురోగమనం గురించి ఆలోచించేవారందరికీ అత్యవసరమైన, కీలకమైన చర్చ. అటువంటి చర్చకు వేదిక కల్పించిన లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ కృషి ప్రశంసనీయం.

అయితే అసలు ఆ చర్చ అవసరమా అనే సందేహం కూడ కొంతమందిలోనైనా ఉంది. భారత సమాజ పరివర్తనకు, పురోగమనానికి చారిత్రక భౌతిక వాద దృక్పథం అవసరం లేదని నమ్మే వారు భారత రాజకీయాలలో, సామాజిక ఆలోచనాపరులలో చాలమందే ఉన్నారు. అసలు వ్యవస్థ మార్పే అవసరం లేదని, ప్రభుత్వాలు మారితే చాలునని, ఉన్న ప్రభుత్వం కిందనైనా ఏవో కొన్ని సంస్కరణలు జరిగితే చాలునని, తమ వాటా పెరిగితే చాలునని అనుకుంటున్న వారు ఉద్యమాలలో కూడ ఉన్నారు. నిజానికి సంస్కరణలతో నాయకుల పబ్బం గడుస్తుందేమో గాని, దోపిడీ పీడనలకు గురవుతున్న అశేష భారత ప్రజానీకానికి ఏ మేలూ జరగదు. తమ నాయకులే, తాము నమ్ముతున్న రాజకీయ, సామాజిక ఉద్యమపక్షాలే తమ నిజమైన మేలును కోరడం లేదని తెలియని అమాయకత్వంలో కోట్లాది ప్రజానీకం ఉన్నారు. తాము అనుసరిస్తున్న పార్టీ, లేదా తమ కులంలో, మతంలో, ప్రాంతంలో పుట్టిన నాయకుడు ఏదో ఒకరకంగా ప్రభుత్వాధికారం చేపడితే తమకు మేలు జరిగిపోతుందని భ్రమపడేవాళ్లు చాలమందే ఉన్నారు. తమను తాము మార్క్సిస్టులుగా, కమ్యూనిస్టులుగా చెప్పుకునేవారికి ఆ భ్రమలు ఉండకూడదు. ప్రభుత్వాధికారానికీ, రాజ్యాధికారానికీ మధ్య, సంస్కరణలకూ వ్యవస్థ మార్పుకూ మధ్య తేడా వారికి తెలిసి ఉండాలి. కాని దురదృష్టవశాత్తూ భారత సమాజంలో కమ్యూనిస్టులుగా, మార్క్సిస్టులుగా చలామణీ అవుతున్నవాళ్లు నిజంగా కమ్యూనిస్టులో మార్క్సిస్టులో కాదు. అందువల్ల మన సమాజంలో చాలమంది ఆలోచనాపరులు కూడ సమాజ స్వభావం గురించి, వ్యవస్థ పరివర్తన గురించి తగినంతగా ఆలోచించడం లేదు.

అది అలా ఉంచి, సైద్ధాంతికంగా మార్క్సిస్టులందరూ చారిత్రక భౌతికవాద దృక్పథం కలిగి ఉంటారు గనుక, భారత సమాజం కూడ అన్ని సమాజాల లాగే భూస్వామ్య దశ నుంచి పెట్టుబడిదారీ దశ నుంచి సోషలిస్టు దశలోకి పరివర్తన చెందుతుందని భావిస్తారు. ఈ పరివర్తనలో భారత సమాజం ఎంత దూరం ప్రయాణించింది, లేదా ప్రయాణించలేదు, ప్రస్తుతం ఏ దశలో ఉంది అనేది నిర్ధారించుకోవడం వర్గపోరాటాన్ని నిర్వహించడానికి అత్యవసరం. కాని చాలమంది మార్క్సిస్టులు వర్గపోరాటాన్ని నిర్వహించవలసిన కర్తవ్యాన్నే వదిలేశారు గనుక వారికి సమాజ స్వభావం గురించీ, దశ గురించీ, పరివర్తన గురించీ ఆలోచించ వలసిన అవసరం ఉందనిపించడం లేదు. అందువల్ల ఇటువంటి చర్చ అవసరాన్ని వాళ్లు కూడ గుర్తించడం లేదు. లేదా, ఎప్పుడో తాము ఒక నిర్ధారణ చేశామనీ, మళ్లీ మళ్లీ దాని గురించి ఆలోచించనక్కరలేదనీ అనుకుంటున్నారు.

విశాలమైన వర్గపోరాట అవసరం అలా ఉంచి, సమాజ స్వభావ నిర్ధారణ తక్షణ అవసరంగా కూడ ఉంది. రెండు పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీలు భారత సమాజం పెట్టుబడిదారీ వ్యవస్థ అని ఎప్పటి నుంచో ప్రకటిస్తున్నాయి. నక్సల్బరీ పంథా అది అర్ధవలస అర్ధ భూస్వామ్యమని ప్రకటించింది. ఈ వాదనలకు తోడు భారత సమాజంలో పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందని 1960ల నుంచే వాదిస్తున్నవారు, ఆ వాదనలను ఖండిస్తూ ఇది అర్ధవలస అర్ధభూస్వామ్య వ్యవస్థేనని అంటున్నవారు సామాజిక శాస్త్రవేత్తలలో ఎందరో ఉన్నారు. 1970ల నుంచే నక్సల్బరీ పంథాను, సాయుధపోరాట వ్యూహాన్ని వదలదలచుకున్న పార్టీలూ గ్రూపులూ కూడ అర్ధభూస్వామ్య అర్ధవలస సూత్రీకరణకు కాలం చెల్లిందని, పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందని మాట్లాడు తున్నాయి. పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందనడానికి కొన్ని సూచికలను చూపుతున్నాయి. మరీ ముఖ్యంగా ప్రపంచీకరణ విధానాల తర్వాత మన సమాజ జీవితంలో ప్రవేశించిన అనేక పరిణామాలు పెట్టుబడిదారీ విధానానికి సూచికే అని వాదిస్తున్నాయి. ఈ స్థితిలో సమాజంలో వస్తున్న మార్పులను ఎలా అర్థం చేసుకోవాలో, సమాజ స్వభావం ఏమిటో, తత్ఫలితమైన పోరాట వ్యూహం ఎలా ఉండాలో చర్చించవలసిన అవసరం ఎప్పుడూ ఉంది, ఉంటుంది.

ఈ నేపథ్యంలో లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ సిపిఐ, సిపిఎంల తోపాటు నక్సల్బరీ పంథాలోని విభిన్న పాయలను ఆహ్వానించి చర్చ నిర్వహించింది. సదస్సును సైద్ధాంతిక అంశాలు, భారత ఉత్పత్తి విధాన చర్చ, ఇటీవలి పరిణామాలు అనే మూడు భాగాలుగా విభజించారు. ప్రొ. డి నరసింహా రెడ్డి అధ్యక్షతన జరిగిన మొదటి సమావేశంలో గడియారం భార్గవ (భారత ఉత్పత్తి విధానం – కొన్ని సంవిధాన ప్రశ్నలు), ప్రొ. వి వి రెడ్డి (ఉత్పత్తి విధానం: బానిసత్వం నుంచి పెట్టుబడిదారీ విధానం), రమేష్ పట్నాయక్ (భారత వ్యవసాయ రంగంలో భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలు ఏ స్థాయిలో ఇంకా కొనసాగుతున్నాయి?) పత్రాలు సమర్పించగా, వేములపల్లి వెంకటరామయ్య ఈ అంశం మీద తన ఆలోచనలు పంచుకున్నారు. డా. కొల్లా రాజమోహన్ అధ్యక్షతన జరిగిన రెండో సమావేశంలో వి శ్రీనివాసరావు భారత ఉత్పత్తి విధానంపై ఆలోచనలు పంచుకోగా, గడ్డం కోటేశ్వర రావు భారతదేశంలో ఉత్పత్తి విధానం: కమ్యూనిస్టు పార్టీల్లో చర్చ అనే అంశంపై పత్రం సమర్పించారు, ప్రొ. కెఆర్ చౌదరి అధ్యక్షతన జరిగిన మూడో సమావేశంలో ఎస్‌వి విద్యాసాగర్ (వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ సంబంధాలను అర్థం చేసుకోవడం: శ్రీకాకుళం జిల్లాలో సూక్ష్మస్థాయి అధ్యయనం), ఆర్‌వి రమణమూర్తి (భారత దేశంలో పెట్టుబడిదారీ అభివృద్ధి, వ్యవసాయ సంక్షోభం: ఒక వర్తమాన అంచనా), ఎ ప్రసాదరావు, కెఆర్ చౌదరి (ప్రపంచీకరణ కింద ఉత్పత్తి విధానం – భారత వ్యవసాయం గురించి ఆలోచనలు), సి భాస్కరరావు (వర్తమాన భారతదేశం పెట్టుబడిదారీ దేశమే), విప్లవ రచయితల సంఘం తరఫున కార్యదర్శి వరలక్ష్మి (అర్ధభూస్వామ్య అర్ధవలస ఉత్పత్తి సంబంధాల ప్రాసంగికత), టి లక్ష్మినారాయణ (భారత వ్యవసాయంలో ఉత్పత్తి శక్తులలో, ఉత్పత్తి సంబంధాలలో మార్పులు) పత్రాలు సమర్పించారు. మూడు సమావేశాలలోను మొత్తంగా దాదాపు ముప్పై మంది చర్చలో పాల్గొని ప్రశ్నలు వేశారు, వివరణలు ఇచ్చారు, కొత్త ప్రతిపాదనలు చేశారు.

ఆ పత్రాలలోనూ చర్చలోనూ ఎన్నో కీలకాంశాలు ప్రస్తావనకు వచ్చాయి. వాటన్నిటినీ వివరించడం ఒక్క వ్యాసంలో సాధ్యం కాదు. ఈ పత్రాలలో ఎక్కువ భాగం భారత ఉత్పత్తి విధానం పెట్టుబడిదారీ విధానమని, అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణ అర్థరహితమని వాదించాయి. భారత సమాజం అర్ధభూస్వామ్య అర్ధ వలస దశలోనే ఉన్నదని, పెట్టుబడిదారీ విధానం వచ్చిందనే వాదనలు దృగ్గోచరాంశాల రూపాన్ని మాత్రమే చూస్తున్నాయని, సారంలోకి వెళ్లడం లేదని కొందరు వాదించారు. ఈ రెండు భిన్న దృక్పథాలు మాత్రమే కాక, మార్క్సిజం గురించి, భారత చరిత్ర గురించి, భారత కమ్యూనిస్టు ఉద్యమం గురించి కూడ ఎన్నో అభిప్రాయాలు వెలువడ్డాయి. మొత్తం మీద రెండు రోజుల చర్చాక్రమంలో వెలువడిన ముఖ్యమైన, ఆలోచించవలసిన వాదనలను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు: 1. అసలు మార్క్సిస్టు చారిత్రక భౌతిక వాద చట్రానికి పరిమితులున్నాయనీ, పాత సంవిధానాలు సరిపోవనీ చేసిన వాదనలు. 2. భారతదేశానికి, భారత విప్లవానికి సంబంధించిన స్థూలమైన అవగాహనలు 3. దేశంలో ప్రస్తుతం కొనసాగుతున్నది పెట్టుబడిదారీ విధానం అనే వాదనలు. 4. దేశంలో ప్రస్తుతం కొనసాగుతున్నది అర్ధభూస్వామ్య అర్ధవలస సమాజం అనే వాదనలు. వీటిలో మొదటి రెండు అంశాలలో భిన్నమైన, పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు, మూడవ వాదనలలో నాలుగో వాదనకు ఖండనలు, నాలుగో వాదనలలో మూడో వాదనకు ఖండనలు వెలువడ్డాయి. ఆ వాదనలలో కొన్ని స్థూలంగా ఇలా ఉన్నాయి:

**'పాత సంవిధానాలు పనికిరావు'**

- సమాజ స్వభావం గురించి చర్చ విశ్లేషణాత్మకంగా ఉండాలి, వివరణాత్మకంగా మాత్రమే ఉంటున్నది.
- పునాది ఉపరితలం చట్రంలో సమాజాన్ని అర్థం చేసుకోవడం సాధ్యం కాదు, ప్రస్తుత సమాజంలో వ్యవస్థేతర అంశాల ప్రాధాన్యత పెరిగిపోతున్నది.
- ఇవాళ అంతర్జాతీయ శ్రమ విభజన జరుగుతున్నది, పాత తరహా పెట్టుబడిదారీ అభివృద్ధి కథనం చెల్లదు.
- కార్మికీకరణ ప్రత్యక్షంగా మాత్రమే కాదు, పరోక్షంగా కూడ జరుగుతున్నది.
- సంక్షేమ రాజ్యం ఉనికిలోకి వచ్చిన తర్వాత ఉత్పత్తి విధాన పరివర్తనను పాత పద్ధతిలో చూడలేము.
- ప్రస్తుత సమాజంలో ఉత్పత్తి సామాజికీకరణ ఎక్కువయింది. శ్రమ కేంద్రీకరణ లేదు. అటువంటప్పుడు పాత కార్మికవర్గ సిద్ధాంతాలు పనికి వస్తాయా?
- చారిత్రక భౌతిక వాదం చెప్పిన దశలను భారతదేశానికి యాంత్రికంగా వర్తింపజేయగలమా?
- పంపిణీ ప్రక్రియ ప్రాధాన్యత పెరుగుతున్నది. దీనితో పాటే ఉత్పత్తిలో మభ్యపెట్టడం, జరిగినట్టు ఉన్నా నిజంగా జరగకపోవడం, చూడడానికి ఉన్నట్టే ఉండి, అసలు ఉండకపోవడం వంటి ప్రక్రియలు ఉన్నాయి.
- సైనికీకరణ వల్ల ఏర్పడే, పెరిగే మార్కెట్ ను పరిగణనలోకి తీసుకోవాలి.

**భారత సమాజానికి, విప్లవానికి సంబంధించిన స్థూలమైన అవగాహనలు**

- అసలు విభిన్న జాతుల నిలయమైన భారతదేశాన్ని ఒకే సమాజంగా చూడవచ్చా? ఇందులో ఎన్నో విభిన్న ఉత్పత్తి విధానాలు ఉన్నాయి. శ్రమను అమ్ముకునే వాళ్లలోనే ఎన్నో అంతరాలు ఉన్నాయి.
- భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ నిజమైన ప్రత్యామ్నాయం కాకుండా సామ్రాజ్యవాదం కుట్ర చేస్తున్నది.
- భారత సమాజంలో వర్గం కన్న ఇతర అస్తిత్వాలు ప్రధానంగా మారుతున్నాయి.
- భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థ బలంగా ఉంది, ప్రజల్లో దానికి ప్రాధాన్యత ఉంది.
- భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యక్రమం కనబడని ఇద్దరు శత్రువుల మీద పోరాడమని ప్రజలకు పిలుపు ఇస్తున్నది. ఇప్పుడు భూస్వామి ఎక్కడున్నాడు? సామ్రాజ్యవాది ఎక్కడున్నాడు?
- అసలు భారత సమాజంలో భూమి సమస్యే లేదు. మన సిద్ధాంత చట్రంలో సామాజిక వాస్తవికతను బిగించి తృప్తి పడుతున్నాం.
- రూపొందుతున్న రైతాంగ వ్యవసాయాన్ని పరిరక్షించడమే వ్యవసాయ విప్లవ కర్తవ్యం.
- దేశమంతా ఒకే ఉత్పత్తి విధానం లేదు. ఎన్నో ఉత్పత్తి విధానాలు ఉన్నాయి. వాటిలో ఏది పెరుగుతున్నదో, ఏది తరుగుతున్నదో చూడాలి.
- తెలంగాణలో మావోయిస్టుల వైఫల్యమే అర్ధభూస్వామ్య సిద్ధాంతానికి కాలం చెల్లిందనడానికి రుజువు.
- చత్తీస్‌గడ్‌లో జరుగుతున్నది భారత ప్రభుత్వంతో వర్గవైరుధ్యం కాదు.

**'పెట్టుబడిదారీ విధానం ప్రవేశించింది, బలపడింది'**

- భౌతిక పరిస్థితి మార్పు లేకుండా ఉండదు, 1947లో ఉన్నట్టే, 1969లో ఉన్నట్టే ఇప్పుడు ఉందనడం కుదరదు. పెట్టుబడిదారీ విధానం రాక తప్పదు, వచ్చింది.
- అరవై సంవత్సరాలుగా బూర్జువా రాజ్యాంగయంత్ర ఉపరితలం పునాది మీద ప్రభావం వేసింది.
- పెట్టుబడిదారీ దోపిడీ, భూస్వామ్య పీడన ఉన్నాయి.
- వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం లేకుండానే, వ్యవసాయేతర రంగాలలో పెట్టుబడిదారీ విధానం వచ్చింది. ప్రభుత్వ రంగంలో, అభివృద్ధి భావజాలం కింద పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయింది.

వ్యవసాయ రంగంలో పెట్టుబడిదారీ అభివృద్ధి కూడ బూర్జువావర్గానికి సహాయపడేందుకే సాగింది.

- ప్రధాన ఉత్పత్తి విధానంగా ఉన్నది సరుకుల విధానమే, పెట్టుబడిదారీ విధానమే.
- స్వేచ్ఛాశ్రామికులు ఆవిర్భవించారు.
- మార్క్స్ చేసిన కౌలు రూపాల చర్చను భారతదేశానికి అన్వయిస్తే, ప్రస్తుత ద్రవ్యరూప కౌలు స్థితి పెట్టుబడిదారీ విధానం ఉందనడానికి సూచికే.
- సరళ సరుకుల ఉత్పత్తి విధానం విస్తృత సరుకుల ఉత్పత్తి విధానంగా మారేటప్పుడు రైతాంగాన్ని ఊచకోత కోయకతప్పదు. లక్షలాది చిన్న రైతుల ఆత్మహత్యలు ఆ ఊచకోతలో భాగమే.
- స్వతంత్ర పెట్టుబడిదారీ వర్గం బలపడడానికి పాలకవర్గం కృషి చేసింది. మొదటి ఇరవై ఏళ్లలో బడాబూర్జువా వర్గం అభివృద్ధి చెందింది.
- పట్టణీకరణ పెట్టుబడిదారీ విధాన చిహ్నమే.
- ఆహారధాన్యాల ఉత్పత్తి ఇబ్బడిముబ్బడిగా పెరగడం పెట్టుబడిదారీ విధాన ఫలితమే.
- వ్యవసాయరంగపు వాటా పెట్టుబడిదారీ దేశాల్లోలాగనే ఉంది.
- భూస్వామి, పెట్టుబడిదారులలో ఎవరు తల, ఎవరు తోక? ఎవరు పురోగామి, ఎవరు మార్గదర్శి, ఎవరు అనుయాయి?
- గుడ్లు, పాలు వంటి వస్తువులు కూడ సరుకులుగా మారి పోతున్నాయి.
- అర్ధవలస అంటున్నామంటే ఆమేరకు బూర్జువా వర్గం వచ్చినట్టే.
- సాఫ్ట్‌వేర్, హైటెక్నాలజీ రంగాలు వచ్చాయంటే ఉన్నతస్థాయి చైతన్యం వచ్చినట్టే కదా? సాఫ్ట్‌వేర్‌లో అదనపు విలువ ఎక్కువగా పోగుపడుతున్నది కదా?
- సహజ ఆర్థిక వ్యవస్థలో విద్యుచ్ఛక్తి పాత్ర ఉండదు. ఇది ఇంకా అర్ధభూస్వామ్యమే అయితే విద్యుచ్ఛక్తి ఇంత ప్రధానం ఎలా అవుతున్నది?
- వ్యవసాయ రంగంలో ఉత్పత్తి సాధనాల వినియోగం విపరీతంగా పెరిగింది. 1951లో 8,500 ఉన్న ట్రాక్టర్లు, 1997 నాటికి ఇరవై లక్షలకు పైగా పెరిగాయి. భూస్వామ్య ఆధిపత్యం ఉంటే ఈ యాంత్రీకరణ సాధ్యమేనా?
- ఇతర రంగాలు వ్యవసాయ రంగాన్ని వలసగా చూస్తూ దోపిడీ చేస్తున్నాయి.
- దున్నేవారికే భూమి నినాదానికి కాలం చెల్లింది.
- దున్నేవారికే భూమి, మౌలిక భూపంపిణీ కార్యక్రమాలు మార్క్సిస్టు వ్యతిరేకమైనవి.
- రైతు వ్యవసాయాన్ని పరిరక్షించడం పెట్టీ బూర్జువా ధోరణి.
- వ్యవసాయ రంగం మొత్తంగా మార్కెటీకరణ చెందింది. అదే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి నిదర్శనం.
- రకరకాల భూస్వామ్య విధానాలు, రకరకాల పెట్టుబడిదారీ విధానాలు ఉన్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థలో కూడ మార్పులు, పరివర్తనలు వచ్చాయి. అక్కడెక్కడో ఉన్నట్టుగా ఇక్కడ లేదు గనుక ఇది పెట్టుబడిదారీ విధానం కాదు అనలేము.
- భారతదేశపు ప్రత్యేకతలతోనైనా, పెట్టుబడిదారీ వ్యవస్థ కళ్లముందర కనబడుతున్నది. బడా గుత్తాధిపత్య బూర్జువా వర్గం కొన్నిచోట్ల, ధనిక రైతాంగ బూర్జువావర్గం కొన్నిచోట్ల ఉంది. ఇది అంతర్గతంగా వచ్చిన పెట్టుబడే. దీన్ని విస్మరించడానికి వీలులేదు.
- గత మూడు దశాబ్దాలలో ప్రాథమిక సంచయనం ఎక్కువగా జరుగుతోంది. టాటాలు బైటికి వెళ్లి కోరస్‌ను కొన్నారు. అంటే భారతదేశంలో వేరే రకమైన పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందుతున్నదా, లేక ఇంకా అర్ధవలస అర్ధభూస్వామ్య వ్యవస్థేనా? కళ్లకు ఒకటి కనిపిస్తోంది. సిద్ధాంతీకరణ మరొకరకంగా ఉంది.

**'పెట్టుబడిదారీ విధానం కాదు, అర్ధభూస్వామ్య, అర్ధవలస సమాజమే'**

- భూస్వామ్య సమాజం నుంచి పెట్టుబడిదారీ సమాజానికి పరివర్తన జరగబోతూ అనేక చారిత్రక, రాజకీయార్థిక, సామాజిక కారణాల వల్ల ఆ పరివర్తన అడ్డుకోబడినప్పుడు, వక్రీకరించబడినప్పుడు మిగిలే స్థితి అర్ధభూస్వామ్య, అర్ధవలస వ్యవస్థ.
- అలా అడ్డుకోబడిన, వక్రీకరించబడిన పరివర్తనకు నాయకత్వం వహిస్తున్నదెవరు, ఆ పరిణామం వల్ల నష్టపోతున్నదెవరు అనే అంచనా వర్గపోరాటానికి అవసరం.
- అర్ధవలస అర్ధభూస్వామ్య విశ్లేషణను కేవలం ఆర్థిక కోణంలో చూస్తే సరిపోదు. అది సరైన మార్క్సిస్టు సంవిధానం కూడ కాదు. ఆ విశ్లేషణకు చారిత్రక, రాజకీయ, సామాజిక కోణాలన్నీ కావాలి. సాహిత్యం వంటి సామాజిక చైతన్య రూపాల, ఉపరితల కోణాలను కూడ కలపాలి.
- వర్గపోరాట ఆచరణతో సంబంధంలేని ఉత్పత్తి విధాన చర్చ అనవసరం మాత్రమే కాదు, విచ్ఛిన్నకరం కూడ.
- వలసగా ఉండడం అనే చారిత్రక ప్రత్యేకత, కులం అనే సామాజిక ప్రత్యేకత, అంతర్గతంగా అభివృద్ధి చెందిన ఉపరితలం కాకుండా బైటినుంచి తీసుకువచ్చి అంటుకట్టిన రాజకీయ ప్రత్యేకతల వల్ల భారతదేశం బూర్జువా ప్రజాస్వామిక విప్లవానికి, స్వతంత్ర పెట్టుబడిదారీ విధానానికి దూరమైంది.
- బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరగకుండా బూర్జువా ప్రజాస్వామిక ఉపరితలాంశాలను దిగుమతి చేసుకోవడం భారత ప్రత్యేకత. ఆ ఉపరితలాంశాలను చూసి పెట్టుబడిదారీ విధానంగా భ్రమపడడం జరుగుతున్నది.
- వచ్చిన పెట్టుబడి అంతర్గత అభివృద్ధితో వచ్చినది కాదు, బాహ్య జోక్యం వల్ల, ద్రవ్య పెట్టుబడి వల్ల, వలస వల్ల వచ్చినది. అది వలస, సామ్రాజ్యవాద పెట్టుబడికి లొంగి, దళారీగా మాత్రమే ఉంటుంది. అది స్వతంత్రంగా ఎదగదలచుకున్నా ద్రవ్య పెట్టుబడి దశలో అది సాధ్యంకాదు. వర్గపోరాట బలాబలాల పొందిక మారినప్పుడు మాత్రమే ఆ బూర్జువావర్గంలోని జాతీయ శక్తులు వికసిస్తాయి.
- ఇప్పుడున్నది పెట్టుబడిదారీ విధానమే అనుకుంటే, ఇది ఏ బూర్జువా ప్రజాస్వామిక విప్లవం వల్ల రూపొందింది? అది ఎప్పుడు జరిగింది? దానికి నాయకత్వం వహించినవారెవరు? అది ఏ వర్గాల ప్రయోజనాల కొరకు జరిగింది? ఇది బూర్జువా ప్రజాస్వామిక విప్లవం అనుకుంటే కనీస కార్యక్రమమైన భూసంస్కరణలు ఎందుకు అమలు జరగలేదు? ఉత్పత్తిశక్తుల విడుదల, ఉత్పాదకత పెరుగుదల ఎందుకు జరగలేదు?
- ఉత్పత్తి శక్తులలో (ఉత్పత్తి సాధనాలలో, ప్రజలలో), ఉత్పత్తి సంబంధాలలో, ఉపరితలంలో మార్పులు కనబడుతున్నాయి. కాని ఆ మార్పుల స్వరూప స్వభావాలను, సారాంశాన్ని విశ్లేషిస్తే అవి చారిత్రక దశలో ఉన్నతదశకు గుణాత్మకంగా పరివర్తన చెందినట్టుగా చెప్పలేము.
- సమాజం, వ్యవస్థ మారాయా లేదా అనే ప్రశ్నకు జవాబు ఎవరి దృష్టికోణం నుంచి చెప్పుకోవాలి? భారత సమాజంలో భూమిలేని నిరుపేదల, చిన్నరైతుల దృక్కోణం నుంచి మాత్రమే చెప్పుకోవాలి.

స్థూలంగా అక్కడ వెలువడిన వాదనలలో ప్రధానమైనవి ఇవి. వీటిలో సంవిధానాలు మారవలసి ఉంటుందనే వాదనను కొంతవరకు అంగీకరించవచ్చు. వస్తువులో మార్పు సహజం, అనివార్యం గనుక ఆ వస్తువును పరిశీలించే పద్ధతి కూడ నానాటికీ పదును దేరవలసి, నిశితం కావలసి ఉంటుంది. ఆ అర్థంలో ఈ వాదనలలో కొన్నిటిని ఆలోచించ వచ్చు. కొత్త అంశాలను సంలీనం చేసుకోవచ్చు. కొత్త పరిణామాలను అర్థం చేసుకునే కొత్త పరికరాలను మన సంవిధానంలోకి చేర్చుకోవచ్చు. దాని అర్థం మార్క్సిస్టు చారిత్రక భౌతికవాద పద్ధతిని పూర్తిగా వదులు కోవాలని కాదు. పద్ధతిని సృజనాత్మకంగా

మార్చుకోవాలి. కొత్త దృగ్గోచరాంశాలను అర్థం చేసుకోగల వైశాల్యాన్ని, లోతును సంతరించుకోవాలి. అందుకు ఎటువంటి అభ్యంతరమూ లేదు. కాని గతంలో ఈ ఆలోచనతో సాగిన ప్రయత్నాలన్నీ చివరికి అసలు పద్ధతినే వదులుకునే దగ్గరికి దారితీశాయి గనుక కొంత జాగరూకత అవసరం. ఎన్ని కొత్త ఆలోచనలకైనా అవకాశం ఇవ్వవచ్చు, కాని ప్రజాజీవితం దోపిడీ పీడనలకు వీలులేని సమానత్వాన్ని సంతరించుకోవాలనే మౌలిక దృక్పథాన్ని వదులుకోగూడదు. ఆ దృక్పథం మార్క్సిజం తప్ప మరొకటి కాదు. గాలిపటం ఎగరేసినట్టుగా ఆలోచనలను ఎంత స్వేచ్ఛగానైనా ఎక్కడికైనా వెళ్లనివ్వవచ్చు. కొత్త గాలులలో విహరించనివ్వవచ్చు. కాని అది గాలివాటు కాగూడదు. గాలిపటానికి ఆధారమైన దారం ఉండాలి. ఆ దారం చైతన్యవంతమైన, ఆచరణశీలి అయిన మనిషి చేతిలో ఉండాలి. ఆ మనిషి స్థిరంగా భూమి మీద నిలబడి ఉండాలి. గాలిపటంతో పాటు దారమూ మనిషీ కొట్టుకుపోయి, అసలు భూమే లేదనే భావవాదానికి చేరితే కష్టం.

ఇక పెట్టుబడిదారీ విధానం వచ్చిందనీ, వస్తున్నదనీ, కొన్ని చోట్ల వచ్చిందనీ, కనబడినదల్లా పెట్టుబడిదారీ విధానానికి నిరూపణేననీ, అర్ధభూస్వామ్య అర్ధవలస వాదులు చాదస్తంగా, మూర్ఖంగా తమ వాదనకు కట్టుబడి ఉన్నారనీ సాగిన వాదనలు సైద్ధాంతికంగానూ చెల్లవు, వాస్తవాల రీత్యానూ చెల్లవు. పెట్టుబడిదారీ విధానం అంటే పెట్టుబడి రూపాలు మాత్రమే కాదు, అది అదనపు విలువ దోపిడీ మీద, విస్తృత పునరుత్పత్తి మీద, ఉత్పత్తిశక్తుల గరిష్ఠ వినియోగం మీద, నిరంతరం పెరిగిపోయే పెట్టుబడి సంచయనం మీద ఆధారపడిన సామాజిక సంబంధాల సమాహారం. మన చుట్టూ ఎన్నెన్ని సరుకులు కనబడినా, ఎంత మిరుమిట్లు గొలిపే పెట్టుబడి కనబడినా అవి ఈ గుణాత్మకంగా భిన్నమైన ఉత్పత్తి సంబంధాల చిహ్నాలు కావు. సామ్రాజ్యవాద యుగంలో అలా ఒక దేశంలో పెట్టుబడిదారీ విధానం పుట్టుకురావడానికి, విస్తరించడానికి సైద్ధాంతికంగా అవకాశమే లేదు. భారత సమాజ ప్రత్యేకతలు అందుకు అవకాశం ఇవ్వవు. ఒకచోట పెట్టుబడిదారీ విధానం వచ్చింది, మరొకచోట రాలేదు అనడం కూడ కుదరదు. అది ఒకచోట వస్తే, వచ్చే అవకాశమే ఉంటే అన్ని చోట్లకూ విస్తరిస్తుంది. ఇది వేరేరకమైన పెట్టుబడిదారీ విధానం అనదలచుకుంటే, పెట్టుబడిదారీ విధానం అనే మాట వాడనక్కరలేదు.

నిజానికి నక్సల్బరీ పంథా సూత్రీకరించిన నాటికన్న ఎక్కువ వివరాలతో, ఎక్కువ అనుభవంతో, ఎక్కువ ఆచరణతో అర్ధవలస అర్ధభూస్వామ్య సూత్రీకరణను సమర్థించగల అవకాశం ఇవాళ ఉంది. ప్రపంచీకరణ విధానాల తర్వాత దేశంలో జాతీయ బూర్జువావర్గం, దేశభక్తియుత బడా పెట్టుబడిదారీ వర్గం లేదని స్పష్టంగా బహిరంగంగా రుజువైపోయింది. నూతన ఆర్థిక విధానాలను వ్యతిరేకిస్తామని 1990ల మొదట్లో రాహుల్ బజాజ్ నాయకత్వంలో ఆరు నెలలో, ఏడాదో గొణిగిన బాంబే క్లబ్ పెద్దలు కూడ ఆ తర్వాత నోరు మూసుకుని సామ్రాజ్యవాద పెట్టుబడికి దాసోహం అంటూ జూనియర్ పార్ట్నర్లుగా, దళారీలుగా సర్దుకున్నారు. ఆనాటినుంచి అణు ఒప్పందం దాకా ఈ రెండు దశాబ్దాలలో ఈ దేశ పాలకుల అర్ధవలస స్వభావం రోజురోజుకూ స్పష్టమయింది. ఈ క్రమంలో భారత దళారీ బడా బూర్జువాలు బహుళజాతి సంస్థలుగా ఎదిగారన్నా, విదేశాలలో పెట్టుబడులు పెట్టగలిగారన్నా, సామ్రాజ్యవాద పెట్టుబడి వలయంలో భాగంగా, వారి దళారులుగా మాత్రమే తప్ప, స్వతంత్ర, దేశీయ పెట్టుబడిదారులుగా కాదు. మరొకవైపు ఈ క్రమంలోనే భూకేంద్రీకరణ, చిన్న కమతాల వ్యవసాయం, వ్యవసాయ సంక్షోభం, రైతాంగంమీద రుణభారం, లక్షలాదిగా రైతుల ఆత్మహత్యలు, అనుపస్థిత భూస్వామ్యం పెరుగుదల, కొత్త రూపాల దోపిడీ పీడనలు, అభివృద్ధి నిరోధక ఉపరితలాంశాల ప్రభావం వంటి అర్ధభూస్వామ్య చిహ్నాలెన్నో బలపడ్డాయి. అసలు అర్ధవలస అర్ధభూస్వామ్య లక్షణాలను విడదీసి చూడడం కూడ సరైన పద్ధతి కాదు.

భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్య వ్యతిరేక వ్యవసాయ విప్లవం ద్వారా, అర్ధభూస్వామ్య అర్ధవలస పాలనను కూలదోసి నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని జయప్రదం చేసి సోషలిస్టు విప్లవం వైపు పురోగమించాలని నక్సల్బరీ పంథా రూపొందించిన వ్యూహం ఇవాల్టికీ అక్షరాలా సరిపోతుందని ఈ నాలుగు దశాబ్దాల పరిణామాలన్నీ మరింతగా రుజువు చేస్తున్నాయి. భారత ఉత్పత్తి విధానం మీద జరిగిన రెండు రోజుల చర్చ ఆ విశ్వాసాన్ని మరింత బలోపేతం చేసింది. చర్చలో గంభీరమైన విషయాలతో పాటు, కొన్ని నేలబారు ఆలోచనలు కూడ కలిసి కలగూరగంపలా మారిపోవడం, అనవసర విషయాల మీద కొంత సమయం వృథా కావడం, కొంతమంది వక్తలకు మౌలిక చారిత్రక భౌతికవాద అవగాహనలు, ఉత్పత్తి విధానపు ప్రాముఖ్యత తెలియకపోవడం వంటి ప్రతికూల అంశాలు కొన్ని ఉన్నప్పటికీ, మొత్తంమీద ఎక్కువమంది హాజరు కావడం, శ్రద్ధగా వినడం, చర్చలో పాల్గొనడం, ఇవాళ అత్యవసరమైన ఒక కీలక రాజకీయార్థిక విషయం మీద ఇంత పెద్ద ఎత్తున ఆసక్తి ఉండడం, మౌలికమైన ఆలోచనా స్ఫోరకమైన అంశాలు చర్చకు రావడం వంటి ఆశాసూచికలు ఈ సదస్సును విజయవంతం చేశాయి.

**కాట్మండు సదస్సు**

విజయవాడ సదస్సు భారత సమాజ స్థితి గురించి, పురోగమన మార్గం గురించి ఆలోచనలు రేకెత్తిస్తే, సరిగ్గా రెండువారాల తర్వాత నేపాల్ రాజధాని కాట్మండులో కృష్ణసేన్ ఇచ్ఛుక్ సాంస్కృతిక్ ప్రతిష్ఠాన్ అనే సంస్థ 'మార్క్సిజం – పోస్ట్ మార్క్సిజం – పోస్ట్ మాడర్నిజం' అనే అంశం మీద నిర్వహించిన సదస్సు, ఆ సందర్భంగా గడించిన మూడు రోజుల అనుభవాలు ఇదే అంశానికి సంబంధించి మరికొన్ని ఆలోచనలను ప్రేరేపించాయి. కృష్ణసేన్ ఇచ్ఛుక్ గొప్ప విప్లవ కవి. 1956లో పుట్టిన కృష్ణసేన్ తన పందొమ్మిదో ఏటి నుంచే కవిత్వం రాస్తూ, 1991 నాటికి విప్లవ కవిగా శోకాంజలి అనే మొదటి కవితా సంపుటం అచ్చువేశాడు. ఆ తర్వాత పదకొండు సంవత్సరాల కాలంలో మరొక మూడు కవితాసంపుటాలు వెలువడ్డాయి. నేపాల్ కమ్యూనిస్టు పార్టీ – మావోయిస్ట్ నడిపిన విప్లవ కార్యక్రమాల్లో పాల్గొంటూ జైలు జీవితాన్ని అనుభవించాడు. అజ్ఞాతవాసంలో ఉన్నాడు. 2002లో ఆయనను ప్రభుత్వ బలగాలు చంపివేశాయి. ఆయన స్మృతిలో ఏర్పడిన సాంస్కృతిక సంస్థ నేపాల్ విప్లవోద్యమ స్ఫూర్తిని నిలిపి ఉంచడానికి ప్రయత్నిస్తున్నది.

నిన్న మొన్నటివరకూ నేపాల్ లో జరిగిన ప్రజాయుద్ధం చాలమందికి ఆసక్తినీ, ఆశనూ కలిగించింది. ఆ తర్వాత 2005 నుంచి ప్రచండ నాయకత్వం విద్రోహానికి పాల్పడడం మొదలై, ప్రచండ – బాబూరామ్ భట్టరాయ్ నాయకత్వం సాయుధ పోరాటాన్ని విరమించింది. ఐక్యరాజ్యసమితి మధ్యవర్తిత్వాన్ని అంగీకరించి ఆయుధాలు అప్పగించి, ప్రజావిముక్తి సైన్యాన్ని బారక్ లకు పరిమితం చేసింది. ప్రభుత్వాధికారాన్ని కూడ చేపట్టి, ప్రజా విముక్తి సైన్యాన్ని అవమానకరమైన షరతులకు లొంగి ప్రభుత్వ సైన్యంలో సంలీనం చేసింది. అయినా నేపాల్ విప్లవోద్యమం గురించి ఇంకా వేచి చూడాలని చాలమంది భావించారు. కాని ఆ నాయకత్వం అవకాశవాదంతో, రివిజనిజంతో నిండిపోయిందని ఆ పార్టీ శ్రేణులలో అత్యధికులు భావించిన సందర్భంగా గత సంవత్సరం జూన్ లో పార్టీ నిట్టనిలువున చీలిపోయింది. ప్రచండ నాయకత్వం తమను తాము ఏకీకృత నేపాల్ కమ్యూనిస్టు పార్టీ – మావోయిస్ట్ అని పిలుచుకుంటుండగా, విప్లవానికి పునరంకితమైన పార్టీ నేపాల్ కమ్యూనిస్టు పార్టీ – మావోయిస్ట్ అనే పాత పేరుతోనే కొనసాగుతోంది.

అప్పటివరకూ పార్టీ ఉపాధ్యక్షుడిగా ఉండిన మోహన్ బైద్య (కిరణ్) కొత్త విప్లవపార్టీకి అధ్యక్షుడయ్యాడు. ప్రచండ – బాబూరామ్ నాయకత్వం చేసిన విద్రోహం తర్వాత, ప్రభుత్వాధికారంలో ఉండి వారు దేశ వ్యాప్తంగా సాగించిన నష్టాల తర్వాత పునర్నిర్మాణ ప్రయత్నాలు ఎంత కష్టభరితంగా ఉంటాయో ఎవరైనా ఊహించవచ్చు. అందుకే ఈ పార్టీ కూడ తక్షణమే

సాయుధ పోరాటానికి అవకాశం లేదని ప్రకటించింది. కాని భూఆక్రమణ పోరాటాలు, సామాజిక సమస్యల మీద పోరాటాలు, ప్రజాసంఘాల పునర్నిర్మాణం ప్రారంభించింది. ఈ క్రమంలోనే మేధావులలో, విద్యావంతులలో మార్క్సిస్టు వ్యతిరేక భావాల ప్రచారాన్ని అడ్డుకునేందుకు పోస్ట్ మాడర్నిజం మీద సదస్సును నిర్వహించింది.

నేపాల్ సమాజం ఇంకెంతమాత్రం అర్ధభూస్వామ్య అర్ధవలస సమాజం కాదని, రాచరికం తొలగిపోవడంతో బూర్జువా ప్రజాస్వామిక విప్లవం విజయవంతమైనట్లేనని, తమ పార్టీ అంతకుముందు ప్రకటించిన నలభై అంశాల కార్యక్రమంలో అత్యధిక భాగం నెరవేరాయని ప్రధానమంత్రిగా ఉండిన రోజులలో బాబూరామ్ ప్రకటించారు. కాని ఎవరైనా ఆ నలభై అంశాల కార్యక్రమాన్ని, 2006 తర్వాత జరిగిన పరిణామాలను పోల్చి చూస్తే ఆ కార్యక్రమంలో కనీస అంశాలు కూడ నేరవేరలేదని తేటతెల్లమవుతుంది. పైగా ఆ కార్యక్రమంలో ఒక అంశమైన భూపంపిణీకి స్వయంగా ప్రచండ – బాబూరామ్ నాయకత్వమే తూట్లు పొడిచింది. అంతకుముందు ప్రజాయుద్ధ క్రమంలో స్వాధీనం చేసుకుని ప్రజలకు పంచిపెట్టిన భూమిని, ఆస్తులను తిరిగి భూస్వాములకు అప్పగించారు. నలభై అంశాల కార్యక్రమంలో ప్రధానాంశమైన భారత విస్తరణవాదం మీద విమర్శను వదులుకోవడం మాత్రమే కాదు, భారత ప్రభుత్వ సహకారం అవసరమని ప్రకటిస్తున్నారు.

ఈ నేపథ్యంలో భాగమే పోస్ట్ మాడర్నిజం మీద చర్చ. మార్క్సిస్టు వ్యతిరేకులు మాత్రమే కాక, మార్క్సిజం మీద అనుమానాలు మొదలైన వాళ్లు కూడ పోస్ట్ మాడర్నిజం మీద ప్రేమ పెంచుకోవడం మనదగ్గర కూడ అనుభవమే. నేపాల్‌లో కూడ సామ్రాజ్యవాద సంస్కృతి, భావజాలాల ప్రభావంలో ఉన్న మేధావులు గత ఒకటి రెండు దశాబ్దాలుగా పోస్ట్ మాడర్నిజం గురించి మాట్లాడుతుండగా, ప్రస్తుతం ప్రచండ అనుకూల శక్తులు కూడ పరోక్షంగా ఆ వాదనల వైపు పయనిస్తున్నాయి. అందువల్ల ఈ చర్చ ఏర్పాటయింది. కిరణ్ నాయకత్వంలోని మావోయిస్టు పార్టీ సమర్థకుల వేదికగా ఈ చర్చావేదిక తయారయినప్పటికీ, వారు విశాల దృక్పథంతో అందరినీ ఈ చర్చకు ఆహ్వానించారు. ప్రచండ అనుకూల నాయకులు కూడ తగినంత మంది పాల్గొన్నారు. త్రిభువన్ విశ్వవిద్యాలయంలో నేపాలీ ప్రొఫెసర్ తారాకాంత్ పాండే నేపాలీలో పత్రాన్ని సమర్పించగా, భారత్ నుంచి న్యూఢిల్లీ జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయ హిందీశాఖ మాజీ ప్రొఫెసర్, సాహిత్య విమర్శకుడు మేనేజర్ పాండే ఒక పత్రం, నేను ఒక పత్రం సమర్పించాం. ఈ మూడు పత్రాల మీద వ్యాఖ్యానించడానికి నలుగురు భిన్న భిన్న దృక్పథాల విమర్శకులను ఎంచుకున్నారు. మన సిపిఐ, సిపిఎంల వంటి యునైటెడ్ మార్క్సిస్ట్ లెనినిస్ట్ పార్టీ సానుభూతిపరుడు, ప్రగతిశీల లేఖక్ సంఘ్ అధ్యక్షుడు అమర్‌గిరి పోస్ట్ మాడర్నిజాన్ని విమర్శిస్తూనే మావోయిజాన్ని కూడ విమర్శించాడు. మనదగ్గరి లాగే 'ఉగ్రవాద మావోవాదం' అని చాల సార్లు అన్నాడు. త్రిభువన్ విశ్వవిద్యాలయ మాజీ ఇంగ్లిష్ ప్రొఫెసర్, పోస్ట్ మాడర్నిస్టు సమర్థకుడు ప్రొ. అభి సుబేది పోస్ట్ మాడర్నిజంలో ఎటువంటి అత్యాధునిక లక్షణాలున్నాయో, వాటిని అర్థం చేసుకోవడంలో పత్ర సమర్పకులం ముగ్గురమూ ఎలా పొరపడ్డామో చెప్పాడు. ఇక ప్రచండ అనుకూల మావోయిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు, సాహిత్యవిమర్శకుడు, నీను చాపగాయ్ విప్లవం ఎవరి సొంత ఆస్తీ కాదని, తామే నిజమైన మావోయిస్టులమనీ, తామేమీ పోస్ట్ మాడర్నిజాన్ని సమర్థించడం లేదని అన్నాడు. మరొక మాజీ ఇంగ్లిష్ ప్రొఫెసర్, విప్లవ మావోయిస్టు పార్టీ సానుభూతిపరుడు దిల్‌సాహ్నీ పోస్ట్ మాడర్నిజం ప్రమాదాల గురించి మాట్లాడాడు. చిట్టచివరిగా మావోయిస్టు పార్టీ అధ్యక్షుడు, స్వయంగా చైతన్య పేరుతో ప్రఖ్యాతుడైన సాహిత్య విమర్శకుడు మోహన్‌బైద్య కిరణ్ అన్ని వాదనలను, పత్రాలను స్పృశిస్తూ ఉపన్యసించాడు.

ఈ మూడు రోజుల నేపాల్ అనుభవం కనీసం నాలుగు అంశాలలో నా మనసుమీద చెరగని ముద్ర వేసింది.

మొట్టమొదటిది, నేపాల్‌కూ తెలంగాణకూ పోలిక. సరిగ్గా 1946–51 మధ్య తెలంగాణలో జరిగినట్టే నేపాల్‌లోనూ 1995–2005 మధ్య రైతాంగ సాయుధ పోరాటం జరిగింది. సరిగ్గా తెలంగాణలో జరిగినట్టే నేపాల్‌లోనూ నాయకత్వం సాయుధపోరాట విరమణ ప్రకటించి ఎన్నికల రాజకీయాల్లోకి దిగింది. సరిగ్గా తెలంగాణలో లాగనే నేపాల్‌లో కూడ సాయుధ పోరాటం జరిగినప్పుడు భూస్వామ్య, రాచరిక పాలన ఉండింది. సాయుధపోరాట ఫలితాలలో ఒకటిగా అక్కడ కూడ రాచరికం కూలిపోయింది. ఇక్కడి నాయకత్వమూ అక్కడి నాయకత్వమూ కూడ అదే గొప్ప విజయంగా, తమ లక్ష్యసాధనగా చెప్పుకున్నారు. కాని స్పష్టంగానే రెండు చోట్లా ఉద్యమ క్రమంలో అంతకన్న ఉన్నతమైన లక్ష్యాలను పెట్టుకుని, వాటిలో సగమో పావో కూడ తీరకుండానే ఉద్యమం ముగించారు. అయితే ఒక తేడా ఏమంటే తెలంగాణలో 1951 విరమణ తర్వాత పదిహేడు సంవత్సరాల సుదీర్ఘమౌనం కొనసాగింది. నక్సల్బరీ నిప్పురవ్వ తర్వాత గాని పునర్నిర్మాణం సాధ్యం కాలేదు. నేపాల్‌లో పునర్నిర్మాణం నాలుగైదేళ్లలోనే మొదలయింది. నాయకత్వ విద్రోహం వల్ల, ఆ నాయకులే కొంతకాలం అధికారంలో ఉండడం వల్ల అక్కడ పునర్నిర్మాణ ప్రయత్నాలు కష్టసాధ్యంగా ఉన్నాయి.

రెండో అంశం పెరిగిపోతున్న వస్తు వ్యామోహ సంస్కృతి. నేపాల్ మీద ప్రపంచీకరణ ప్రభావాలు చాల ఎక్కువగా ఉన్నాయి. ఆ దేశ ఆర్థిక దుస్థితి వల్ల అక్కడి నుంచి విపరీతంగా వలసలు సాగుతుంటాయి, హిమాలయాల వల్ల విపరీతంగా పర్యాటకుల తాకిడి ఉంటుంది. విదేశీ ప్రభావాలు దేశంలోకి సులభంగా, చాల ఎక్కువగా వస్తుంటాయి. కాట్మండూలో ఎన్నో మాల్‌లు, సామ్రాజ్యవాద సంస్కృతీ చిహ్నాలు, వస్తువ్యామోహం విచ్చలవిడిగా కనబడ్డాయి. ఆ ప్రభావానికి లోనైన వేలాది మంది యువకులు కనబడ్డారు.

కాని అదే సమయంలో గొప్ప ఆశాసూచికలుగా రెండు అంశాలు కనబడ్డాయి. మొదటిది, అక్కడి విప్లవ, సాంస్కృతికోద్యమంలో కనబడిన విశాల దృష్టి. రివిజనిజాన్ని అంత తీవ్రంగా ఖండిస్తూ కూడ, ఆ రివిజనిస్టులతో ఒకే ప్రజా సంఘంలో ఉండడానికి, వారిని తమ వేదికల మీద మాట్లాడించడానికి, బహిరంగ చర్చలు జరపడానికి నేపాల్ విప్లవకారులు చూపుతున్న సంయమనం ఆహ్వానించదగినది. సాయుధపోరాట వ్యూహాన్ని కొనసాగించడానికి పార్టీని చీల్చినవారే, సాంస్కృతిక, మేధో చర్చలో అటువంటి చీలికలు అవసరం లేదని అనుకుంటున్నట్టున్నారు. భావసంఘర్షణ బహిరంగంగా, ఐక్యంగా జరపవచ్చుననుకుంటున్నారు.

అంతకన్న ఎక్కువ ఆశను కల్పించినది, మొదటిరోజు కవితా ఉత్సవం లోను, మర్నాడు సదస్సులోను వందలాది మంది యువకులు పాల్గొనడం. రెండు రోజులూ సభికులలో సగంకన్న ఎక్కువ మంది ఇరవైలలో ఉన్న యువకులే ఉన్నారు. కవితా ఉత్సవంలో నేను విని అర్థం చేసుకోగలిగిన కవితలన్నీ కూడ ప్రచండ విద్రోహాన్ని ఖండిస్తూ, పోరాటం కొనసాగించవలసిన అవసరాన్ని వివరిస్తూ సాగాయి. సామ్రాజ్యవాద సంస్కృతిని విమర్శించాయి. కవుల స్వరాలలో, హావభావాలలో గొప్ప విప్లవ స్ఫూర్తి కనబడింది, వినబడింది.

'మార్క్సిజం లెనినిజం మావోయిజం ప్రచండ మార్గం' అనీ, 'ఇరవై ఒకటో శతాబ్ది సోషలిస్టు విప్లవాలన్నిటికీ మార్గదర్శి ప్రచండ మార్గమే' అనీ అతివాద నినాదాలు వినిపించిన నేల అది. ఆ నినాదాలు ఇంకా ప్రతిధ్వనిస్తుండగానే, ప్రచండ రంగు మార్చకుండానే దిక్కు మార్చిన తర్వాత, విప్లవస్ఫూర్తిని యథాతథంగా నిలుపుకోవడం అసిధారావ్రతమే. ఆ అసిధారా వ్రతానికి నేపాలీ సోదరులు మరొకసారి పూనుకుంటున్నారనే విశ్వాసంతో, వారు ఈసారి జాగరూకతతో విజయం సాధించగలరనే ఆశతో తిరిగివచ్చాను.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# భూమి వేట - కాకినాడ సెజ్

*అభివృద్ధి పేరుతో, ఉపాధి అవకాశాల ఆశ చూపుతూ రైతుల నుంచి వేలాది ఎకరాల భూమిని లాక్కొన్న పాలకులు నిర్వాసితులైన వారికి సరైన ప్రత్యామ్నాయ ఉపాధి చూపకుండా, నిలువ నీడ లేకుండా చేశారని అంటున్నారు* **హేమా వెంకట్రావ్**

నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ ఆ తర్వాతి క్రమంలో వచ్చిన ప్రత్యేక ఆర్థిక మండలాల (సెజ్) గురించి ప్రగతిశీల శక్తులు ఎప్పటికప్పుడు అప్రమత్తంగానే ఉంటూ, వాటి దుష్ఫలితాల గురించి ప్రజలకు తెలియ చేయడంలో ముందు వరుసలోనే ఉన్నాయి. 2005లో వచ్చిన ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టం గురించి మేధావులు ముందుగానే హెచ్చరించారు. 2006లోనే కాకినాడ సెజ్‌లకు బీజం పడింది. భూమిపై వేట మొదలయింది. బంగారం పండే ఎకర భూమికి ముష్టి మూడు లక్షల రూపాయలు ఇచ్చి మొత్తంగా వేల ఎకరాల భూమిని చుట్ట పెట్టే ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. రైతులకూ, రైతు కూలీలకూ నిలువనీడ లేకుండా చేసే సెజ్ కుట్రల్ని పసిగట్టిన పోరాట సంఘాలు 2008లో ప్రతిఘటనకు పూనుకున్నాయి. అరెస్టులు, కుట్ర కేసులు, కోర్టులో న్యాయ పోరాటం, ఆనాటి తొలిదశ ఉద్యమం ఆత్మరక్షణలోనే నడిచింది.

మారుతున్న రాజకీయార్థిక పరిస్థితులలో పోలీసుల అత్యుత్సాహాన్ని నిలదీస్తూ, భూమి కోసం రాజీలేని పోరాటానికి సిద్ధపడుతున్న మహిళలు, విద్యార్థులు, యువకులు ఉద్యమంలో కొత్త నీరై చేరడం మలిదశ ఉద్యమంలో ప్రత్యేకతలుగా గుర్తించవచ్చు. వైఎస్ పాలనలో భూ భాగోతాలు బయటపడడం, వాన్‌పిక్ భూములలో కెబినెట్ మంత్రులతో సహా జైళ్ల పాలవడం, ఓట్ల రాజకీయాల కోసమైనా రైతులకు అండగా నిలుస్తామని ప్రతిపక్షాలు హామీలు ఇవ్వడం. అంతర్జాతీయ ద్రవ్యోల్బణం, మందకోడిగా సాగుతున్న దేశీయ మార్కెటు స్థితులు సహజంగానే సెజ్ వ్యతిరేక ఉద్యమానికి ఊపిరి పోశాయి. మా భూములు మేము దున్నుకుంటుంటే మీరు ఎందుకు వచ్చారు? ఎవరు పంపితే వచ్చారు? అనే కాకినాడ సెజ్ ప్రతిపాదిత ప్రాంతంలో ఏరువాక సాగిస్తున్న భూములలోకి పోలీసుల ప్రవేశాన్ని నిలదీసిన రమణక్కపేట మహిళల తెగువ ఈస్ట్ ఇండియా కంపెనీని ఎదిరించిన ఝాన్సీ లక్ష్మీబాయి వారసత్వాన్ని స్ఫురణకు తెచ్చారు. కాలం చెల్లిన సెజ్ ప్రతిపాదనల్ని కాలదన్ని మోసపూరితంగా, బలవంతంగా లాక్కొన్న తమ భూముల్ని దున్నుకోవడానికి సిద్ధపడ్డారు. రైతులు వంటావార్పు నిర్వహించి సెజ్ ఆక్రమణను నిరసించారు. శాంతియుతంగా 'ఏరువాక' నిర్వహిస్తుంటే ఎందుకు తమ భూములలోకి రావల్సి వచ్చిందంటూ నిలదీశారు. సెజ్ కోసం అక్రమంగా లాక్కొన్న భూముల్ని తిరిగి ఇచ్చేంత వరకు పోరాటం చేస్తామన్నారు. 2012 మే 11న ఏరువాకను ఆపడానికి వస్తున్న పోలీసు వాహనాలను తమ దరికి చేరకుండా దారి మధ్యలో మంటలు వేసి తమ ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. అక్కడికి చేరుకున్న పోలీసు మూకల్ని తిప్పి కొట్టారు. కాకినాడ సెజ్ ప్రతిపాదిత ప్రాంతంలోని రమణక్కపేటలో తిరిగి రగిలిన పోరాట జ్వాల ఇది. 2008 మార్చ్ 7న అంతర్జాతీయ మహిళా దినం మార్చ్ 8 పోరాట స్ఫూర్తితో ప్రతిఘటన రూపంతో ఉద్యమం మలుపు తిరిగింది. చైతన్యవంతులైన స్త్రీలు సెజ్ వ్యతిరేక ఉద్యమంలో ఉప్పెనలా వచ్చి పోరాటాన్ని మరింత పదునెక్కించారు. మరోవైపు దళితులు, కొద్ది మంది బహుజనులు ఉద్యమం నుంచి వెనుదిరిగారు. అభివృద్ధి ఆధునీకరణ పేరుతో జరుగుతున్న ఈ క్రమంలో అట్టడుగు వర్గాలుగా ఉన్న దళితులు ఉద్యమానికి దూరంగానూ, సమాజంలో అసమానతకు గురయిన స్త్రీలు ఎందుకు ఒక ప్రవాహంలాగా ఉద్యమంలో చేరుతున్నారు? అలాగే ప్రపంచీకరణ మాయలో పడి కొట్టుకు పోయే ఇతర యువతలాగా కాకుండా కాకినాడ సెజ్ వ్యతిరేక ఉద్యమంలో స్థానిక యువత ఎందుకు క్రియాశీలపాత్ర వహిద్దామనుకుంటుంది? వీటి సామాజిక, రాజకీయార్థిక నేపథ్యంలోకి వెళ్లేముందు అక్కడే వాస్తవాలను మీ ముందు ఉంచుతాను.

భూమిలేని దళిత బహుజనులు దిక్కుతోచని పరిస్థితులలో ఉన్న గూడును పాడుచేసుకొని (కూల్చేసుకొని) పసిపిల్లలతో సహా సెజ్ ప్రభువులు కట్టించిన కాలనీల్లోకి గొడ్డుగోదల్లాగా తరలించారు. ఒకరో, ఇద్దరో కాస్త భూమి ఉన్న వాళ్లు కూడా గ్రామాలు ఖాళీ కావడంతో తమ సామాజిక వర్గం కోసం కాలనీలోకి వెళ్లిపోయారు. అసలు ఈ వర్గమే ఎందుకు నష్టపోతుంది అని ప్రశ్నించుకుంటే ఈ విషాదం వెనకాతల సామ్రాజ్యవాద ప్రపంచీకరణ చెప్పు చేతుల్లో నడుస్తున్న పాలకవర్గాల కుట్ర ఉంది. ఆధిపత్య కులాల ధనిక రైతుల నుండి ప్రతిఘటన, వారికి వ్యవస్థలో ఉంటే బార్గెనింగ్ కెపాసిటీని గుర్తించిన సెజ్ యాజమాన్యం పాలక వర్గాల సహాయంతో దళిత బహుజనులను టార్గెట్ చేసుకుంది. సెజ్ ఏర్పాటుకు వ్యవసాయ పునర్ వ్యవస్థీకరణకు తొ(బ)లి మెట్టుగా ఈ వర్గాలను వాడుకున్నారు. ఈ సామాజిక వర్గంలో ప్రలోభాలకు లొంగిన కొందరిని దళారులుగా మార్చుకొని, వారికి చిన్నచితకా కాంట్రాక్టులు అంటగట్టి, తమ చెప్పు చేతుల్లో ఉంచుకున్నారు. ఇక మిగిలిన వారికి పని లేక పోవడంతో, వచ్చిన నష్టపరిహారాన్ని కాస్త వారి ఖర్చులకు, సెల్‌ఫోన్లు, మోటారుబైక్ లాంటి విలాసాలకు (వారి తాహతుకు మించి) తుడిచిపెట్టుకు పోగా కొన్ని నెలల్లోనే వారు బికారులుగా మారి వీథిన పడ్డారు. గ్రామాల్లో ఉన్నప్పుడు, భూముల్లో ఏదో పని దొరికేది. ఇప్పుడు పనికోసమే వేరే ప్రాంతాలకు వలస పోవలసి వస్తుంది. విశాలమైన గ్రామ వాతావరణానికి అలవాటు పడ్డ జీవితాలు అగ్గిపెట్టెలాంటి ఇళ్లలో మగ్గిపోతున్నారు.

అటు పుట్టిన ఊరు నుంచి పెకిలించి వేయబడి ఇటు సెజ్ కాలనీల్లో ఉపాధిలేక వీరు రెండింటికి చెడ్డ రేవడి కావడమే గాక సెజ్ వ్యతిరేక పోరాట కమిటీ నాయకత్వం దృష్టిలో ఉద్యమానికి వెన్నుపోటుదార్లుగా మిగిలిపోవడం యాదృచ్ఛికం కాదు. అభివృద్ధి వెలుగునీడల గురించి కొత్తచూపు అందించిన ఆర్.ఎస్.రావుగారి మాటల్లో చెప్పాలంటే 'పెట్టుబడి దృక్పథం నుండి చూస్తే గ్రామాలలో ఉండే ఉత్పత్తి శక్తులు, రైతుకూలీలు, పేదరైతులు, కులవృత్తులు చేసేవారు పేద జనాభాగానే ఉంటారు. పెట్టుబడిదారీ విధానం గ్రామీణ ప్రాంతంలో ఉన్న ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తి పద్ధతులను, విధానాలను రూపాంతరం చేసి మానవశ్రమ కేంద్రంగా ఉత్పత్తులను, మిగులు ఉత్పత్తులను తయారుచేసే వ్యవస్థగా మారుతుంది. ఈ రూపంలో మిగిలిన ఉత్పత్తి అంటే మిగులు ఉత్పత్తిగా ఈ పనివాళ్లను సమీకరించిన వ్యక్తికి చెందుతుంది. పట్టణీకరణ పారిశ్రామీకరణగా వృద్ధిచెంది పెట్టుబడి ప్రవేశిస్తుంది. దాని ద్వారా వ్యవసాయం పునర్ వ్యవస్థీకరణ చెంది పెద్ద పెద్ద పరిశ్రమలే అభివృద్ధి అని సమాజంలో వ్యవసాయ రంగం కుంచించుకు పోవాలని అదే అభివృద్ధి అని చెపుతుంది.

సరిగ్గా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నేటి మన పాలకులతో ప్రజలకు నమ్మబలికిస్తుంది కూడా ఇదే!

అభివృద్ధి, ఉపాధి అని చెప్పినదాని పట్ల కూడా పాలక వర్గాలకు నిబద్ధత లేదు. కాకినాడ సెజ్‌లలో ఏ పరిశ్రమలు వస్తాయి? ఎంతమందికి ఉపాధి దొరుకుతుంది? అభివృద్ధి ఏ మేరకు జరుగుతుంది? అభివృద్ధి జరిగినా అది ఎవరికి ఉద్దేశించినది? అన్న విషయాలకు పాలకవర్గాలకే కనీస అంచనాలు లేవు. అభివృద్ధి అనేది ఉత్పత్తి శక్తుల ప్రాతిపదిక మీద, ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదిక మీద, ఆ సంబంధాల మార్పు ద్వారా ఒక వ్యవస్థలోంచి మరొక వ్యవస్థలోకి మారడం అనేది ఒక ప్రాతిపదిక అయితే కేవలం ఉత్పత్తి అనేది గాలిలో తిరుగాడుతున్న మాటేగాని ఈనాటి వరకు (ఆరేళ్ల కాలంలో) ఎటువంటి ప్రయత్నం, ప్రాజెక్టు లేదు. కేవలం కె.వి. రావు అనే వ్యక్తికి భూములను కట్టబెట్టి పన్ను రాయితీలను ఇచ్చి, రియల్ ఎస్టేట్ భూదాహానికి ప్రతీకగా నిలిచి పోయింది. వలసపాలనలో భూమి ఈ రోజు పెట్టుబడికి స్థావరం అయింది. అపారమైన ప్రకృతి వనరులు సెజ్‌ల పరమై పెట్టుబడి కేంద్రీకరణ జరుగుతుంది. అసలు మొదటి నుంచి కాకినాడ సెజ్ దారే వేరు. రాష్ట్రంలో సెజ్‌ల కోసం ఆంధ్రప్రదేశ్ మౌలిక సదుపాయాల సంస్థ (ఎపిఐఐసి) భూములను సేకరించి సెజ్‌లకు కట్టబెడితే కాకినాడలో ప్రత్యక్షంగా, కె.వి.రావు అనే డెవలపర్‌కు కట్టబెట్టింది.

సెజ్‌లలో కంపెనీలు పెట్టి ఉపాధి కల్పిస్తామన్న ప్రభుత్వం ఉన్న ఉపాధిని పోగొట్టింది. సెజ్ గ్రామాలలో ఉపాధి హామీ పథకం నిలిపి వేసింది. బ్యాంకుల ద్వారా రైతులకు రుణాలు ఇవ్వడం నిలిపివేసింది. బడుగు బలహీన వర్గాలకు ఇచ్చే పాడి పశువులు, గొర్రెలు, మేకలు తదితర రుణాలు ఇవ్వడం లేదు. ప్రకృతి వైపరీత్యాలు వచ్చినప్పుడు పంట నష్టపరిహారం తాత్కాలిక సహాయం అందచేయడం లేదు. ఇందిరమ్మ గృహాలు, రోడ్లు, పాఠశాల భవనాలు, తుపాను షెల్టర్లలకు మరమత్తులు చేయడం అనేవి జరగడం లేదు. ఈ మొత్తం క్రమం బడుగు బలహీన వర్గాలను గ్రామాల నుంచీ దూరం చేశాయి.

కాకినాడ సెజ్ వ్యతిరేక పోరాటంలో బడుగు బలహీన వర్గాల నాయకత్వం తొలి దశలో లేనప్పటికీ మలిదశలో దళితులు అంబేద్కర్ సెజ్ వ్యతిరేక పోరాట కమిటీ ద్వారా తమ హక్కుల పరిరక్షణకు పూనుకున్నారు. తమ కోసం ఒక కార్యాలయాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఐదు దళిత గ్రామాలతో పాటు వ్యవసాయ కూలీలు అధికంగా ఉన్న బి.సి. వర్గానికి చెందిన గ్రామాల్లో కూడా ప్రజల్ని కూడగట్టడానికి ప్రయత్నించారు. గ్రామ సభలు నిర్వహించారు. అంబేద్కర్ జయంతి సందర్భంగా 2009 ఏప్రిల్ 14న ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆ సభకు మానవహక్కుల కార్యకర్త డా. బాలగోపాల్, హోప్ ఐల్యాండ్ సముద్ర తీరాన ఇసుక తవ్వకానికి వ్యతిరేకంగా పోరాడుతున్న హోప్ ఐల్యాండ్ పరిరక్షణ కమిటీ సభ్యులు సభలో పాల్గొనగా, కోస్తల్ కారిడార్ వ్యతిరేక కమిటీ, పోలేపల్లి సెజ్ వ్యతిరేక ఇతర ఉద్యమకారులు తమ మద్దతును ప్రకటించారు. ఈ సంఘం కార్యక్రమాలు సెజ్ యాజమాన్యాన్ని వణికించాయి. సెజ్ యాజమాన్యం సంఘం నాయకుల్ని నయానా భయానా లొంగదీసుకుంది. దాంతో సెజ్ చూపించే ఉపాధి, లొసుగులు లేని పునరావాసం వచ్చే వరకైనా పోరాటంలో భాగమవ్వాలని గ్రామాల్ని వదిలి వెళ్లొద్దన్న నిర్ణయం నీరుగారి పోయింది. అమ్ముడు పోయిన నాయకుల ద్రోహం వలన సంఘం విచ్ఛిన్నమయింది. చరిత్రలో అంటరానివారుగా వీరు వెలివేయబడితే ఈ రోజు తమకు తాముగా వెలివేసుకున్న ఒక సామాజిక వర్గంగా మిగిలిపోయారు. శతాబ్దాలుగా అగ్ర కులాల అణిచివేత, భూమిలేని తనం వల్ల, సెజ్ ద్వారా మెరుగైన ఉపాధి లభిస్తుందన్న ఆశతో దళారీల వలలో చిక్కారు. ఈ బాధ సర్వద్రష్టల్ని చూపించి, సెజ్ యాజమాన్యం మొత్తం ప్రజానీకం తమ వెంటే ఉన్నట్లు గోబెల్ ప్రచారం చేస్తుంది. మొదటి నుంచి పాలక వర్గాలు ఈ పేద బలహీన వర్గాల్ని ఉత్పత్తి శక్తులుగా, సమాజపు పునర్నిర్మాణానికి కేంద్ర శక్తులుగా, చోదకశక్తులుగా భావించే నిర్మాణాత్మకమైన వైఖరిని తీసు కోకుండా అతిహీనంగా నేడు సెజ్ యాజమాన్యాలకు బలిపెడుతున్నారు.

ప్రభుత్వం బలహీన వర్గాల శ్రమను, జ్ఞానాన్ని వినియోగించుకొని భూసంస్కరణల ద్వారా అభివృద్ధిని సాధించలేకపోయింది. సహజంగానే భూస్వామ్య వ్యవస్థలో ఉత్పత్తిగానీ, మిగులు ఉత్పత్తి గానీ మనిషి శ్రమ ద్వారా వచ్చిన కూడా అవి ప్రకృతి సహజంగా, భూమి కేంద్రంగా ఆ మిగులు మీద అధికారం శ్రమకు కాకుండా, శ్రమ చేసిన మనిషికి కాకుండా, ఆ భూమి మీద ఉన్న వారికే చెందే క్రమం ఉంది. ఈ వ్యవస్థలో వ్యవసాయేతర ఉత్పత్తులను, అవి తయారు చేసిన కులాలకు సామాజిక విలువ లేదు. కాబట్టి ఈ రోజు కాకినాడ సెజ్‌లో బడుగు బలహీనవర్గాలు భూమి నుంచి పెకిలించడానికి కారకులైయారు. భూస్వామ్య సమాజంలో ప్రకృతి మీద ఉండే అవగాహన ఈ అవగాహన ద్వారా వచ్చిన ఉత్పత్తి పరికరాలు, ఆ పరికరాల ద్వారా వచ్చిన ఉత్పత్తి సంబంధాలు నేడు సెజ్‌ల ద్వారా చెల్లా చెదురై పెట్టుబడి కేంద్రీకరణ వ్యవస్థకు దారీ తీశాయి.

ఇన్నింటిని పోగొట్టుకున్న ఈ బాధితులకు అధికార యంత్రాంగం సరైన పునరావాసాన్ని కూడా అందించలేక పోయింది. ప్రత్యామ్నాయాన్ని చూపవలసిన పాలక వర్గాలు, దళారీ పెట్టుబడిదారీ వర్గానికి దాసోహ మవుతున్నాయి. గ్రామాల నుంచి తరలించబడిన జనం పట్ల ప్రభుత్వం ఏ బాధ్యత వహించకుండా నిమ్మకుండి పోయింది. మధ్య ధనిక రైతాంగ నాయకత్వం ఉన్న సెజ్ వ్యతిరేక పోరాటం దళిత, బలహీన వర్గాల అసంతృప్తులను క్రోడీకరించి ఉద్యమ బాటలో కలుపుకోలేక పోతుంది.

భూమిలేని నిరుపేదలు భూస్వామ్య వ్యవస్థలో కొత్తకాదు. భూమి మీద ఆధిపత్యం లేకపోయినా దాని మీద ఆధారపడ్డ అనుబంధంతో పోరాడారు. కానీ భూస్వామ్య వ్యవస్థ నుంచి పెట్టుబడిదారీ విధానంలో ప్రవేశిస్తున్న నేటి సమాజంలో సెజ్ యాజమాన్యం కొత్త ఆశలు రేకెత్తించి వ్యవసాయ కూలీలను భూమి నుంచి వేరు చేసింది. రైతులను, కూలీలను విడదీయ గలిగింది. అంటే భూమి నుంచి యాజమానులను తప్ప మెజారిటీ మనుషులను దూరం చేసింది. రైతులు కూలీల మధ్య వైషమ్యాలు పెంచింది. రైతులను నిస్సహాయులను చేసి వారి స్థానంలో యంత్రాల వాడకాన్ని పెంచేలా చేసింది. వ్యవసాయం లాభసాటి కాదని మరోవైపు ప్రచారం చేస్తోంది. గమనించవలసిన విషయమేమిటంటే నందిగ్రాం, సింగూరులలో భూసంస్కరణలకు నోచుకొని ప్రజలు సెజ్ వ్యతిరేక ఉద్యమానికి ఊపిరి పోస్తే, కాకినాడ సెజ్‌లో బడుగు బలహీన వర్గాలే యాజమాన్యం చూపిన ఆశలకు బలై ఉద్యమానికి దూరంగా ఉండిపోయారు. అభివృద్ధి యజ్ఞంలో సమిధలుగా మారిన వీరే అన్ని రకాల ఛీత్కారాలకు, హింసకు గురికావడం విషాదం.

ఈ బడుగు బలహీన వర్గాల్లో ఎక్కువ శాతం దళితులే. వీరిలో 90 శాతం పైగా క్రైస్తవులైనా, స్టేట్ కుండే హిందుత్వ ధోరణి వల్ల వీరి మత హక్కును హరించేస్తోంది. వీరు ప్రభుత్వ రికార్డులలో హిందువులుగా, సామాజికంగా క్రైస్తవులుగా మిగిలిపోయారు. నాటి బ్రిటిష్ సామ్రాజ్య వాదుల కంటే నేటి అమెరికన్ సామ్రాజ్యవాదుల కంటే క్రూరమైన బ్రాహ్మణ సామ్రాజ్యవాదం వీరిని క్రైస్తవులుగా గుర్తించదు. అలా గుర్తింపు కావాలంటే దళితుల రాయితీల మీద వేటు తప్పదు. అందుకే అనాదిగా అణగారిన ఈ కులాలు చాలా వరకు జనాభా లెక్కల్లో హిందువులుగానే మిగిలిపోయారు. ప్రపంచంలో ఏ సామ్రాజ్యవాది చేయనంత హీనంగా, క్రూరంగా దళితుల మానవ హక్కుల మీద దాడి చేస్తున్నారు. అందుకు కాకినాడ సెజ్ మినహాయింపు కాదు. ఈ దళిత గ్రామాల్లో ఉన్న చర్చీలు కూడా మినహాయింపు కాదు. తరతరాలుగా దళితులు పూజించుకున్న ప్రార్థన స్థలాలు కూడా సెజ్ కబ్జాలోకి చేరిపోయాయి. హిందూ మతతత్వ ఫాసిస్టు ప్రభుత్వం మైనారిటీ హక్కుల పట్ల మిన్నకుండి పోయింది. ఎందుకంటే గుజరాత్‌లో ముస్లిం, మైనారిటీలపై మారణకాండ మాత్రమే కాకుండా ఆ మారణకాండ ప్రపంచ బ్యాంకు అభివృద్ధి మరొక పార్శ్వమని

ప్రత్యేక ఆర్థిక మండలాలను అమలుపరుస్తున్న గుజరాత్ ముఖ్యమంత్రి నేటి హీరో. హిందూత్వ ఫాసిస్టు శక్తులు అంతగా సామ్రాజ్యవాదాన్ని బలపరుస్తున్నాయి అనడానికి ఇదొక మచ్చుతునక. వాటిలో కాకినాడ సెజ్‌లు కూడా భాగమే. కొసమెరుపు ఏమిటంటే క్రైస్తవ మైనారిటీ సంఘాల నుంచి, దళిత సంఘాల నుంచి రావలసినంత ప్రతిఘటన లేకపోవడం!

చట్టవిరుద్ధంగా భూసేకరణ చేసి ల్యాండ్ మాఫియాతో కుమ్మక్కై చట్టబద్ధంగా భూసేకరణ చేసినట్టుగా రైతులను నమ్మించి వారి భూముల నుండి, గ్రామాల నుండి తరలించేందుకు ప్రయత్నించిన అప్పటి తూర్పు గోదావరి జిల్లా కలెక్టర్ అనిల్ కుమార్ సింఘాల్, రెవెన్యూ రిజిస్ట్రేషన్ ముఖ్య కార్యదర్శి ఎస్.వి. ప్రసాద్, పంచాయతీ రాజ్ శాఖ ముఖ్య కార్యదర్శి ఎమ్. శామ్యూల్‌ల పైన విచారణ జరిపి బాధ్యులైన వారిపై ఐపిసి సెక్షన్ 120(బి), నేరపూరిత కుట్ర 409 ప్రభుత్వ ఉద్యోగులుగా ఉండి (నమ్మకాన్ని వమ్ము చేయడం) (బ్రీచ్ ఆఫ్ ట్రస్ట్) 420 మోసం, అవినీతి నిరోధక చట్టం సెక్షన్ రెడ్‌విత్ 13(2), రెడ్‌విత్(1)(సి)(డి), అధికార దుర్వినియోగం సెక్షన్ 15 కింద కేసులు నమోదు చేయాలని మొత్తంగా సిబిఐ విచారణ జరపాలని చైతన్యవంతమైన నాయకత్వం డిమాండ్ చేస్తున్నది. అయితే ఇందులో రెండు అంశాలు ఉన్నాయి. ఒకటి ఈ మధ్య వరుస భూకుంభకోణాలలో సిబిఐ చూపిస్తున్న పాత్ర పట్ల ప్రజలు ఆకర్షితులై ఉండవచ్చు. లేదా ఆ మేరకు ప్రజాస్వామిక ఆకాంక్ష ప్రభుత్వం తీరుస్తుందేమోనని ప్రజల నుంచి వచ్చిన ఉద్యమం కావచ్చు. కాని ఏమి జరుగుతుందో మనం ఊహించుకోవచ్చు. ఇకపోతే ఈ మధ్య తెరమీదకు వస్తున్న జాతీయ భూసేకరణ పునరావాసం బిల్లు 2011 బిల్లుకు సంబంధించిన దాని గురించి ఇక్కడ ప్రస్తావించడం లేదు. ఎందుకంటే అది వలసవాద చట్టం కంటే లొసుగులతో కూడిన దేశ విద్రోహ చట్టం. ఇందులో ఒక నైతిక, సామాజిక స్పృహే లేదు.

ఇంతగా చట్టం చట్టుబండలవుతున్నా విపక్షాల పాత్ర ఏమిటి అనే ప్రశ్న రావచ్చు. అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో సెజ్‌లకు తెర తీశారు. కాబట్టి సెజ్ బాధితులు ప్రత్యామ్నాయం కోసం వెతికారు. 2009 ఎలక్షన్లకు ముందు సామాజిక న్యాయం అంటూ తెరపైకి వచ్చిన ప్రజారాజ్యం వైపు సాధారణంగానే ప్రజలు మొగ్గు చూపారు. పిఠాపురం నియోజక వర్గంలో ప్రజారాజ్యం తరుపున వంగా గీత నిలబడ్డారు. ఈమె ఒక కుల వర్గానికి సంబంధించింది. ఆ కులానికి సంబంధించిన వారే మెజారిటీ. అలాగే రాష్ట్రంలో అనేక మంది దళిత మేధావులు ప్రజారాజ్యం సామాజిక న్యాయంపై ఆశలు పెట్టుకొని ఆ పార్టీలో చేరినట్టే ఎక్కువ శాతం దళితులు ఆ పార్టీకే ఓటు వేశారు. గమనించవలసిన దేమిటంటే ఆమె స్థానికురాలు కాకపోయిన ఈ వర్గాలే ఆమెను గెలిపించాయి. ఏ పార్టీని సెజ్ బాధిత ప్రజలు ధిక్కరించారో ఆ పార్టీలోకే ప్రజారాజ్యం పార్టీ విలీనమయింది. అప్పటి వరకు భూములు కాపాడు తామన్న ఆమె వెనుదిరిగింది. కాకినాడలో పెద్ద ఎత్తున ఏరువాక లాంటి ఉద్యమాలు నడిపినా ప్రజలకు వారి ఆకాంక్షకు మద్దతు ఇవ్వలేదంటే ఆమె పాలక పక్షంలో మమేకమైనట్టే అని ప్రజలు గ్రహించారు.

ఉప ఎన్నికల నేపథ్యంలో సెజ్‌ల భూములు రైతులకు ఇచ్చే వరకూ పోరు అని 2012 ఏప్రిల్ 20న ప్రజల ముందు చంద్రబాబు (తెలుగు దేశం) ప్రకటించారు. ఇదే చంద్రబాబు నాయుడు వ్యవసాయం దేశానికి పనికిరాదని ప్రపంచ బ్యాంకుకు దాసోహమన్న విషయాన్ని అతను మర్చి పోయాడేమో గాని ప్రజలు మర్చిపోలేదు. కాకినాడ వ్యతిరేక ఉద్యమంలో మొదటి నుంచి బిజెపి వైఖరి వేరు. గుజరాత్‌కు భిన్నంగా వారి రాజకీయ ప్రయోజనాల కోసం సెజ్ వ్యతిరేక ఉద్యమానికి మద్దతు తెలిపారు. ఇక ఎనిమిది కమ్యూనిస్టు పార్టీలతో ఆవిర్భవించిన కాకినాడ సెజ్ వ్యతిరేక కమిటీలో మొదటి నుంచి సిపిఐ (ఎంఎల్) లిబరేషన్, న్యూడెమోక్రసీ పార్టీలు పోరాటంలో పాల్గొన్నాయి. ఎన్నో అక్రమ కేసుల్ని ఎదుర్కొన్నారు. ఇద్దరు లిబరేషన్ నాయకులు జైళ్లపాలైయారు. మొదట్లో ఉన్న ఉద్యమ తీవ్రత తగ్గింది. ఒక క్రియాశీల ఐక్య కార్యాచరణ కొరవడింది.

ప్రజాపోరులో ఒక నిర్మాణాత్మకమైన వైఖరిని ఈ సంఘాలు తీసుకోలేకపోయాయి. 2008 నుంచి సెజ్ వ్యతిరేక పోరాట కమిటీ, ప్రజా సంఘాల నాయకులు, న్యాయవాదిపై పెట్టిన కేసులు కొనసాగుతూ ముగింపు దశకు చేరుకున్నాయి. ఈ కేసులన్నీ పిఠాపురం, తుని, కాకినాడ కోర్టులలో ఉన్నాయి. వారంలో రెండు మూడు రోజులు నాయకులు ఏదో ఒక కేసులో హాజరు కావలసిందే. నాయకులకు శిక్ష ఖరారు కావడానికి కావలసిన అబద్ధపు సాక్ష్యాలను సెజ్ యాజమాన్యం ప్రవేశపెడుతుంది. ఉద్యమ స్ఫూర్తితో ముందుకు వెళ్తున్న నాయకులకు ఎలాంటి శిక్షలు పడతాయో వేచి చూడవలసిందే!

సెజ్ వ్యతిరేక పోరులో అత్యధికంగా పాల్గొన్నది మహిళలే. పోలీసులు గ్రామాలపై విరుచుకుపడితే తామే ముందుండి తమ వారిని కాపాడు కోవడంతో పాటు అనేక విషయాలను చర్చించుకునేవారు. ప్రజలు ప్రకృతి వనరులను పోగొట్టు కోవడంతో పాటు దానికి సంబంధించిన జ్ఞానాన్ని కూడా పోగొట్టుకుంటారు. వ్యవసాయానికి బదులు పారిశ్రామికీకరణే ప్రత్యామ్నాయంగా వచ్చే సమాజంలో నైపుణ్యంతో కూడిన జ్ఞానం కొరవడుతోంది కాబట్టి స్త్రీలు ఈ విషయాన్ని ముందు గానే గుర్తించారు. ప్రత్యామ్నాయ సమాజంలో కావలసిన నైపుణ్యంలేక, ఉన్న కాస్తంత ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కోల్పోతామని గృహ పరిధిలోకి నెట్టి వేయబడతామన్న స్పృహ వారికి కల్గింది. స్త్రీలకు కుటుంబ వనరులపై ఆధిపత్య హక్కులు లేకపోయినా ఓమేరకు రక్షణ ఫ్యూడల్ వ్యవస్థ కల్పిస్తుంది. సహజంగానే మొదటి దశలో భూమిని కోల్పోయినప్పుడు డబ్బు రూపేణా వచ్చే పునరావాసం పురుషుని చేతుల్లోకి వెళ్లిపోయింది. పితృస్వామిక సమాజంలో ఈ మార్పు పురుషుని పెత్తనానికి దారితీసింది. ఇప్పటి వరకు ఉద్యోగం పురుష లక్షణం కాబట్టి పునరావాస కాలనీలో కల్పిస్తున్న కొన్ని శారీరక శ్రమకు సంబంధించిన పనులు అన్ని పురుషులకే ఇచ్చారు. శ్రామిక వర్గానికి చెందిన స్త్రీలు తమ అస్తిత్వాన్ని కోల్పోయి ఇంటికే అంకితమయి పోయారు. ఇది కుటుంబ హింసకు దారితీసింది. కాబట్టి స్త్రీలు ఉద్యమంలోకి ఉధృతంగా వచ్చారు. కాకినాడ సెజ్ రాములమ్మలు, పోలేపల్లి చుక్కమ్మలు, జిందాల్ దేవుడమ్మలు, రాయిఘడ్, మంగుళూరు దీదీలు ఈ కోవకు చెందిన వారే. విషాదమేమిటంటే కాకినాడ సెజ్ యాజమాన్యాన్ని తారెత్తించి ప్రతిఘటించిన స్త్రీలు నాయకత్వ స్థానంలో లేరు. కేవలం ప్రతిఘటనా స్వరాలుగా మారిపోయారు. సెజ్ ఉద్యమ సారథ్యాన్ని నిర్వహించడంలో వీరి పాత్ర లేదు. అందుకు కారణం పితృస్వామ్య ధోరణులు నాయకత్వంలో ఉండడం. సునామీలా వచ్చి పోలీసులను తరిమి వేసిన స్త్రీలు అంతే వేగంగా మిన్నకుండిపోయారు. వంటవార్పు నిరసన కార్యక్రమంలో కూడా స్త్రీల భాగస్వామ్యం చెప్పుకోతగినదిగా లేదు. ఉద్యమకారులలో స్త్రీలు ముందుంటే పోలీసులు ఏమి చేయరన్న అభిప్రాయం ఉండొచ్చు. కానీ వారిని నాయకత్వ స్థానంలోకి తీసుకు రావాలన్న అభీష్టం లేదు. అందుకు కారణాలు ఏమైనా కావచ్చు. కాని కుటుంబాన్ని ఇద్దరు వ్యక్తుల కలయికగా కాకుండా పితృస్వామ్య భావజాలంలో ఉన్న విభిన్న అభిప్రాయాలు కలిగిన వ్యక్తులుగా గుర్తించక పోవడం పెద్ద లోపం. రాష్ట్రంలో సెజ్ ఉద్యమాల ఆదర్శంగా నిలిచిన కాకినాడ సెజ్ ఉద్యమం మరింత పదును పెట్టుకోవడానికి తీసుకోవలసిన అవసరాలలో స్త్రీల నాయకత్వ శ్రేణులను ఏర్పర్చడం తక్షణ కర్తవ్యం కావాలి. మహిళా సాధికారత పేరిట ప్రభుత్వం స్వయం సహాయక గ్రూపులను ఏర్పాటు చేసి తమ ప్రయోజనాలకు వేదికగా మలిచింది. కాని సోంపేట థర్మల్ విద్యుత్ ప్రాజెక్టు వ్యతిరేక ఉద్యమంలోని స్త్రీలు ప్రభుత్వ ఆర్థిక సహాయాన్ని నిర్ద్వంద్వంగా తోసిపుచ్చారన్న వాస్తవం మనకు తెలుసు. మన దేశంలో ఫెమినిస్టు ఉద్యమాలు వ్యక్తిగత సమస్యలకు పరిమితం అయినంతగా, ప్రజా ఉద్యమాలలో మమేకం కాలేక పోతున్నాయి. కుటుంబ సంబంధాల సమస్యల పరిధిని దాటి విస్తృత సమాజ స్థాయిలో ప్రజలతో కలిసి నడిచినప్పుడే స్త్రీల విముక్తి సాధ్యమవుతుందన్న ఆచరణ, స్పృహ నేడు ఫెమినిస్టు ఉద్యమాలకు అత్యంత అవసరం. ఈ ఉద్యమాల

రాజకీయ దృష్టి, తాత్విక పునాది మరింత పదునెక్కి సమాజ విముక్తిలో పాల్గొన్నప్పుడే ఇది సాధ్యం.

సెజ్ గ్రామాల్లోని చదువుకున్న యువత తాము చదువుకున్న చదువుకు ఉద్యోగాలు రాక గ్రామాలకు వెనుదిరుగుతున్నారు. గ్రామాలలో భూములను కోల్పోయిన తమ తల్లిదండ్రులకు జరిగిన అన్యాయంపైన ఊరూరా తిరిగి అధ్యయనం చేశారు. కలసికట్టుగా తమ పొలాల్లో వంటవార్పు నిరసన కార్యక్రమాన్ని చేపట్టారు. తమ భూములు మేజర్లు కాని తమ అనుమతి లేకుండా బదిలి చేయబడిందని, కాబట్టి తమ భూములపై, తమకు కూడా హక్కు ఉందని ఉపాధి కల్పించాలని డిమాండ్ చేశారు. అందుకు గ్రామాలపై పడి పోలీసులు యువతను అరెస్టు చేశారు. తల్లితండ్రులను బెదిరించారు. అయినా యువత వెను దిరగలేదు. ఇప్పటివరకు కొనసాగుతున్న ఉద్యమ బాటలోనే ప్రయాణిస్తు న్నారు. నాయకత్వ బాధ్యతలు తీసుకోవడానికి సంసిద్ధులవుతున్నారు.

ఇక ఉప ఎన్నికల సందర్భంలో చంద్రబాబు రైతులకు భూమిని పోరాడి ఇప్పిస్తానన్నాడేకాని ఆ ప్రయత్నాలు ఏమీ లేక పోగా సరికొత్త వేషంతో అధికారం కోసం పాదయాత్ర మొదలు పెట్టారు. బిజెపి, సిపిఎం వంటి అఖిల భారత పార్టీలయినా, తెలుగుదేశం లాంటి ప్రాంతీయ పార్టీలైనా సామ్రాజ్యవాద ప్రపంచీకరణను వ్యతిరేకించే ధోరణిని నటించి అధికారం లోకి వచ్చినా ఆ పార్టీల నిబద్ధత ఇప్పటి వరకు ప్రజలకు అనుభవ పూర్వకమే.

ఏ రాజకీయ శక్తులైన, బానిస వ్యవస్థలో భూమిని వాడుకున్నారే గాని ఇంతగా భ్రష్టు పట్టించలేదు. అందుకే సెజ్‌లను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన ఆర్ఎస్‌రావు వివరణ ఎంతో సరైనది. ఆయన ఏమంటారంటే కమ్యూనిస్టు దేశాలు ఒక్క అడుగు వెనక్కి వేసిన కాలంలో పెట్టుబడి తనదైన శైలిలో ప్రవేశపెట్టిన ప్రపంచీకరణ కార్యక్రమంలో సెజ్‌లు అత్యంత ముఖ్యమైన స్థానాన్ని కలిగి ఉన్నాయి. సోషలిస్టు సమాజాలను పునర్నిర్మించే కార్యక్రమంలో అంతర్ రాష్ట్రీయ పెట్టుబడి ఎంచుకున్న రూపం సెజ్. ఈ పునర్ నిర్మాణ కార్యక్రమంలో మిగిలిన సమాజం దాని చరిత్రతో సంబంధం లేకుండా ప్రభుత్వ ఆధిపత్యానికి దూరంగా స్వచ్ఛందంగా పెరిగినవే సెజ్‌లు అంటారాయన. పాలకులు పెట్టుబడి ద్వారా వృద్ధిని వ్యవస్థాగత మార్పులు లేకుండా తేవాలని చూస్తుంటే ప్రజలు వ్యవస్థలో మార్పు ఒక కొత్త నిర్మాణంలోకి అభివృద్ధిని చూస్తున్నారు. ఇది పాలకులకు ప్రజలకు మధ్యనున్న వైరుధ్యం. అభివృద్ధి అనే భావనను నెట్టేసి వృద్ధి అనే భూతాన్ని ప్రజలకు చూపి అదే అభివృద్ధిగా వర్ణిస్తున్నారు. పాత సమాజం నుండి కొత్త సమాజంలో వృద్ధి సాధ్యపడినా మిగులు మనుష్యుల సమస్యలు తీరకపోవడం. పేదరికంతో, నిరుద్యోగంతో బతుకుతూ పెట్టుబడిదారీ వర్గాల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడేటట్లు ముున్ముందు చేస్తారు.

దేశంలో మొట్టమొదటి సారిగా సెజ్‌లను తాత్కాలికంగా నిలిపివేసిన గోవాకు మేము వెళ్లినప్పుడు అక్కడ సామాజిక కార్యకర్తలు వెళ్లబుచ్చిన అభిప్రాయం కూడా ఇదే. వారు సెజ్, మైనింగ్ వ్యతిరేక ఉద్యమాల అనుభవాలను పంచుకొని కాకినాడ సెజ్ వ్యతిరేక ఉద్యమానికి మద్దతును ప్రకటించారు. గోవాలో ఎలక్షన్ల సందర్భంగా నియోజక వర్గాల ఎన్నికల పోటీలో నిలబడి సెజ్ వ్యతిరేక ఉద్యమాలకు అండగా నిలిచిన వారిని గెలిపించమని తద్వారా సెజ్‌లను రాష్ట్రంలో మట్టు పెట్టాలని ప్రజలకు పిలుపునిచ్చారు. అప్పటి వరకు కాంగ్రెస్ కూటమి హయాంలో ఉన్న ప్రభుత్వం భూములను సెజ్‌లకు అప్పగించాలని ప్రయత్నిస్తే ప్రజలు ప్రత్యామ్నాయంగా బిజెపి కూటమిని గెలిపించారు. అప్పటి ప్రతిపక్షనేత మనోహర్ పారెకర్ నేటి ముఖ్యమంత్రి. ఇతను ప్రతిపక్షనేతగా ఉన్నప్పుడు ఇనుప ఖనిజ తవ్వకాల్లో అవినీతి అక్రమాలను, మైనింగ్ కార్యకలాపా లలోని దోపిడీని ప్రజా ఉద్యమాలు బయటపెట్టాయి. గోవా ఫౌండేషన్ అనే స్వచ్ఛంధ సంస్థ ప్రజా ప్రయోజనాల వ్యాజ్యాన్ని సుప్రీం కోర్టులో వేసి అక్రమ మైనింగ్ కార్యకలాపాలపై దర్యాప్తు చేయాలని కోరింది. అదే సమయంలో కేంద్ర ప్రభుత్వం జస్టిస్ ఎం.బి.షా నేతృత్వంలో ఒక కమీషన్‌ను నియమించింది. 12 ఏళ్ల కాలంలో అక్రమ మైనింగ్ ద్వారా రాష్ట్ర ఖజానాకు రు. 35 వేల కోట్ల నష్టం జరిగిందని నిర్ధారించింది. ఈ నేపథ్యంలోనే గోవాలో మైనింగ్ కార్యకలాపాలపై పూర్తి స్థాయి నిషేధం విధిస్తూ సుప్రీం కోర్టు న్యాయమూర్తి జస్టిస్ అఫ్తాబ్ ఆలం నేతృత్వంలోని త్రిసభ్య ధర్మాసనం ఉత్తర్వులు జారీ చేసింది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు నోటీసులు జారీ చేసింది. గోవాలో అక్రమ మైనింగ్‌పై నాలుగు వారాల్లో నివేదిక ఇవ్వాలని సుప్రీం సాధికార కమిటీకి ఆదేశాలు జారీ చేసింది. గోవాలో మైనింగ్ లీజులు అన్నింటిని చట్టవిరుద్ధంగా ఇచ్చారని గోవా ఫౌండేషన్ తరఫున హాజరైన న్యాయవాది ప్రశాంత్ భూషన్ సుప్రీం కోర్టుకు తెలిపారు. రాష్ట్రంలోని మైనింగ్ కార్యకలాపాలపై గోవా ప్రభుత్వం ప్రజల ఒత్తిడితో, ఎన్నికల నాటి ప్రమాణాలకు అనుగుణంగా తప్పని పరిస్థితులలో తాత్కాలిక నిషేధం విధించింది. 2012 అక్టోబర్ వరకు ఈ నిషేధం అమల్లో ఉంటుందని పేర్కొంది. అయితే తాత్కాలిక నిలుపుదలతో దీర్ఘకాలిక ప్రయోజనాలకు ఒరిగేది ఏమిలేదని ఇప్పటికే ప్రైవేటు కంపెనీలు గనుల నుంచి ఖనిజాన్ని తవ్వి రవాణా చేసుకుంటున్నా యని ప్రశాంత్ భూషణ్ సుప్రీంకోర్టు దృష్టికి తీసుకొచ్చారు. ఫలితంగా మైనింగ్ మాఫియా మీద సుప్రీంకోర్టు ఉక్కుపాదం మోపింది. ఆంధ్రప్రదేశ్, కర్ణాటకలలోని మైనింగ్ కార్యకలాపాలపై సుప్రీం కోర్టు నిషేధం విధించిన సంగతి సుపరిచితమే. సెజ్‌లపై రద్దు, మైనింగ్ కార్యకలాపాలపై ఉక్కుపాదం ప్రజల సంఘటిత శక్తితో అసాధ్యాలు అనుకున్నవి సుసాధ్యాలుగా మారతాయనడానికి ఇవి మచ్చుతునకలు.

అభివృద్ధి పేరిట జరిగే విధ్వంసంలో తాము ధ్వంసం అవుతున్నామని ప్రజలు హెచ్చరికగా తమ పోరును అన్ని రాష్ట్రాలలో వివిధ స్థాయిలలో కొనసాగిస్తూనే ఉన్నారు. మన రాష్ట్రంలో సోంపేట, కాకరాపల్లి థర్మల్ విద్యుత్ పోరాటాలు తీసుకున్నట్లయితే అవి మరింత విస్తృతమయి భూపోరాటంగా మాత్రమే కాక పర్యావరణం, సహజ ప్రకృతి వనరులను కాపాడుకోవడం లక్ష్యంగా కదిలింది. అందుకే భూమి సొంతదారులే కాకుండా ప్రతి ఒక్కరిని ఉద్యమంలో భాగస్వాములను చేసింది. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గ వ్యతిరేక పోరాటంగా రూపుదిద్దు కొంది. న్యాయ స్థానాలను ఆశ్రయించినా పోరాటపటిమను కోల్పోలేదు. అందుకు ప్రభుత్వ దమనకాండకు సోంపేట, కాకరాపల్లిలో జరిగిన పోలీసు కాల్పులే సాక్ష్యం. బహుళ జాతి కంపెనీలు, బడా పారిశ్రామిక వేత్తలు, బడా భూస్వాములు కావడానికి చేసే ప్రయత్నాలకు ప్రజలు గండి కొడుతున్నారు. అందుకు మొన్నటి నందిగ్రాం జయగీతికే సాక్ష్యం.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రజల దగ్గర ఉన్న భూములు లాక్కుంటూ ప్రజల దృష్టిని మరల్చేందుకు మరో విడత భూపంపిణీకి సిద్ధమవుతుంది. ఈ విషయాన్ని రెవెన్యూ మంత్రి 2012 అక్టోబరు 5న ప్రకటించారు. పేదలకు భూములు పంచేందుకు కనీసం లక్ష ఎకరాలు భూమి సేకరించాలని జిల్లా కలెక్టర్లను ఆదేశించారు. ఒక వైపు శ్రీకాకుళం జిల్లాలోని లక్షింపేటలో దమనకాండ జరిగి ఐదుగురు దళితులు చనిపోతే, 250 ఎకరాల ప్రభుత్వ భూమిని పంచలేని పాలక వర్గాలు లక్షల ఎకరాల భూపంపిణీ చేస్తామని ప్రకటనలు చేస్తున్నాయి. త్వరలో ఆంధ్రప్రదేశ్ భూనిర్వాహణ సంస్థ ఏర్పాటు కానుందని, భూముల కేటాయింపు స్వాధీనం వంటి అంశాలను ఈ సంస్థే పర్యవేక్షించనుందని సెలవిచ్చారు. మరి ఇప్పటివరకు వేల ఎకరాలను పంచే రంగాన్ని బడా పారిశ్రామికవేత్తలకు అప్పచెప్పిన ఆంధ్రప్రదేశ్ మౌలిక సదుపాయాల సంస్థ (ఎపిఐఐసి) కంటే ఈ సంస్థ ఏవిధంగా భిన్నమయింది? ఈ విషయాలను సదరు మంత్రిగారు ప్రస్తావించరు. పైగా క్రిస్టియన్, ముస్లిం మైనారిటీ భూముల పరిరక్షణకు చర్యలు తీసుకోవాలని కలెక్టర్లను ఆదేశించారు. ఒక వైపు అణగారిన వర్గాల నెత్తుటిలో భూమి తడిసి ముద్దవుతుంటే మరోపైపు పాలక వర్గాల బూటకపు మాటలు ప్రజలు నమ్మే స్థితిలో లేరు. కొన్ని సంవత్సరాలుగా

# గల్ఫ్ బాధితులు - ఒక అధ్యయనం

***ఉన్న ఊళ్లో బతుకు తెరువు లేక, ఉపాధి కోసం గల్ఫ్ దేశాలకు వలసపోతున్న వారి కష్టాలనూ, దళారుల చేతుల్లో బలైపోతున్న వారి పరిస్థితులనూ వివరిస్తున్నారు బి.వి.ఎన్. స్వామి***

వలసలు అనేక రకాలు. వ్యక్తి తన శ్రేయస్సు కోసం ఆలోచించడం సహజం. అందుకోసం ఉన్న చోటు నుండి మరో చోటుకి తరలడం అనివార్యం. అలాంటి అనివార్యత రుద్రంగి గ్రామస్తులకు కలిగింది. మరింత మెరుగైన జీవితం కోసం వెళ్లిన గ్రామస్తులు అప్పుల బారిన పడి నరక యాతన పడుతున్నారు. ఈ వ్యతిరేక ఫలితాల అధ్యయనంలో అనేక ఆసక్తికర విషయాలు తెలిసినయి. కరీంనగర్ జిల్లా చందుర్తి మండలం రుద్రంగి గ్రామంలో 2500 కుటుంబాలు ఉన్నవి. జనాభా 9969, ఓటర్లు 7055. భూమి విస్తీర్ణం 10,720 ఎకరాలు. సాగు భూమి 8826 ఎకరాలు. పురుషుల్లో 90 శాతం మంది గల్ఫ్ దేశాల్లో ఏదో ఒక దేశం వెళ్లి వచ్చినవారే. ఇటీవలి కాలంలో ఏజెంట్ల మోసాల వల్ల గల్ఫ్ నుండి ఉత్త చేతులతో వచ్చినవారు ఎక్కువే ఉన్నారు. వారి బాధలు, కష్టాలు ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. అసలు గల్ఫ్‌లో వీరి కష్టాలు, ఇక్కడ కుటుంబ సభ్యుల కష్టాలు వర్ణనాతీతం. వారి వెతల్ని తెలుసుకోవడానికి, వివరాలు సేకరించడానికి కరీంనగర్ జిల్లా శాఖ ఆధ్వర్యంలో తెలంగాణ రచయితల వేదిక రుద్రంగి గ్రామ అధ్యయనం కోసం వెళ్లింది.

దాదాపు నలభై సంవత్సరాల క్రితం, గల్ఫ్ దేశాల్లో పని మనుషుల కొరత వల్ల, వెనకబడ్డ ప్రాంతాల ప్రజల్ని డబ్బులిచ్చి, ఆకర్షించి ఆయా దేశాలకు తరలించారు. ఇందులో ప్రధాన పాత్ర ఏజెంట్లదే. నాడు వెళ్లిన ప్రజలు, స్థిరమైన వసతి, పని, ఆదాయం పొంది తమ కుటుంబా లకు పంపేవారు. దానివల్ల ఆయా కుటుంబాలు ఉన్నత స్థితికి వచ్చాయి. తమ తోటి వారి అభివృద్ధి చూసి తామూ వెళ్లాలనే ఆలోచనతో, అనేక మంది గల్ఫ్ దేశాలకు వలస బాట పట్టారు. అది ఇప్పుడు వ్యాపారమైంది. రోజులు గడుస్తున్న కొద్దీ వలసలు పెరిగాయి. గల్ఫ్ దేశాల్లో విదేశీ పనివారి సంఖ్య పెరిగింది. పని కోసం పోటీ పెరిగింది. ఫలితంగా వలసపోయిన వారికి కష్ట, నష్టాలు మొదలయ్యాయి. అయినా ప్రజలు గల్ఫ్ వెళ్లడానికే ఆసక్తి చూపారు. ఈ దేశంలో ఏజెంట్లు వ్యక్తుల్ని విమానం ఎక్కించి చేతులు దులుపుకోవడం మొదలు పెట్టారు. గల్ఫ్‌కు వెళ్లిన వ్యక్తి తనకు తెలియకుండానే చొరబాటుదారుడయ్యాడు. దొంగతనంగా గడపాల్సి వచ్చింది. దొరికితే జైలు పాలయ్యాడు. ఇదంతా దొంగ వీసా వల్ల జరిగిన ఫలితం. ఈ విషయం నిరక్షరాస్యుడైన వలస వ్యక్తికి తెలియదు. ఒకవేళ తెలిసినా వెళ్లాల్సిన అనివార్యత వల్ల జరిగిన ఫలితం.

కంపెనీ వీసా, టూరిస్ట్ వీసా, ఆజాద్ వీసా అనే మూడు వీసాల్లో దేని మీద వెళుతున్నామనే అవగాహన వ్యక్తులకు పూర్తిస్థాయిలో లేక పోవడం వల్ల కూడా మోసం స్వదేశం నుండే మొదలయింది. మోసానికి కారణం ఏజెంట్ రూపంలో కనబడుతుంది. అతనికి జవాబుదారీతనం లేకుండా పోయే వెసులుబాటు ఉండడం అత్యంత విషాదకరం.

రెండు సంవత్సరాల కాలపరిమితిపై వెళ్లిన వ్యక్తి పని అయిపోయి ఆరు నెలలలోపు రావడం, అక్కడికి వెళ్లినవారికి రోజు కూలీ వెతుక్కుంటూ దిన దినగండంగా బతకడం, పని చూపించే అక్కడి బ్రోకర్ డబ్బులు ఎగ్గొట్టడం, స్థానిక పరిస్థితులు తెలువకపోవడం వల్ల అతన్ని ఏమీ చేయలేకపోవడం, కల్లివెల్లిపై (దొంగతనంగా ఉండడం) ఉండడం వల్ల బిక్కు, బిక్కుమంటూ గడపడం, పనిలేకపోవడం వల్ల పని చేసిన రోజుల డబ్బులతో విమానం టికెట్ కొని వ్యక్తిని తమ దేశం వైపు నెట్టడం, పని పరిస్థితులను వ్యక్తి తట్టుకోలేకపోవడం, వృత్తి నైపుణ్యం లేకపోవడం, వృత్తి నైపుణ్యం ఉన్నవాడికి కూలిపని దొరకడం, ఇలాంటి అనిశ్చిత పరిస్థితుల వల్ల గల్ఫ్ వెళ్లిన వ్యక్తులు అర్ధాంతరంగా ఇంటికి రావాల్సి వస్తోంది. లక్షలు ఖర్చు పెట్టి వెళ్లడం, అక్కడ సంపాదించలేక తిరిగి రావడం వల్ల అప్పుల పాలయ్యారు. వడ్డీల వల్ల మరింత పీకల లోతుకు

---

దుర్వినియోగం అవుతున్న భూముల్ని గుర్తించి వాటిని స్వాధీనం చేసుకోవాలని రెవెన్యూ శాఖ ముఖ్యకార్యదర్శి అనిల్ చంద్రపునేత కలెక్టర్లకు సూచించారు. బడా కంపెనీల ఏజెంట్లుగా పని చేస్తున్న పాలక వర్గాలు, పాదయాత్రల పేరుతో అధికారంలోకి రావడానికి ప్రయత్నిస్తున్నా, ప్రతిపక్షాలుగాని, సెజ్ పేరు చెప్పి కొల్లగొట్టిన భూములను స్వాధీనం చేసుకోవడానికి నిర్దిష్టమైన చర్యలు చేపట్టగలరా? వైఎస్ అనే భూతాన్ని వదిలించుకోవడానికి పావులుగా రాజకీయ చదరంగం నడుస్తుంది. జాతీయ స్థాయిలో సంస్కరణల రూపంలో దేశాన్ని టోకుగా అమ్మివేయడానికి రంగం సిద్ధం అయింది. రాష్ట్రంలో సెజ్ వ్యతిరేక ఉద్యమం ఇప్పుడు నివురు గప్పిన నిప్పులా ఉంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగా భూమిని పోగొట్టుకున్న తండ్రుల తరం, తరాల సంపదని, ఉపాధిని పోగొట్టుకొన్న ఈ తరం కుటుంబ ఆర్థిక అస్థిరత్వానికి బలైన స్త్రీలు, మోసగింపబడ్డ దళిత, బలహీన వర్గాలు యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాయి.

గమనించవలసినది ఏమిటంటే వలసవాద కాలంలోనూ, స్వాతంత్ర్యం పేరిట అధికార మార్పిడి తర్వాత దేశ పౌరులు తమ జీవించే హక్కుకై పోరాడుతూనే ఉన్నారు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరులో అమరులైన భగత్‌సింగ్ తదితరులు నవజవాన్ సభను ఏర్పాటు చేసి కార్మిక, కర్షక రాజ్యం కోసం ఉరికంబం ఎక్కారు. తెలంగాణ రైతాంగ ఉద్యమంలో బందగీ సోదరులు భూమి పంపకాలు, చాకలి ఐలమ్మ గొంతులో భూస్వాములకు వ్యతిరేకంగా 'దున్నేవానికే భూమి' నినాదం పుట్టుకొచ్చింది. ఇదే ఉద్యమం శ్రీకాకుళం మరిన్ని రైతాంగ పోరాటాలకు భూమిక అయింది. మన పొరుగు రాష్ట్రం తమిళనాడులో అణువిద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా, చత్తీస్‌గడ్‌లో ప్రజలు పెట్టుబడి ఆధారిత, అభివృద్ధి నమూనాలు వ్యతిరేకించి ప్రత్యామ్నాయ శ్రమ ఆధారిత ఆర్థిక స్వావలంబనకు కృషి చేస్తున్నారు. హింస, ప్రతిహింసలు మొదలైనా ప్రజలు వెనుదిరుగ లేదు. అంతిమంగా ఈ సెజ్ వ్యతిరేక పోరాటం ఒక పటిష్టమైన రాజకీయ దృష్టి కోణంలో ప్రజా ఉద్యమ నిర్మాణ బాటలో సంఘటితంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణను ఎదుర్కొనే స్థాయికి చేరినప్పుడే పరిష్కారం దొరుకుతుంది. లేనట్లయితే అవి తాత్కాలిక విజయాలే కానీ శాశ్వత పరిష్కారం కావు కాకినాడ పోరాటానికి ఇది మినహాయింపు కాదు. అదే జరగాలని ప్రజల పోరుతో మనం మమేకమవుదాం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

కూరుకుపోయారు. అప్పు తీర్చడం కోసం ఉన్న ఇల్లును, వ్యవసాయ భూమిని అమ్మి అనాథలయ్యారు. చెట్టు కింద జీవితం గడుపుతున్నారు. ఏదో కారణం వల్ల గల్ఫ్‌లో హత్యకు గురైన వారి భార్యా బిడ్డలు, తల్లిదండ్రులు రెంటికీ చెడ్డ రేవడులయ్యారు. శవం రావడం కోసం ఉల్టా ఖర్చు పెట్టాల్సిన పరిస్థితి పగవారికి కూడా రాకూడదు. లక్షలు ఖర్చుపెట్టి, అప్పులపాలై దయనీయమైన పరిస్థితిలోకి గల్ఫ్ బాధితులు నెట్టబడ్డారు.

నదీ లోయ నాగరికతలు వర్ధిల్లడానికీ, విస్తరించడానికీ మనిషి ఒక చోటు నుండి మరొక చోటుకు తరలివెళ్లడమే కారణం. ఆనాటి వలసల ఆదాన ప్రదానాల వల్ల నాగరికత, సంస్కృతులు మిళితమయి కొత్త కళారూపాలు, జీవన మార్గాలు ఆవిర్భవించాయి. ఒక దశలో వలసలు మనిషి వికాసానికి దోహదం చేశాయి. మరిప్పుడు మనిషి మరణానికి ఎందుకు దారితీస్తున్నవి? నిజం చెప్పాలంటే గత ముప్పై సంవత్సరాల క్రితం వరకు వలస మంచి జీవికను ఇచ్చింది. వలసల కారణంగానే కుటుంబాలు, గ్రామాలు ఆర్థిక పరిపుష్టిని సాధించాయి. గ్రామ జీవన విధానాల్లో మార్పు తీసుకురావడంలోనూ, గ్రామ జీవన ప్రమాణాలు మెరుగుపరచడంలోనూ ప్రజల వలసలు, ప్రభుత్వాల కంటే ఎక్కువ దోహదపడ్డాయి. గల్ఫ్ దేశాలయిన యుఎఇ (దుబాయ్), సౌదీ అరేబియా, ఒమన్ (మస్కట్), ఖతార్, కువైట్, బహ్రెయిన్ లాంటి దేశాల రియాళ్లు, దీనార్‌ల వంటి కరెన్సీ, రూపాయలుగా మారి వ్యవసాయ బావులు, బోర్లు తవ్వించాయి. సాగునీటి పారుదలకు ఉపకరించాయి. సాగు విస్తీర్ణం పెరిగి పంటల దిగుబడి పెరిగింది. రకరకాల వ్యాపారాలు పెరిగాయి. మొత్తానికి గ్రామ ముఖచిత్రం మారింది. ఇదంతా ఒక పార్శ్వం.

ఈ మార్పులన్నీ వలసల్ని ఉధృతం చేశాయి. ఎనభైయవ దశకం నుండి వలసలు ఊపందుకున్నాయి. గల్ఫ్‌లో లేబర్ చవక అయింది. పనులు తక్కువ అయి, లేబర్ ఎక్కువ అవడమనే దశ ఏర్పడింది. గల్ఫ్ ప్రభుత్వం ఆమ్నెస్టీ ప్రకటించడం, గడువు లోపల స్వదేశాలకు వెళ్లని వారిని జైళ్లలో తోస్తామనడం సమస్యకు పరాకాష్ఠ. దీపకాంతికి భ్రమ పడి శలభాలు మంటలో పడి మసైనట్లు, పెట్టుబడికి ఆకర్షితులైన ప్రజలు వలస వెళ్లి తమ బతుకులను ఆగం చేసుకుంటున్నారు. ఇదంతా ఎనభై దశకం తర్వాత జరుగుతున్న క్రమం. దీనికి ప్రధాన కారణం గ్లోబలైజేషన్. కులవృత్తులు నశించిన వృత్తిపనివారు, వ్యవసాయం భారమైన రైతులు వలసవెళ్లారు. రాజ్యహింస కూడ దీనికి తోడయింది. మొత్తానికి వీరందరు వలస కూలీలు అయ్యారు. గల్ఫ్‌లో పనులు లేకపోవడం, ఉన్నా పూర్తికాలం దొరకకపోవడం, మొత్తానికి పని కరువు కావడం వల్ల వెళ్లినవారు ఉత్త చేతులతో తిరిగి వచ్చారు. ఖర్చులు మీదపడడం వల్ల చిన్న రైతులు భూములు, చేతిపనివారు ఇండ్లు అమ్ముకొని కొంత అప్పు తీర్చారు. అధిక వడ్డీల వల్ల అప్పులు పెరిగాయి. దానివల్ల వారి బతుకులు దుర్భరమై, జీవం లేని మనుషులుగా బతుకులీడుస్తున్నారు.

ఆధునిక ప్రభుత్వాలు ఎక్కువగా సంక్షేమ పథకాల మీదే దృష్టి పెడుతున్నాయి. ఇలాంటి పథకాలు ఎక్కువ ఆదరణ పొందుతున్నవి. ఆరోగ్యశ్రీ, వృద్ధాప్య పింఛన్, బియ్యం పథకాలు, సబ్సిడీ పథకాలు, ఉపాధి హామీ, వివిధ రకాల ఉద్యోగ పథకాలు. ఇలా ప్రజాకర్షక పథకాలు ఎన్నో ఉన్నాయి. గల్ఫ్ బాధితులు ఇలాంటి పథకాలకు లబ్ధిదారులుగా ఉన్నారా? అనేది ప్రశ్న. కొంతమంది గల్ఫ్ బాధిత పురుషులకు ఇలాంటి పథకాల ఊసే తెలియదు. వినడానికి ఆశ్చర్యకరంగా ఉన్నా నమ్మలేని నిజం ఇది. మోసపోయి, అప్పుల ఊబిలో మునిగిన మగవారు, యాంత్రికంగా పనిచేస్తూ మత్తులో మునుగుతున్నారు. ఆయా కుటుంబాల స్త్రీలు సంసారాల్ని నెట్టుకొస్తున్నారు. స్త్రీలు క్రియాశీలంగా ఉన్నారు. ప్రభుత్వ పథకాలను వీరు సమర్థవంతంగా ఉపయోగించుకుంటున్నారు. ఇంతటి చురుకుదనం వలసపోయి వచ్చిన మగవారిలో కనిపించలేదు. అత్యంత నిర్లిప్తంగా, నిర్లక్ష్యంగా బతుకులీడుస్తున్నారు. ప్రభుత్వం వీరిని ఆదుకోవాలి. ఓట్లు వేయించుకొనే పార్టీలు వీరిని దత్తత తీసుకోవాలి. అప్పుడే పార్టీలు, ప్రభుత్వాలు, వ్యక్తుల కన్నా ఉన్నత స్థాయిలో నిలుస్తాయి.

గల్ఫ్ వెళ్లిన వారి అనుభవాలు వింటే ఒళ్లు గగుర్పొడుస్తోంది. లేబర్‌గా ఇక్కడి నుండి వెళ్లిన వారి పరిస్థితి బానిసలుగా ఉంటుంది. కల్లివెల్లిపై ఉంటే దినదిన గండం నూరేళ్లాయిషే. మహమ్మద్ ఖాసిం అనుభవాన్ని ఆయన మాటల్లోనే విందాం. 'ముగ్గురు బిడ్డలు, ఒక కొడుకు నాకు. భూమి లేదు. సౌదీకి పోయినాక ఇల్లు అమ్మిన. ఇప్పుడు ఇందిరమ్మ ఇల్లు ఉంది. మందిని చూసి పోయిన, తోటపని అంటే పోయిన. పోయినాంక గొర్లుకాయపెట్టిండ్రు. దుబ్బల మీదికి (ఎడారి ఇసుక దిబ్బలు) గొర్లు కాయపంపిండ్రు. వాటిని పట్టుకొని నేను ఒక్కన్నే ఉన్న. పిస్సలేసినట్టయింది. మనిషి తోడు లేదు. నాకు తోడుగా గాడిద ఉంది. 500 గొర్లు ఉన్నాయి. వాటికి కాపలా నేను. అక్కడ ఉన్న ఐదు నెలలు స్నానం చెయ్యలేదు. వారానికి ఒకసారి (గురువారం నుండి గురువారం వరకు) మనిషి వచ్చి తినడానికి రొట్టెలు, ఆవు నెయ్యి, ఐదు లీటర్ల నీళ్ల డబ్బ ఇచ్చి పోయెటోడు. ఐదు నెలలు ఉండేసరికి పానం బోయిన ట్టయింది. దెబ్బదివేలు పెట్టి పోయిన. అక్కడోల్లు విమానం టిక్కెట్టు కొనిచ్చి పంపించిండ్రు. టికెట్ ఖరీదు కింద జీతం ఉంచుకున్నరు. వచ్చినాంక ఇల్లు అమ్మిన. కొంత బాకీ తీరింది. ఉన్న ఊర్లె గంజినీళ్లు తాగి బతికినా మంచిదే, వలస మాత్రం పోను' అని ముగించిండు. చాలా మందిని కలిశాం. ఏ ఒక్కరి అనుభవం సంతోషకరంగా లేదు. వలసల నుండి లాభం పొందినవారు కూడా ఏదో గండం గడిచిందని ఊపిరి పీల్చుకున్నట్లుగా కనిపించారు.

నాంపెల్లి గోవర్దన్ మాట్లాడుతూ సంపాయించుకోవచ్చు అని పోయిన. పోకున్నా ఎల్లుతుండే. పోవడానికి లక్ష ముప్పయి వేలు ఖర్చు పెట్టిన. వెల్డింగ్ పని అని చెప్పి ఒంటెలు కాయపెట్టిండ్రు. పది ఒంటెలకు కాపలా ఉన్న. ఒంటె తప్పిపోతే కొట్టెటోళ్లు. ఎడారులల్ల ఒంటరిగా ఉన్నా. దగ్గర సెల్‌ఫోన్ ఉంటే మాట్లాడుతున్ననని గుంజుకున్నరు. నరకం అనుభవించిన. ఎడారుల్లో కొమ్ముల పాములుంటయి. అవి కరిసినాక తొందరగా దవాఖానాకు పోతే తప్ప బతకడం ఉండదు. చెబితే వినకపోతే శిక్షలు భయంకరంగా ఉంటాయి. రూంల వేసి తాళం పెడతారు. కిటికి ఈవల నీళ్ల క్యాన్ పెట్టి, అందులో గొట్టం వేసి, గొట్టం చివరి కొసను కిటికీ లోపలికి వేసి నీళ్లు తాగమని చెప్పి పోతరు. సౌదీ అరేబియాలో మూడు నెలలు గడిపివచ్చా. అప్పుల పాలైన. ఇప్పుడు టైలర్‌గా జీవితం గడుపుతున్న అని చెప్పిండు.

గాజుల మల్లేశం అనుభవం మరో రకంగా ఉంది. రెండు సంవత్సరాల వీసా మీద దుబాయికి పోయిండు. బోరింగ్ పని అని చెప్పి గొర్ల కాపలా కాయమన్నారట. పనిచేసే చోట మరొకరి తప్పిదం వల్ల ట్రక్కు రెండు కాళ్ల మీదకు ఎక్కిందట. ఇంటి నుండి యాభై వేలు పంపితే స్వదేశానికి వచ్చిండు. ప్రస్తుతం భూమి, ఇల్లు లేదు. 'చెట్టు కింద బిచ్చగాళ్ల లెక్క బతుకుతున్నం' అని అతని భార్య అంది.

ఇంతటి భయంకర అనుభవాల్ని పొంది కూడా రెండోసారి పోవాలనుకునే వారు ఉన్నారు. 'అక్కడికి పోతే సుఖం ఏం లేదు. ఇక్కడ ఉండలేక, అప్పులోల్లకు ముఖం చూపించలేక మల్ల పోవాలనిపిస్తుంది. ఏజెంట్ మీద పైసలు ఉన్నాయి. ఇయ్యమంటే ఇస్తలేడు. పైసలకు బదులు మల్ల ఫ్రీగా పంపుత అంటున్నాడు. అందుకోసం పోవాలనిపిస్తుంది' అని తోకల భూమయ్య అన్నాడు.

ఇక్కడి నుండి వెళ్లిన పేద బిడ్డలకు అక్కడ పేదరికమే కనపడలేదట. ఒకవేళ ఎవరన్నా తక్కువ స్థాయిలో ఉంటే, అక్కడి ధనవంతులు వారికి కావలిసినన్ని నోట్ల కట్టలు ఇస్తరని అమాయకంగా అన్నారు. జరుగుతుందని చెబుతున్న అభివృద్ధి అందని ప్రజలు వలసలు పోతున్నారు. వలస వెళ్లిన ప్రజలు మోసపోతున్నారు. మోసపోయిన వారు అప్పుల్లో కూరుకు పోతున్నారు. కూరుకుపోయిన వారిని పట్టించుకునే వారు కరువయ్యారు. దేశం వెలుగుతుంది అనే వాళ్లు ఈ నీడల్ని పట్టించుకోవాలి. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# భగత్‌సింగ్ నుంచీ వేలాడుతున్న ఉరితాడు

***ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశంగా చెప్పకుంటున్న భారతదేశంలో పాలకులు రోజురోజుకూ ప్రజాస్వామ్య విలువలను కాలరాస్తూ దేశ విలువలను దిగజారుస్తున్నారంటున్నారు* ఆకుల భూమయ్య**

**మా**ర్చ్ 23, 2013న భగత్‌సింగ్ 82వ వర్ధంతి. భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌లు సరిగ్గా 82సంవత్సరాల క్రితం ఈ రోజే (23.03.1931) ఉరికంభం ఎక్కారు. వీరిని ఆనాడు ప్రజాగ్రహానికి గురవుతామని భయంతో రహస్యంగా ఉరి తీశారు. 1975లో భూమయ్య, కిష్టాగౌడ్‌లను అలాగే ఉరి తీశారు. చట్టం పట్ల అంతా శ్రద్ధాసక్తులు ఉన్నట్లయితే ప్రజాభిప్రాయాన్ని తమకు అనుకూలంగా మలుచుకోవాలి కానీ, ఇలా రహస్యంగా ఉరి తీయడంలో ప్రభుత్వం తన తప్పును కప్పిపుచ్చుకునే ప్రయత్నం చేస్తోంది. అంతటి ప్రజాభిమానం చూరగొన్న నాయకులు ఎందుకు ఉరిశిక్షకు గురవుతున్నారో ఆలోచించాలి. అంటే రాజ్యం తప్పు చేస్తున్నదని అర్థమవుతోంది. రాజ్యానికి తాను తప్పు చేస్తున్నానని తెలుసు కాబట్టే ప్రజాగ్రహానికి గురవుతానని భయ పడుతోంది. చట్టాన్ని బాహాటంగా అమలు చేసే నైతిక ధైర్యం, స్థైర్యం, అర్హత రాజ్యానికి లేవని స్పష్టంగా తెలుస్తోంది.

ఎవరీ రాజకీయ ఖైదీలు? సమాజం కోసం ఆలోచించి, సమాజం కోసం బతికి అనితరసాధ్యమైన త్యాగాలు చేస్తూ, చివరకు సమాజం కోసం, ప్రజల కోసం ప్రాణాలు అర్పించడానికి సిద్ధమైన వారు ఖైదీలుగా ఉండడం అనేది సభ్యసమాజం సిగ్గుపడాల్సిన అంశం. అందుకే రాజకీయ ఖైదీలను బేషరతుగా విడుదల చేయాలని ప్రజాస్వామిక వాదులు కోరుతున్నారు. అయితే సమస్త ప్రజానీకం కూడా ఇందు కోసం మద్దతుగా నినదించాల్సి ఉంది. ఈ సందర్భంగా మార్చి 23 నుంచి 29 వరకు రాజకీయ ఖైదీల హక్కుల పోరాట వారంగా సభలు నిర్వహించడం స్ఫూర్తి కలిగిస్తుంది.

మన రాష్ట్రంలో జగన్మోహన్‌రెడ్డిలాంటి వారు జైళ్లలో ఉన్నప్పటికీ, సకల సౌకర్యాలు అనుభవిస్తూ, తమ రాజకీయ పార్టీల కార్యకలాపాలు నడుపుకుంటున్నారు. లక్షల కోట్ల రూపాయల అక్రమ సంపాదనతో 2జీ స్పెక్ట్రం లాంటి కేసుల్లో, ఇతర కేసుల్లో ఉన్న వారు ఘరానా ఖైదీలుగా కొనసాగుతున్నారు. అయితే వ్యవస్థ మార్పు కోసం జరిగే పోరాటాల్లో పాల్గొనే వారు ఇది ప్రజాస్వామ్యం పేరు మీద అమలవుతున్న నియంతృత్వం అంటున్నారు. సిసలైన ప్రజాస్వామ్యం మీద సోషలిస్టు వ్యవస్థల కొరకు పోరాడుతున్న వారిని జైళ్లలో కూడా అనేక ఇబ్బందులు పెడుతూ, వాళ్ల కనీస పౌర ప్రజాస్వామిక మానవ హక్కులను హరిస్తున్నారు. జైళ్లు అంటే సంస్కరణ కేంద్రాలుగా ఉండాలి. కాని అవి కాన్సంట్రేటెడ్ క్యాంపులుగా మారుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయ ఖైదీలు జరిపిన పోరాటాలు కొన్ని హక్కులు సాధించినప్పటికీ, విప్లవ కార్యాచరణకు కొంత గౌరవ ప్రదమైన స్థానం కల్పించినప్పటికీ చత్తీస్‌గడ్, జార్ఖండ్, మహారాష్ట్ర, ఒడిశా, మధ్యప్రదేశ్, బీహార్ జైళ్ల చిత్రహింసల కొలిమిలుగా ఉన్నాయి. జైళ్లలో మగ్గుతూ పోరాటాలు కొనసాగిస్తున్న ఖైదీల పోరాటాలకు మద్దతుగా బయట ప్రజలు, ప్రజాస్వామికవాదులు పెద్ద ఎత్తున ఉద్యమాలు నిర్వహించాల్సి ఉంది. వ్యవస్థ మార్పు కోరుతూ, రాజకీయ కారణాలతో జైళ్లలో మగ్గుతున్న ఖైదీలను వెంటనే బేషరతుగా విడుదల చేయాలని డిమాండ్ చేయడం ప్రతి పౌరుని ప్రాథమిక విధిగా ప్రచారం నిర్వహించాల్సి ఉంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు, ప్రజాస్వామిక భావనలకు శతాబ్దాల చరిత్ర ఉంది.

మాగ్నాకార్ట మొదలుకొని క్రాంవెల్ తిరుగుబాటు వరకు మందకొడిగా సాగినప్పటికీ ఇంగ్లాండ్ విప్లవం తరువాత పార్లమెంట్ అధికారాలు పెరిగి రాజు అధికారం పరిమితం అయ్యింది. చట్టబద్ధ రాజరికం అమలులోకి వచ్చింది. తరువాత జరిగిన అమెరికా స్వాతంత్ర్య పోరాటం బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గడగడలాడించింది. పౌర ప్రజాస్వామిక హక్కులు అమలు చేసే నూతన వ్యవస్థ ఉనికిలోకి వచ్చింది. పరాకాష్టగా ఫ్రెంచ్ విప్లవం 1789లో స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదా లతో, ప్రజాస్వామిక భావనలతో గుణాత్మక మలుపులు తీసుకువచ్చింది. తరువాత వివిధ మార్గాల్లోనైనా జర్మనీ, ఇటలీల్లో జరిగిన ఏకీకరణలు, జపాన్‌లో ప్రజాస్వామిక విధానం అమలు జరగడం, వాటిని బలోపేతం చేయడం జరిగాయి. రష్యాలో బోల్షివిక్ విప్లవం, ప్రజాస్వామిక సోషలిస్టు, సామాజిక వ్యవస్థల్ని ఏర్పరిచింది. మనం ప్రతినిత్యం విద్యాలయాల్లో పై విప్లవాల గురించి సానుకూలంగా గొప్ప సామాజిక అభివృద్ధిగా చెప్పుకుంటున్నాం. ఆ విప్లవాన్ని ఆదర్శంగా చూసుకుంటున్నాం.

కానీ, మన దేశ విషయానికి వస్తే ఆ విప్లవాన్ని ఎందుకు ఆహ్వానించలేక పోతున్నాం. ఇటలీని ఐక్యపరిచిన బ్యారీబాల్డీని ఆదర్శంగా తీసుకున్న గాంధీ జాతిపితగా ఉన్న మన ఘనమైన రాజ్యంలో బ్యారీబాల్డీ లాంటి విప్లవ చర్యలను ఎందుకు ఆమోదించలేకపోతున్నాం? ఇవన్నీ సమాధానం లేని ప్రశ్నలుగా మిగలాలా? అలా మిగలడానికి వీలు లేదు. పాఠ్యాంశాల్లో, సిలబస్‌లలో గొప్పగా చెప్పుకునే సామాజిక రాజకీయ విప్లవాలు తద్వారా ఏర్పడ్డ సామాజిక వ్యవస్థల గొప్పతనాన్ని కీర్తించే మనం, మన దేశంలో దాన్ని ఎందుకు వ్యతిరేకిస్తున్నామో ఒకసారి పునరాలోచన చేసుకోవాలి. ఈ ద్వంద విధానానికి కారణం ఏమిటో ఆలోచిస్తున్న మేధావులను అలాంటి ఉన్నత వ్యవస్థలకై పాటుపడుతున్న త్యాగధనులను జైళ్లలో కుక్కిన క్రూరరాజ్యాన్ని నిలదీయడమే భగత్‌సింగ్ లాంటి వాళ్లకు మనం అర్పించగలిగినటువంటి నిజమైన నివాళి.

ప్రజాస్వామ్యం అంటే భిన్న అభిప్రాయాల్ని ఓపికగా వినడం, గౌరవించడం, భిన్న అభిప్రాయాలను వెలిబుచ్చే హక్కును గుర్తించి గౌరవించడం, భిన్నాభిప్రాయాల పట్ల సహనంతో వ్యవహరించడం, ఏ మాత్రం వీలైనా భిన్నాభిప్రాయాలను పరిగణనలోకి తీసుకుని దాన్ని పాటించడం ప్రజాస్వామ్య వ్యవస్థ మౌలిక లక్షణం. కానీ నేటి మన వ్యవస్థలో భిన్నాభిప్రాయల్ని వినడానికే సిద్ధ పడడం లేదు. తొక్కిపెట్టడం, వీలైతే అణిచివేయడం పరిపాటి అయింది. ఇటీవల అసెంబ్లీలో తెలంగాణ రాష్ట్ర సమితి శాసనసభ్యులు హరీష్‌రావు మాట్లాడుతూ

'ఉద్యమాలు గల్లపట్టి సాధించుకున్నాయ'ని అన్నప్పుడు ఆయన అభిప్రాయంగా గౌరవించి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి సమాధానంగా దాన్ని సున్నితంగా తిరస్కరించవచ్చు. కానీ 'మీరు అలా ఉద్యమాల ద్వారా సాధించినామనుకుంటే ఇప్పటి నుండి ఒక్క రూపాయి కూడా ఇవ్వన'ని బాహాటంగా అసెంబ్లీలోనే మాట్లాడడం చూస్తే మన పాలకులకు కనీసం ప్రజాస్వామిక భావన అంటే ఏమిటో తెలియదని స్పష్టం అవుతుంది. అదే కిరణ్‌కుమార్‌రెడ్డి తాను హైదరాబాదీనని చెబుతూనే తెలంగాణకు రూపాయి కూడా ఇవ్వననడంలోని ఔచిత్యాన్ని అర్థం చేసుకోవడం కష్టం కాదు. తాను హైదరాబాదీనని చెప్పి భయపడ నంటూనే ఇటీవల మంజూరైనటువంటి తెలుగు పండిట్ పోస్టులలో చిత్తూరుకు 2,800 పోస్టులు, కరీంనగర్ జిల్లాకు 28పోస్టులే కేటాయించాడు. ఇంతటి వివక్షత తెలంగాణ పట్ల చూపుతున్నప్పుడు తెలంగాణ కోసం కొట్లాడడం అనేది ఎంత న్యాయమైనదో ఆలోచించాలి? తెలంగాణను ఇంకా కలిపి ఉంచాలనుకోవడం ఎంతటి నిరంకుశత్వమో, ఎంతటి నియంతృత్వమో ఆంధ్ర పాలకులు ఇకనైనా ఆలోచించాలి.

రాజకీయ ఖైదీలమీద సాగుతున్న అణిచివేతను, నిర్బంధాన్ని పరిశీలించినప్పుడు రాజకీయ ఖైదీల మీద సాధారణంగా సాయుధ పోరాటం ద్వారా చట్టబద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని కూల్చడానికి కుట్ర పన్నారనే ఆరోపణ ఉంటుంది. మన పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థకు 66 ఏండ్ల చరిత్ర ఉంది. ఈ పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థ అత్యంత పవిత్రమైనదని కూడా చిదంబరం లాంటి వాళ్లు ఎప్పటికప్పుడు చెబుతూ ఉంటారు. ఈ రాజ్యవ్యవస్థ దేశంలో ఏ సమస్యను పరిష్కరించగలిగిందో చెప్పగలరా? 66 ఏండ్లుగా మండుతున్న కాశ్మీర్, ఈశాన్య భారత జాతుల సమస్యలను పరిష్కరించగలిగిందా? మధ్య భారత్‌లోని గిరిజనుల సమస్యలను పరిష్కరించగలిగిందా? లేక ఈ దేశాన్ని పట్టి పీడిస్తున్నటువంటి కుల సమస్యను పరిష్కరించడానికి ఏమైనా ప్రయత్నం జరిగిందా? ఈ నాటికి నిర్భయలాంటి స్త్రీల మీద అత్యాచారాలు జరుగుతూ ఉన్నాయి. వాటిని ఆపడానికి కావాల్సినటు వంటి ఎజెండా ఏమైనా ఈ ప్రభుత్వం ముందు ఉందా అంటే శూన్యమే గోచరిస్తోంది.

ఈశాన్య భారత్, కాశ్మీర్ లాంటి ప్రాంతాల్లో ఈ నాటికి 15లక్షల మంది సైన్యాన్ని మోహరించి సైనిక బలగాల ప్రత్యేకాధికారాల చట్టాన్ని అమలు చేస్తుంది ఈ ప్రభుత్వం. ఇంత సుదీర్ఘకాలం సైనిక పాలన అవసరం అయిన తరువాత దీన్ని ప్రజాస్వామిక వ్యవస్థ అని ఎలా అనగలం. దీన్ని మార్చడానికి సిద్ధపడిన వాడు నేరస్థుడవుతాడా?

మధ్యభారతంలో లక్షల కోట్ల ఎంఒయులు కుదుర్చుకున్న బహుళజాతి కంపెనీలు పోస్కో, మిట్టల్, జిందాల్, ఎస్సార్, వేదాంత లాంటివి మన సహజ వనరులను, ఖనిజాలను సైన్యం, పారా మిలటరీ బలగాల పహారాలో పట్టపగలే దోచుకుపోతుంటే, ఆపడానికి సాహసించే ఆదివాసీ దేశద్రోహి అవుతాడు. అతనికి సరైన మార్గం చూపే మావోయిస్టులు అత్యంత ప్రమాదకారులుగా చిత్రీకరించ బడడం విడ్డూరం కాదా? మావోయిస్టులను అణిచివేయడానికే మధ్య భారతంలో ప్రజానీకం మీద యుద్ధం ప్రకటించడం ఎలాంటి ప్రజాస్వామ్యమో అర్థం చేసుకోవాలి.

విదేశీయులు మన వనరులను దోచుకోకుండా మన సైన్యం కాపాడే బదులు వారి కనుసన్నల్లోనే వనరుల తరలింపు జరుపుతుంటే అడ్డుకునే వారు దేశద్రోహులు అవుతారు. వారికి ఉరి శిక్ష వేయాల్సిందేనా? ఇదంతా తలక్రిందులుగా కనబడడం లేదా? మన వనరులు దేశం బయటికి తరలించడానికి మనమే సైన్యాన్ని నియమించుకోవాలా? మన చట్టసభలు ఏనాడైనా ప్రజల సమస్యలు చర్చించాయా? డబ్బుకు ప్రశ్నలు అడిగే ఎంపీలు ఉన్న ప్రజాస్వామ్యాన్ని మనం రక్షించాలా? ఈ బూటకపు ప్రజాస్వామ్యాన్ని, పార్లమెంటరీ వ్యవస్థను కూల్చేవాడు భగత్‌సింగ్ లాగా దేశ భక్తుడవుతాడు, కానీ దేశద్రోహి ఎలా అవుతాడు? నిజమైన దేశ భక్తులను దేశ ద్రోహులుగా చిత్రీకరిస్తూ పోటా, అప్సా, యుఎపిఎ కేసులు బనాయిస్తున్నారు. ఉరిశిక్షలు వేయిస్తున్నారు. ధైర్యం చాలక రహస్యంగా ఉరి తీస్తున్నారు. మన జైళ్లలో తలారి ఉద్యోగానికి ఎవరూ రావడం లేదని అంటున్నారు కానీ ప్రణబ్‌ముఖర్జీ రాష్ట్రపతి అయ్యాక క్షమాభిక్ష పిటిషన్లన్నింటినీ వెంటవెంటనే క్లియర్ చేస్తూ మహా తలారీగా అవతారం ఎత్తాడు.

ఇక తెలంగాణ ఉద్యమంలో అణిచివేత కొత్త పుంతలు తొక్కుతుంది. శ్రీకృష్ణ కమిటీ 8వ చాప్టర్ రహస్య చాప్టర్‌గా తెలంగాణ సమస్యకు పరిష్కారం, ఉద్యమాన్ని ఎలా పక్కదారి పట్టించాలో చెబుతుంది. మీడియాను ఎలా దారికి తెచ్చుకోవాలి, రాజకీయ పార్టీలను, ఇతర సంస్థలను, టిఆర్ఎస్‌ను ఎలా దారికి తెచ్చుకోవాలో రాజకీయ బేరసారాలకు లొంగని సిసలైన ఉద్యమకారులపై యుఎపిఎ కేసులు బనాయించాలని, దానికి లొంగని మొండిఘటాలను సాంబశివుడు, వనిపెంట వెంకటేశ్వర్లు లాంటి వారిని ఎలా ప్రత్యక్షంగా, పరోక్షంగా హత్యలు చేయాలో వివరించారు. తెలంగాణ సాధన కొరకు టిఆర్ఎస్‌లో చేరి ఎన్నికల ద్వారా తెలంగాణ సాధిస్తానన్న సాంబశివున్ని హత్య చేసిందీ ఈ వ్యవస్థ. ఎన్నికలొద్దు ఉద్యమం ద్వారా తెలంగాణ సాధించుకుందా మనుకున్న వనిపెంట వెంకటేశ్వర్లును కిడ్నాప్ చేసి చంపించిందీ ఈ వ్యవస్థ. అంటే తెలంగాణ ఉద్యమకారులను చంపడమే పనిగా పెట్టుకున్న ఈ వ్యవస్థను నిలదీయకుండా ఎలా న్యాయం సాధించగలం? తెలంగాణకు న్యాయం చెప్పమని మాజీ న్యాయమూర్తిని అడిగితే, క్రూర చట్టాలు, కుటిల పద్ధతులు అవలంభించి ఉద్యమాన్ని అణిచివేయాలని సూచించే న్యాయమూర్తులు ఉన్న ఘనమైన ప్రజాస్వామ్య వ్యవస్థ మనది. వ్యవస్థ లోపభూయిష్టంగా మారినప్పుడు దాన్ని మార్చుకోవడం ప్రతి పౌరుని విధి. దాన్ని మార్చడానికి ప్రపంచంలో ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి.

చాలా దేశాల్లో సాయుధంగానే మార్చుకున్న సంఘటనలు చరిత్ర తెలిసిన వాళ్లకు కొత్తకాదు. మన దేశంలో ఆ ప్రయత్నం చేసే వారికి కూడా వారి ఆప్షన్ వారికి ఉండాలి. అదే ప్రజాస్వామ్యం అవుతుంది. నేను చెప్పినట్లు నడుచుకోవాలనడం నియంతృత్వం అవుతుంది తప్ప ప్రజాస్వామ్యం కాదు. ఇతరులు చెప్పేదాన్ని మనకు ఇష్టం లేకపోయినా వినడం, గౌరవించడమే ప్రజాస్వామ్యం అవుతుంది. మన దేశంలో వివక్ష ఎంత నగ్నంగా నాట్యం చేస్తుందంటే కార్గిల్‌లో పట్టుబడ్డ పాకిస్తాన్ సైనికులను వార్ ఆఫ్ ప్రిజనర్స్ చట్టం కింద సగౌరవంగా పాకిస్తాన్‌కు పంపుతున్న దేశం, మన దేశంలోనే విప్లవకారులను బూటకపు ఎన్‌కౌంటర్లలో చంపిన తరువాత వారి శవాలను కూడా కాళ్లతో తన్నుతూ అవమానిస్తున్నటువంటి పరిస్థితిని చూస్తున్నాం. అఫ్జల్ గురులాంటి దేశ పౌరులను రహస్యంగా ఉరితీస్తూ, భారతీయులను అన్యాయంగా చంపిన ఇటలీ నావికులకు ఉరిశిక్షలు ఉండవంటూ ముందే ప్రకటించి, లొంగిపోయి, నామమాత్రపు విచారణ ఎదుర్కొమ్మని సూచనలు ఇస్తుంది మన ప్రభుత్వం. ఇంతటి ద్వంద ప్రమాణాలు ఎందుకో ఆలోచించాల్సి నటువంటి అవసరం లేదా.

వనరులు దోచుకునేవాళ్లకు వత్తాసు పలుకుతూ, వనరులను కాపాడే వాళ్లను నేరస్థులను చేస్తున్నదీ ఈ వ్యవస్థ. ఇంతటి బూటకపు ప్రజాస్వామ్యాన్ని కాపాడవల్సిన అవసరం ఉందా? అని అందరూ ప్రశ్నించాల్సిన సమయం ఆసన్నమైంది.

# రష్యా విప్లవంలో కార్మికులు, రైతులు

***రష్యాలో నిరంకుశ రాచరిక పాలనకు వ్యతిరేకంగా సాగిన ఉద్యమానికి కార్మికులూ, రైతులూ ముందుండి నాయకత్వం వహించారని అంటున్నారు* కె. నరేంద్రమోహన్**

అక్టోబర్ విప్లవానికి, దానికి డ్రెస్ రిహార్సల్‌లా పనిచేసిన 1905 విప్లవానికి దారితీసిన కార్మికుల, రైతుల స్థితిగతులు విశ్లేషించే ప్రయత్నం ఇది. విప్లవకాలంలో రష్యా ఎదుర్కొన్న రైతు సంక్షోభానికి మూలం 1861లోని మోసపూరిత అర్ధబానిస విముక్తిలో ఉంది. అందులో ప్రభుత్వ భూముల్లో పనిచేసిన వారికి తలసరి సుమారుగా 14 ఎకరాలు లభించాయి. అప్పటి అంచనాల ప్రకారం అది ఒక కుటుంబానికి సరిపడే భూమి. అదే లెక్కన భూస్వాముల, స్వంత కమతాల రైతులకు 4 కోట్ల 40 లక్షల ఎకరాలు తరుగు లభించాయి. రైతులకు భూమి ఉచితంగా లభించకుండా, తాము స్వయంగా సాగు చేసుకుంటున్న భూములతో సహా, భూస్వాములకు దండుగ చెల్లించవలసి వచ్చింది. భూస్వాములు సారవంతమైన భూములు స్వంతానికి ఉంచుకొని, నీటి పారుదల లేని, ముక్కలు చెక్కలుగా ఉన్న భూములను రైతులకు వదిలారు.

ఈ సంస్కరణలు అమలు జరిగిన తరువాత ముప్పై వేల మంది భూస్వాముల ఆధీనంలో 7 కోట్ల ఎకరాల భూమి, చర్చి, మత సంస్థల ఆధీనంలో 25 లక్షల ఎకరాల భూమి మిగిలింది. వాస్తవంగా ఇది ఒక కోటి రైతు కుటుంబాలకు చెంది ఉండాలి. రైతులు తమ వ్యక్తిగత విముక్తికి భూస్వాములకు 21.9 కోట్ల రూబుల్ చెల్లించగా, భూముల పరిహారంతో కలుపుకొని రైతుల వద్ద 86.7 కోట్ల రూబుళ్ల రుణాలు మిగిలాయి. అదే సమయంలో, ప్రభుత్వం కేటాయించిన భూములపై ఒక దేస్యటిన్కు (2.7 ఎకరాలు) 1.6 రూబుల్ - ప్రైవేటు భూమిపై 23 కోపెక్కు - పన్నులు విధించింది.

స్థానిక వ్యవసాయ కమిటీల అంచనాల ప్రకారం 1902లో రైతుల లాభంలో 50 నుండి 100 శాతం ప్రత్యక్ష, పరోక్ష పన్నుల కింద ప్రభుత్వం వసూలు చేసింది. సైనిక, అధికారుల వ్యయం, పరిశ్రమలకు రక్షిత ఆర్డర్‌లకు పెట్టే ఖర్చుతో, ప్రతి సంవత్సరం రైతు ఆర్థిక వ్యవస్థలో 8.5 కోట్ల రూబుళ్ల లోటు మిగిలింది. (ట్రాట్‌స్కీ, ది ఇయర్ నైన్టీన్ నాట్ ఫైవ్, మార్క్సిస్ట్ ఇంటర్నెట్ ఆర్కివ్).

ప్రధానంగా అర్ధబానిస విధానం ప్రబలంగా ఉండిన మధ్య రష్యాలోని

---

ఇక ఉరిశిక్షలు ఎంతటి అమానవీయత. ప్రపంచంలో మూడింట నాలుగు వంతుల దేశాలు ఉరిశిక్షణను రద్దు చేశాయి. మిగతా వాటిలో చాలా దేశాలు చట్టం చేయకపోయినా ఉరిశిక్ష అమలు చేయడం లేదు. కన్నుకు కన్ను, పన్నుకు పన్ను అనేది మధ్య యుగాల న్యాయం. ఎట్రిబ్యూటరీ పనిష్‌మెంట్‌కు మన దేశంలో స్థానం లేదని న్యాయవ్యవస్థ చెప్పింది. రిఫార్మ్‌మెంటరీ పనిష్‌మెంట్ మన విధానంగా చెప్పు కుంటున్నాం. కానీ ఈ విషయంలో న్యాయకోవిధులు ఎన్ని చెప్పినప్పటికీ ప్రతికార శిక్షలే అమలవుతున్నాయి. ఉరిలో ఎంత అమానుషత ఉంటుందంటే హత్యలు, తదితర తీవ్ర నేరాలకు పాల్పడే వాళ్లలో 99 శాతం క్షణికావేశంకులోనై, ఉద్వేగానికి గురై, విచక్షణా జ్ఞానం కోల్పోయిన స్థితిలో అలాంటి నేరాలకు పాల్పడుతుంటారు. కాని, వారికి ఉరిశిక్ష ఖాయం చేయబడ్డ తరువాత జరిగే తతంగాన్ని గమనిస్తే ఉరిశిక్ష అమలు చేసే ముందు రోజు ఖైదీకి తెలియజేస్తారు. ఆ రాత్రంతా అతను చస్తూనే ఉంటాడు. అతని కుటుంబ సభ్యులు, మిత్రులు చివరి సారిగా చూసినప్పుడు వారి బాధ వర్ణణాతీతం.

ఇక ఉరి అమలుచేసే సమయంలో ఒక తలారి, ఒక జడ్జి, ఒక డాక్టర్, జైలు సూపరింటెండెంట్ వీరందరూ సాటి మనిషిని సమయం చూసుకొని ప్రశాంత చిత్తంతో ఆజ్ఞలు జారీ చేసి తలారీ చేత మీట నొక్కిస్తారు. క్షణికావేశంలో నేరం చేసిన నేరస్థున్ని ఇంత మంది ప్రశాంత చిత్తంతో కలిసి చంపేస్తున్నారంటే ఇంత కంటే అమానవీయత ఏముంటుంది. నాగరిక సభ్యసమాజం చేయవల్సిన పనికాదు. తలదించుకోవాల్సిన పరిస్థితి. అందుకే అన్నిరకాలుగా ఉరిశిక్ష రద్దు చేయాల్సిందేనని ప్రజలందరూ డిమాండ్ చేయవల్సిందే. దీర్ఘకాలం జైలులో ఉండడం కూడా మరణ శిక్ష కంటే ఘోరమైనదే. జైలు నుంచి సంస్కరించి బయటికి పంపాలే. కానీ జీవితమంతా జైలులో ఉంచి హింసించడం ఎలా నాగరికత అనిపించుకుంటుందో వ్యవస్థకు ఆధిపత్యం వహించేవాళ్లు ఆలోచించాలే. ఇలాంటి అమానవీయ పద్ధతులు రద్దు కావడానికి ప్రజలంతా కూడా పెద్ద ఎత్తున ఉద్యమించాల్సి ఉంది.

ఇటీవల అజ్మల్ కసబ్, అఫ్జల్ గురులను రహస్యంగా ఉరి తీశారు. కసబ్ కేసులో ఏదో విచారణ జరిపినట్టు కనబడుతుంది. కానీ అఫ్జల్ గురు విషయంలో సాక్ష్యాధారాలు సరిగా లేవని సుప్రీంకోర్టే స్వయంగా పేర్కొంది. అయితే జాతి మనోభావాలను గౌరవించడానికి పార్లమెంట్‌పై దాడి చేసిన వారిని ఉరి తీయకపోతే ఎలా అనే నియమస్తు ఉరిశిక్షను ఖాయం చేశామని సుప్రీంకోర్టు వారే చెప్పారంటే ఇంతకంటే అమానవీయత ఇంకేం కావాలి. సందేహానికి ఎలాంటి తావు లేకుండా నేరం చేసినట్టు నిరూపించబడితేనే ఉరిశిక్ష కానీ అత్యంత అరుదైన కేసుల్లో మాత్రమే ఉరిశిక్ష వేయాలని చట్టం చెబుతుంది.

స్పష్టమైన ఆధారాలు లేకున్నా జాతి మనోభావనలు తృప్తి పరచడానికి ఉరి తీస్తున్నారంటే మన జాతి భావనలు అంతటి క్రూరంగా తయారైనాయా? రుజువులు లేకుండానే మన పార్లమెంట్‌పై దాడి జరిగినందుకు ఎవరినో ఒకరిని ఉరి తీస్తేనే తృప్తి పడేంత నీచ స్థాయికి మన జాతి ఎప్పుడు దిగజారిందో మనకైతే అర్థం కాలేదు కానీ జాతి మనోభావాల పేర కొంత మంది న్యాయమూర్తులు తమ భావనలను సంతృప్తి పరుచుకుంటున్నారని అర్థం అవుతుంది. ఇంతటి కుసంస్కారం నుంచి బయట పడి మానవీయ సమాజాన్ని నిర్మాణం చేసుకుందాం. దాని కోసం రాజకీయ ఖైదీల హక్కుల పోరాట వారాన్ని విజయవంతం చేద్దాం.

*(రచయిత తెలంగాణ ప్రజా ఫ్రంట్ అధ్యక్షులు)* వీ

రైతులు కరువు పరిస్థితుల్లో వ్యవసాయం చేయవలసి వచ్చింది. రైతులు, పిండిలో రంపపు పొట్టు, చెట్ల బెరడు కలుపుకొని తినేవారు. భూదాహం, కౌలు పెరగుదలతో పెట్టుబడిదారీ వ్యవసాయానికి అనుకూలమైన పరిస్థితి లేకుండా పోయింది. భూస్వాములు ఆధునిక పద్ధతులు వాడక కౌలుదార్ల ద్వార, లేదా పేద రైతుల, కూలీల శ్రమతో సాగుబడి చేయసాగారు. ఈ ప్రాంతంలో రైతులలో అతి స్వల్పంగా సామాజిక వర్గీకరణ జరిగి ప్రధాన వైరుధ్యం రైతులకు ఎస్టేట్లకు నడుమ కనపడింది. వీరిలో కొందరు ఉత్తర, దక్షిణ ప్రాంతాల్లో కార్మికులుగా, వ్యవసాయ కూలీలుగా వెళ్లి అక్కడి వేతనాలు మరింత తగ్గించారు. అయినప్పటికీ మధ్య రష్యా ప్రాంతంలో సుమారు ఐదు కోట్ల మంది తగినంత ఉపాధి లేనివారు ఉండేవారు. వీరు కార్మికులలో కలవలేక పోవడంవల్ల ఉన్న చోటనే రైతుల పరిస్థితి మరింత దిగజారింది.

దక్షిణ ప్రాంతంలో అర్ధబానిస విధానం అట్టే లేకపోవడం, విస్తారమైన మైదాన ప్రాంతాలు ఉండడంతో సుమారు 2.2 కోట్ల ఎకరాల్లో అమెరికాను పోలిన భారీ వ్యవసాయం, యాంత్రీకరణ ప్రవేశించి, భూమి కౌలు, ధరలు పెరిగి సన్నకారు రైతుల కమతాలు, పశు సంపద సన్నగిల్లాయి. సమస్యకు పరిష్కారంగా ఒకవేళ భూములు ప్రభుత్వం ద్వారా కొనుగోలు చేస్తే, కౌలు స్థానంలో రుణం మిగులుతుంది. దానికి తోడు ఏటా రైతుల నుండి తరలిపోతున్న లోటు పూడి, లాభసాటి వ్యవసాయం సాగాలంటే, శిక్షణ, సాంకేతిక పరిజ్ఞానం, సామాజిక స్వేచ్ఛ, స్థిరమైన రాజకీయ వ్యవస్థ ఉండాలి. అంటే నిరంకుశ పాలన, పన్నుల దోపిడీ, అధికారుల పెత్తనం, అంతు పొంతూ లేని సైనిక వ్యయం, యూరప్ స్టాక్‌మార్కెట్ రుణాలు రద్దు చేయాలి. సారాంశం, భూస్వామ్యం రద్దు, జార్ పాలన అంతం, ప్రజాస్వామ్యం.

ఈ రైతు సామాజిక కుదురు నుండే రష్యన్ కార్మిక వర్గం పుట్టింది. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానం ఎదుగుదల గురించి పరిశోధన చేసిన ఆస్ట్రియన్ సోషలిస్ట్ ఆర్. హిల్ఫర్‌డింగ్ (ఇతని సంస్కరణ వాదానికి వ్యతిరేకంగానే లెనిన్ తన ఇంపీరియలిజం హయ్యస్ట్ స్టేజ్ అఫ్ కాపిటలిజం) మాటల్లో ద్రవ్య, పారిశ్రామిక రూపంలో పెట్టుబడి ఎగుమతి మొదలైన తరువాత, ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడి విస్తరించింది. ప్రతి దేశంలో పెట్టుబడిదారీ విధానం స్వతంత్రంగా ఎదగకుండా, పెట్టుబడిదారీ సంబంధాలు, దోపిడీ, పెట్టుబడితో బాటు బయటి నుండి దిగుమతి చేయబడ్డాయి. అంతేకాదు పెట్టుబడి అభివృద్ధి చెందిన దేశాల్లో ఉన్న స్థాయిలో దిగుమతి చేయబడి, తన విప్లవాత్మక ప్రభావాన్ని అతి త్వరలో, అత్యంత బలంగా చూపిస్తుంది (ఫైనాన్స్ కాపిటల్, మార్క్సిస్ట్ ఇంటర్నెట్ ఆర్కివ్).

బలహీనమైన విదేశీ వ్యాపారం ఉన్న దశలో, రష్యాపై యూరప్ ప్రభావం ప్రధానంగా మిలిటరీ రూపంలో పడింది. తనకంటే వెనుకబడిన సమాజాలపై గెలవగలిగిన రష్యా పారిశ్రామిక రాజ్యాల ధాటికి నిలువ లేకపోయింది. క్రిమీయా యుద్ధంలో (1853 – 56) ఇంగ్లిష్, ఫ్రెంచ్ సైన్యాల రైఫిల్ తూపాకులు, లోహ యుద్ధ నౌకలు, టెలిగ్రాఫ్, యుద్ధ ఫోటోగ్రఫీ, రైల్వేలు, పెద్ద ఎత్తున అర్టిలరి ప్రయోగం వంటి వాటి ధాటికి పది లక్షల మంది రష్యా సైనికులు చనిపోయారు.

ఈ సందర్భంలో రష్యన్ రాజ్యం ముందు ఉన్న రెండు దారుల్లో మొదటిది, మాస్కో జార్ల ముందు లొంగిన తాతార్ రాజ్యంలా లొంగి పోవడం, లేదా తన ఆర్థిక ఎదుగుదల కంటే వేగంగా వ్యయం పెంచి ఉత్పత్తిలో సింహభాగం సైనిక, అధికార అవసరాలకు ఖర్చు చేయడం. రెండవదారీ ఎంచుకోవడంతో రాజ్యానికి పరిశ్రమలు, సాంకేతిక నైపుణ్యం కూడ అభివృద్ధి చేయవలసి వచ్చింది, సైనిక నిపుణులు, పాఠ్య పుస్తకాలతో బాటు ఫ్యాక్టరీలను కూడ రాజ్యం దిగుమతి చేసుకుంది.

భారీ పరిశ్రమల్లో లోహ, బొగ్గు, చమురు రంగాలు దాదాపు మొత్తం విదేశీ యాజమాన్యంలో స్థాపించబడ్డాయి. తేలిక పరిశ్రమలు అదే బాటలో నడిచాయి. రష్యాలోని షేర్లలో దాదాపు 40 శాతం విదేశీయుల యాజమాన్యంలో ఉండేవి. పెద్ద పరిశ్రమల్లో ఆ శాతం ఇంకా ఎక్కువ ఉండేది, ప్రధానంగా ఇంగ్లండ్, ఫ్రాన్స్, బెల్జియం, జర్మనీల యాజమాన్యంలో. (ఎ. రాబినోవిచ్, ది బోల్షివిక్స్ కం టు పవర్)

విదేశీ పెట్టుబడిదారులు, బట్టల, లోహ పరిశ్రమల్లో ఇంగ్లండ్, అమెరికాల నుండి ఫ్యాక్టరీలు నట్లు, బోల్టులతో సహా దిగుమతి చేశారు. ఒక జర్మన్ క్నోప్ సంస్థ మాత్రమే ఇంగ్లండ్ నుండి 122 బట్టల ఫ్యాక్టరీలు దిగుమతి చేసింది. బట్టల పరిశ్రమ పత్తి పంటతో నడపవచ్చు, కాని లోహ పరిశ్రమ ఎదగడానికి, బొగ్గు, రైలు మార్గాలు ఉండాలి. రష్యాలో, 1860లో 1600 కిలోమీటర్ల రైలు మార్గం ఉండగా, 1892-1901 నడుమ అది 26,000 కిలోమీటర్లకు పెరిగింది. రైల్వే నిర్మాణం స్వతహాగా ఇతర (బొగ్గు, ఉక్కు, టెలిగ్రాఫ్ వంటి) పరిశ్రమలకు ప్రోత్సాహం కల్పిస్తుంది.

1900-1910 నడుమ పరిశ్రమల ఎదుగుదలలో అమెరికా తరువాత రెండవ స్థానంలో రష్యా ఉండేది. అత్యంత ఆధునిక స్థాయిలోని భారీ పరిశ్రమల ప్రవేశంతో సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో 1880-1900 నడుమ కార్మిక జన సంఖ్య 82 శాతం, మాస్కోలో 51 శాతం పెరిగింది. 1914లో 50 శాతం పారిశ్రామిక కార్మికులు 500 మందికి పైగా సిబ్బంది ఉన్న ఫ్యాక్టరీలలో పనిచేసేవారు. దాదాపు 25 శాతం 1000 మందికి పైగా కార్మికులు ఉన్న సంస్థలలో ఉండేవారు. అంటే భారీ పారిశ్రామిక కార్మికుల సంఖ్య 20 లక్షల సమీపంలో ఉన్నప్పటికీ వారు ప్రధాన నగరాలల్లోనే కేంద్రీకృతమై ఉండేవారు. ఈ కేంద్రీకరణ వల్ల వారికి తమ సంఖ్యను మించిన బలం లభించింది. వారి జీవనం చూస్తే, 50 నుండి 100 శాతం లాభాలు సంపాదించే స్థాయిలో దోపిడీ సాగేది. రోజుకు 10 నుండి 14 గంటల పనికి పురుషులకు 60 కోపెక్కు, స్త్రీలకు 40 కోపెక్కల స్థాయిలో వేతనాలు, గాలి వెలుతురు, మురుగు నీటి పారుదల లేని ఇరుకు ఫ్యాక్టరీ వాడలలో నివసింప చేయడం వంటి యజమానుల దోపిడీ ఒక వైపు ఉంటే, సమ్మె చేస్తే, బహిరంగ సమావేశం జరిపితే పోలీసు, మిలిటరి దాడులు, కాల్పులు, బహిష్కరణ, సైన్యంలోకి పంపడం వంటి రాజ్య అణచివేత మరోవైపు ఉండేది.

ఈ పరిస్థితిలో రష్యా కార్మిక వర్గం అతి త్వరలో పశ్చిమ యూరప్‌లో అరుదుగా జరిగిన రాజకీయ సమ్మెను ప్రధాన పోరాట రూపంగా ఎంచుకుంది. సమ్మె హక్కు, పత్రికా స్వేచ్ఛా వంటివి లేని నిరంకుశ రాచరిక వ్యవస్థలో అత్యంత ఆధునిక స్థాయిలో పారిశ్రామికీకరణ జరగడంతోబాటు, బూర్జువా వర్గానికి రాచరికాన్ని ఎదిరించే బలం లేకపోవడంతో, పశ్చిమ యూరప్‌లో బూర్జువావర్గం నిర్వహించిన పౌర హక్కుల, భూసంస్కరణల, జాతుల స్వయం నిర్ణయం, రాజ్యాంగ సభ వంటి ఉద్యమాలను కూడా రష్యాలో కార్మిక వర్గమే నిర్వహించి ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిసారిగా రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించింది.

*(రచయిత సామాజిక కార్యకర్త, ఆస్ట్రేలియా)* వీ

# చావెజ్ దృఢమైన సామ్రాజ్యవాద వ్యతిరేకి

*చావెజ్ అవలంబించిన విధానాలనూ, వాటిపై వచ్చిన అభిప్రాయాలనూ, విమర్శలనూ విశ్లేషిస్తూ, ఆ విధానాలు సామ్రాజ్యవాద వ్యతిరేక విధానాలుగానే చూడాలని అంటున్నారు* **జి. సత్యనారాయణ రెడ్డి**

ఇటీవల మరణించిన వెనిజులా దేశాధ్యక్షుడు హ్యూగో చావెజ్‌పైన ప్రపంచ వ్యాప్తంగా విభిన్నమైన, పరస్పర విరుద్ధమైన అంచనాలతో కూడిన కథనాలు, వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ఆయన అనుసరించిన విధానాలను మార్క్సిస్టు – లెనినిస్టు దృక్కోణంలో ఏ విధంగా విశ్లేషించు కోవాలి? ఏ విధంగా విశ్లేషించడం సరైనదిగా ఉంటుంది? అనే దానికి ముందుగా ఆయనపై వ్యక్తమవుతున్న వివిధ అభిప్రాయాల గురించి క్లుప్తంగానైనా ప్రస్తావించాల్సిన అవసరం ఉంది. స్థూలంగా వాటిని అతి అంచనాలు, మిత అంచనాలు, తప్పుడు అంచనాలుగా పేర్కొనవచ్చు.

**అతి అంచనాలు**

ఆయన ఒక అసాధారణ కమ్యూనిస్టు అని, 'దక్షిణ అమెరికాలో రాలిన ఎర్రసూరీడు' అని అభివర్ణించడం, అలాంటి ఇతర అభిప్రాయాలు ఈ కోవకు చెందుతాయి. తాను కమ్యూనిస్టును కాదనీ, మార్క్సిజం తమ దేశానికి వర్తించదనీ, దక్షిణ అమెరికాను స్పెయిన్ వలస పాలన నుండి విముక్తి చేసిన సమైన్ బొలివర్ (1783 – 1830) తనకు ఆదర్శమనీ, ఆ అభిప్రాయాల ప్రకారమే, వాటి సాధన కోసమే తాను కృషి చేస్తాననీ కూడా ఆయన ఎలాంటి అస్పష్టతకు తావు లేకుండా ప్రకటించాడు. చివరి వరకు దాని కోసమే పాటు పడ్డాడు. అంత స్పష్టంగా తన అభిప్రాయాలను ప్రకటించాక కూడా ఆయనను, ఒక కమ్యూనిస్టుగా పేర్కొనడం అనేది పూర్తిగా స్వీయ మానసిక తత్వంతో కూడిన, చేసిన అంచనాగానే పేర్కొనవలసి ఉంటుంది.

**మిత అంచనాలు**

'చావెజ్ ఒక అసమగ్ర, అభివృద్ధి నిరోధక, అశాస్త్రీయ భావాలతో కూడిన కొంత మెరుగైన పాలన ఇవ్వడానికి ప్రయత్నించిన ఒక మామూలు సంస్కరణ వాది మాత్రమే' ననేది మరో అభిప్రాయం. ఇది ఆయన నిర్వహించిన పాత్రను పూర్తిగా తగ్గించి చూపడం మాత్రమే అవుతుంది. ఈ అభిప్రాయాలు కలవారు ఆయన మతపరమైన విశ్వాసాలను, ఆయనలోని ఇతర అశాస్త్రీయమైన అభిప్రాయాలనే ముఖ్యమైనవిగా భావిస్తున్నారు. ఆయన నిర్వహించిన, ప్రాముఖ్యతగల సామ్రాజ్యవాద వ్యతిరేక, ప్రత్యేకించి అమెరికన్ అగ్రరాజ్య వ్యతిరేక పాత్రను, దాని కోసం ఆయన సల్పిన పోరాటాన్ని వారు పరిగణనలోకి తీసుకోవడం లేదు. ఆ విధంగా చేయడం ఆయన పాత్రను తగ్గించడంతో పాటుగా వక్రీకరించడమే అవుతుంది.

**తప్పుడు అభిప్రాయాలు**

ఆయనొక సోషల్ ఫాసిస్టనీ, ఆయన ప్రకటించిన సోషలిజం, సామ్రాజ్యవాద వ్యతిరేకతలు కేవలం ముసుగులు మాత్రమేననీ, ఆయన అనుసరించిన సంస్కరణ వాదం చాలా ప్రమాదకరమైనదనేది మూడో కోవకు చెందిన అభిప్రాయం. జర్మనీలో నాజీలు తమను తాము నేషనల్ సోషలిస్టులమని పిలుచుకొన్నట్లుగానే చావెజ్ బొలివారియన్ సోషలిస్టు అని పిలిపించుకొన్నాడనే వరకూ కూడా ఈ విమర్శలు విస్తరించాయి. మార్క్సిస్టు–లెనినిస్టులుగా–మావోయిస్టులుగా చెప్పుకొనే వారిపై అభిప్రాయాలు చావెజ్ పాత్రలు వాస్తవంగా మార్క్సిస్టు – లెనినిస్టు దృక్పథంతో అంచనా వేయడం లేదు. అవి స్వీయ మానసికతత్వంతోనూ, దురభిప్రాయాలతోనూ ఏర్పరుచుకొన్న అంచనాలుగానే భావించవలసి ఉంటుంది. ఒక వ్యక్తి, దేశాధినేత అమలు జరిపిన విధానాలపై భావాన్ని, ఫలితాలను మొత్తంగా ఆయన ఆచరణను అంచనా కట్టడానికి రెండు కొలమానాలను ప్రామాణికంగా తీసుకోవాలి. సామ్రాజ్యవాదం, ముఖ్యంగా అమెరికన్ అగ్రరాజ్యం, దేశంలోని దోపిడీ వర్గాలు ఒక పక్క, మరోపక్క దేశ ప్రజలు చావెజ్‌పైన ఎలాంటి అభిప్రాయాలు వ్యక్తం చేసారు? వారు వివిధ క్లిష్ట సందర్భాల్లో ఏమి చేసారు? ఏ విధంగా స్పందించారు? అనేవే ఆ రెండు కొలమానాలు. ఈ కొలమానాలను ప్రాతిపదికగా చేసుకొని వెనిజులాలోని గత పద్నాలుగు సంవత్సరాల పరిణామాలను గనుక బేరీజు వేసుకొంటే చావెజ్‌పైన మార్క్సిస్టు – లెనినిస్టులుగా చెప్పుకొంటున్నవారి పై అభిప్రాయాలు ఎంత తప్పో స్పష్టమవుతుంది.

**చావెజ్‌ను సోషల్ ఫాసిస్టు అనడం ఎట్లా చెల్లుబాటవుతుంది?**

ఈ కింద పేర్కొన్న వాస్తవాలు ఈ అభిప్రాయం ఏ విధంగా తప్పో స్పష్టం చేస్తాయి.

1) దేశానికి నూతన రాజ్యాంగం అవసరమా కాదా అనే దానిపైన చావెజ్ ప్రజాభిప్రాయ సేకరణను (రెఫరెండం) జరిపించాడు. దేశ ప్రజల్లో 72 శాతం మంది అది అవసరమేననే తప్పు అభిప్రాయంగా దాన్లో స్పష్టం చేశారు.

2) ఆ వెను వెంటనే రాజ్యాంగ సభ ఏర్పాటుకై చావెజ్ ఎన్నికలు జరిపించాడు. చావెజ్, ఆయన మిత్రపక్షాల వారు పోటీ చేసిన వాటిలో 95 శాతం స్థానాలను గెలుచుకొన్నారు.

3) అధ్యక్షుడిని వెనక్కి పిలిపించే హక్కు (రీకాల్ హక్కు) ను కూడా పొందుపరుస్తూ 1999లో 350 అధికరణలతో కూడిన ఒక నూతన రాజ్యాంగాన్ని దేశానికి అందించాడు చావెజ్.

4) ఆ రాజ్యాంగం ప్రకారం వెంటనే తిరిగి ఎన్నికలు జరిపించాడు (జూలై 30, 2000). ఆ ఎన్నికల్లో ఆయన కూటమి 2/3వ వంతు స్థానాలను గెలుచుకుంది.

5) నిరంకుశ కార్మిక నాయకులను అదుపులో పెట్టే లక్ష్యంతో కార్మిక సంఘాలకు చట్టబద్ధంగా ఎన్నికలు జరగాలన్న నిబంధనలను రూపొందించి వాటిని అమలు జరిపించాడు. తద్వారా ట్రేడ్ యూనియన్ ప్రజాస్వామ్యాన్ని బలోపేతం చేశాడు.

చావెజ్ కమ్యూనిస్టు కాడనేది నిర్వివాదాంశం. అందువలన పైన చర్యలన్నీ సోషలిస్టు ప్రజాస్వామ్యంలోనో, నూతన ప్రజాస్వామ్యంలోనో ఒక భాగం కావనేది స్పష్టమే. ఆయన అమలు జరిపిన పైన పేర్కొన్న అయిదు ముఖ్యమైన చర్యలన్నీ బూర్జువా ప్రజాస్వామ్య పరిధిలోనివే. అయినా వాటికి కచ్చితమైన ప్రజాస్వామిక స్వభావం ఉంది. రీకాల్ హక్కును (అధ్యక్షుడిని వెనక్కి పిలిచే హక్కు) రాజ్యాంగంలో చేర్చడమే గాకుండా తన ప్రత్యర్థులను 'సుమాటే' అనే స్వచ్ఛంద సంస్థ పేరుతో తన రికాల్‌కు డిమాండ్ చేస్తే, దానిపైన చావెజ్ ఎన్నికలు నిర్వహించాడు. చావెజ్‌ను దించి వేయవద్దనీ, ఆయనే అధ్యక్షుడిగా కొనసాగాలనీ ఆ ఓటింగ్‌లో పాల్గొన్న 59 శాతం మంది ప్రజలు కోరారు. ఆ ఎన్నికను అమెరికా మాజీ అధ్యక్షుడు జిమ్మి కార్టర్ నేతృత్వంలోని సంస్థ న్యాయమైనదిగా ప్రకటించింది. చావెజ్ పైన పేర్కొన్న విధంగా స్పష్టమైన ప్రజాస్వామిక విధానాలను అమలు జరపగా, ఆయన్ను ఒక సోషల్ ఫాసిస్టుగా పేర్కొనడం వాస్తవాలకు విరుద్ధమైన ఒక వ్యతిరేక, ప్రతికూల (నెగెటివ్) అభిప్రాయమనేది స్పష్టం.

చావెజ్‌తో పాటుగా లాటిన్ అమెరికా దేశాల్లోని మరికొందరు దేశాధ్యక్షులు 'పింక్ విప్లవం' పేరుతో అనుసరిస్తున్న విధానాలను ఏ విధంగా, ఏ దృక్పథంతో అర్థం చేసుకోవాలి? మావో రూపొందించిన మూడు ప్రపంచాల సిద్ధాంతం వెలుగులో మాత్రమే ఈ పరిణామాన్ని సరిగానూ, శాస్త్రీయంగానూ మనం అర్థం చేసుకోగలుగుతాం. ఆ మూడు ప్రపంచాల సిద్ధాంతం అంటే ఏమిటి? దాని సారాంశం ఏమిటి? 1974 ఫిబ్రవరిలో ఒక మూడవ ప్రపంచ దేశానికి చెందిన నాయకునితో మాట్లాడుతూ మొదటిసారి మావో దాని గురించి ఈ కింది విధంగా వివరించాడు.

ప్రపంచంలోని దేశాలను మూడు కేటగిరీలుగా విభజించాలి. అమెరికా, సోవియట్ యూనియన్‌లను మొదటి ప్రపంచం గానూ, జపాన్, ఐరోపా, కెనడా దేశాలను రెండవ ప్రపంచంగానూ, జపాన్ మినహా ఆసియా ఖండాన్ని, ఆఫ్రికా, దక్షిణ అమెరికా ఖండాల్లోని దేశాలను మూడవ ప్రపంచంగా ఆయన పేర్కొన్నాడు. ప్రపంచంపై ఆధిపత్యం చెలాయిస్తున్న అగ్రరాజ్యాలైన అమెరికా, సోవియట్ యూనియన్‌లకు వ్యతిరేకంగా మూడవ ప్రపంచ దేశాలు ప్రధానమైన శక్తిగా, రెండవ ప్రపంచ దేశాలను కూడా కలుపుకొని ప్రపంచ వ్యాప్తంగా ఒక విశాలమైన ఐక్య సంఘటన నిర్మాణానికి పూనుకోవాలి, కృషి చేయాలి. ఆ విధంగా సాగే అగ్రరాజ్య వ్యతిరేక పోరాటం, అగ్రరాజ్యాలను తద్వారా మొత్తంగా సామ్రాజ్యవాదాన్ని బాగా బలహీనపరుస్తుంది. అది ప్రపంచంలో విప్లవాన్ని ముందుకు తోసుకు వెళ్లడంతో సానుకూలమైన పాత్రను నిర్వహిస్తుంది. ఇదీ ఆ సిద్ధాంతపు సారాంశం.

ప్రపంచాన్ని పై విధంగా విభజించే సిద్ధాంతం ద్వారా మావో నేటి ప్రపంచ భౌతిక వాస్తవాలను మార్క్సిస్టు – లెనినిస్టు దృక్పథంతో మదింపు చేసాడనేది స్పష్టమే. ఆ తర్వాత మారిన ప్రస్తుత పరిస్థితుల్లో అమెరికా ఆధిపత్య, యుద్ధ విధానాలకు వ్యతిరేకంగా విస్తృత ప్రాతిపదికపైన ఐక్య సంఘటన ఏర్పాటుకు ఈ సిద్ధాంతం ఒక శక్తిమంతమైన సాధనంగా ఉపయోగపడుతుంది. ప్రస్తుతం అమెరికాకు వ్యతిరేకంగా ప్రపంచంలోని దేశాలన్నింటినీ ఐక్యం చేసే ఎత్తుగడలను అనుసరించవలసిన అవసరం ఉంది. ఇప్పటికే బలహీనపడుతున్న అమెరికా అగ్రరాజ్యం రానున్న రోజుల్లో మరింతగానూ, మరింత వేగంగానూ బలహీన పడుతుంది. సామ్రాజ్యవాదానికి నాయకుడిగా ఉంటున్న అమెరికా అగ్రరాజ్యం బలహీనపడింది అంటే మొత్తంగా సామ్రాజ్యవాదమే బలహీనపడడం అవుతుంది. ఈ పరిస్థితుల్లో మార్క్సిస్టు – లెనినిస్టు విప్లవ శక్తులతో పాటుగా, మూడవ ప్రపంచ దేశాలు, ఆయా దేశాల్లోని ఇతర స్వతంత్ర శక్తులు (ఫోర్సెస్ ఆఫ్ ఇండిపెండెన్స్) బాగా అభివృద్ధి చెంది బలపడడానికి అది తోడ్పడుతుంది. వెనిజులాలో, దక్షిణ అమెరికా ఖండంలో, మొత్తంగా ప్రపంచంలోని పరిణామాలను మనం ఈ వెలుగులోనే అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది.

ఈ దృక్కోణం నుండి కాకుండా చావెజ్‌కు మత విశ్వాసాలున్నాయనీ, ఆయనొక సంస్కరణవాదనే కోణాల్లో ఆలోచించేవారు, అంచనా కట్టే వారు రాజకీయంగా తప్పు చేస్తున్నట్లుగా భావించాల్సి ఉంటుందనేది స్పష్టమే. ఈ కింద పేర్కొన్న విషయం దానినే మరింతగా బలపరుస్తుంది.

'కార్మికవర్గం తప్పనిసరిగా పీడిత జాతులతో సమైక్యం కావాలనే లెనిన్ సూత్రీకరణను స్టాలిన్ కొనసాగిస్తూ వచ్చాడు. జాతీయ విముక్తి యుద్ధంలో వాటి పరిస్థితి, రాజకీయ దృక్పథాలు వేరుగా ఉన్నప్పటికీ, సామ్రాజ్యవాద దురాక్రమాలను వ్యతిరేకించే అన్ని శక్తులను కలుపుకు రావాలని ఆయన (స్టాలిన్) సూచించాడు. అఫ్ఘనిస్తాన్‌కు చెందిన అమీర్ స్వదేశంలో రాజరిక వ్యవస్థనే అంటిపెట్టుకొన్నప్పటికీ, ఈజిప్టు జాతీయోద్యమ నాయకులు బూర్జువా వర్గానికి చెందిన వారు సోషలిస్టు వ్యతిరేకులయినప్పటికీ ఆ దేశాల స్వాతంత్ర్యం కోసం వారు సాగిస్తున్న పోరాటాలు విప్లవ పోరాటాలే. ఎందుకంటే అవి సామ్రాజ్యవాదాన్ని బలహీనపరిచి, నాశనం చెయ్యడానికి ఉపయోగపడ్డాయి' మావో మూడు ప్రపంచాల సిద్ధాంతంపై 'పీపుల్స్ డైలీ' సంపాదకీయం, 31 అక్టోబర్ 1977.

మావో ఆ తర్వాత కాలంలో మూడు ప్రపంచాల విభజనను ఒక సమగ్రమయిన సిద్ధాంత స్థాయికి అభివృద్ధి చేసినప్పటికీ లెనిన్, స్టాలిన్‌లు అంతకు ముందే మౌలికంగా ఆ దృక్పథాన్నే కలిగి ఉన్నారనీ, ఆ వైఖరితోనే ప్రపంచంలోని వివిధ పరిణామాలను విశ్లేషించారనీ పై పేరాలో పేర్కొన్న విషయం స్పష్టం చేస్తుంది. ఆయా దేశాల్లోని సాంఘిక వ్యవస్థలు రాజరికాలయినా, బూర్జువా పాలనలో ఉన్నా కూడా సామ్రాజ్యవాదానికి, ప్రత్యేకించి అగ్రరాజ్య ఆధిపత్య విధానాలకు వ్యతిరేకంగా అవి నిర్వహించే పాత్రను బట్టి వాటిని అంచనా కట్టాలనేదే పై వివరణ సారాంశం. ఆ ప్రాతిపదికపై ఆలోచించినప్పుడు చావెజ్ రోమన్ కాథలిక్కనీ, ఆయనకు మతపరమైన విశ్వాసాలు ఉండడాన్ని పక్కనబెట్టి, ఆయన నిర్వహించిన అమెరికా అగ్రరాజ్య వ్యతిరేక పాత్రనే ప్రధానంగా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది.

సామ్రాజ్యవాదుల, దేశంలోని వారి దళారుల, భూస్వాముల

ప్రాబల్యం తగ్గించడం కోసం చావెజ్ 2001, 2002 సంవత్సరాల్లో అనేక కీలక నిర్ణయాలు తీసుకొని, వాటి అమలు కోసం చర్యలు చేపట్టాడు. చమురు వనరుల స్వాధీనం, భూసంస్కరణలు, అనేక ఇతర సంక్షేమ చర్యల ద్వారా ప్రజల జీవన స్థాయిని గణనీయంగా ఆయన మెరుగు పరిచాడు. ప్రభుత్వ వ్యయంతో విద్య, వైద్య సౌకర్యాలను విస్తరింప జేసాడు. యూనివర్సిటీ స్థాయి వరకూ ఉచిత విద్య సౌకర్యాన్ని కలిగించాడు.

**చావెజ్‌పై అంచనాకు ముఖ్యమైన రెండు కొలమానాలు**

దేశంలోని దోపిడీ వర్గాలు, సామ్రాజ్యవాదులు ఒకవైపు, ఆ దేశ ప్రజలు రెండవ వైపు తీసుకొనే వైఖరులను బట్టి ఆ ప్రభుత్వంపైనా, దాని నాయకుడిపైనా మౌలికంగా ఒక అంచనాకు రావచ్చును. చావెజ్ దేశంలోని దోపిడీ వర్గాలకు, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు వ్యతిరేకంగా వరసగా అనేక చర్యలు చేపట్టాడు. వాటి మూలంగా తమ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు దెబ్బతింటున్నాయనే ఉద్దేశంతోనే చావెజ్‌ను ఆ వర్గాలన్నీ కుట్రపన్ని 2002, ఏప్రిల్ 9న అరెస్టు చేసి జైల్లో పెట్టారు. దానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ప్రజలు ఒక వెల్లువలా కదిలి వీధుల్లోకి వచ్చారు. వారితోపాటుగా, చావెజ్ అనుకూలురైన సైన్యంలోని ఒక భాగం ఆయన్ను జైలు నుండి విడిపించి అధ్యక్ష భవనాన్ని తిరిగి స్వాధీనం చేసుకొన్నారు. ప్రపంచ చరిత్రలో ఇది ఒక అరుదైన, అసాధారణమైన సంఘటన. వివిధ దేశాల్లో చావెజ్ లాంటి వారు అనేక మంది అంతకు ముందు కూడా ముందుకు వచ్చారు. నాజర్, సుకర్ణో, అలెండి, గడాఫి అలాంటి వారిలో కొందరు మాత్రమే. వారిలో అత్యధికులను ఆ దేశ పాలకవర్గాల, ముఖ్యంగా అమెరికన్ సామ్రాజ్యవాదుల సహాయ, సహకారాలతో చంపివేయగలిగారు. చావెజ్‌ను కూడా చంపాలనే దోపిడీ శక్తులు నిర్ణయించుకున్నాయి. కానీ ఆ ప్రయత్నంలో వారు విఫలమయ్యాయి. చావెజ్ అనుసరించిన విధానాలు వారిని ఆ ప్రయత్నంలో విఫలం చేసాయి. తన పద్నాలుగు సంవత్సరాల పాలన కాలంలో జరిగిన నాలుగు ఎన్నికల్లో చావెజ్ 53 నుండి 66 శాతం దాకా ఓట్లు పొందగలిగాడు. వీటన్నిటి పరాకాష్టగా ప్రజలు, సైన్యం ఆయన ప్రాణాలను కాపాడుకోగలగడం ప్రాముఖ్యత గల విషయం. చావెజ్ ప్రజా అనుకూల, దేశ అనుకూల సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని దీనిని బట్టే అంచనా కట్టవచ్చును.

వెనిజులా, దక్షిణ అమెరికాతో పాటు నేటి ప్రపంచ పరిణామాలను గమనిస్తే మూడవ ప్రపంచ దేశాలు, ప్రజలు సామ్రాజ్యవాదులను, అగ్రరాజ్య ఆధిపత్యాన్ని చూసి ఇంకెంత మాత్రం భయపడడం లేదు. మూడవ ప్రపంచ దేశాలను చూసి సామ్రాజ్యవాదులు, అమెరికా అగ్రరాజ్యమే భయపడుతున్నాయి. ఇది నేటి ప్రపంచపు ప్రాథమిక చారిత్రక ధోరణిగా స్పష్టంగా కనిపిస్తున్న ఒక భౌతిక వాస్తవం.

ఇరాక్, అఫ్ఘనిస్తాన్ యుద్ధాల్లో పీకలదాకా దిగబడిపోయిన అమెరికా అగ్రరాజ్యం ఆర్థికంగానూ, ఇతర విధాలుగానూ బాగా దెబ్బతిన్నది, బలహీనపడింది. ఇంకా పడుతున్నది. అంతకు పూర్వమే రష్యన్ అగ్రరాజ్యం దెబ్బతిని పోయి బాగా బలహీనపడింది. ఫ్రాన్స్, బ్రిటన్, జర్మనీ, జపాన్ సామ్రాజ్యవాద దేశాలు బాగా దెబ్బతిని పోయాయి. పై దేశాలన్నీ తమ ఆర్థిక ప్రయోజనాల పరిరక్షణ కోసం అమెరికా అగ్ర రాజ్యంతో పోటీ పడుతున్నాయి. (కొన్ని సందర్భాల్లో అవి అమెరికాతో కుమ్మక్కు అవుతున్నప్పటికీ వాటి మధ్య పోటీనే ప్రధానమైన విషయంగా ఉంటున్నది). మరోపక్క జనచైనా అన్ని విధాలుగా ముందుకు దూసుకొని వచ్చింది. మూడవ ప్రపంచ దేశాలకు అది నిజమైన మిత్రుడుగా, అమెరికా అగ్రరాజ్యానికి ఒక బలమైన సవాలుగా నిలుస్తోంది. బలహీన పడిన అగ్రరాజ్యంగా రష్యా తన ప్రయోజనాలను కాపాడుకోవడం కోసం అమెరికాతో పోటీ పడుతోంది. ఈ విధంగా అన్ని వైపుల నుంచి చుట్టి వేయబడిన అమెరికా అగ్రరాజ్యం ప్రపంచంపై తన ప్రాబల్యాన్ని, పట్టును రోజు రోజుకూ మరింతగా కోల్పోతూ ఒంటరిదైపోతోంది. ఈ క్రమం రాబోవు కాలంలో మరింత బలపడుతూందే తప్ప బలహీన పడదు. '1930, 40ల నాటికి తూర్పు దేశాల ఆధిక్యతను అంగీకరించడానికి పశ్చిమ దేశాలు సంసిద్ధంగా ఉండాలని' కొద్ది సంవత్సరాల క్రితం ప్రపంచబ్యాంకు మాజీ అధ్యక్షుడు ఉల్ఫెన్‌సన్ ప్రకటించాడు. ప్రస్తుత ప్రపంచ పరిణామాలు ఆ వైపుగానే సాగుతున్నాయనేది ఒక తిరుగులేని వాస్తవం.

**బలహీనపడుతున్న సామ్రాజ్యవాదం – అమెరికా అగ్రరాజ్యం**

ఈ పరిస్థితుల్లో అనేక మూడవ ప్రపంచ దేశాలు మరింతగా స్వాతంత్ర్యాన్ని ప్రదర్శించగలుగుతాయి. అన్ని విధాలుగా మరింతగా నిలదొక్కుకోవడానికి అవి ప్రయత్నిస్తున్నాయి. వరసగా సంభవించే ఇలాంటి ఆర్థిక, రాజకీయ మార్పులు ఆయా దేశాల్లోని వనరులను జాతీయ శక్తులను తమ చేతుల్లోకి తీసుకొనే క్రమం మరింత బలపడుతోంది. ఒకప్పుడు శాసించగలిగిన స్థితిలో ఉన్న విదేశీ గుత్త సంస్థలు తమ ప్రాబల్యాన్ని ఒకటి తర్వాత ఒకటి ఒదులుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. అదంతా కూడా జనరల్‌గా సామ్రాజ్యవాదం, ప్రత్యేకించి అమెరికా అగ్రరాజ్యం మరింతగా బలహీనపడడానికి, దెబ్బ తినిపోవడానికే దారితీస్తోంది. ఈ పరిణామమంతా ప్రపంచ విప్లవ పురోగమనానికి సానుకూలమైన నేపథ్యాన్ని సమకూర్చడానికి తోడ్పడుతుందనేది స్పష్టమే.

భారతదేశం కూడా మూడవ ప్రపంచానికే చెందిన దేశం. అయితే భారత పాలకులు మాత్రం సామ్రాజ్యవాదులకు కల్తీలేని దళారులుగా ఉంటూ వస్తున్నారు. ప్రపంచంపై ఆధిపత్యం నిలుపుకోవడానికి ప్రయత్నిస్తున్న అమెరికా అగ్రరాజ్య విధానాలతో వారు పీఠముడి వేసుకొని దానిలో భాగం కోసం, ప్రాంతీయ ఆధిపత్యం కోసం చుట్టుపక్క దేశాలపై పెత్తనం కోసం పాకులాడుతున్నారు. అందువలన ఈ పరిణామంతో భారత పాలకుల పాత్ర పూర్తిగా ప్రతికూలం (నెగెటివ్) గానే ఉంటుంది. భారతదేశంలోని కమ్యూనిస్టు విప్లవకారులూ, స్వాతంత్ర్య శక్తులూ, దేశభక్తి కలవారందరూ కూడా భారత పాలకుల అమెరికా అగ్రరాజ్య అనుకూల విధానాలకు వ్యతిరేకంగా పోరాడడానికి ముందుకు రావాలి. అమెరికా ఆధిపత్యాన్ని దెబ్బకొట్టే కృషిలో వారు తమ వంతు పాత్రను నిర్వహించడానికి మరింతగా నడుం బిగించాలి. హ్యూగో చావెజ్ కృషి, ఆచరణ నుండి వారు అలాంటి స్ఫూర్తిని పొందాలి.

*(రచయిత 'పోరు నేల' ప్రచురణ సంస్థ సంపాదకులు)* వీ

*(…4వ పేజీ తరువాయి)*

వాసులకు మేము నాగరికత నేర్పుతామని బ్రిటిష్ యూరోపియన్ సమాజం అనాగరికంగా వలసలు ఏర్పాటు చేసుకొని, కట్టు బానిసలుగా చేసుకొని, ఎదురు తిరిగిన వారిని అమానుషంగా, క్రూరంగా చంపివేసినటువంటి అనాగరిక ప్రపంచ సమాజం నుండి నేటి నాగరికత ప్రపంచానికి పెద్దన్నగా (ఐక్య రాజ్య సమితిలోని ఐదు శాశ్వత సభ్య దేశాలలోని ప్రముఖ దేశం), ప్రపంచ పోలీసుగా కరుడుగట్టిన సామ్రాజ్యతత్వంలో భాగంగానే ఒక సద్దాం హుస్సేన్, ఒక బిన్ లాడెన్, ఒక గడాఫీ విచారణ లేకుండా అతి క్రూరంగా బలి అయినారు. వారి శవాల మీదుగా ప్రపంచ ఉగ్రవాదాన్ని నిర్మూలించి, ప్రపంచ శాంతిని కాపాడుతున్నామంటూనే, ప్రపంచ అశాంతికి అగ్నికి ఆజ్యం పోస్తున్నది నేటి అగ్రదేశం. అలాంటి దేశాలు ప్రపంచంలో పురుడు పోసుకోకముందే భారత ఖండ యవనికపై వైదిక నాగరికత ఆర్యుల కాలం నుండి బుద్ధుడు, అశోకుడు వారసత్వం నుండి గాంధీ గారి సత్యం, అహింస గురించి మన దేశ గొప్ప ఔన్నత్యం, ప్రపంచంలో అతి పెద్ద పార్లమెంటరీ ప్రజాస్వామ్య దేశంగా వెలుగొందుతున్న మన దేశంలో 'ఉరిశిక్ష రద్దు' గురించి జరుగుతున్న చర్చ ఎంతో ఆహ్వానించదగ్గ పరిణామం. ప్రస్తుత తరుణంలో ఇలాంటి ఆలోచనాత్మక మైన వ్యాసాలు ప్రచురిస్తున్న వీక్షణం పత్రికకు సర్వదా ధన్యవాదాలు.

**– *గాడిపల్లి కేశవరెడ్డి***
*సిద్ధిపేట, మెదక్*

**తె**లంగాణ ప్రత్యేక రాష్ట్రం వల్ల సర్వ సమస్యలు పరిష్కారమయ్యి భూలోక స్వర్గం ఏర్పడుతున్నట్లు ఎడ్ల పోచయ్య భావిస్తున్నట్లున్నారు. అరవై ఏండ్లుగా తెలంగాణ ప్రజల్లో ప్రత్యేక రాష్ట్ర కాంక్ష ఉందని ఆయన అభిప్రాయం. మీరు అభిప్రాయ పడుతున్నట్లుగా 1952కు ముందే ఆంధ్రా వారి దోపిడీ తెలుసా, నైజాం పాలన కంటే విశాలాంధ్ర వల్ల ఇంకా దోపిడీ జరుగుతోందని మీ ఊహ చాల గొప్పది. ఇక 2009 డిసెంబర్ 9న, డిసెంబర్ 23 కేంద్ర ప్రకటన నమ్మక ద్రోహంగా చెప్పారు. మరి కెసిఆర్ ఎన్ని రకాల ముహూర్తాలు, తేదీలు, ఆయన మాటలు, చేష్టలు. ఆయన, ఆయన కుటుంబ సభ్యుల రాజకీయ మాటలు ఏ మాత్రం తెలంగాణ ప్రజలకు చెడ్డగా కనిపించవా, వినిపించదా? ఇక రాయలసీమకు సంపన్న, స్వార్థ రాజకీయాల వల్ల ఎలా ప్రత్యేక తెలంగాణ రాకుండా అడ్డం పడుతున్నదో ఆయన పూర్తిగా వివరించి ఉండాలి. రాయలసీమలో తాగడానికి నీరు లేదు, సాగు నీరు లేదు. ఇక వెయ్యి మంది పనిచేసే ఒక్క పరిశ్రమ లేని ఈ ప్రాంతం వారు తెలంగాణను ఎలా దోపిడీ చేస్తున్నారు?

ఆయన ప్రమాదాలు – వివరణ 1) వాయిదాలకు బలికానున్న ఉద్యమం – వాయిదాలు లేకుండా ఒకేసారి హోల్‌సేల్‌గా ప్రత్యేక రాష్ట్రం లేదా దేశం ఏర్పాటు చేస్తుంటే ఎవరు అడ్డుపడుతున్నారు?; 2) నిరాశ వ్యాపించడం – అరవై ఏండ్లుగా చేస్తున్న ఉద్యమం ఇప్పుడు ఎందుకు నిరాశకు గురవుతోంది. మీ మీద మీకు నమ్మకం లేదు. ఉద్యమాల్లో నిజాయితీ ఉంటే నిరాశ ఎలా ఏర్పడుతుంది; 3) అనైక్యత ప్రబలడం – ప్రజల్లో బలంగా కాంక్ష ఉందని మీరే అంటున్నారు. మరి అనైక్యత ఎలా? ఇపుడే ఇలా ఉంటే, ప్రత్యేక రాష్ట్రం ఏర్పడ్డాక ఐక్యత వస్తుందా; 4) మతోన్మాదం పెచ్చరిల్లడం – తెలంగాణ మతోన్మాదంతోనే ఇంత వరకు సాగింది. నిజాం పాలన పూర్తిగా మతాలను ఆదరించి, లౌకిక రాజ్యంగా ఉండేదా. భారతదేశం కులం, మతం, ప్రాంతీయ వాదాలతో అడుగడుగునా దగాకు గురవుతున్నది; 5) ఎన్నికల రాజకీయాల మాయ – మరి గత పదేండ్లుగా ఎన్నికల ద్వారా తెలంగాణ బలం ఏమిటో పదే పదే ఎన్నికలు నిర్వహిస్తూ మీ బల ప్రదర్శన నిరూపించు కుంటున్నారు కదా. మరి ఎన్నికలను ఎందుకు వ్యతిరేకించరు; 6) నాయకత్వ విద్రోహం – మీకు నాయకత్వం మీద కూడ నమ్మకం లేనట్లు ఉంది. మరి పోరాటాలు ఎలా చేస్తారు. మరో నాయకత్వం ఎలా ఉంటుందో. ఎలాంటి రాజకీయ నాయకులను మీరు విశ్వసిస్తారో తెలిపి ఉంటే బాగుండేది; 7) సరైన పోరాట రూపాలు చేపట్టలేని స్థితి – సరైన పోరాటాలు లేనపుడు, ఉద్యమాలు ఎందుకు. ప్రత్యేక రాష్ట్రం ఎందుకు. గడచిన పదిహేనేండ్లలో తెలంగాణలోని మేధావులు, కవులు, రచయితలు ప్రత్యేక తెలంగాణ ధ్యేయంగా భావిస్తున్నారు. వీరికి ప్రత్యేక తెలంగాణ వల్ల వచ్చే ప్రయోజనాలు ఏమిటి, ఏ విధంగా అభివృద్ధి సాధిస్తారు. కులం, మతం లేని కేంద్రం ఏర్పాటు చేస్తారా? మూఢ నమ్మకాలు, మద్యపాన నిషేధం, దోపిడీ లేని వ్యవస్థ, పెత్తందార్ల దోపిడీ ఎదుర్కొంటారా? అందరికి ఉద్యోగం, అందరికి ఉపాధి సాధిస్తారా? లంచాలు లేని, న్యాయమైన పాలన అందిస్తారా? తాగడానికి నీరు లేదు, సాగునీరు లేదు. కులం, మతం, మూఢనమ్మకాల నిరోధం కోసం ఎందుకు పోరాటం చేయరు? 70 శాతం మందికి మంచి తిండి, వసతులు లేక ఎన్నో వ్యాధులతో నలిగిపోతున్నారు. వారి గురించి మాట్లాడరు. పోరాటం చేయరు. భయంకరమైన కులం, మతం, ప్రాంతీయ వాదాల వల్ల మానవాళి ఎంత ఘోరంగా నాశనమైపోతున్నదో వారి గురించి, మీరు ఎందుకు నోరు మెదపరు. మేధావులు సర్వమానవాళికి ప్రయోజనం కొరకు పాటుబడాలి. ఇక తెలంగాణ మేధావులు మాత్రం అందుకు విరుద్ధంగా ఉన్నారు. ఎందుకంటే, ఆంధ్రప్రదేశ్ ఎన్ని రాష్ట్రాలుగా విడిపోవాలి, ఎలా విడిపోవాలి అనే విషయం ఇంత వరకు ఆ మేధావులు సూచించ లేదు. మేధావులకు స్వార్థం ఉండదు. అయితే మీరు రాయలసీమ, ఉత్తరాంధ్రతో మాకేమిటని ప్రశ్నిస్తున్నారు. మీరు మేధావులా? హైదరాబాద్‌లో గత పదిహేనేండ్లుగా పరిశ్రమలు, ప్రైవేట్, పబ్లిక్ రంగాలు ఏర్పాటు చేస్తుంటే ఎందుకు తెలంగాణ వారు వ్యతిరేకించలేదు. ఇది మీ స్వార్థం కాదా? మానవత్వం ఉన్న వారైతే రాయలసీమలో పరిశ్రమలు ఏర్పాటు చేయండి. మాకు అవసరం లేదని చెప్పవచ్చు కదా. మంచి వ్యవస్థ కోసం పోరాటం చేయండి. మనుషులంతా ఒకటే అనే భావనతో ఉండండి. కులం, మతం, ప్రాంతీయ వాదాలతో మనుషుల మధ్య చిచ్చు లేపకండి. తిండి లేక ఎందరో ఆకలి మంటల్లో మాడిపోయే వారి కోసం పాటుపడండి. ఉద్యమాల పేరుతో అమాయక ప్రజల, యువకుల ప్రాణాలు తీయకండి.

**– *మరకా సూర్యనారాయణ రెడ్డి***
*పులివెందుల, కడప*

**డా.** పున్నయ్య చావెజ్ మీద రాసిన రెండు పేజీల వ్యాసంలో రెండు పేరాలు కేవలం దేశదేశాల నాయకులు ఆయన్ను గురించి ఏమి అన్నారో చెప్పారు. పుతిన్, మన్మోహన్ సింగ్ లాంటి నయా ఉదారవాద, ప్రపంచీకరణ విధానాల నాయకులు చావెజ్ గురించి మాట్లాడితే దాంట్లో లాంఛనం తప్ప నిజాయితీ ఆశించలేం. ఇక చావెజ్ తరువాత వెనిజులా ఎటు వైపు అన్నది ప్రధానం. దాని గురించి విశ్లేషిస్తే మంచిది. చావెజ్‌ను స్టాలిన్‌తో పోల్చడం కూడా ప్రశ్నించవలసిన విషయం. చైనా–అల్బేనియాతో కూడి – కృశ్చేవ్ మీద చేసిన విమర్శను విమర్శ లేకుండా స్వీకరించే ధోరణి భారతీయ వామపక్షంలో ఉంది. కృశ్చేవ్ రివిజనిజం కంటే ముందే స్టాలిన్ 'ఒక దేశంలో సామ్యవాదం' నినాదాన్ని, మూడవ అంతర్జాతీయాన్ని మూసివేయడాన్ని, కార్మిక వర్గ ప్రజాస్వామ్యం గురించి భారతీయ వామపక్ష వాదులు విశ్లేషించిన దాఖలాలు లేవు.

**– *కె. నరేంద్రమోహన్***
*(వీక్షణం బ్లాగ్ www.veekshanam.wordpress.com పై పోస్ట్ చేసిన వ్యాఖ్య)*

**వి**ప్లవోద్యమాలు ప్రత్యామ్నాయం కాదు, పూర్తిగా కొత్తవి భిన్నమైనవీను. వీక్షణం పత్రికలో విప్లవోద్యమాలు చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాల గురించి 'ప్రత్యామ్నాయ ఆర్థిక వ్యవస్థ నిర్మాణం', 'ప్రత్యామ్నాయపు అభివృద్ధి నమూనా' అని రాస్తున్నారు. ప్రత్యామ్నాయం అంటే ఒక దానికి బదులుగా మరొకటి అనే అర్థం వస్తుంది. ఈ అర్థంలో ఆ ఒకటి, దానికి బదులుగా వచ్చే మరొకటి కూడా సమాన విషయాలే అవుతాయి. ఒకటి లేకున్నా మరొక దానితో పని పూర్తి చేయవచ్చు. ఒకటి లేకున్నా దాని ప్లేస్‌లో మరొక దాన్ని నిలబెట్టవచ్చు అనే అర్థంలోనే ప్రత్యామ్నాయం అనే పదం వాడబడుతున్నది. ఒక విషయానికి ప్రత్యామ్నాయం లేదు అనే సందర్భంలో ఫలానా విషయం ప్రత్యామ్నాయం అవుతుందని చెప్పినప్పుడు కూడా మొదటి విషయం పాత్రను రెండవ విషయం కూడా నిర్వహించగలుగుతుంది అనే అర్థం మాత్రమే వస్తుంది. మొదటి విషయం కంటే రెండవ విషయం మరింత ఉన్నతమైనది, నూతనమైనది, భిన్నమైనది అయినప్పుడు రెండవ విషయాన్ని ప్రత్యామ్నాయం అనరు. పాతదైన, కాలం చెల్లిన మొదట విషయాన్ని స్థానభ్రంశ మొందించి ఆ ప్లేస్‌ను వినూత్నమైన కర్తవ్యాలను నిర్వహించగలిగిన మరొక నూతన విషయం ఆక్రమించు కోవడం ఒక చారిత్రక కర్తవ్యం మాత్రమే అవుతుంది కాని ప్రత్యామ్నాయం అనరు. విప్లవోద్యమాలు నిర్మాణం చేస్తున్నది అర్ధ భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలకు ప్రత్యామ్నాయంగా అటువంటివే అయిన మరే ఇతర ఉత్పత్తి సంబంధాలను నిర్మాణం చేయడం లేదు. దానికి బదులుగా అర్ధ భూస్వామ్య సంబంధాలను ధ్వంసం చేస్తూ వాటిని నెట్టి వేస్తూ పూర్తిగా నూతన మైనవి, భిన్నమైనవి అయిన ఉత్పత్తి సంబంధా లను నెలకొల్పడానికి ప్రయత్నం జరుగుతుండ వచ్చు. కానీ ప్రత్యామ్నాయం కాదు.

**– పాపన్న**
*(వీక్షణం మెయిల్‌కు వచ్చిన ఉత్తరం, వివరాలు లేవు)*

## భుల్లార్‌కు ఉరిశిక్ష సమంజసమే : సుప్రీం

1993 కారు బాంబు కేసులో ఉరి శిక్ష పడి 18 ఏళ్ల జైలు జీవితం గడిపిన కారణంగా, తనకు విధించిన మరణశిక్షను జీవితఖైదుగా మార్చాలని ఖలిస్థాన్ మిలిటెంట్ దేవిందర్‌పాల్ సింగ్ భుల్లార్ సుప్రీం కోర్టులో దాఖలు చేసిన పిటిషన్‌ను ఏప్రిల్ 12న జస్టిస్ సింఘ్వీ, జస్టిస్ ఎస్.జె. ముఖోపాధ్యాయలతో కూడిన ధర్మాసనం కొట్టివేసింది. శిక్ష అమలులో ఆలస్యం జరిగినంత మాత్రాన ఉరిశిక్షను జీవిత ఖైదుగా మార్చలేమంది. ఈ తీర్పు పై భుల్లార్ భార్య స్పందిస్తూ 1984 సిక్కు వ్యతిరేక అల్లర్లకు బాధ్యులైన కిషోర్‌లాల్, జగదీష్ టైట్లర్, సజ్జన్ కుమార్ లకు శిక్ష ఎందుకు పడడం లేదని ప్రశ్నించారు.

## చత్తీస్‌గడ్‌లో ఎన్‌కౌంటర్

చత్తీస్‌గడ్‌లోని సుక్మాజిల్లా పరిధిలోని కుమ్మరితోగు ప్రాంతంలో ఏప్రిల్ 16న పోలీసులకు, మావోయిస్టులకు మధ్య జరిగిన కాల్పుల్లో తొమ్మిది మంది మావోయిస్టులు, ఒక ఆర్ఎస్ఐ చనిపోయారు. మృతులు ఖమ్మం, వరంగల్, కరీంనగర్ జిల్లాల కార్యదర్శి సుధాకర్, దళ కమాండర్ గుగులోతు లక్ష్మి, మద్దె సీత, దుర్గం రాజు, రీనా, చత్తీస్‌గడ్‌కు చెందిన అజయ్, కరీంనగర్‌కు చెందిన ఆరెళ్ల వెంకట్, వరంగల్‌కు చెందిన ఊర్మిళ, వరంగల్‌కు చెందిన ఎట్టి నర్సక్కలుగా తెలిపారు.

## గనుల లీజుల రద్దు

ఆంధ్రప్రదేశ్-కర్ణాటక సరిహద్దుల్లోని 49 గనుల లీజులు రద్దు చేస్తూ సుప్రీం కోర్టు ఏప్రిల్ 18న తీర్పునిచ్చింది. కర్ణాటకకు చెందిన సమాజ పరివర్తన సముదాయ అనే స్వచ్ఛంద సంస్థ ఇనుప ఖనిజ లీజుల్లోని అక్రమాలపై సుప్రీంకోర్టులో పిటిషన్ వేసింది. ఈ పిటిషన్ ఆధారంగా సుప్రీంకోర్టు గాలి జనార్ధన్‌రెడ్డితో పాటు మొత్తం 49 లీజుల అక్రమాలపై విచారణ చేపట్టింది. రెండు రాష్ట్రాల సరిహద్దులు నిర్ధారించేవరకు తవ్వకం పనులు ఆపాలని నిర్దేశించింది. ఒడిశాలోని నియంగిరి కొండల్లో వేదాంత గ్రూపు బాక్సైట్ మైనింగ్ ప్రాజెక్ట్‌ను గ్రామ సభలు అనుమతించే వరకు తవ్వకాలు నిలిపివేయాలని సుప్రీంకోర్టు ఏప్రిల్ 18న తీర్పునిచ్చింది. మైనింగ్ ప్రాజెక్ట్ వల్ల స్థానికులకు ఎదురయ్యే అన్ని అంశాలపై మూడు నెలల్లోగా నిర్ణయం తీసుకోవాలని రాయగడ, కలహండి జిల్లాల్లోని గ్రామ సభలను కోరింది.

## మిర్జా బేగ్‌కు మరణ శిక్ష

ఫిబ్రవరి13, 2010లో పుణెలోని జర్మన్ బేకరీలో పేలుడు జరిగి 17 మంది మరణించగా, 64 మంది గాయపడ్డ కేసులో మిర్జా హిమాయత్ బేగ్‌కు పుణె సెషన్స్ కోర్టు ఏప్రిల్ 18న మరణ శిక్ష విధించింది. అక్రమ కార్యకలాపాల నిరోధక చట్టం, పేలుడు పదార్థాల చట్టం కింద నేరపూరిత కుట్ర, హత్యలకు పాల్పడినందుకు అత్యున్నత శిక్ష విధిస్తున్నట్టు అడిషనల్ సెషన్స్ జడ్జి ఎన్‌పి ధోతే వెల్లడించారు.

## మాజీ జస్టిస్ వర్మ మృతి

సుప్రీంకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ జగదీష్ శరణ్ వర్మ (80) కాలేయ సంబంధిత వ్యాధికి గుర్‌గామ్‌లోని వేదాంత ఆస్పత్రిలో చికిత్స పొందుతూ ఏప్రిల్ 22న మరణించారు. వర్మ 1933 జనవరి 18న పుట్టారు. వర్మ భారత సుప్రీం కోర్టు 27వ ప్రధాన న్యాయమూర్తిగా 1997 మార్చి 25 నుండి 1998 జనవరి 18 వరకు పనిచేవారు. మధ్యప్రదేశ్‌లోని సంటాలో ప్రాథమిక విద్యను అభ్యసించారు. 1955లో న్యాయవాదిగా ప్రస్థానాన్ని ప్రారంభించి 1973లో మధ్యప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తిగా బాధ్యతలు చేపట్టారు.

## నొవార్టిస్ పేటెంట్‌కు గండి

కాన్సర్‌ను నియంత్రించే పాత ఔషధానికి మెరుగులు దిద్ది కొత్త మందులా పేటెంట్ పొందేందుకు బహుళజాతి సంస్థ నొవార్టిస్ ఏడేళ్లుగా ప్రయత్నిస్తోంది. కాన్సర్ రోగులకు ప్రాణాధారమైన గివెక్ (ఇమాటినిబ్ మెసెలైట్)కు భారత ప్రభుత్వం పేటెంట్‌ను నిరాకరించడాన్ని సవాల్ చేస్తూ నొవార్టిస్ సంస్థ పెట్టుకున్న పిటిషన్‌ను సుప్రీంకోర్టు ఏప్రిల్ 1న కొట్టివేసింది. ఈ మందుకు సంబంధించి 'నవ్యత్వం ఆవిష్కరణ' ప్రమాణాలను పేటెంట్ దరఖాస్తు అందుకోలేక పోయిందని తేల్చిచెప్పింది.

## జనతంత్ర యాత్ర

అవినీతి రాజకీయాల నుంచి దేశానికి విముక్తి కలిగించేందుకు అన్నా హజారే ఏప్రిల్ 1న అమృత్‌సర్‌లో జనతంత్ర యాత్ర ప్రారంభించారు. ఈ యాత్రను రెండో స్వతంత్ర పోరాటంగా అభివర్ణించారు. వచ్చే సాధారణ ఎన్నికల వరకు ఈ యాత్ర కొనసాగుతుందన్నారు. ప్రజా ఉద్యమం మాత్రమే దేశంలో మార్పు తీసుకురాగలదన్నారు. వచ్చే పార్లమెంట్ ఎన్నికల్లో నిజాయితీ పరులే పోటీ చేసేలా చేయడమే తన యాత్ర లక్ష్యమన్నారు.

## మావోయిస్టులపై గగనతల దాడులు

మావోయిస్టు ప్రభావిత రాష్ట్రాలైన బీహార్, చత్తీస్‌గడ్, ఒడిశా, జార్ఖండ్‌లలో ఆంధ్రప్రదేశ్ గ్రేహౌండ్స్ తరహాలో యుద్ధ శిక్షణ ఇవ్వనున్నారు. ఈ మేరకు కేంద్ర హోంశాఖ చేసిన ప్రతిపాదనకు ఆర్థిక వ్యవహారాల కేంద్ర కేబినెట్ ఆమోదం తెలిపింది. ఇప్పటికే లక్ష మంది ఉన్న పారా మిలిటరీ బలగాలకు తోడు ప్రత్యేక బలగాలు రానున్నాయి. హోంశాఖ కార్యదర్శి ఏప్రిల్ 2న ఢిల్లీలో మాట్లాడుతూ మావోయిస్టుల సమస్య పరిష్కారానికి అందుబాటులో ఉన్న అన్ని వనరులను గగనతల దాడులతో సహా ఉపయోగించుకుంటామన్నారు. ఈ పద్దు కింద రు. 373 కోట్లు కేటాయించారు.

## శ్రీలంక తమిళులకు అండగా చిత్ర పరిశ్రమ

శ్రీలంక తమిళులకు అండగా తమిళనాడు చిత్ర పరిశ్రమ ఏప్రిల్ 2న మద్రాస్‌లోని టీనగర్‌లో ఒక రోజు నిరాహార దీక్ష చేపట్టింది. పౌరయుద్ధం కారణంగా నిర్వాసితులైన శ్రీలంక తమిళులకు పునరావాసం కల్పించాలని, యుద్ధ నేరాలకు పాల్పడిన వారిపై అంతర్జాతీయ దర్యాప్తు నిర్వహించాలని డిమాండ్ చేసింది. దీక్షకు నాయకత్వం వహించిన కోలీవుడ్ సంఘం అధ్యక్షుడు శరత్‌కుమార్ మాట్లాడుతూ తమిళ ఈలం కోసం రెఫరెండం పెట్టాలన్నారు. యుద్ధ నేరగాళ్లపై చర్యలు తీసుకోవాలని, తమిళనాడు అసెంబ్లీ చేసిన తీర్మానాన్ని ఆమోదించాలని కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

## అత్యాచార నిరోధక చట్టం

అత్యాచార నిరోధక బిల్లును రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఏప్రిల్ 2న ఆమోదించారు. అత్యాచార నేరానికి కఠిన శిక్షలు విధించేలా కేంద్రం నేర న్యాయ (సవరణ) బిల్లు-2013 పార్లమెంట్ ఉభయ సభల్లో ఆమోదం పొందింది. రాష్ట్రపతి ఆమోదంతో అత్యాచార నేర నిరోధక బిల్లు చట్టం అయింది.

## గనుల విధ్వంసాన్ని ఆపండి

దేశవ్యాప్తంగా గనుల తవ్వకం వల్ల ఐదో షెడ్యూల్డ్ ప్రాంతాల్లో విధ్వంసక పరిస్థితులు నెలకొన్నాయని, వాటిని అడ్డుకోవాలని ఏప్రిల్ 8న పంచాయతీరాజ్ శాఖ మంత్రి కిశోర్ చంద్రదేవ్ కోరారు. ఇందుకోసం రాజ్యాంగ అధికారాలను ప్రయోగించాలని సూచిస్తూ షెడ్యూల్డ్-5 ఉన్న ప్రాంతాల్లోని రాష్ట్రాల గవర్నర్లకు ఆయన లేఖ రాశారు.

వీ

## పాకిస్తాన్ - ఎన్నికలు - ముషార్రఫ్

పాకిస్తాన్‌లో ఎన్నికల కమిషన్ ఇసిపి మాజీ న్యాయమూర్తి మీర్‌హజర్ ఖాన్ ఖోస్‌ను మార్చ్ 24న ఆపద్ధర్మ ప్రధానమంత్రిగా నియమించింది. 2009లో దేశం విడిచి దుబాయిలో ఉన్న మాజీ అధ్యక్షుడు పర్వేజ్ ముషార్రఫ్ ఎన్నికలలో పాల్గొనడానికి స్వదేశానికి వచ్చారు. అయితే ఆయనపై రాజ్యాంగ ఉల్లంఘన, దేశద్రోహం నేరారోపణ ఉండడం వల్ల మూడు చోట్ల సమర్పించిన నామినేషన్‌లు తిరస్కరించబడ్డాయి. ఇదే ఆరోపణలపై విచారిస్తున్న న్యాయస్థానం ఆయన అరెస్టుకు ఆదేశాలు ఇవ్వడంతో ఏప్రిల్ 19న ముషార్రఫ్‌ను అరెస్టు చేశారు. మరోపక్క మతోన్మాద గ్రూపుల మధ్య దాడులు కొనసాగుతున్నాయి. నౌషేర్ పట్టణంలో జాలోజాయి శరణార్థి శిబిరం మీద జరిగిన దాడిలో పన్నెండు మంది, పెషావర్ చెక్‌పోస్టుపై జరిగిన దాడిలో పది మంది మరణించారు.

## అఫ్ఘనిస్తాన్ - ఘర్షణలు

మార్చ్ 23న అమెరికా అఫ్ఘనిస్తాన్‌లోని తన చివరి కారాగార స్థావరాన్ని కాబూల్‌కు అప్పగించింది. 2014 నాటికి పశ్చిమ దేశాల సైనిక బలాల ఉపసంహరణ పూర్తికానుంది. ఈ నేపథ్యంలో అఫ్ఘనిస్తాన్‌లో అధికారం కోసం ప్రభుత్వ సైనిక దళాలకూ, తాలిబన్‌లకూ మధ్య తీవ్ర ఘర్షణలు జరుగుతున్నాయి. ఏప్రిల్ 3న అఫ్ఘనిస్తాన్, ఇరాన్ సరిహద్దు ప్రాంతంలోని ఫరాలోని కోర్టు భవనంపై జరిగిన ఆత్మాహుతి దాడిలో, తదనంతర కాల్పుల్లో 34 మంది సామాన్య పౌరులు, 10 మంది ప్రభుత్వ సిబ్బంది, 9 మంది మిలిటెంట్లు మరణించారు. ఏప్రిల్ 7న షిగార్‌లోని కునార్ ప్రావిన్స్‌పై నాటో అఫ్ఘన్ సంయుక్త దళాల దాడిలో 10 మంది పిల్లలు, ఒక స్త్రీ మరణించారు. ఏప్రిల్ 12న తాలిబన్ దళాల దాడిలో 13 మంది అఫ్ఘన్ సైనికులు మరణించారు.

## మధ్య ఆఫ్రికా రిపబ్లిక్

మధ్య ఆఫ్రికా రిపబ్లిక్ రాజధాని బాంగుయ్‌ను తిరుగుబాటుదార్ల ఐక్య (సెలెకా) సంఘటన కైవసం చేసుకుంది. మార్చ్ 23న అధ్యక్షుడు ఫ్రాంకోయిజ్ బోజిజ్ బాంగుయ్ వదిలి కెమెరూన్‌కు పారిపోయాడు. సెలెకా నాయకుడు మైఖెల్ జటోడియా అధ్యక్షుడిగా ప్రకటించుకున్నారు. పద్దెనిమిది నెలల్లో ఎన్నికలు నిర్వహించగలనని ప్రకటించాడు.

## బ్రిటన్ ఉక్కు మహిళ మృతి

బ్రిటన్ ప్రప్రథమ మహిళా ప్రధానమంత్రి, ఉక్కు మహిళగా పేరొందిన మార్గరెట్ థాచర్ (87) ఏప్రిల్ 8న మరణించారు. 20వ శతాబ్దంలో తన రాజకీయ చతురతతో రాజకీయాలపై తనదైన ముద్రవేశారు. 1979 నుంచి 1990 వరకూ ప్రధాని బాధ్యతలు నిర్వహించారు. 19వ శతాబ్దం నుంచీ బ్రిటన్ చరిత్రలో ఇంత సుదీర్ఘకాలం వరుసగా ప్రధాని పదవి చేపట్టిన వారు మరొకరు లేరు.

## చిలీ - పాబ్లో నెరుడా

చిలియన్ కమ్యూనిస్టు పార్టీ ఫిర్యాదు మీద ప్రముఖ విప్లవ కవి పాబ్లో నెరుడా భౌతికకాయాన్ని ఏప్రిల్ 8న అధికార్లు సమాధి నుండి వెలికితీశారు. నెరుడా 1970లలో అప్పటి నియంత అగస్టో పినోచెట్‌కు వ్యతిరేకంగా తన కలాన్ని, గళాన్ని ఝళిపించారు. 1971లో సాహిత్య నోబెల్ బహుమతి అందుకున్నారు. 1973లో సైనిక చర్య అనంతరం పన్నెండు రోజులకు కాన్సర్‌తో మరణించారని అధికార వర్గాలు ప్రకటించగా, విష ప్రయోగం జరిగిందని నెరుడా డ్రైవర్ ఆరోపించాడు.

## కెన్యా - నూతన అధ్యక్షుడు

కెన్యా నాల్గవ అధ్యక్షుడిగా ఉరు కెన్యాటా ఏప్రిల్ 9న ప్రమాణ స్వీకారం చేశాడు. విలియం రూటో ఉపాధ్యక్షునిగా బాధ్యతలు చేపట్టారు. వీళ్లిద్దరు 2011 ఎన్నికల అనంతర హింసను ప్రేరేపించి పదకొండు వందల మంది పౌరుల ఊచకోతకు కారకులయ్యారని హేగ్‌లోని అంతర్జాతీయ నేర న్యాయస్థానంలో విచారణ ఎదుర్కొంటున్నారు.

## మయన్మార్ - మతఘర్షణలు

ఉత్తర మయన్మార్‌లోని మేక్టిలాలో మార్చ్ 23న జరిగిన మత సంఘర్షణలో నలభై మంది మరణించారు. దాదాపు తొమ్మిది వేల మంది నిరాశ్రులయ్యారు. ప్రభుత్వం ఆ ప్రాంతంలో ఎమర్జెన్సీ ప్రకటించి సైన్యాన్ని పంపింది. ఏప్రిల్ 1న ప్రైవేట్ మీడియా మీద ఉన్న నిషేధాజ్ఞలు ప్రభుత్వం తొలగించింది. దీంతో మయన్మార్ వీథులను ప్రముఖ అంతర్జాతీయ పత్రికలు ముంచెత్తాయి.

## అమెరికా - పేలుళ్లు

అమెరికాలోని బోస్టన్ నగరంలో ఏప్రిల్ 15న మారథాన పరుగు పందెం వద్ద జరిగిన బాంబు పేలుడులో ముగ్గురు మరణించగా, పద్నాలుగు మంది గాయపడ్డారు. దీనికి బాధ్యులుగా ఇద్దరు చెచెన్యా యువకులు టామెర్లన్ టార్స్‌నెన్, జోఖర్ త్సర్నేవ్‌లుగా గుర్తించారు. పోలీసు కాల్పుల్లో టామెర్లన్ మరణించగా, జోఖర్‌ను ఏప్రిల్ 18న పట్టుకున్నారు. ఏప్రిల్ 17న టెక్సాస్ నగరంలో ఒక ఎరువుల కర్మాగారంలో జరిగిన పేలుడులో పదిహేను మంది మరణించారు. 160 మందికి పైగా గాయపడ్డారు.

## వెనిజులా - నూతన అధ్యక్షుడు

వెనిజులా మాజీ అధ్యక్షుడు హ్యూగో చావెజ్ మరణం తర్వాత అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో చావెజ్ ప్రతిపాదించిన నికొలస్ మదురోకు 50.8 శాతం ఓట్లు రాగా, ప్రత్యర్థి హెన్రిక్ క్యాప్రిల్స్‌కు 49 శాతం ఓట్లు వచ్చాయి. దీంతో మదురో స్వల్ప ఆధిక్యంతో అధ్యక్ష పీఠం దక్కించుకున్నారు. ఏప్రిల్ 19న మదురో వెనిజులా అధ్యక్షునిగా ప్రమాణ స్వీకారం చేశారు.

## ఉత్తర కొరియా - యుద్ధ ప్రకంపనలు

ఉత్తర కొరియా, దక్షిణ కొరియాల మధ్య యుద్ధ ప్రకంపనలు కొనసాగుతూనే ఉన్నాయి. ఏప్రిల్ 3న ఉత్తర కొరియా తన భూభాగంలోని కీసాంగ్ ఉమ్మడి పారిశ్రామిక ప్రాంతాల్ని మూసివేసింది. దక్షిణ కొరియాతో యుద్ధం తప్పని పరిస్థితి ఉంది కనుక తమ దేశంలోని విదేశీ రాయబార కార్యాలయ ఉద్యోగులందరినీ ఖాళీ చేసి వెళ్లిపోవలసిందిగా తాము రక్షణ కల్పించలేమని చెప్పింది. కాగా ఏప్రిల్ 18న దక్షిణ కొరియాతో శాంతి చర్చలకు రెండు షరతులు విధించింది. ఒకటి, ఐక్యరాజ్య సమితి మంజూరీలపై విధించిన ఆంక్షలను ఎత్తివేయాలనీ; రెండు, దక్షిణ కొరియా, అమెరికా సంయుక్త సైనిక బలగాల యుద్ధ విన్యాసాలను నిలిపివేయాలనీ. ఉత్తర కొరియా కీసాంగ్‌లోని తమ యాభై మూడువేల మంది కార్మికుల్ని ఉపసంహరించుకుంది.

## నేపాల్ - ఎన్నికలు

ఆపద్ధర్మ ప్రధాని మాజీ న్యాయమూర్తి ఖిల్‌రాజ్ రెజ్మీ నాయకత్వంలోని ప్రభుత్వం జూన్‌లో ఎన్నికల నిర్వహణకు ఏర్పాట్లు చేస్తుండగా, కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ నేపాల్, మావోయిస్టు పార్టీ, మధేషీ పీపుల్స్ రైట్స్ ఫోరంల నుండి వ్యతిరేకత వ్యక్తమవుతోంది. రెజ్మీ రాజీనామా చేయాలని, అధ్యక్షుడు రాంబరణ్ యాదవ్ మార్చ్ 14న చేసిన రాజ్యాంగ సవరణలను నిరాకరిస్తున్నామని, రాజకీయ పార్టీల చేత జాతీయ ఐక్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని సిపిఎన్ మావోయిస్టు పార్టీ అధికార ప్రతినిధి పంపా భూసాల్ అన్నారు.

## చైనా - భూకంపం

చైనాలోని నైరుతీ ప్రాంతంలోని సిచువాన్ రాష్ట్రంలో ఏప్రిల్ 20న భూకంపం సంభవించింది. దీని తీవ్రత రిక్టర్ స్కేల్‌పై 7.0గా నమోదైంది. ఈ భూకంపం వల్ల దాదాపు రెండు వందల మందికి పైగా మరణించారు. పదకొండు వేల మందికి పైగా గాయపడ్డారు. భారీ ఆస్తి నష్టం జరిగింది. పదివేలకు పైగా ఇళ్లు నేలమట్టమయ్యాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చుయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 మార్చ్ నుండి 31 మార్చ్ 2013 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1820)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 24 | 24 | 4 | 3 | 1 | 1 | 1 | 2 | 3 | 1 | 4 | 22 | 26 | – | – | – | 3 | 2 |
| హైదరాబాద్ | – | – | – | 4 | 13 | 1 | – | – | 1 | 4 | 5 | 10 | – | – | 25 | 19 | – | – | – | 8 | – |
| నల్గొండ | – | 2 | – | 9 | 10 | 1 | 4 | – | – | 5 | 3 | 8 | 3 | 6 | 60 | 20 | – | – | – | 1 | 3 |
| మహబూబ్‌నగర్ | – | 7 | – | 22 | 18 | 12 | 13 | 3 | 6 | 7 | 7 | 18 | 22 | 6 | 52 | 10 | – | – | – | – | – |
| మెదక్ | – | 6 | – | 9 | 18 | 2 | 7 | 2 | 1 | 6 | 7 | 4 | 2 | 4 | 42 | 27 | – | – | – | – | 3 |
| నిజామాబాద్ | – | – | – | 4 | 7 | – | – | – | – | 3 | 2 | 4 | 2 | 6 | 22 | 12 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 2 | – | 4 | 6 | 10 | 6 | 5 | 1 | 10 | 6 | 3 | 8 | 1 | 36 | 22 | – | – | – | – | 1 |
| వరంగల్ | – | 1 | – | 6 | 7 | 8 | 9 | 8 | 1 | 1 | – | – | 2 | 14 | 25 | 20 | – | – | – | – | 5 |
| కరీంనగర్* | – | 11 | 8 | 18 | 25 | 3 | 5 | 1 | 3 | 6 | 3 | 6 | 3 | 4 | 76 | 17 | – | – | – | – | 4 |
| ఖమ్మం | – | – | – | 4 | 4 | – | – | 4 | – | – | 1 | 1 | 1 | 1 | 13 | 11 | 1 | – | – | – | – |
| అనంతపూర్ | – | 1 | 1 | 7 | 7 | 2 | 3 | 3 | – | 2 | 6 | 7 | 1 | 4 | 31 | 8 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 2 | 3 | – | – | – | 2 | 3 | – | – | – | – | 21 | 12 | – | – | – | – | – |
| కర్నూలు | – | 4 | 2 | 8 | 3 | 6 | 4 | 7 | 6 | 4 | 3 | 7 | 8 | 5 | 24 | 20 | – | – | – | – | 5 |
| చిత్తూరు | – | – | – | 9 | 7 | 8 | 7 | – | – | – | 7 | 6 | 20 | – | 30 | – | – | – | – | – | 4 |
| విశాఖపట్నం | – | – | – | 5 | 11 | – | 3 | 3 | – | 11 | 1 | 1 | 6 | 1 | 16 | 24 | – | – | – | 22 | – |
| విజయనగరం | – | – | – | 5 | 2 | 5 | 4 | – | 10 | 4 | 6 | 2 | 2 | – | 35 | 10 | – | – | – | – | 2 |
| **మొత్తం** | **1** | **37** | **11** | **140** | **165** | **62** | **68** | **109** | **32** | **67** | **59** | **80** | **81** | **56** | **530** | **258** | **1** | **–** | **–** | **34** | **29** |

* ఫిబ్రవరి, మార్చ్ రెండు నెలల జాబితా

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| ప్రజా ఎజెండా లేని | | |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| రాజ్యం – సంక్షేమం | కె. బాలగోపాల్ | 100 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దళిత | కె. బాలగోపాల్ | 120 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| హక్కుల బాటసారి | బుర్ర రాములు రచనలు | 50 |
| నిగాహ్ | కె. బాలగోపాల్ వ్యాసం సంకలనం | 200 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

## కథ – నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| రుదాలి | మహాశ్వేతాదేవి | 45 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ ద్యుమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh** | **(1956-2006)** | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |


**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 142 -May 2013 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 29/4/2013 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao